[ C. 2-7256-47—I Ed.—250]

Andhra University Series: No. 43

# ద్విపద భారతము

## సంపుటము ౪

( శాంతి, ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వములు )

గ్రంథకర్త:

సోమన

విద్వాన్.

గంటి జోగి సోమయాజి. ఎం. ఏ., ఎల్. టి.,

ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రచురణ శాఖాధ్యక్షులు:




ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము

రాజమహేంద్రవరము: సరస్వతీ పవర్ ప్రెస్ నందు

శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు గారిచే ముద్రితము.

1950

Price Rs. 12/-] [వెల రూ. 12/-

నాలుగు సంపుటముల సెట్టు - వెల రూ. 40/-

# ఉపోద్ఘాతము



శాంత్యాది స్వర్గారోహణ పర్యంతము గల గ్రంథము ఈ సంపుటమున నున్నది. ఇదియే తురీయ సంపుటము.

మహాభారత వృత్తాంతమును ద్విపద రూపమునఁ దెనుఁగున వెలయించిన యీ ముగ్గురి కవుల సమష్టి పరిశ్రమము ఆంధ్ర విశ్వకలా పరిషత్తువారి యాదరమున ముద్రితమై లోకమున వెలయఁ గలదు.

కవులు—కాలము, రచనా విశేషములు, పరివర్తన విధానము, ప్రయోగ విశేషములు మొదలగు విషయములు ప్రథమ సంపుటము నుపోద్ఘాతములోఁ జూపఁబడినవి. ఇఁక విశేషించి వ్రాయఁదగిన పీఠిక లేదని రెండవ సంపుటములోఁ దెలుపఁ బడినది. మూఁడవ సంపుటము నందలి యుపోద్ఘాతమున, మరల క్రొత్తగా సంపాదింపఁ బడిన ప్రతులును, వానివలని ప్రయోజనమును విశదీకరింపఁబడినవి.

గ్రంథముద్రణములోఁ గొన్ని తప్పులు పడుట నివారింపరానిది. ప్రూఫుల నెంత శ్రమించి చూచినను అవి కనుమొఱఁగి పోవును. విజ్ఞులగు పాఠకులు వానిని సులభముగా గుర్తింపఁగలరని నమ్ముచున్నాను.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు
వాల్తేరు
13 — 10 — 50

విద్వాన్ సోమయాజి
ప్రచురణశాఖాధ్యక్షుఁడు

# విషయసూచిక



## శాంతిపర్వము — ప్రథమాశ్వాసము

విషయము ... పుటసంఖ్య

విషయము | పుటసంఖ్య



ఆనుశాసనికపర్వము — ద్వితీయాశ్వాసము

| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|
| భీష్ముఁడు ధర్మరాజునకు దానవిశేషముల తెఱం గెఱింగించుట | ... | ౩౯ |
| నృగచరిత్రము | ... | ౪౨ |
| గోప్రభావము | ... | ౪౩ |

## ఆనుశాసనికపర్వము — తృతీయాశ్వాసము



## అశ్వమేధపర్వము — ప్రథమాశ్వాసము

## ఆశ్రమవాసపర్వము — ప్రథమాశ్వాసము

విషయము | పుటసంఖ్య
---|---



ఆశ్రమవాసపర్వము — ద్వితీయాశ్వాసము

# ప్రథమాశ్వాసము



[1] శ్రీ వేంకటాద్రీశ, సృష్టిప్రకాశ, । భావనాతీత, సౌభాగ్యప్రదాత,
కమలామనోహర, గజరాజవరద, । రమణ మంథాద్రిధరా! చిత్తగింపు.
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
ఆరీతి బంధుమిత్రాదుల కెల్ల । నాయూఢి నుదకకృత్యంబు లాచరించి
వరఁగ దుఃఖంబునఁ బాండునందనులు । తిరముగా భాగీరథీతీర భూమి
న య్యాశుచిత్వంబు నపనయించుటకుఁ । జయ్యన నొక సమస్థలమున నంత
సలలిత పటకుటీ సంవిధానంబు । సలవడఁ జేయించి యాధృతరాష్ట్ర
[2] విదురులు సర్వభూవిభుల భార్యలును । సుదవతియును దాము మాసమాత్రంబు

## మహర్షులు పాండవులఁ జూడవచ్చుట

నిలిచి; రయ్యెడ [3] మేఘనీలవర్ణుండు । కలితాత్ముఁ డామ్నాయకర్త పుణ్యుండు
వ్యాసమహాముని వామదేవుండు । వాసిష్ఠ దుర్వాస వాలఖిల్యులును
సనకసనందన సరసిజగర్భ । తనయ కౌండిన్య మతంగ గార్గ్యేయ
శౌనకాదులు శిష్యసహితంబుగాఁగ । జానొప్ప నంత నజాతశత్రువునిఁ
గనుఁగొను వేడుకఁ గడఁగి యేతేర । నెనయంగ వారికి నెదురేఁగి భక్తి
నరసి తత్కాలోచి తార్చనంబులను । హరియును దానును నమ్మహాత్ములను
బ్రీతులఁ గావించి పెంపు దీపించి । యాతతి నుండంగ, నాధర్మరాజుఁ
గను గొని యంత నక్కమలసంభవుని । తనయుఁ డిట్లనియె: "నోధరణీతలేశ,
నెలకొని కృష్ణుండు నీకు శోభనము । గొలెఁదిగా కెంత యుఁ గోరుచునుండ
నారయఁ గ్రీడి దర్పావేశబాహు । సారవిస్ఫూర్తి విస్తరగాండివమున
సమరపాండిత్య విజయములు [4] వాటిరింఁ । గొమరొప్ప రాజ్యంబు గొంటి రాజేంద్ర!

---

ఇందలి పాఠాంతరములు మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరీలోని 12245 ప్రతినుండి గైకొనఁబడినవి.

(1) శ్రీకామినీవక్షు, సృష్టిసంరక్ష! । నాకేశవంద్య! పినాకిసంస్తుత్య! (ఓ) 2. పౌరభూవిభువులు
3. కంతనిగమూర్ధవేది, (త) 4. గావింప.

ఆరూఢి భువన భయంకరమైన । పోరున నీవు తమ్ములతోడఁ గూడి
చలమును బలమును సాహసత్వమును । వెలయించు చోట భావించి యొక్కింత
దొలఁకొని ధర్మువు దొలఁగంగ ద్రొక్క । వరసి చూచినఁ బ్రియమయ్యెను మాకు.”
అనవిని జనవిభుండతని కిట్లనియె : । “వనజదళాక్షుండు వరుసమామీఁద
దయ చూపుటను, భూతధాత్రి దేవతల । జయకరానుగ్రహ సత్యవిస్ఫూర్తి
ననిలనందన విజయాంచిత బాహు । ఘన బలంబునను నీక్షాత్త్రబలంబబ్బె.
వినను బంధువధార్థంబు కతన, । మానుగా నభిమన్యు మఱియుఁ బాంచాలి
తనయుల నేవురఁ దగఁ గోలుపోయి । యనయంబు విది గెలువనదు నాబుద్ధి ;
అదియునుఁగాక చయ్యన విన్నవింతు । విదిత భుజాబల విక్రమోన్నతుఁడు
కురురాజునకుఁ బట్టుఁగొమ్మ సమ్రాజి । దఱిమి చంపినయట్టి దానవినోది
తరణిసూనుఁడు, కుంతి తనయుఁడటంచు । ధరణిలో నుగకప్రదానకాలమున
నాకెఱింగించె; నా నలిన బాంధవుని । బ్రాకటంబుగఁ దాను బ్రార్థించుటయును
అతఁడు వరమిచ్చినట్టి విధంబు । ఖ్యాతిగాఁ గర్ణునిఁ గన్నట్టి తెఱఁగు,
పాలవైచుటయు, నపార వైచిత్రి । తో రాజరాజుకు దొరయయి యుండ
నరవి వారికి మాకు జగడ మయ్యెను । అరయంగ మాప్పుటకై పుత్త్రికడకుఁ
జనుటయుఁ, దానన్న సకల వార్తలును । బొనరంగ ననుదినంబును జెప్పుచుండు.
ఆయమ తనపుత్త్రుఁడగు టెఱిఁగించి । ‘పాయక తమ్ముల పాలికి రమ్మ్న’
నావుడు నాతండు: “నాకు దోషంబు । భావించి యా కురుపతిని దొఱంగి
వచ్చిన, నదిగాక వాసవితోడ । పోచ్చెంబుగా యుద్ధమున కేతఁ డోడె
నని పల్కరే! జను; లైనను నీకుఁ । దనయు లార్వురు లేరు ధర నొక్కఁడణఁగు
ననయంబు నేనొండె నర్జునుండొండె” । ననిన నా తల్లియు “నట్లైన వారి
కభయ మి” మ్మని పల్క నంగీకరించి । శుభమతి మమ్ము నచ్చో యుద్ధభూమి
లోలత మించి నల్వురఁ బట్టఁ గాని । పాలించి తెగఁ డాయెఁ బ్రాణంబులకును.
తొల్లి తా దాఁచెను; తుదిని మా తల్లి । బల్లిదుఁ డతఁడు చెప్పఁగ వలదనఁగ
నీరీతి దాఁచె; మే మేవుర మెఱుఁగ । మూరయ; దుర్యోధనావనీశునకు
సొలవక ప్రీతిగా జూదంబునాఁడు । తలకొని పెక్కాడె ధర్మేతరములు.
నయమార దానికి నా హృదయంబు । భయదమయ్యెను గోపభర మొందకుండు.
కౌరవు లొనరించు కష్టానమతియె । కారణంబుగ నాకుఁ గడుఁ గోపమెత్తు;

కర్ణుని వదనపంకజము గన్గొనిన । నిర్ణయింపఁగ శాంతి నెఱి నావహిల్లు.
అమరేంద్రసూను నయ్యాడ నొవ్వఁబలికి (?) । ప్రమదంబుతోడ నా భానునందనుని
గొనకొని యిలమీఁదఁ గూల్పక వచ్చి । నను తమ్ముఁడవుగావు నాకు నీ వంటి ;
కర మొప్ప సోదర ఘాతి నే నైతి ; । ... ... ... ... ...
జగతి శోకంబెల్లు సహియింప వచ్చు ! । అగణిత లీలఁ గార్యము తప్పె ; నతఁడు
నేమును గూడిన నిర్జరులైన । వేమారు నడ్డమే ! వినుము మునీంద్ర !
తరణినందనుని రథంబు చక్రంబు । ధరణిఁ గ్రుంగుటకు నెంతయుఁ గారణంబు
ఎద్ది ? యుర్వీరున కిట భృగురాముఁ । డుద్దీప్తుఁడై యెట్లు లొసఁగె శాపంబు ?
నలి మీఱఁగా భువనంబుల యందుఁ । గలవర్తనములు నిక్కంబుగా నీకుఁ
దెలియని యవి లేవు తేటపడంగఁ । దెలుపవే !" యనిన నద్ధీరాత్ముఁ డనియె :

### కర్ణుని పుట్టు పూర్వోత్తరములు నారదుఁడు ధర్మజునకెఱిఁగించుట

ముని దత్తమగు మంత్రమహిమఁ గుంతి తొల్లి । ఘనతర విస్ఫూర్తిఁ గన్నియనాఁడు
అరవిందమిత్రు బ్రత్యక్షంబు చేసి । కర మొప్ప నందనుఁ గాంచి సిగ్గునను
విన్యాసమునఁ బుత్రు [1] వెలయింపదయ్యె ; । కన్యాత్వ వికలంబు గాకుండ సూర్యు
వరము గల్గుటఁ జేసి యంతనే సర్వ । [2] నిరుపమ లావణ్య [3] నిశిత ప్రభావ
యై మించె [4] దేవరహస్య మీ తెఱఁగు. । భామిని యారీతిఁ బాఱవైచుటయు
సూతుఁ డెత్తుక పోయె ; సూతజుఁ డనఁగ । నాతఁడిఁ బెరిగి చయ్యన భానుజుండు
వరమతి నీ నేర్పు వాయుజులావు । నగుసి [5] విల్బలిమియు నలిననాభుండు
చెలిమి సేయుటయును జేకూరఁ గవల । కలిత [6] వీరత్వంబు గని యంత జనులు
అనురాగచిత్తులై యుండంగ మిమ్ముఁ । గొనియాడుటకు నాత్మఁ గుందుచునుండు.
[7] తేవమీఱంగ నట్టిద దైవఘటన ; । భావింపఁగా నెన్నిభంగులనైన
నట్టి మాత్సర్యంబు నంగి కర్ణుండు । నెట్టన [8] మీయెడ నెఱి కోపమొనఁగ
నా సుయోధనుఁ గూడి యమరేంద్రసుతుని । చేసూటి విద్య [9] వీక్షించి కుంభజుని
పాలికిఁ జని "నాకు బ్రహ్మాస్త్ర [10] మిచ్చి । పాలింపు ; మాజిలోఁ బార్థు సమాన

1. వెలయించి యపుడు. 2. ఉరుతర. 3. ఉచిత. 4 పరమ. 5 మహాబలిమియు. (ఓ) 6. వేదిత్వంబు. (త) 7. దేవ మీరఁగనట్టి దైవ సంఘటన. (ఓ) 8. యందు. 9. లక్షించి. 10. మిపుడు మిమ్ము. (త)

శౌర్యంబ నయ్యెద; సర్వశిష్యులును । ధైర్యాఢ్య, సమముగాదా! మీకు" ననినఁ
గలశసంభవుఁ డంతఁ గర్ణునిఁ జూచి । [1] తెలివి దీపింపంగ ధీరుఁడై పలికె:
"నెగడంగ వ్రత [2]సమన్విత విప్రుఁడొండెఁ । దగఁ దపః పుణ్య భూ[3]ధవ వరుఁడొండెఁ
గాని యన్యుఁడుగాఁడు కడఁగి బ్రహ్మాస్త్ర । దానంబునకును బాత్రంబు కానీన!"
అనుటయు నట్లు కాకని మందిరమున । కనయంబు నట పోయి యారాత్రి గడపి
మఱునాఁడు గదలి సమ్మద వృత్తితోడఁ । దఱలక యమ్మహేంద్రక్ష్మాధరంబు
కరిగి బ్రాహ్మణవేష [4] మలరంగఁ దాల్చి । పరశురామునిఁ గాంచి ప్రణమిల్లి పలికె:
"వర్ణితోన్నత భృగువంశ జాతుండఁ । దూర్ణమై ఖరితోడఁ దొడరి యే నిన్ను
సేవింప వచ్చితిఁ జేకొమ్ము దయను, । భావనాతీత ప్రభావ విజ్ఞాత!
అలవడ నస్త్ర విద్యాపేక్ష నాకుఁ । గలిగి వచ్చితి." నన్నఁ గడు [5] సంతసిల్లి
యతనికి నస్త్ర విద్యాభ్యాస మెలమిఁ । బ్రతిదివసంబుఁ దప్పక చెప్పుచుండ,
నొకనాఁడు భానుజుఁ డొక్కచో నొంటి । బ్రకటించి లాఘవాభ్యాసంబు సేయ
ధృతి నొక్కముని హోమధేను వత్సంబు । అతని కడ్డము వచ్చి యాబాణవితతి
కాడిన మృతిఁబొందఁగా [6] నాతఁడలిగి । పోఁడిగా నీ తేరు భువిఁ గ్రుంగుఁ గాత
మని శపియించిన నాశాపమునను । వనజాప్తసుతు తేరు వసుధపైఁ గ్రుంగె.
భృగు[7]రాముఁడలిగి శపించిన తెఱఁగు । తగ నీకుఁ జెప్పెద ధరణీశ, వినుము.
ఆరీతి నవ్వీరుఁ [8]డతనికి భక్తుఁ । డై రమ్యవృత్తి నిత్యము సేవసేయఁ
బరితోషచిత్తుఁడై భార్గవరాముఁ । డరయ నాతనికి బ్రహ్మాస్త్రంబు లోను
గా దివ్యబాణముల్ గడఁగి యిచ్చుటయు, । నాదట దివ్య శస్త్రావళిచేత
దేదీప్యమానుఁడై తేజంబు మీఱ, । మోదించి రాముఁడిమ్ముల నొక్కనాఁడు
తరణినందను నూరు[9]తలముపై శిరము । చిరతర [10]లీలను జేర్చి నిద్రింప,
వెనుకొని యంతలో వికృతా [11]కృతి ఘోర । ఘనరూప మళకాఖ్యగలుగు కీటకము
సొలవక దినకరసుతు తొడక్రిందఁ । దొలిచె సత్వరముగాఁ; దొలువంగ నతఁడు
తనగురునకును నిద్రాభంగమగుట । తనమది నోర్వక ధైర్యంబుగలిగి
కీటకృత్యమునకుఁ గృశమతి నోర్చు । [12]పాటించియుచలుఁడై పదరక [13]యుండె.

---

1. తెలియుంగ నతనితో. 2. సముత్థిత. 3. ధరవర్య 4. మమరంగ. 5. వేడ్కఁబొంది. (ఓ)
6. ముని యలిగి. 7. రాఘవుండు. 8. డాతని. (త) 9. తట (ఓ). 10. లీలఁజేర్చిన నిద్రవెంపు.
11. కారి. 12. పాటిగా. 13. యుండి (త)

అత్తఱి నాకీట మాతొడ దొలువ । నెత్తురు [1]కాల్వలై సిండి యారాము
దేహంబు సోఁకిన, ధృతిమేలు కాంచి । యాహరివిక్రము నప్పుడుగాంచి
నెత్తురెక్కడిదన్న, నిజయూరువంత (?) । నెత్తియాకీటంబు నేవుతోఁ జూపి,
"యిది దొలుచుచునుండ సింక మీనిదుర । పడపడి చెడునని భావించియేను
గదలక యుండితిఁ గరుణాసముద్ర ! । విదితప్రతాప, దోర్విజితక్షితీప !"
అని విన్నవించిన నాభార్గవుఁడు । గనుఁగొనుచుండ నాఘనకీటకంబు
మృతినొంది దైత్యుఁడై మిన్నకయుంత । ఖతలంబునందుండి "గాంభీర్యధుర్య !
నీకతంబున శాప నిర్ముక్తిఁ గంటిఁ ; । బ్రాకట విస్ఫూర్తి భవము లడంగె ;
పేర్మి గ్రస్తుండను పేరి రాక్షసుఁడ ; । ధర్మస్వరూప, యొంతయు నొక్కనాఁడు
భృగుని నిజాంగనఁ బ్రేమ [2]హరించి । యగపడి [3]కీటమై తత్తపశ్శాపమున.
మీదివ్యలోకనామృత [4]సేచనమున । నాదట సుఖినైతి." నని భక్తి మ్రొక్కి
చనియె; రాముండు సజ్జలజబాంధవుని । తనయుని ధైర్యంబు తనమనంబునను
దలపోసి తలపోసి తరణిజుకనియె : । "వలదు నిక్కముచెప్పు వసుధవిప్రునికి
నీతాల్మికేఁను నీవెవ్వఁడ ?" వనిన । భీతిల్లి "యేను నీపృథివిలోవలను
సూతపుత్రుఁడ" నని సొలవక చెప్ప, । నాతఱి భృగురాముఁడతనిఁ గోపించి
"యక్కటా ! విప్రుండనని కపటమునఁ । దక్కక దివ్యాస్త్రతతి వడసితివి.
పాపాత్మ, నీకిట్టి బాణజాలములు । ఏపార విఫలంబు లిదెయవుఁగాక."
యని శపియించిన, నంతఁ గర్ణుండు । తనలోన వగచుచు దైవమాయనుచు
వచ్చి దుర్యోధను వలనొప్పఁ గాంచి । చెచ్చెర "నో కురుక్షితిరాజచంద్ర !
మునుమిడి పరశురాముని నాశ్రయించి । ఘనతర దివ్యాస్త్రకలితుండనైతి;
మగఁటిమితో నన్ను మార్కొనలేరు । జగతిలో నెవ్వరు సంశయపడకు."
మని విన్నవించిన నాకురురాజు । వినయంబు తనలోన [5]హర్షించుచుండె.
ఎసఁగ మీయన్న పోయినపోకలిట్లు । వసుమతీనాయక, వలనొప్ప వినుము.
అటఁ గళింగాధీశుఁ డతులప్రతాపి । పటుతరకీర్తిసంప[6]న్నుండునైన
చిత్రాంగదుండు వైచిత్రిదీపింపఁ । బుత్రికాపాణికి సింపులు దళుకొత్త
వసుధలోపల స్వయంవరమని చాట, । శిశుపాలుఁడును రుక్మిచేఁగి గాంధార

---

1 కాలువై. (ఓ) 2 వరించి. 3. తిరిగితినతని. (త) 4. సేవనమున. (ఓ) 5. హరుషింపుచుండె. (త)
6. న్నాఢ్యుఁడైన. (ఓ)

వతి జరాసంధుండు బాహ్లికముఖ్యు । వితతి నానామహీవిభులును బోవ,
దుర్యోధనుండును దోహలంబెసఁగ । శౌర్య [1]ప్రతాపుఁడై చతురంగబలము
తనవెంట రాఁగ రథంబెక్కి కదలి । ననుజాప్తతనయుండు వరుస సేవింప
నరిగినఁ, గాళింగుఁడంత భూపతుల । నరవింతోఁ దగినట్టి [2]సద్విధానముల
మన్నించి పూజించి మంచెలమీఁదఁ । బన్నుగాఁ గూర్చుండఁ [3]బనిచి యామీఁదఁ
గాళింగుఁ డాత్మీయకన్యక [4]వరుని । మేళవింపఁగ నతిమృదు వాక్యసరణి
నాదరించుచు [5]"నీస్వయంవరమందు । దాదులు పేర్వేర ధరణీవల్లభులఁ
జూపిచెప్పెదరు; నీచూపుకే రాజు । ప్రాపుగాఁ గనుపట్టెఁ బాప, వరింపు."
మని బుద్ధి చెప్పఁగా ... ... । ... ...నాసుయోధనుని
గడచి పోయినఁజూచి కౌరవరాజు । తడయక దాని రథంబుపైఁ బెట్టఁ
బనిచె; పేర్వడిన భూపాలలోకములు । ఘనభీషణాకృతిగా వచ్చి తాఁకి
వివిధభంగుల బాణవృష్టి ముంచుటయు । రవితనూభవుఁడు విక్రమధురంధరుఁడు
భల్లముల్ వరఁగించి బాణజాలముల । నెల్లను ఖండించి యేపుదీపించి
రథముల విఱిచి సారథులఁ జెండాడి । రథికుల విదళించి రాజశేఖరుల
శిరములు [6]తెగనేసి చిత్రంబులైన । శరముల నరుల జర్ఝరితంబు సేయఁ,
చావక మిగిలినశత్రుసైన్యములు । కావరంబున నిట్లు గడఁగితి మనుచుఁ
దలలు వీడఁగఁ బాఱఁ, దగసుయోధనుఁడు । వలనొప్పఁ బ్రీతుఁడై వారణపురికి
నరుదెంచెఁ గౌరవు లభినుతిసేయ. । పరువడి నటఁ బదపడి యొక్కనాఁడు
పొనఁగ గిరివ్రజపుర మేలునట్టి । రసికోత్తముండు జరాసంధుఁ డెలమి
మహిమీఁద నాపగ మనసునఁ బెట్టి । యహిమాంశునందను నంచితస్ఫూర్తిఁ
బొలుపొంద [7]నెక్కటి పోరుకుఁ బిలువఁ, । జవమున నా జరాసంధునిఁ దాఁకి
వివిధ దివ్యాస్త్ర ప్రవీణత [8]నెఱపు । రవిపుత్రుమీఁద విక్రమలీల నతఁడు
ఘనబాణతతు లేయఁగా, నిరువురును । వినుతింప సమముగా వీఁక [9]జోడాడి
రథములు డిగ్గి యుర్వర గ్రక్కతిలఁగఁ । బ్రథిత వైఖరి బాహుబల సంగరంబు
సేయుచుఁ బెనఁగ, నొచ్చిన జరాసంధు । నాయతముష్టిచే నతఁడు నొప్పించె.
అంతటఁ బోవక యలవు దీపించి । దంతావళంబులుద్ధతిఁ బోరునట్లు

---

1. ప్రభావుఁడై. (ఓ) 2. సంవి. 3. బార్థివేశ్వరుఁడు. 4. మిగుల. (త) 5. నిష్ఠురాలవడమందు.
6. తెగఁద్రెంచి 7. నొక్కుఁడు. (ఓ) 8. నెఱప. 9. జోడాడ. (త).

1 ధరణీధరము నొండు ధరణీధరంబు । నరుదుగాఁ బెనఁగినయట్టి చందమునఁ,
గంఠారవముల దిగ్గజములు చెదరఁ । గంఠీరవము హరి కడఁగినరీతిఁ
బెనఁగుచో శౌర్య గాంభీర్యముల్ 2 మెఱసి । వనజాప్తసూనుండు వడి జరాసూను
నంగ సంధి వికల మప్పుడు చేయ, । సంగతిగాఁ బోరు చాలించి యతఁడు
మఱి చెల్మిసేయుచు మాలినీనగర । మఱిముఱినీయంగ నధిక తేజమున
నిధిపురికేతెంచె ; నీరెండువిధము । లభినవోత్సాహుండవై మెఱుంగుదువు.
శ్రీమించి యిటు ప్రసిద్ధ శౌర్యమున । నీమహిఁ నెగడిన యినతనూభవునిఁ
బ్రవిమలోదీర్ణత భంజించు కొఱకుఁ । గవచకుండలము లాఖండలుఁ డడిగి
సలలిత విస్ఫూర్తి జనులు నుతింప । నెలమితోఁ గొని మిగుల హితమాచరించె.
క్షితిలోప మును దానఁ జేసి యర్జునుఁడు । నతనిఁజంపఁగఁ జాలె." నని చెప్పి మఱియు :
"ప్రార్థివోత్తము, విను బ్రాహ్మణుఁడలిగె; । నర్థించి వంచించె నమర వల్లభుఁడు ;
జమదగ్నిసూనుండు శపియించెఁ ; గుంతి । కొమరొప్ప నాతని కోపంబు మాన్చె ;
రమణ భీష్ముం డర్ధరథుఁ[4] జేసి యణఁచె ; । నమితవైఖరి శల్యుఁడనుచితమాడి
కలఁచెఁ ; గృష్ణుండు తక్కక విధిఁ జేయ్యె ; । పలు సంపదల నిట్లు పార్థుండు గూల్చె.
అదియును గాక దివ్యాస్త్ర సంతతులు । మదనారియును నగ్ని మఱియు నింద్రుండు
యముఁడును వరుణుండు నాదిగా నొసఁగి ; । రమితవైఖరి ద్రోణుఁ డట కృపచేసె;
అటుగాన కర్ణుని నాహవభూమిఁ । ఒటుతిరలీల నప్పార్థుండు చంపె."
అనవిని దుఃఖితుఁడై ధర్మరాజు । గొనకొని పలవించి కుంభిని వ్రాలె.
మెఱసి యాలోఁ దత్ప్రమావంబునందుఁ । దళలకయున్నట్టి తరలాక్షి కుంతి
యసుతనూజాతుని యడలుమాన్పుటకుఁ । గొమరొప్పనిట్లను : "గుణధుర్య, వినుము
జననము దెలిపి యే సరవితోఁ బిలువ । వనజాప్తుఁడును 'సత్యవాక్యంబు రమ్ము'
అనిపలు తెఱఁగులఁ నట బుద్ధిచెప్ప । వినఁడయ్యెఁ గర్ణుండు; వీనికి వగవఁ
బనిలేదు నీకు నేపట్టునఁ బుత్ర!" । యనుటయు నామాటలాదరింపకయుఁ,
జటులవిస్ఫూర్తి ఁ నసహ్యంబు లైనఁ । గట కట పడి కుంతిఁ గనుఁగొనియనియె :

---

1. ధరణీధరము మహీధరము నొండొండ. 2. మెఱయ (ఓ). 3. సుతుని (తం). 4. జేసె మఱియు. 5. మాగ (తం).

## స్త్రీలకు రహస్యరక్షణము లేకుండునట్లు ధర్మజుఁడు శపించుట

"భరత వంశమునకు భవదీయమంత్ర | కరణాలోపనమునఁ గాదె యింతయును
బుట్టె; నింతటినుండి భూమిలోపలను | నెట్టన మానినీ నివహంబునకును
గరిమ రహస్యరక్షణమందు శక్తి | యరయ లేకుండెడు" మని శపియించి,
తనకతంబునను మృతముఁ బొందినట్టి | ఘనుల నా యుభయపక్షంబు రాజులను
దలఁచియు విలపించి తరణినూనునకు | నలనడ వగచుచు, నర్జునుఁ జూచి:
"మన కేటి రాజ్యంబు! మహి [1]లోన నొండు | జనపదంబున భైక్షచర్య జీవనము
నడపుచునుండ మున్నతవృత్తి గాఁగ; | [2]ఎడప నీదుఃఖంబు నిట మానదింక.
జ్ఞాతుల నందఱఁ జంపితి మిఁకయె | జాతిగాఁ దముదామె చంపుటగాదె!
కులమురక్షణ రాజకుల లక్షణంబు; | కులభక్షణము చేసి క్రూరుండనైతి!
క్షత్రవర్తన మది కాల్పనె యింక! | నేత్రోత్సవంబుగా నెగడు నహింస
వరుసఁ దాలిమి లోపవర్జన కలిత | కరణంబు లెల్ల నాగమవిహితములు.
అసుఖదంబైన రాజ్యామిషంబునకుఁ | బసు చెడి కుక్కల భంగి నెంతయును
దమలోనఁ దమలోనఁ [3]దామెకాట్లాడి | క్రమమునఁ బొలిసి రీగతి వచ్చె; రాజ్య
మేనొల్ల నేలంగ; నిదె మీఁగు వేగ | మానుగాఁ గైకొని మన్నింపుఁ డీవు.
ఒనరంగ నాంబికేయుఁడు పుత్త్రి [4]కీడు | సునిశితమగు [5]మతిఁ జూడ కన్నిచుఁ
డేగతిఁ బోయె నింపెసఁగఁ బోసిచ్చె; | బాగుగా మగిడింపఁ బాల్పడఁడయ్యె;
ఆతఁడు కులమెల్ల హరియింపఁ జేసె; | నాతనిఁ జంపఁగ నటఁ గోపమాత్రె;
నరయ దుఃఖాక్రాంత [6]మయ్యె నామదియు. | కురురాజు మిక్కిలి క్రూరుఁడై యుండి
రమణతోఁ గర్జమెఱుంగక యున్నఁ (?) | బ్రమదంబు తోడ నేఁ బాటించి యోర్చి
తాలఁగంగ లేనైతి; దుర్దాంత రాజ్య | కలనా పరిగ్రహకతంబు మదిని
గలుగుటఁజేసి యాకల్మషం బిట్టు | లెలమితోడుత నాచరింపంగవలసె.
తొడరి పరిగ్రహదోషంబు మిగుల | నడరు పరిగ్రహత్యాగంబు వలనఁ
గాని పోవదు; పరిగ్రహవర్జితుండు | మానుగా నట జన్మమరణదుఃఖములఁ
బొరయఁడు; ధర వేదములును జెప్పెడిని. | సరస విస్ఫూర్తిని సకలధర్మములు
చేయంగ శక్యమే చెచ్చెరనొకని! | కావున నపరిగ్రహమున శుద్ధుఁడను;

1. మెలునొంది. 2. ఎడపని. 3 దామకొట్లాడి. 4. కొఱుడు. 5. బుద్ధి (ఓ) 6.మయ్యెను తుదిని. (త)

మీఱు రాజ్యంబేలి మెఱయుఁడు ధాత్రి ; । నారణ్యముల కిప్పుడరిగి తపంబు
సేయుచు సుఖలీలఁ జెందెద" ననినఁ । బాయక యప్పుడప్పార్థుఁ డిట్లనియె :

### అర్జునుఁ డుచితవచనముల ధర్మజుమనస్తాపోపశమనము సేయుట

"వలవదొ హహా యిట్టి వాక్యముల్ గలవె! । నలి భూజాదర్పంబునను శత్రుజనులఁ
బరిమార్చి [1]కడపటఁ బౌరుషంబెడలి । వరుస భిక్షావృత్తి వర్తింపఁదగునె!
ధర్మమార్గంబున ధరణి చే[2]కురిన । నర్మిలి విడుచుట యది యోగ్యమగునె!
అటులైన మున్నెల్ల యవనిపాలకులఁ । దటుకునఁ జంపితి ధరణీతలేంద్ర!
అడరి రాజ్యముఁదక్క యడవికిఁజనిన । బెడిదంబుగా జనుల్ చేలంద్రు నిన్ను.
సరవిమై దృష్టకృతశంక గల్గినను । అరయంగ నశ్వమేధాది కర్మములఁ
బోవదే! యెంతయు భూపాలవర్య! । వేవిధంబులఁ జెప్ప వినమె సంపదలు
పుడమిలోపల లేని పురుషవర్యుండు । నడపీనుఁగనుచు నెన్నఁగ నహుషోక్తి.
కర మొప్ప ధర్మార్థకామమోక్షములు । గరిమతో నర్థంబు గలవాని కమరు.
కలిమియె చుట్టాలు గలుగంగఁజేయు; । కలిమియె మిత్రులఁ గలుగంగఁజేయు;
కలిమియె శౌర్యంబు గలుగంగఁజేయు; । కలిమియె సద్బుద్ధి గలుగంగఁజేయు;
కలిమియె ధర్మంబు గలుగంగఁజేయు; । కలిమియె సత్కీర్తి గలుగంగఁజేయు.
జ్ఞాతి నాశనమునఁ గాదె దేవతలు । ఖ్యాతిగా వర్ధిల్లి రఖిలదిక్కులను;
వేదార్థములు నిట్ల వివరించిచూడ । మోదంబుతోడుత భూపాలవరులు
శత్రుసర్వంసహాస్థలి శౌర్యమహిమ । పాత్రంబుగాఁగొని, పాలించి, ధనము
లార్జించి, యాగంబులలవడఁ జేసి, । పర్జన్యముఖ్య దిక్పాలురఁ బ్రీతి
యుతులుఁగాఁ జేసి, యాయుత్తమలోక । మతులితంబుగఁ గాంతు; రట్టిమార్గమున
నహుషాంబరీషులు నలభగీరథులు । విహితోక్తి నృగుఁడును వెన హైహయుండుఁ
దగ హరిశ్చంద్ర మాంధాతృభూవిభులు, । మొగి దిలీపుండును మొదలైనవారు
నడచుట వినమె! యెన్నఁగనిట్టిపదవి । నడసితి; యాగ ముద్భటవృత్తిఁ జేయు."
మనిన యప్పలుకుల కటఁ గొంతసేపు । తనలోనఁ జింతించి ధర్మజుఁడనియె :

1. తడఁబడ, 2. కూడ (ఓ)

“[1]క్షితిలోననొక్కటి సేమంపుఁదెగువు | రతిమీఱఁ గలదు సుత్రామజ, వినుము.
సారహీనంబైన సంసారసుఖము | వారక విడిచి యా వనమునకేఁగి,
తాపసవాక్యామృతంబులు [2]చెవులఁ | బ్రాపించి గ్రోలి, నిర్మల చిత్తవృత్తి
[3]వరవి నిందాస్తుతుల్ సరియుఁగాఁగొనుచు, | నురవడితోఁ గత్తి నొక్కఁడు వ్రేయ
మఱియు వేఱొక్కఁడు మమతఁ జందనము | తఱలక యలఁదినఁ దగసమత్త్వమున
జగతిలోపల మూఁగ జడుఁడన మెలఁగి | పగలేక తగువేళఁ బర్ణశాలలకు
నరిగి భిక్షంబెత్తి యది భుజియించి | హరుసించి తృప్తుండ నై యుంటమేలు.”
అనిన వాయుకుమారుఁ డాయమనూతిఁ | గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
“వేదవిహితకర్మ విమలయోగ్యుండ | వై దయాపరుఁడవై యడలంగఁదగునె ?
రాజధర్మములందు రమణ జన్మించి | నోజతోడ ననూయ యుర్వీతలేశ !
వాఁడిమి నలుకతో వైరివర్గములఁ | బోఁడిమి చెడఁజంపి భువి భైక్షవృత్తి
నడవికిఁ బోయెదననుచుఁ బల్కినను, | బుడమివారలు నిన్ను బొరిఁబొరి నగరె !
గొలఁదిగా కొంతయుఁ గూపంబు ద్రవ్వి | జలము ద్రావనియట్టి జడునికైవడిని,
యున్నతతరువెక్కి యొగి జున్ను దిగిచి | వన్నెగాఁ దేనె ద్రావని వానిభంగి,
నచ్చియాఁకొన్న నన్నము కంచమునకు | [4] వచ్చినఁ గుడువనివానిచందమునఁ
దలకొని తమకించి [5]తనవశన్ జేసి | యలవడ సతిఁ గవియనివానిరీతి
గాదె శత్రులనెల్ల ఖండించివైచి | మేదినీరాజ్యంబు మొలవక యడవి
కరిగెద ననుటెల్ల ! నదినీవె యెఱుఁగు | దరయంగ మమ్ము నీయవనిలో జనులు
నిందింతు రతనిమాన్పింపక తాము | పొందుగా [7]వెఱ్ఱులై పోయిరటంచు.
ఘనమైన రాజ్యభోగంబులఁ [8]బాపి, | పనివడి నిందలఁ బాల్పడఁ జేసి,
యడవికిఁ బోయిన నయ్యెడిదేమి ? | [9]తడయక మదిలోనఁ దలపోయవయ్య !”
అనిన ధర్మజుఁ జూచి యమరేంద్రసుతుఁడు : | “అనఘాత్మ, యొక యితిహాసంబు వినుము ;
కొందఱు బ్రాహ్మణుల్ [10]గూడి యుద్వృత్తి | నొందంగ నాత్మకులోచితాచార
ములు మాని యడవికి మొగిఁ జనినంత | బలభేది కృపతోడఁ బక్షిరూపమున

---

1. బంధుజాలంబులఁ బ్రబలాగ్రహమున – నంధుండనై చంపి యారడిపడితి – సారహీనంబైన (ఓ)
2. మదిని (త) 3. తరలకపూయంగఁ దగసమత్వమున – మఱియును దావేఱె మాడ్కిని మిగుల – జగతిలోపల (త) 4. వచ్చికుడువకయున్నవానివిధమున; 5. తమ పంపు సేసి (త) 6. పొదపక (త)
7. కలసియు (ఓ) 8. మాని. 9. పుడమీశ, మాకుఁ జెప్పుము తెలియంగ. 10. గోరి (త)

సరవితోడుత వానిసన్నిధి కరిగి । 'తిరముగా మీరున్న తెఱఁగొప్ప' దనిన
విని వా'రఖిలమార్గవేది యీపక్షి' । యని దానికభిముఖులై 'సత్ప్రసంబు
వినిపింపు మెద్ది భావించి యాలోన.' । ననిన నాపక్షి బ్రాహ్మణుల కిట్లనియె:
"పరమతి నలుగాలివానిలో గోవు, । ధరణి నశేషశబ్దముల మంత్రమును,
సరవితోడుత లోహజాతిఁ గాంచనము, । నరులలో విప్రుఁ డున్నతి నధికత్వ
భాజనంబులు మఱి బ్రాహ్మణులార ! । ఓజతో నిప్పు డిట్లుత్తముఁడైన
యుర్వీసురుండు మంత్రోపాశ్రితములఁ । బర్విన కర్మముల్ పరువడి నడపి
ఘన రత్న కనక సాంగత్యంబు వోలెఁ । గొనియాడఁ బడు మఱి కుంభినిలోన.
మునుమిడి యాలస్యమునఁ గోపమునను । జను శోకమున ననుష్ఠానంబు విడువఁ
బాప ; [1] మజ్ఞానులు పరమార్థహీను । లాపజ్జ నెంతయు నవివేకులగుచుఁ
గరిచెడి సన్న్యాసకాల వివేక । మెఱుఁగక పదరుచు నిహాపరోన్నతులు
తమకు లేకునికిఁ బదభ్రష్టులగుదు ; । రమిత గృహస్థ ధర్మాదుల నడచి
ధరణిలో నతిథిసంతర్పణ చేసి, । సరవి శిష్టాన్న భోజనపరులగుచుఁ
బొలుపుగా వర్తించు పుణ్యవంతులకుఁ । జెలఁగి పుణ్యములరచేతివిగావె !"
అనిచెప్ప విని వారలరిగి గృహస్థ । ఘనతర ధర్మముల్ గని ; రదిగానఁ
బుడమిపాలింపు మిప్పుడు యాగవిధులు । నడుపుము నీ" వన్న నకులుఁడిట్లనియె:

నకులుఁడు ధర్మజునకు మనస్తాపోపశమనంబు సేయుట

"దేవతల్ వేదవిధి ప్రవర్తకులు; । భావింప నట్టిరు బ్రాహ్మణోత్తములు ;
వెలయంగ వారిసేవించి యజ్ఞాదు । లలవడఁ జేయుచు నర్థమార్జించి
భూదేవతా దేవపూజగా నిడుచు । నాదటఁ దత్ఫలంబందుట గాక
శోక మోహాదు లచ్చుగ మాని యడవి । చేకొన్న నందులఁ జేరెడిదేమి !
మునుకొని తక్కినమూఁడాశ్రమములు । తనరః నొక్కెడ గహస్థాశ్రమ మొకట
నరవితో నిడి తూఁప సమముగాఁదూఁగె. । పరువడి నది మేలు పార్థివోత్తంస !
మొదల హింసను దోషములు పొందుననెడి । పదపడి శంకకుఁ బనిలేదు వినుము.
వలనొప్ప విమతుల వధియింపకెవ్వఁ । డిలయేలెఁ దొంటి భూమీశులలోన ?
ఇరవేది మఱియు వారెల్లపాపములఁ । బొరసిరే ! సుగతికిఁ బోవుటలేదె !

---

.1 మూలే కాని బ్రాహ్మణులార (ఓ)

గోవుల గజముల ఘోటకంబులను । వావిరి దాసుల వరరత్నములను
గ్రామంబులను మందిరముల నిక్కముల । నీమహి నత్పాత్ర మెఱిఁగియిప్పింపు."
అనవుడు సహదేవుఁడంత నిట్లనియె : । "మనుజేశ, విను పెక్కుమాటలేటికిని ?
వెలివెలి వస్తువుల్ విడిచెఁబోనరుఁడు । కలిత కర్మిష్ఠతఁ గాదె శరీర
యాత్రయునడపుట యదియెమోక్షణము । ధాత్రీశ, గాదు. ఎంతయు వనంబునకు
నరిగి నీ వలయు పదార్థంబులందుఁ । జిరలీలఁ బ్రేమంబు సేయంగ వలదె !
జగతిలో నిదియు సంసార చక్రంబు ; । మిగిడింపు మనను వేమఱు చెప్పనేల !
నీవె తల్లియుఁ దండ్రి నీవె చుట్టంబు । నీవె సద్గురుఁడవు నీవె దైవమవు.
తథ్యంబులైన నతథ్యంబులైనఁ । బథ్యముల్గాఁ గొను పలుకులు ప్రీతి."
నని యిట్లు తనతమ్ములందఱుఁ దెలుప । విని యూరకుండిన, వెలఁది పాంచాలి
యమనూతి కిట్లను : "ననుజులఁ దేర్పు ; । ననుయకాలముచన్నఁ జని సుయోధనునిఁ
జంపి భోగంబుల సద్విహారములఁ । బెంపారుసుఖములఁ బ్రీతిఁ జేయుదము.
అని యూరడింపవే ! యరులమర్దించి । చెనసి భూస్థలమెల్లఁ జేకొని మఱియుఁ
బుడమీశ, యడవికిఁ బోయెద ననుచు । నుడికింప నీకును నుచితంబె ! నిన్నుఁ
గడవనెఱింగెడి ఘనులెందుఁ గలరు ? । మడపక విను పేదమనసు నీమనసు.
నృపునందు [1] విధి దండనీతి గల్పించె ; । నపుడుగావున ధరనపరాధమెఱిఁగి
దండించినట్టి భూ [2]ధవవర్యునకును । రెండులోకంబులఁ బ్రేమఁ జేకూరు.
సభ కేకవస్త్ర రజస్వల యనక । యభినవోత్సాహుఁడై యట నీడ్చుతప్పు,
తొడలుచూపినతప్పు, దుష్టవర్తనల । నడచినతప్పు, నానలినాప్తసూను
నందు దుర్యోధనునందును గాంచి । యందఁద దండించి తది కల్మషంబె !
కొండీని గృహదాహకుని బంధుఘాతిఁ । జండాలు నఖలదూషకు నర్థహారణ
పరు మద్యపాయినిఁ బరసతిఁగోరు । దురితాత్ముఁ జంప బంధురపుణ్యుఁడగును.
ధారుణీవిభుఁ డట్టి దండార్హులైన । వారిఁ జంపక యున్న వచ్చుఁ బాపములు.
ఉచితదండనవృత్తి నుర్వీరక్షణము । ప్రచురత రాజధర్మముగాక, భూమి
దేవార్హమైనట్టి ధృతి శమదమము । భావింపఁ బాడియే పార్థివులకును !
తన దురితంబున ధార్తరాష్ట్రుండు । గొనకొని చెడె బంధుకోటులతోడ.
దానఁ బాపములేదు ధర్మంబు గలుగు ; । మానుగా నెంతయు మఖమొనరింపు.

1. విను, వర. 2. వర. (ఓ)

ధరణి బృహస్పతి దైత్యగురుండు । గరిమతోఁ బరిపాటిగా దండనీతి
పలికిరి దానిని బరువడి నడపు." । ...... .....................
అనిన నూరక యున్న నరేంద్రసుతుఁడు । తననేర్పు విలసిల్ల ధరణీశుకనియె :
"దక్షుఁడై భూపతి [1] తగ దండనీతి । వీక్షింపకున్న నీ విశ్వంబులోనఁ
దరమిడి [2] యన్యోన్యధనధాన్య దార । హరణంబు జనులెల్ల నాచరింపుదురు ;
ఆపాపజాలంబులనిశంబు నొందు । భూపాలు ; దండమెప్పుడు హింస యనఁగ
వలదు; దుర్వృత్తుల వధియించు రుద్రు । జలజాక్షు వాసవు [3] శర్వజుఁ జూడు.
ఒండొంక వారలు నున్మార్గ చరుల । దండిప [4] వినమె! యధర్మంబులణఁగు
[5] ధర్మముల్ వర్ధిల్లు దండంబునందు; । ధర్మంబువలననే ధరణి వర్ధిలును ;
ఎట్టివారికినైన హింసకుఁ దొలఁగ । నెట్టన వశమౌనె! నిజబుద్ధిఁ జూడు.
కాయలఁ బండ్లను గమలంబులందు । మాయఁగా లేవె సూక్ష్మంపు జంతువులు!
మునుకొని యటఁ గందమూలాదులకును । మునులు సేయరె హింస పుడమిలోపలను!
ప్రాణికిఁ బ్రాణియే [6] భక్ష్యంబుగాఁగ । నేణాంక [7]కుల, విధియింపఁడే బ్రహ్మ.
చెలరేఁగి పరహింస చేసి యాగములు । బలువిడి నొనరింపఁ బాపంబు లగునె!
అరి వీరులను ఘోరమగు యుద్ధమునను । దొరఁకొని వధియింప దోష మే లగును !"
అని యర్జునుఁడు వల్కు నమ్మాటలెల్ల । విని పలుకక యున్న విభుదెస చూచి

## భీముఁడు ధర్మజునకు హితముపదేశించుట

తిరమిడి వాయునందనుఁడు కోపించి । "సరవి సాధించిన సామ్రాజ్య [8] లక్ష్మి
యడలునఁ దిగఁద్రోచి యడవికిఁ జనిన । మడపక విను పేదమనసువాఁ డనుచుఁ
జెడనాడుచుందురు క్షితిలోన జనులు । ఎడపని కడఁకతో; నిదియును గాక
యాసభలోఁ బడినట్టి బన్నముల । వేసరి, యడవిలో విహరించినపుడు
సరవి దైత్యులచేత సైంధవుచేతఁ । గర ముప్పఁ బడిన దుఃఖములకు నోర్చి
గొనకొని విరటుని గొలిచి యావెనుక । నని సేయు టే ధర్మమగుటయుఁ దెలిసి,
రణములోపల ధార్తరాష్ట్రులఁ జంప । గణుతించి నప్పుడె గనవె ధర్మములు!

---

1. తన. 2. ధన ధాన్యదారాసమృద్ధి. (ఓ) 3. శక్రజు; శమనజు. 4. మేలు అధర్మంబులణఁగు (త)
5. అర్మిలిఁ బృథివీశు కననేల వినుము - ధర్మంబు వలననే. (ఓ) 6. భక్షణంబుగను. 7. వంశ. విధింపఁ
డే. (త) 8. పదవి - యడరున. (ఓ)

వనివడి యేము నీ వంపు నేయంగ । జెనసి దుర్జనులను జెరసి సాధులను
మనుచుచు హయమేధమఖ మొనరింపు." । మనవిని ధర్మజుఁ డతనికిట్లనియె :
"మదమును రాగమున్ మాత్సర్యవృత్తి । మొదలగు పాపముల్ పొందు భూపతికి
గరిమతోఁ గామభోగంబులు విడిచి । గుఱుతుగాఁ గాయలాకులు నీళ్లు గాలి
యనుభవించిన మునులట వెఱ్ఱివారె! । ... ... ... ... ...
మెలఁగు దుర్బుద్ధు లావిషగతిమైన । బలు కర్మములు చేసి బంధాదులందుఁ
దగులుదు; రటుగాఁక దత్త్వవిచార, । సుగుణులు గాంతు రెచ్చోటనైన ముక్తి
యలవడ." నని పల్కి యపుడూరకున్నఁ । దెలివితో సాత్యవతేయుఁ డిట్లనియె:
[1]... ... ... ... ... ... ... ... ... ...
పరికింప ననుజుల పలుకు సత్యంబు; । అరయంగ వినుము గృహస్థ ధర్మంబు
చెలిమి నుత్తమ మని చెప్పంగఁ బడును; । పలు తెఱంగులఁ బశుపక్షులాదిగను
జీవుల కాశ్రయస్థితియు ; రాజులకు । భావింప నదితక్క బ్రహ్మచర్యమును
దపమును దమమును ధర్మముల్ గావు. । నృపవర, వినుదండనీతి యుత్తమము.
ఉర్విలోఁ దొల్లి సుద్యుమ్న భూవిభుఁడు । సర్వ సర్వంసహాచక్ర మేలుచును
నెగడిన యా దండనీతిచేఁ గాదె । తగ నపవర్గ మా ధన్యుండు గాంచె."
అనవుడు ధర్మజుఁ 'డత్తెఱంగెల్ల । వినిపింపవే!' యన వెఁడియు ననియె:

### సుద్యుమ్నచరితము పారాశర్యుండు ధర్మజున కెఱిఁగించుట

లీలతోఁ శంఖుండు లిఖితుండు ననఁగఁ । బోలంగ నన్నదమ్ములు విప్రవరులు
గల రుత్తమోత్తముల్ గారుణ్య[2] నిధులు, । తెలియంగ బాహుదాతీరంబునందు
నారూఢ పుష్ప ఫలాభివృద్ధులను । అరయ నొప్పారు నాశ్రమంబులను
దపముసేయుదు ; రొక్కతఱి లిఖితుండు । విపరీతగతి నన్న వీక్షింపవలసి
యన్నయింటికిఁ బోయి యతఁడు లేకున్నఁ, । బన్నుగా నారంగఁ బండిన పండు
గని [3]కోసి తినఁగఁ, జక్కఁగ నన్న వచ్చి । 'యనఘ, యెక్కడి పండు?' లని యడుగుటయుఁ,
బ్రణతుఁడై 'యిచ్చోటిపండ్లివి' యనిన । 'గుణనిధి, యడుగక గోయంగఁ దగునె!
ముచ్చిలియేగాదె మునుమిడి పాప । మచ్చుగా నంపెద నవనీశుచేత

1. జనకసతీ సంవాదము, దేవస్థానునిహితోపదేశము, అదిగాఁగల చాల విషయమిట లుప్తము చూ, తిక్కనశాం. ప. 1 – 130 – 155. 2. ధనులు. 3. కొనితినఁగ నాయన్నయు వచ్చి. (త)

దండితుండవు గమ్ము తప్పక పొమ్ము। ముందుగా." ననిన నమ్మౌని నాతఁడరిగి
పోల సుద్యుమ్ను నిఁ బొడగన్న, నతఁడు। నాలోన నెదురేఁగి యర్ఘ్య పాద్యాదు
లారూఢి నిచ్చి, యో యనఘాత్మ, మీరు। వారక యిచటికి వచ్చిన కార్య
మలవడఁ జేసెద నానతిం" డనినఁ। బలికె సుద్యుమ్నుతో బ్రాహ్మణోత్తముఁడు:
"చెప్పిన యట్లెల్లఁ జేసెద నంటి; । తప్పకు మీ మాట ధరణీతలేశ।"
అనిపల్కి పతిఁతోడ: "ననఘ, మాయన్న। యనుమతిలేక ఫలాదులు గోసి
తింటి; మ్రుచ్చిమిగాదె! దినకర తేజ, । దంటవై మ్రుచ్చుల దండించు గతిని
గడఁగి దండించి యకల్మషుఁ జేయు. । తడయ కింతయు రాజదండితునకును
యమదండనంబు లేదని పెద్దలెల్లఁ । బ్రమదంబుతోడుతఁ బలికిరి తెలియు.
వరదండధారణ వైకల్య దురిత । మరయంగ నిను బొరయక యుండవలయు."
నని తేటపడనాడ నవనీశ్వరుండు । ఘన విషాదంబునఁ గన్నీరునించి
"పనివడి నన్ను నీపనికి నంపకుము । మునినాథ," యని పాదములకు మ్రొక్కినను,
వినకున్నఁ జూచి భూవిభుఁడు బ్రాహ్మణుని । ఘనహస్త యుగళంబు ఖండించుటయును,
జని శంఖుఁ గాంచి హస్తములు చూపుటయు, । మనమున నలరి యమ్మౌనిశేఖరుఁడు
లలి [1]ధర్మమార్గ ముల్లంఘింపఁ [2]దగదు, । వలసె నిష్కృతియు నీవలనఁ గులమ్ము
పెనుపొందె; సురముని పితృతర్పణములు । పనివడి సేయుము బాహుదలోన.
బలసి మద్యమ్ము ద్రావుట, గురుపత్నిఁ । గలియుట, బ్రాహ్మణు ఖండించుటయును
గ్రమ్మిన ఘనపాతకములనఁబడును. । [3]ఇమ్మహాపాపంబు లేనింటిలోన
నిహమున నేమొనరించిన వినుము । సహజంబుగా నెట్టిజాతివాఁడైన
దండనీయుండు ; నెంతయుఁ దస్కరుండు । దండిగా శారీర దండయోగ్యుండు.
ధరణిలోపల రాజదండితుల్ సుకృత । పరులకై వడి నాకప్రాప్తులగుదురు.
అమ్మహారాజుచే ననఘాత్మ, నీవు । నెమ్మి దండితుఁడవై నిఖిలపుణ్యములు
గంటివి పొమ్మన్నఁగని లిఖితుండు । నంటున బాహుదానదిఁ దీర్థమాడఁ
బ్రభవించె నతని కరమ్ములవ్వేళ. । అభినవోత్సాహుఁడై యన్నపాలికిని
మగిడి యేతెంచి సమ్మతి లిఖితుండు । తగ కరంబులు చూపఁ, దమ్మునకనియె :

---

1. తీర్థ (?) 2. దగదు—అలవడనటుగాదె యట నీకతమున. 3. ఇమ్మహాపాతకం బెప్పుడులేని-గృహమున నేమొనరించిన వినుము. (త).

"[1]అచ్చెరువడనేల! యదియస్మదీయ । సచ్చరిత్రత నువ్వె! సర్వేశుకతన.
పొసఁగ నుర్వ్యాన్యుండు పుణ్యుఁడై మించె, । నసదృశవిస్ఫూర్తి." ననిచెప్పి మఱియు
వ్యాసుఁడిట్లని పల్కె : "ననఘాత్మ, నీవు । భూసతీ యుతముగాఁ బొందు సౌఖ్యములు.
తగ మహామహిమ నీతమ్మునిమాట । లగణిత వేదార్థమని విచారింపు.
అడవుల మీరున్న యపుడు సోదరులు । అడలుచు సుమనోరథాశేశ కలిత
హృదయులై యుండుదు రుర్వీశలేశ!(?)। అదియుపేక్షింపక యవనిపాలింపు.
పొలుపొంద దుఃఖమ్ము పొమ్మని త్రోవ । నలవడసుఖము రమ్మని తెచ్చుకొనఁగ
నిలలోనఁజూడంగ నెవ్వరి వశము! । కొలుబాము నందలి దుష్కృతసుకృత
ములు [2]హేతువులుగ నిమ్ములవానిఁ జేయు । వలనొప్పఁగా నెంతవారలకైన.
మఱియును జననము మరణము వృద్ధి । వఱలుహానియుఁగాలవశత [3]వచ్చునవి;

వ్యాసుఁడు ధర్మజునకు సేనజిత్తు వాక్యము లెఱిఁగించుట

కావున నీకు శోకము పనిలేదు. । ఆ విధి సేనజిత్తను మహీవిభుఁడు
తలఁగి శోకార్తుఁడై తనలోనఁదానె । తెలిసి సజ్జనసన్నిధి నుపన్యసించి
నట్టివాక్యంబు లీ వాదరంబునను । నెట్టన వినుము మన్నించి మోదమున.
తారు కొందఱకు బాధకులయి నడచి । తారును బరులచేతను బాధఁబొంది
యవి కాల భావ్యంబులని మెలంగుచును । భువిలోన సుఖశోకములఁబొందవలదు.
అర్థ దారాబంధు హానికి నాత్మ । నర్థి దుఃఖింపంగ నటఁబనిలేదు.
అని [4]చెప్ప సేనజిత్తను [5]నృపతివలె । ననఘాత్మ, శుచివి గమ్మనిన నిట్లనియె :
"మఱవవచ్చునె! యభిమన్యునిఁగర్ణు । నఱిముఱి ద్రుపదుని నాపగాతనయు
ద్రౌపదేయుల ; మహీధవుల నందఱను । బాపాత్మురీతిఁ జంపంగఁజూచితిని !
గురుఁడు తనూజునిగూర్చి శోకించి । నరసుతంబుగ నన్ను నమ్మియర్థింపఁ
జావనివానిని జచ్చినాఁడనుచు । భావించి మఱియు నిభమునెపంబునను
బొంకితి ; నిటువంటి పుణ్యహీనునకు । నింక [6]నెక్కడిరాజ్య? [7]మెక్కడిబ్రదుకు ?

---

1. "ఇది మదీయతపోవిభవంబున దైవకృతంబైన విశేషంబు; నీవుశుచివగుట దైవంబునకతన." అని. తిక్కన, చూ. శాం. 1-171. 2. హితవులుగ...బొందఁజేయు. 3. జర్పింప. (మా). 4. చెప్ప. 5. నృపాలుండు. 6. నేమిటి 7. మేమిటి. (ఓ)

వెనుకొని ప్రాయోపవేశన వృత్తి । వినుతింపఁ బ్రాణముల్ విడిచెద." ననిన
మురహరుఁ డనియె: "ఓపురుషవరేణ్య, । గుఱుతుగా నీమదిఁ గుందంగఁదగునె!
జగతిలోఁదొల్లి సృంజయుఁడను రాజు । అగణిత పుత్రశోకాతురత్వమును
బొందిన నుపశమంబుగఁ దొంటినృపులఁ । బొందుగాఁజెప్పి యిమ్ముల శాంతిచేసె
నీనారదుం" డని యెలమితోఁ జూపి । మానుగా నిట్లనె మధుసూదనుండు :

### కృష్ణుఁడు ధర్మజునకు షోడశరాజుల చరితములఁ జెప్పుట

"అవనిలో సంవర్తుఁడను మహామౌని । తవిలి యెంతయు దేవతాగురుతోడి
తగువైరమున మహద్రష్టమైనడప, । నగణితస్ఫూర్తి హిమాచలపాద
మున సురేంద్రాదు లిమ్ములసహాయముగఁ, । గనకమయంబుగాఁ గ్రతుసాధనములఁ
గావించి యాగ మకల్మషవృత్తి । వేవిధంబుల విప్రవితతికిఁ జాల
దక్షిణలిచ్చె నెంతయు మరుత్తుండు । ఈక్షోణి నిత్యమై యెనఁగెనే యకట!
సన్మార్గమున [1] రాజ్యసంపదనొంది । సమ్మతి నేఁ కోట శక్రుండు తనకుఁ
గనకమయములైన కర్కట మీన । ఘనకూర్మనక్రముల్ గల వాన గురియ,
న య్యర్థమెల్లఁ [2] దా నర్థులకిచ్చి । చయ్యన బ్రాహ్మణసమితిఁ బోషించి
మేదిని ఘోటక మేధాదులైన । వేదోక్తమఖములు వేడ్కతోఁజేసి
యగణిత విఖ్యాతి నఖిలంబుఁ బొగడ । నెగడు సుహోత్రుండు నేఁడున్నవాఁడె!
పొలుపొంద మదగజంబులు పెక్కువేలు, । కలిత సర్వాంగలక్షణములు గలుగు
హయము లనేకముల్, హాటకమయము । [3] లయిన కొమ్ములు గలయట్టి ధేనువులు,
ధనశతకోటులు, దర్పకశరము । లననొప్పు కన్యక లర్బుదసంఖ్య
భూసురావలి కిచ్చి పొగడ యజ్ఞములు । చేసె నాయంగుఁ డీక్షితి నున్నవాఁడె!
ఏడుదీవులయందు నేపుతో రథము । క్రీడింప విభవమార్జించి శాత్రవులఁ
గనివిని యెఱుఁగక ఘనముగాఁ బ్రజలఁ । బనివడి మన్నించి పాలనచేసి
యక్షయధనము ఫాలాక్షుండు దనకు । రక్షింపఁగా, సద్వరంబులు పెక్కు
భాగీరథీతీర పర్యంతభూమి । నాగమవిధిఁజేసె నఖిలంబుఁ బొగడ.
తారకంబుల వృష్టిధారలనైన । వారక లెక్కింప వచ్చును గాని
యతఁ డిచ్చుగోవుల నట నెన్నవశమె! । ప్రతిన నాశిబి ధాత్రిపైనున్నవాఁడె!

---

1. రాజ్యసౌఖ్యంబు నొంది. 2. ధనా. 3. లగుకొమ్ములును గల్గునట్టి.

ధరణిలో నెంతయుఁ దాటకఁ జంపి । యరయవిశ్వామిత్రుయాగంబు గాచి
సీతామహాదేవిఁ జేకొని యడవి । నాతతగతి నేఁగి యంబుధి గట్టి
దశకంఠుఁ జంపి దుర్దశలు వారించె । దశరథరాముఁ డెంతయు నున్నవాఁడె!
పూర్వవంశ్యులఁ గావఁబూని యా గంగ । సర్వసర్వంసహాస్థలికిని దెచ్చి
యప్రతిహతముగా నశ్వమేధములు । సుప్రసన్నతఁ జేసి శోభనలీల
నరయంగ [1] నొకలక్ష యరదంబులందు । గరిమతోడుతఁ గన్యకలను భూషించి,
రథముల నునిచి యారథరథంబునకుఁ । బ్రథితమైనట్టి యిభముల నూటేర్చి,
యేనుఁగేనుఁగునకు నిలఘోటకములు । మానుగా వేయేసి మట్టుగాఁ జేసి
హయ హయంబునకును నట్లు గోచయము । ప్రియముతోడుతఁ గూర్చి పేర్మి విప్రులకు
దక్షిణయుతముగాఁ దగ నిచ్చినట్టి । రక్షకుం డాభగీరథుఁ డున్నవాఁడె!
అరయ విశ్వావసుండాదిగా దేవ । వరులు గంధర్వులు వాదన మెలమి
నొనరింప, రంభాది యువతీ జనములు । పనివడి యాటలు పాటలు నెఱప,
దివ్యమునీంద్రు లెంతే వినుతింప । భవ్యులై నిఖిల భూపాలురుఁ గొలువ,
ధరణిదేవతలను దానంబునందుఁ । దిరముగా నెంతయుఁ దృప్తులఁ జేసి,
హయమేధ యాగంబులటు పెక్కు చేసి, । దయతోడ శతతమాధ్వరమున హయము
నాశింప [2] నింద్రున కర్థితో నిచ్చె । రాశి దిలీప భూరమణుఁ డున్నాఁడె!
జననమాదిగఁ బాకశాసనుచేత । జనియించు నెయిపాలు [3] సరవితోఁ ద్రావి,
ద్వాదశదినము లాతఁడు గారవింప । నాదట వర్ధిల్లి, యవనిఁ [4] బంద్రెండు
హాయనంబుల ప్రాయమై రాజ్యపదవి । పాయక చేకొని భానునిదీప్తి
[5]యంతటఁ గన్పించు నాభూతధాత్రి । యంతయు [6]నొక్కఁడే యనుభవింపుచును,
రాజసూయ మహాధ్వరము లశ్వమేధ । వాజపేయాదు లుర్వర మెచ్చఁ జేసి
ప్రతినతో రావణు భంజించి మించె । క్షితిని మాంధాత నిల్చెనె మహీపాల!
ఉర్వి దేవాసుర యుద్ధంబునందు । సర్వరాక్షసులను సమయించి మించి
మహిమగా వర్ణాశ్రమముల నేర్పఱచి । బహుతర హయమేధ పౌండరీకాది
యాగంబులొనరించి యఖిలదేవతల । బాగొప్ప రక్షించి భార్గవు కూఁతు
వరియించి కీర్తుల వన్నెకునెక్కి । ధరణి యయాతి భూధవుఁడున్నవాఁడె!

---

1. కొయిశేల. 2. దేవేంద్రు. 3. సరితోన (?). 4. పన్నెండు. 5. కెంతయు. 6. నొక్కఁడ.

భూమిలోఁ గలిగిన భూమీశులెల్ల । వేమఱు నొక్కటై వెస నెత్తి వచ్చి
కదనంబు చేసి విక్రమమున నలసి । చెదరక శరణుచొచ్చినవారిఁ గాచి
ప్రేమతో మఖములు పెక్కొనరించె । నామహీపతి [1]యేఁడి యంబరీషుండు !
లక్ష భార్యల నుపలాలనచేసి । వీక్షింప నొక్కొక్క వెలఁదికి వేవు
రాత్మజులను గాంచి హయమేధచయము । లాత్మీయముగఁ జేసి యవనిలో మించె
నా శశిబిందుని యంతటివాఁడు । నాశంబు నొందఁడే నరనాథచంద్ర !
అధిక తపంబున ననలు మెప్పించి । యధికుఁడై బ్రహ్మచర్య ప్రవర్తనల
దమ మహింసయుఁ బాత్రదానంబు మఱియు । శమమును వరముగాఁ జయ్యనఁగోరి,
వేదికాస్థలి మణివితతులచేత । నాదట ముప్పదియాఱు యోజనము
లైనదైర్ఘ్యంబును నంతియువిరివి । గా నొనరించి మఖంబొప్పఁ జేసి
కరమొప్పఁ దనపేర గయ నుతికెక్కఁ । బరఁగిన గయుఁడు నిప్పాటనున్నాఁడె !
అవని నిర్వాది వేవు రభ్యాగతులకు । వివిధాన్నతతులు భావించి పెట్టించి
సత్రయాగము చేసి సకలపుణ్యములుఁ । బాత్రతఁ జేకొని భాగ్యవిస్ఫూర్తి
రమణుఁడైనట్టి యా రంతిదేవుండు । ప్రమదంబుతో భూమిపై నున్నవాఁడె !
శరభ సింహాత్యుగ్ర సర్పకోటులను । గరిడికిఁ దెప్పించి [2]కట్టు విచ్చుచును
దమియింపఁగా [3]సర్వదమననామముఁ । విమలుఁడై పెంపొంది విజయ [4]శౌర్యమున
భాగీరథీతీర భాగంబునందు, । రాగిల్లు వేడ్క సరస్వతీ తీర
మున వివిధాధ్వరంబులు పెక్కుచేసి । కనక నిర్మిత హయ కరి రథంబులను
ధరణిదేవతల కెంతయు భక్తి నిచ్చె । భరతుఁడున్నాఁడె భూపాలాగ్రగణ్య !
పరువడి మిట్టును బల్లంబు నగుట । నరదముల్ దోలంగ ననువుగాకున్న
జగతీతలంబెల్ల సమముచేయించి । బెగడికఁ దనపేరఁ బృథివినాఁ బరఁగు
గోరూపమైన యక్కుంభినిఁ జూచి । వారక నిఖిలదేవతలను బనిచి
మొగినోషధుల రత్నములఁ బిదికించెఁ । దగఁ బృథుఁడను రాజు ధాత్రినున్నాఁడె !
ఇరువదియొక్కమాఱేచి రాజులను । బరశువుచేఁ గొట్టి పారంగ వైచి
కశ్యప బ్రహ్మకీ క్ష్మాతలం బిచ్చి । కాశ్యపి యనుపేరు గలుగంగఁ జేసి
తేజంబు దానంబు ధృతియును గలుగు । నా జామదగ్న్యుండు నవని నున్నాఁడె !"
అనుచుఁ జెప్పినవిని యబ్జలోచనుని । గనుఁగొని పాండవాగ్రజుఁ డొప్పఁ బలికె:

---

1. పేఁడి. 2. కట్టి విడ్చుచు; కట్టిచ్చుచు. 3. సర్వ. 4. కార్యమున.

"పారిదిమై సృంజయసుతుఁడైన యట్టి । వరలబ్ధ ఘనుఁడు సువర్ణ నిష్ఠీవి
హతుఁడైన వార్త పాయక నేనువింటి । వ్రతమతి; నైన సువ్యక్తంబుగాఁగ
విన వేడ్క యయ్యెడు వినిపింపు" మనిన । వనజాక్షుఁడిట్లను: [1] "వడినాఁడు నీకు
వ్యాసమహాముని వలనుమీఱంగ । ధీశక్తి నారదాధీనంబు నగుటఁ
జేసి తద్విధమెల్లఁ జెప్పెఁ; బర్వతుని । వాసిగాఁ జెప్పఁడు ; వరమతి వినుము.

## శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బర్వత నారదుల వృత్తాంత మెఱిఁగించుట

చెలిమితో నారదు చెలియలికొడుకు । నల పర్వతుండుఁ బాయక యిద్ద ఱెలమి
"వెనుకొని నిజ చిత్తవృత్తు లొండొరుల । కును దాఁపకెంతయుఁ గుంభినిలోనఁ
జరియించువారము ; సరి నటుగాక । యొరవొందఁగఁ ఘటించి యెవ్వఁడు దాఁచె
వాని శాపార్హత వాటిల్లఁ గలది, । పూనికయిది." యని పోరినొక్కనాఁడు
సృంజయుఁ గాంచి యంచితభక్తి నతఁడు । రంజిల్లఁ బూజింప రమణఁ గైకొనుచు
"నీయింటఁ గొన్నాళ్ళు నిలిచి యుండెదము । పాయక యిప్పు డేభంగులనైన."
అనినఁ బ్రియంబంది యా సృంజయుండు । తనయను సుకుమారిఁ దప్పక చూచి
"యిక్కన్య మీకు విహితపరిచర్య । మక్కువఁ జేసెడు మహితాత్ములార!"
యనిన నొడంబడి యక్కన్య తమకు । దినమును శుశ్రూష తేకువఁ జేసి
వలయు పదార్థముల్ వడి సమకట్టి । యెలమితోఁ బెట్టంగ, నిట నొక్కనాఁడు
నారదుఁ డాయింతి నయనముల్ గురులు । నీరజవదనంబు నిటలస్థలంబు
కరయుగమూలముల్ కంబుకంఠంబు । గుఱుతుగా బిగిగల గుబ్బపాలిండ్లు
నడుమును నాభి యున్నత జఘనంబు । నడుగులుఁ గనుఁగొని యంగజబాణ
దళితుఁడై యెంతయు ధైర్యంబు వదలి । తులకించు వెన్నెలతో మేలమాడు
మీనాక్షి నగవును మృదుభాషణములు । మానుగాఁ దలపోయ, మామను జూచి
'యిటులేల వలవంత యీతనిఁ జెందెఁ । దటుకున!' నని మతిఁ దప్పక చూచి
పరికించి కాంచి యెప్పటి సమయంబు । కరమర్థిఁ గడచినఁ గని [2] యిట్టులనియె:
"రాచకూఁతురి మీఁద రాగంబుపుట్టి । యీచాయ చెప్పక యెట్లుదాఁచితివి!

1. "నీకు నాఁడు కృష్ణద్వైపాయనుం డక్కుమారువృత్తాంతంబు నారదునధీనం బగుటఁజేసి తద్వ్యాపారంబు సెప్పెఁ బర్వతుని జెప్పఁడుగాని పర్వతుండును సహకారి యుత్తెఱం గాకర్ణింపు" మని తిక్కన. శాం. 1. 245. 2. పర్వతుఁడు - కర్త అధ్యాహార్యము.

నాతిపాణిగ్రహణానంతరమునఁ । గోఁతిమొగంబు నీకును నవుఁగాక."
యనవుడు పర్వతు నానారదుండు । "అనిమిషలోకంబు కరుగుట మాను."
మనిప్రతిశాపంబు నతని కిచ్చుటయు । జనులు పూజింప భూస్థలి నుండె నతఁడు.
అంత నారదముని యమ్మహారాజు । నంతయుఁ గనుఁగొని యిట్లని పలికె:
"వెన్నెలతేటయో! విరహుల దీమొ! । కన్నెజాజుల బంతో! కాఱుమెఱుంగో!
నీకుమారితె నిమ్ము నెమ్మినా" కనిన । భూకాంతుఁ డప్పుడా పూఁబోఁడి నొసఁగె.
శుభ దివసంబున శుభముహూర్తమున । నభినవంబుగఁ బెండ్లియాడిన నంత
వానరముఖమైన, వనితాలలామ । యానారదునిఁ జూచి యంతరంగమున
రోయక మిగులను రూపాఢ్యుఁడనుచుఁ । బాయక మిక్కిలి పతిభక్తితోడ
నతనిఁ బ్రీతునిఁ జేయ, నతఁ డొక్కనాఁడు । ప్రతిలేక యడవికిఁ బనిగల్గి పోయి
పర్వతుఁ గాంచినఁ, బర్వతుఁడపుడు । పర్విన వేడ్కతోఁ బఱతెంచి మ్రొక్కి
'మామ, నాశాపంబు మరలింపు!' మనిన । వేమఱు నీవుగావే మున్ను నన్ను
శపియించినాఁడవు! సరవి మరల్పు । మిపు' డన్న నొడఁబడి యిరువురునపుడు
మరలిచి శాపముల్ మక్కువతోడ । నరుదెంచి నిజమందిరాంగణభూమి
దరిసించి నంత, నాతన్వి మొంకియును । బరపురుషుని గాఁగ భావించి చూచి
మాఱు మొగంబిడి మరలిపోవుటయు । నారక నవ్వి పర్వతుఁ డిట్టులనియె:
'నాతి, నీ పురుషుండు సమ్మునీ' ననుచు । నాతత శాపవృత్తాంతంబు చెప్ప
ముదమందె నప్పు డా మునిపత్ని; యీభంగిఁ । బదపడి వినుము భూపాలావతంస!
నీ వడిగిన స్వర్ణనిష్ఠీవి చరిత । దేవమునీంద్రుండు తేటగాఁ జెప్పు."
ననుచు నారదుఁ జూచి నానారదుండు । "మనుజేశ, యిప్పుడు మధుసూదనుండు
చెప్పిన తెఱఁగెల్లఁ జెలఁగి నిక్కపము । చెప్పెదఁ గనకనిష్ఠీవి విధంబు.
ఆవిధంబున నేను నల్లుండుఁ బ్రీతి । నావిరి నచ్చోట వసియింపఁ గొన్ని
సమయముల్ చనిన, నిశ్చలవృత్తి మాకు । గమనేచ్ఛ పుట్టి భూకాంతునిఁ జేరి
'మామ, కోరు వరంబు మఱి నీకు నిత్తుఁ । బ్రేమతో' ననిన నాసృంజయుఁ డనియె:
"అరయ మీరలు ప్రీతులైనంతకంటె । వరములు గలవె! యేవంకలనైన."
నని గారవించిన "ననిమిషవరులఁ । దనరంగ మించిన తనయునిఁ గనఁగఁ
దలఁతువు నీపట్టి తనయునిఁ గనుము । అలవడఁగా." నన్న నాపర్వతుండు
అనిమిషేశ్వర రక్షణాయత్త చిత్త । మున మహీపతితోడ మునుమిడి పలికె:

‘ అవనీశ, సుతుఁడు దీర్ఘాయువు గాఁడు । వివిధ భంగుల ’ నని వినిపింప నతఁడు
మిక్కిలి ప్రార్థించి “ మీయనుగ్రహము । తక్కువ గాకుండఁ దగఁ జేయుఁ” డనిన,
నమ్మని మఱుమాట లాడకయున్న । నెమ్మిగా నృపుఁ జూచి నేనప్పుడంటి :
“ వలదు శంకింప భూవర, యింద్రువలనఁ । గలుగు భయంబు చక్కఁగ నేన మాన్తు.
అక్కుమారుఁడు సువర్ణాదులఁ గురియుఁ । జక్కగా నదిగాన స్వర్ణ నిష్ఠీవి
యనఁ బ్రసిద్ధికి నెక్కు” నని యూఱడించి । యెనయంగ నేను యథేచ్ఛమై నరుగ
[1]సృంజయుఁ డంతఁ బుత్రునిఁగాంచుటయును(?) । రంజిల్ల వాఁడు మూత్రమున లాలాశ్రు
మలము లష్టాపద మయములై తోరుఁగ । నెలమితోఁ బెరుఁగంగ, నిట నొక్కనాఁడు
మ్రుచ్చులబ్బాలుని [2] మెదలంగ నీక (?) । యచ్చుగాఁ గొనిపోయి యడవిలోపలను
ఒనర బాలునిఁ గట్టి యొడలు శోధించి । కనకంబు గానక కడిమిమైఁ జంపి
పోయిన, సృంజయ భూపతి కొడుకు । [3] నాయెడఁ గానక యాత్మలో వగచి
‘ యీకుమారోత్తంసు నింద్రుఁడే చంపెఁ । గా’ కని వలవించి కడు నార్తుఁడగుచు
నన్ను దలంచిన, నరపతి కడకుఁ । [4] బన్నగాఁ బోయి యాపద్మలోచనుఁడు
నీకుఁజెప్పిన యాదినృప చరిత్రములు । తూకొని యేఁజెప్పి దుఃఖంబు దీర్చి
యడవిలో నవిచారులైన తస్కరులు । కొడుకుఁ జంపుట చెప్పి, గొనకొని నరక
వానంబునందున్న స్వర్ణ నిష్ఠీవి । భాసిల్లఁ దెచ్చి భూపాలునకిచ్చి
“ ఇంద్రుని చేఁతగాదిది; [5] యిక్కుమారు । సాంద్రత నింద్రుండు చంపంగ [6] వేచు;
వెఱవొప్పనెంతయు వీని రక్షణము । మఱవకు ” మనిచెప్పి మఱియు నిజేచ్ఛ
నరిగిన, నొక్కనాఁ డాఖండలుండు । ‘ పరఁగ నీ శిశువు తప్పక నన్ను మీఱు ’
ననుచు శంకించి పాయకనన్నుఁ దలఁచి । మునుకొని యేకాంతమున బృహస్పతికి
నత్తెఱఁ గెఱిఁగించి యతని సమ్మతిని । దత్తరపాటుతోఁ దనశతకోటిఁ
గనుఁగొని వ్యాఘ్రంబుగతి రూపుదాల్చి । చని స్వర్ణ నిష్ఠీవిఁ జంపి రమ్మనుచు
ననిపిన, నెంతయు నది వచ్చువేళ । ననఘుఁడు సృంజయుఁ డాంద్రునుఁ దాను
బుత్రయుక్తముగ నిమ్మల గంగకరిగి । నేత్రోత్సవంబుగా నెగడు తత్తీర
వనభూములందుఁ బావన చిత్తవృత్తిఁ । దనరిన సతులతోఁ దగ విహరింప,

---

1. రేఫ వక్రసందుల ప్రయోగమున నితఁడు పలుమాఱు పొఱపడినాఁడు. 2. మెదలంగ.
3. గానక యాత్మలోఁ గడువగచివగచి. 4. నెన్నఁగాఁ బోయిననిట విలోచనుఁడు. 5. యొక్క.
6. దలఁచు ; వెఱచు.

శార్దూల మేతెంచి చయ్యన సుతుని । నిర్దయత్వంబున నెఱిఁ జంపివైచి
యంతర్హితంబైన యంతలో, దాది । సంతాపమున నేడ్వ, జనపతి వచ్చి
బాలునిఁ గనుఁగొని బహుళ శోకమున । లోలాక్షులును దాను లోలతనున్న
దలఁచిన వచ్చి యా తనయుని ప్రాణ । కలితునిఁ జేసినఁ గనకనిష్ఠీవి
జనకుండు మిగుల హర్షంబునఁ బొందె. । అనఘాత్మ, యీరీతి నాసృంజయుండు
సంతోషచిత్తుఁడై సరవిఁ గుమారుఁ । ౚంతంబుతోడుతఁ బట్టంబు గట్ట
శత సహస్రాధిక సంవత్సరంబు । లతఁడు రాజ్యము చేసె." నని చెప్పి మఱియు
హరియు వ్యాసుండును నాదరంబునను । బరువడిఁ జెప్పిన పద్ధతి నీవు
ధరణి పాలింపుము ధర్మమార్గమున । నరనాథ!" యనిన నెంతయు నూఱకున్న
నతని నుద్దేశించి యా వ్యాసమౌని । యతులిత స్ఫూర్తి నిట్లని చెప్పఁదొడఁగె :
" క్షత్రియులకుఁ బ్రజాసంరక్ష గడచి । ధాత్రిలోపల నొండు ధర్మంబు లేదు ;
గావునఁ బ్రజలను గడఁగి పాలింపు, । పావనచరిత, శోభన మావహిల్ల."
నావుడు నమ్మహీనాథుఁ డిట్లనియె : । " భావింప నో మునిప్రవర, యేఁజేసి
నట్టి పాపంబు లేమని చెప్పవచ్చు ! । గట్టిగాఁ జంపంగఁ గానట్టివారిఁ
బలువురఁ జంపితి బంధువర్గములఁ । గలనిలో ; నిది యాత్మఁ గనలుచునుండు."
అనవిని మునిచంద్రుఁ డర్థి నిట్లనియె : । "మనుజు లెవ్వరు సేయ? మహినీశ్వరాజ్ఞ ;
పరశురాముఁడు బాహుబలమున నృపులఁ । బరశువుచేత నేర్పడఁ జంపివైచి
పాపంబు పొందెనే పలుకులింకేల ? । యేపట్టునను గర్త యెద్దానికైన
ననయంబు నీశ్వరుఁడను నిశ్చయంబు । మనమున నిజమైన మఱిచాలు నధిప !
ఒనరంగ నాత్మకులోక్త కర్మంబు । ఘనముగా నూర్ధ్వలోకమునకుఁ జేర్చు ;
పరకర్మ మొనరింపఁ బాపంబు వచ్చు । ధరణిలో ననుచుఁ బెద్దలు జెప్పుచుండ్రు.
కావున నిజవంశ కర్మంబు నడవు । భూవర" యనవు డమ్మౌని కిట్టులనియె :
"పుత్రులు నన్నలుఁ బొనఁగఁ దమ్ములును । పౌత్రులు మామలు బంధువర్గములు
జనకులు బావలు సరవిఁ దాతలును । మనమార గురువులు మఱఁదులు హితులు
నాచేత మడిసిరి ; నలి వారిసతులు । చూచి శోకించుచు సొరిదిఁ బ్రాణములు
విడుతురు ; దానిని వెన విచారింపఁ । గడగి స్త్రీవధపాతకమును బాటిల్లు.
ఏరీతి భూచక్ర మేలంగ వచ్చు ? । వారక" యనిన భూవరున కిట్లనియె :
" విడువు మమ్మలికంబు వినుము చెప్పెదను । దడయక నీకుఁ బాతకమేమిలేదు ;

కృపతోడ శ్రీయును గీర్తియుఁ గలుగు; । చపలత దురములోఁ జచ్చినయట్టి
జనపతు లేలెడు జనపదంబులను । దనరంగ నట వారితనయులకిమ్ము;
కొడుకులు లేనిచోఁ గూఁతులనిలుపు; । తడయక పుణ్యాహముల్ తగ నీకుఁగలుగు.
అనుమానపడకు దేవాధీశ్వరుండు । తునుమాడె దైత్యులఁ దోడఁబుట్టువుల.
అతనిఁ గొల్వరే యఖిలసంయములు! । ఖ్యాతితో నూర్ధ్వ లోకం బదిగాదె!
ఏలఁడే నాకంబు! నీవును నట్లు । పాలింపు; ధరఁ గ్రతుపరుఁడవుగమ్ము.
అనయంబుఁ దొలితొలి యశ్వమేధంబు । నొనరింపు సందేహ మొప్పఁగా విడువు."
మనిన నంకిలి దేఱి యాధర్మరాజు । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె:
"ఎట్టిపాపంబున కెట్టు లీధాత్రి । గట్టి ప్రాయశ్చిత్తగతి యెఱిఁగింపు?"
అనుటయు మునినాథుఁ డట్ల కాకనుచు । జననాథుతోడ నిశ్చలవృత్తి ననియె:

## వ్యాసుఁడు ధర్మజునకు ధర్మాధర్మము లెఱిఁగించుట

"వేదోక్త కర్మంబు వెనఁజేయకుంట, । ఆదట నింద్యమైనది సేయుటయును,
మఱి రవియుదయాస్తమయకాలములను । నెఱిమీఱ నెంతయు నిద్రించుటయును,
ధరఁ బాత్రభూతుండు దనగృహంబునకు । నరుగుదెంచినఁ బూజయాచరింపమియుఁ,
బరదారగమనంబు, ప్రజ్ఞదీపించి । గురువున కెదురు గ్రక్కునఁ బల్కుటయును,
గ్రామంబు చెఱుచుట, రసవిక్రయంబు, । వేమఱు నెంతయు వేద విక్రయము,
రూఢిగాఁ దల్లిదండ్రులఁ బ్రోవమియును, । [1] ఓడక మఱి యసత్యోపచారంబు,
గహన[2]దాహము, నన్యకర్మకృతియును, । మహిలోనఁ దనదు కర్మము విడుచుటయుఁ,
బరఁగ వృథా పశుప్రహరణంబులును, । ధరణిదేవతల విత్తము హరించుటయు,
దొరకొని శరణాగతులఁ బ్రోవమియును । బరఁగఁ బాపములండ్రు; పాపముల్ వోలె
మానుగా నుండియు మహిని దూష్యములు । గానివి చెప్పెదఁ గడఁకతో వినుము;
గుఱిమీఱఁ గైదువగొని తన్ను బోర । నఱిముఱిఁ జంపంగ నరుదెంచునట్టి
వేదాంత రాద్ధాంత వేదినినైన । మోదంబుతోడఁ జంపుట పుణ్యమధిప!
తనరంగ విప్రవిత్తము హరింపంగఁ । గని చంపినను బాపకలితుండు గాఁడు.
సరవితో జీవిత సంశయవేళ । నరనాథ, యన్నపానములు లేమియును

1. ప్రౌఢయౌ తనసతిఁ బొందకుండుటయు. 2. దాహకమన్య.

వెరవుతోఁ గల్లుద్రావినను, గల్లగుట । యెఱుఁగక త్రావిన, నిట్టిపాపములు
నరయంగ నధికపుణ్యంబునఁ జెడును. । సరసత గురువుల సంరక్షణకును
వరుసతో నావదవచ్చిన యెడను । ధరణి భూదేవవిత్తంబు దక్కంగ
నితరధనంబుల నేపుతోఁడుతను । బలిమిమీఱ హరియింపఁ బాపంబులేదు.
పరిణయవేళలఁ బ్రాణహానులను । గరిమతో గురువుల కార్యార్థమునను
బడఁతులతోడి సంభాషణవేళఁ । బుడమిసర్వస్వంబుఁ బోయెడు వేళ
బొంకినఁ బాపంబు పొరయదు నిజము. । అంకిలిఁ గలల వీర్యస్ఖలనంబు
పరికింపఁ గలిగిన, బ్రహ్మచర్యంబు । వగుసతోఁ జెడదు ; పావకముఖంబునను
ఆహుతుల్ వేల్చిన నాకిల్బిషంబు । ఊహింపఁ జెడును బుణ్యోజ్జ్వలమూర్తి !
ఇలనన్న పతితుండయిన, నటుగాక । యలవడ సన్న్యాసియయినను, నతని
తమ్ముఁడాతండుండ దారసంగ్రహము । క్రమ్మఱఁ జేసినఁ గలుషంబులేదు.
అరయంగ గోవులకై కాననంబు । దరికొల్పుటయును నధ్వరమునఁ బశువుఁ
జంపుట, దానంబు సరి నపాత్రునకు । సొంపుతో నెఱుఁగకిచ్చుట, తగనట్టి
సేవకు విడుచుట క్షితిలోనఁ గీడ్గు । గావు ; ప్రాయశ్చిత్తగతి నెఱింగింతు

## వేదవ్యాసమహర్షి ధర్మజునకుఁ బ్రాయశ్చిత్తవిశేషము లెఱిఁగించుట

కర్మంబు దెలుపుచు ఘనకపాలమున । నర్మిలి భైక్షపుటన్నంబు నేక
కాలంబు గుడుచుచు ఖట్వాంగచిహ్న । మాలోనఁ గైకొని యట బ్రహ్మచర్య
మును నధశ్శయనంబు మునుకొని పూని । పనివడి ద్వాదశాబ్దంబు లీరీతిఁ
జరియింప వినుము నిశ్చల బ్రహ్మహత్య । దురిత మెంతేనియుఁ దొలఁగు నిక్కువము.
నరనాథ, కృచ్ఛ్రముల్ నడపిన నాఱు । వరుసంబులను దెగు ; వదలక మూఁడు
వరుసముల్ మిగులఁ బావన వృత్తితోడ । సరవిఁ జాంద్రాయణచర్య చేసినను
బోవును ; మఱి మాసభోజియయ్యెనను । భూవర, యొక యబ్దమునఁ బాయు ; నట్లు
కాక ఘోటకమేధ కలితుఁ డయ్యెనను । బ్రాకటంబుగ నెట్టిపాపముల్ చెడును.
వెనుకొని కల్లుద్రావిన పాతకంబు । ననల వర్ణంబుగా నది గాచిత్రావ,
నటుగాక సొదపేర్చి యగ్నిలో నుఱుక, । నట మహాప్రస్థాన మాచరింపంగ,

సరవి బృహస్పతి సవమను మఖము । ధరణిఁ జేసిన, భూమిదాన మిచ్చినను
బొలుపార నెంతయుఁ బోవు నా కీడు ; । కొలఁదిగా గురుతల్పగుం డనల ప్ర
తప్తయౌ నాయస తరుణి దేహంబు । దీప్తమై ఖరిత ోడ ధృతిఁ గౌఁగిలింప,
నది గాక కోసి మేహనము హస్తమున । వదలక ధరియించి వరుస సంబరము
చూచుచుఁ బోయిన సొరిది నా పాప । మూచాయఁ దొలఁగు ; పాయక సువర్ణంబు
హరియించినాతఁడు నట్టిహేమంబు । ధరణిదేవుల కియ్యఁ దలఁగు దోషంబు.
అవనిఁ గోపలఁ గల్లలాడిన పాప । మవిరళంబుగఁ బోవు నాతనిభక్తిఁ
బ్రీతునిఁ జేసినఁ; బేర్మితో గురున । కాతలి నెమరాడినట్టి పాతకము
ఎలమితో నుపహారమిచ్చి యాతనికి । వెలయంగ మ్రొక్కిన వెడలు నిక్కువము.
గరిమతోఁ బరదారగమన దోషంబు । (నురువడి ధరణిలో నొకవత్సరంబు)
పరమ వ్రతుండునై పరఁగి కృచ్ఛ్రములఁ । జరియింప మానును జగతీతలేశ !
మునుకొని వినుము యిమ్ముల వావిగాని । వనితఁ బొందినయట్టివాని పాపంబు
ఆఱు మాసంబులు నార్ద్ర వస్త్రంబు । నారూఢి ధరియించి యట భస్మశయన
పరత వాటించినఁ బాయు నిక్కువము. । సొరిదిమైఁ బరపురుషుని సంగమునఁ
[1] బరిహృతయైనట్టి భామాలలామ । యగయ రజస్వలయై శుద్ధిఁ బొందు
ఘనముగా నెంతయుఁ గంచు భస్మమున । ననయంబు శుద్ధమైనట్టి విధమున.
తఱలక నఱకంగఁ దగని వృక్షంబు । నఱికినఁ బక్షుల నలి వధించినను
మునుకొని తనచేత మూనాళ్లుపవాసు । చనిల భక్షకుఁడైన నఘములఁ బాయు.
మహిలోనఁ బుణ్యకర్మములు సేయుచును । బహుతర ధనములు బ్రాహ్మలకిచ్చి
చెలఁగినఁ, బూర్వోపచితములైనట్టి । కలుషముల్ వాయును గౌరవనాథ !"
అనుడు "నభోజ్యంబు లటు సపాత్రులను । గనన పేయంబుల గణుతింపు" మనిన
నర్మిలి దీపింప నాతనిఁ జూచి । ధర్మాత్ముఁడైన వేదవ్యాసుఁ డనియె :
"ఉరువడి తురగియు నుష్ట్రియు ఖరియుఁ । గురిసిన దుగ్ధముల్ క్షోణి నింద్యములు.
మానుషీ క్షీరముల్ మఱియు ధేనువులు । ఈనిన పదినాళ్ల నెనఁగు దుగ్ధములు
నేతెఱంగున నైన నివి యపేయములు ; । నూతకాన్నంబును జూదరన్నంబు
తలవరియన్నంబు ధరణిలోఁ బ్రేత । కలి తాన్నమును వంది ఘనతరాన్నంబు

---

1. పరహిత. 2. భూరుహముల నింక నఱక — నని భయఘ్నుండైన. (మూ)

భామోపజీవనపరుని యన్నమును । భూమి యగ్రజునకు మున్నుగాఁ బెండ్లి
యాడిన వానింటి యన్నంబు నాడి । పాడెడు వానింటి బహువిధాన్నంబు
మానంగ వలయును మనుజవర్యులకు, । భూనాథ, వినుము యొప్పదు సభోజ్యములు ;
ధృతి సురతోఁ గూడఁ దెచ్చినయట్టి । వితత పదార్థముల్ వెసనభోజ్యములు.
పులగము పాయసంబును [1] నట్లు మఱియుఁ । బలలమర్చకుఁ గాక పక్వంబులైనఁ
గలుగునభోజ్యత ఘనతర లీల ; । వెలయంగ విచ్చలవిడి వంటకంబు
చేసి వేఁడుకకు భుజింపంగఁ జనదు. । వాసిగా నతిథి దేవపితృపూజలను
గరలి చేసినఁ గాని గృహమేధులకును । ఇరవొప్ప భోజ్యమయ్యినఁ దినరాదు.
నరవి సపాత్ర నిశ్చయ మింక వినుము । తిరముగాఁ జెప్పెదఁ దెలివిడి గాఁగ :

### కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు సపాత్ర పురుషుల నెఱిఁగించుట

"పాడియు నాడియు బ్రదుకువారలును । గూడంగఁబరిహాసకుండు దుర్జనుఁడు
సంగహీనుఁడు మత్తుఁడటు చోరకుండు । వెంగలి దుర్వృత్తి వేదబాహ్యుండు
వెస నపుంసకుఁడును వీ రాదిగాఁగ । ననసృశదానంబు కర్హులు గారు.
[2] పోరిఁ గుక్కలతిత్తిసి [3] బూసఁగంగఁ బాలు । కర మొప్పఁ బోసినగతి నపాత్రునకు
నిచ్చినదానంబు లిల వృథవోవు ; । ఇచ్చుచోఁ బాత్రత నెఱుఁగంగవలయు."
అని చెప్ప మునిఁ గని యాధర్మరాజు : । "అనఘాత్మ, ధర్మంబు లానతీవయ్య
ధరణి వర్ణాశ్రమ ధర్మంబులాది । పరగిన ధర్మముల్ పాటించి." యనిన,
"శాంతనవుఁడు నీకు సకలధర్మములు । నంతయుఁ జెప్పు నివేఁడుమచ్చటికి"
ననిన ధర్మతనూజుఁ డతని కిట్లనియె : । "మునినాథ, [4] కృత్రిమంబున భీష్ముఁగూల్చి
క్రమ్మఱ నాతనికడకు నేఁబోయి । నెమ్మి మొగముఁజూచి నిఖిలధర్మములు
నొప్పుగా నుపదేశ మొనరింపు మనుచుఁ । దప్పక యేరీతిఁ దగ నడుగుదును ?"
అనుడు జనార్దనుఁ డా రాజుఁజూచి : । "మనుజేశ, మునిశిఖామణి వాక్యసరణి
నేయుదుగాక వేంచేయుముపురికిఁ । బోయకయీవేళపద" మన్న నతఁడు

### ధర్మజుఁడు సపరివారంబుగాఁ గరినగరంబు ప్రవేశించుట

కరమొప్ప మదిలోని కలఁక వోవిడిచి । ధరణి యేలఁగఁబూని తపసులననిపి
మఱునాఁడు సంధ్యాది మహితకృత్యములు । తెఱఁగొప్ప నవేగఁ దీర్చి ధర్మజుఁడు

---

1. మెండలైన – ఫలము లచ్చినకుఁగా. 2. ఒరి. 3. ఉమకను. 4. భీష్ముని మదమున. (మూ)

దివ్య గంధంబులు దివ్యమాల్యములు । దివ్యభూషణములు దివ్యాంబరములుఁ
గైకొని రథమెక్క గ్రక్కున నంత । నాకడ సారథియయ్యె భీముండు ;
పార్థుండు శ్వేతాతపత్రంబు వట్టె ; । అర్థిం గవలు వట్టి రాతపత్రములు.
ఆరీతి ధర్మజుఁ డా యాంబికేయు । నాతని దేవిని నందలంబులను
ఎక్కించి, కుంతిని నిటుఁ దనసతిని । మక్కువఁ గురురాజు మానినీమణులఁ
దగనందలముల నంతట నెక్కఁ బనిచి । నగధర సాత్యకుల్ నలి యుయుత్సుండు
విదురుండుఁ దోడరా వేగంబె కదలి । కదళికా స్తంభముల్ ఘనపతాకములు
పొలుపొందు తోరణంబులు మేలుకట్లుఁ । గలిగి యొప్పిదమైన గజపురిఁ జొచ్చి
రాజమార్గంబున రమణతోఁ బోయి । రాజిల్లు వేడుక రాజిల్లుఁ జొచ్చి,
తగ నందు గృహదేవతలఁ బూజచేసి । మగిడి యంగణభూమి మఱివచ్చి నిలిచి,
ఘనముగా విప్రులఁ గనిపించుకొనుచుఁ । గనకంబు గోవులఁ గరుల నశ్వముల
దానంబులిచ్చె ; నంతట ధర్మసుతుని । యానసం బందఱు నటు చూచుచుండ
సరిగఁ ద్రిదండివేషము ధరియించి । సరవి దుర్యోధను సఖుఁడు చార్వాకుఁ
డనువాఁడు భూదేవతాళిలోఁ జొచ్చి । గొనకొని నిలిచి యాక్షోణీశు కనియె :
"వినుము నరేంద్ర, యీవిశ్వంబులోన । ఘనులు విప్రులుగూడి కడఁకతోడుతను
నన్ను బంపిరి విను నలినారివంశ ! । అన్నల గురువుల సఖుల బాంధవులఁ
దాతల సోదరతతులఁ జంపితివి ; । నీతియే రాజ్యంబు నీకు నేలంగ !
[1]ననుమని పల్కిరి ట్లక్కటా ! బంధు । జనులనుజంపి నిచ్చలు భోగములకుఁ
బనిపూనితివి నీకుఁ [2]బాపమేదక్క." । ననవుడుఁ దలవాంచి యాధర్మరాజు :
"మ్రొక్కి వేఁడెద మిమ్ము మునివరులార ! । ధిక్కరింపకుఁడు ; సుధీజనవరుల
యనుమతితోఁ గూడ నట వచ్చినాఁడ." । ననిన భూసురవర్యు : "లవనీతలేశ !
లలి నిట్టి వాక్యజాలములు మాలోన । నెలమిఁ బుట్టినవిగా వేమొకో గాని.
జగతిలో నుత్తమక్షత్త్రియధర్మమునఁ । దగఁ గొన్న భూమి యెంతయు నేలు." మనుచు
నమ్మాయగల భిక్షు నటఁ జూచి చూచి । నెమ్మి బోధంబున నీచుఁగా నెఱిఁగి
ధర్మజుతోడ నంతయు నప్పుడనిరి : । "దుర్మదాంధుఁడు వీఁడు దుర్యోధనునకు
మిత్రుండు దైత్యుండు మేదినీనాథ ! । పాత్రుఁడై సన్యాసిభావంబు దాల్చి
యెఱుకచాలనిమాట లితఁడాడెఁ ; గుక్క । మొఱఁగిన నేమి ? తమ్ములు పనుల్ సేయఁ

1. ననిమునుల్ పలికి. 2. బాడియేదక్క. (మూ)

బూజ్యంబుగాఁగ సద్భోగభాగ్యముల । రాజ్యమేలుము ధర్మరాజ, సర్వజ్ఞ !"
అని యాదరించి యాయవసి దేవతలు । దనుజుని గనుఁగొని తగురోషవృత్తి
హుంకార మొనరింప నొగి వాఁడు గూలె; । నంకించి పొగడిరి యసురులు దివిని.
అంత ధర్మజుఁడు విప్రావళి కెల్ల । నెంతయు నర్చనలిచ్చి పీఠోల్లసిల్ప,
బ్రాహ్మణస్తుతి చేసి ప్రార్థివుఁజూచి । జిహ్మగపతిశాయి చెలఁగి యిట్లనియె :
"క్షితినాథ, విను వీఁడుకృతయుగంబునను । జతురాననుని గూర్చి సరవిఁ దపంబు
నాయెడఁ జేయఁ బ్రత్యక్షమై బ్రహ్మ । 'పాయక వరమిత్తుఁ బ్రజ్ఞతో నడుగు'
మనినఁ జార్వాకుండు నాబ్రహ్మఁజూచి । 'యనఘాత్మ, నాకును నఖిలభూతముల
వలనను నభయంబు వరముగా నీవె! । కలితాత్మ" యనిన నక్కమలగర్భుండు
తగఁ బల్కె "భూదేవతలకు ననిష్ట । మగు పని సేయకు; మటు సేసితేని
యదియ [1] నీకును దుది" యని వర మొసఁగె ; । పదపడి వీఁడును బాధించె నోరుల.
బాధింపవారలు వద్మజుఁ గాంచి । సాధింపరాని రాక్షసబాధ చెప్ప
విని బ్రహ్మ మున్న [2] నే వివరించినాఁడ, । ననయంబు కురురాజుకట మిత్రుఁడగుచు
నవనీసురుల మనోవ్యథకరంబుగను । దవిరి పల్కు ననాఁడె తీఱు వాఁ డనుచు
నసురుల మన్నించె ; నట్టులె వీఁడు । ప్రమదంబుతోడుతఁ బడియె నిచ్చోట
విను" మని వీనుఁగు వెడఁ వైపించి । 'ఘనముగా రాజ్యంబు గైకొను నీవు'

## ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము

అనిపల్కి శ్రీకృష్ణుఁ డాకృపాచార్యు । ననయంబు గాన్పింప నర్హపీఠమునఁ
గూర్చుండ నియమించి, గురుఁడు ధౌమ్యుండుఁ । [3] గూర్చునా పెద్దలఁ గూర్చుండఁబనిచి
నలిమీఱు సింహాసనమున ధర్మజుని । నిలిపి వేడుకతోడ నీలవర్ణుండు
తగు మంగళద్రవ్యతతులు తెప్పించి । మొగి నంత శుభవాద్యములు మ్రోయుచుండఁ
బాంచాలిఁ దద్వామ పార్శ్వంబునందు । నుంచి హోమంబుల నొనఁగూర్చి చేసి
గంగాది తీర్థముల్ కడఁకఁ దెప్పించి । యంగనాయుతు నృపు నభిషిక్తుఁ జేసె.
అప్పుడు ప్రీతితో నాంబికేయుండు । తప్పక కలశంబు ధౌమ్యుఁ డీయంగ
నభిషేక మొనరించె నుమతనూభవుని । శుభలీల దేవతాప్తతులు చెలంగ

---

1. నీకంటును. 2 వివేకించినాఁడ. 3. గూర్చుండు. (మూ)

**అంత** భూప్రజల మహాదరంబునను । ఎంతయుఁ గనుఁగొని యిట్లను నృపతి :
" గురువును దైవంబుఁ గుంభినిలోన । నరయంగ మాకు నీయాంబికేయుండు ;
కావున మీరెల్ల ఘనతరలీల । భావించి యాతని పంపుసేయుండు.
తాలిమి జ్ఞాతి వధంబు సేసియును । లోఁత నితనిఁగొల్చుటకుఁగా నిపుడు
మహితగృహస్థ ధర్మమును గైకొంటి । బహువిధంబుల." నని పల్కి యాయంధ
భూవిభు గాంధారిఁ బోషింపఁ బంచి, । యావేళ నాకృపాచార్యునిఁ బనిచి,
యువరాజు పదవి వాయుజునకు నొసఁగి, । నవడిఁ గర్తవ్యవిచారంబునకును
విదురు నియోగించి, వెనుక మందరయుఁ । జగు రొప్ప నెఱుఁగంగ సంజయుఁ జొనిపి,
ధరణి భృత్యులకు జీతంబు దిద్దుటకుఁ । గర మొప్ప నకులునిఁ గట్టడ చేసి,
ప్రేమ దర్పితుల నుర్దింప నెంతయును । ఆ మహేంద్రతనూజు నర్థి నేమించి,
గరిమతో బ్రాహ్మణ కర్మంబులకును । సరవిమై ధౌమ్యునిఁ జాలించి, యంత
సహదేవుఁ గనుఁగొని సర్వకార్యముల । బహులీల మత్సమీపంబున నిలువు
మనుచుఁ గట్టడ చేసి, యమతనూభవుఁడు । ఘనముగాఁ గదన రంగంబునఁ దెగిన
వారికిఁ గర్ణాది వసుధేశులకును । రారాజునకును విక్రమవర్యులకును
శ్రాద్ధకర్మంబులు సలుపుచు ధర్మ । సిద్ధాంతవేదియై శ్రీకృష్ణుఁజూచి :
"గోవింద, మాధవ, గోపికారమణ, । ఆవేదములు నిన్ను నభినుతి సేయ
నోపవు నేమెంత యురగేంద్రశయన ! । మాపాలి వేల్పవై మమ్ముఁబ్రోచితివి ;
నీ వాదిమూర్తివి నిఖిలలోకేశ ! । భావనాతీత, దిక్పాలక వంద్య, "
యనియని కొనియాడి యందఱఁజూచి । చనవొప్ప నిజనివాసములకు ననిచి
వరమతి నాభీము వానవిఁగవలఁ । బరికించి, "నాకుఁగా భవ్యాత్ములార !
కడుఁ బ్రయాసంబునఁ గానలఁ దిరిగి । బడలితి ; రింక వైభవములఁ బొందుఁ."
డని యాంబికేయునియనుమతి వడసి । యొనయ దుర్యోధనునిల్లు భీమునకు
ధృతి దుస్ససేనుమందిరము పార్థునకు । నతని తమ్మునియిండులాశ్వినేయులకు
నిచ్చి, ధౌమ్యాదుల నిండ్లకుననిచి । యిచ్చెఱ నా కురుక్షితిపతి నందుఁ
దొల్లింటి చోట బంధురలీల నిలిపి, । యెల్లగా మన్నించి యింపుసేపించి,
కృష్ణసాత్యకుల నాక్రీడి యింటికిని । దృష్ణతో ననిపి, యుస్థిరుఁడు ధర్మజుఁడు

బహుతరవైభవ ప్రాభవ కలిగ । విహిత సౌఖ్యంబుల వెలయుచునుండె.
అని యిట్లు జనమేజయ క్షితిపతికి । మునిచెప్పెనని చెప్ప మోదించి ఋషులు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యనియడుగుటయు
వైకుంఠనాథ, శ్రీవర, వాసుదేవ, । కాకోదరాధీశ ఘనభోగశయన.
నిఖిలాండనాయక, నిత్యకల్యాణ, । అఖిల తత్త్వాతీత, యాద్యంతరహిత,
ఘనమాని హృద్గేహకలితసందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తి ప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై శాంతిపర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొక్కటియయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ కామినీ వక్ష, సృష్టిసంరక్ష, । నాకేశవంద్య, పినాకి సంస్తుత్య,
బ్రహ్మాండనాయక, పద్మాక్షకళత్ర, । జిహ్మగాచలవాస, శ్రీవేంకటేశ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
ధర్మనందనుఁ డిట్లు ధరణీతలంబు । కూర్మితోఁ గైకొని గురువుల హితుల
దొరల నమాత్యుల దుర్గాధిపతుల । సరసుల నాశ్రితజనముల భటులఁ
గరమొప్ప వందిమాగధుల నర్థులను । గరిమఁ గృతార్థులఁ గావించి మించి
తగ ధృతరాష్ట్రు గాంధారి విదురుల । కగపడ రాజ్యమయ్యెడ సమర్పించి
'వెలయ మీరింతకు విభులు మీపంపు । నలవడఁ బూని సేయంగలవాఁడ'
నని భక్తిఁ బలికి నిత్యంబును వారి । యనుమతి గొని వేడ్క నవని యేలుచును
రమణఁ బూర్వప్రకారంబునకంటెఁ । బ్రముదితంబై యుండఁ బాలనచేసి
విపతులై మిగుల నిర్విణ్ణులై యున్న । చపలలోచనల నిచ్చలు నరయుచును,
సరవి యుయుత్సు సంజయులకు మిగుల । నరసుతి స్ఫూర్తి మన్ననలు సల్పుచును,
సారిదిఁ గుంతికిని శుశ్రూష సేయుచును । సరసఁ బాంచాలికి సౌమనస్యంబు
గావింపుచును, ధౌమ్యు గారవస్ఫూర్తి । గా వివిధార్థ [1] సంకలితుఁ జేయుచును,
పితృపూజనంబులు ప్రీతితోడుతను । నతిథి తర్పణములు నమరపూజలును,
విప్రార్చనంబులు వెస నడపుచును, । సుప్రసన్నతతోడ సొంపుదీపించె.

### ధర్మరాజు ధ్యాన నిమగ్నుఁడగు కృష్ణుని సందర్శించి సంభావించుట

ఒకనాఁడు ధర్మజుఁ డుత్సాహమునను । సకలేశుఁడున్నట్టి సదనంబు చేరి
మణిహేమపర్యంక మహితోపవేశు । మణివక్షు మణిహేమమాలికాభరణు
మెరుతటిల్లతామేఘసంకాశు । వారిజాతాక్షు భూవరుఁ గాంచియనియె :
"కలిత సౌఖ్యంబుగా గడపితే రాత్రి? । నెలకొన్న నీబుద్ధి [2] నిర్మలంబగునె?"

---

1. ముల్ కడఁకనిచ్చుచును. 2. నిఖిలంబుగంటె. (మూ)

యనుచుఁ గృతాంజలియై చేరఁబోయి । తనమాటలకును మాధవుఁ డూరకుండి
పరమ దివ్యజ్ఞాన పరిణతి నున్నఁ । దిర మొప్ప నతని నుద్దేశించి యనియె :
"పంచాత్మకంబైన పవనంబు మిగుల । నంచిత నిగృహీతమైనది ; మనము
బుద్ధిలో నొనఁగూర్చి పొలుపుగఁ దీపించి । శుద్ధతరజ్ఞాన శోభన లీల
నుండఁ గారణమేమి ? యెుగి నెఱిఁగింపు. । పుండరీకాక్ష, సంపూర్ణ ప్రభావ,
క్షరము నక్షరమును జగతియు నీవ ; । గరిమయు నాద్యంత గతులును నీవ ;
ఒక్కఁడై వెలిఁగెడి యోగియు నీవ ; । తక్కక నిఖిలభూతంబులు నీవ ;
అజర, ప్రసన్నుండ వగుటను నామదిని । నిజముగా నున్న సందియమెల్ల మాన్పు."
మని విన్నవించిన నంబుజోదరుఁడు । పొసరఁగా నింద్రియంబులను గోచరిత
ములనుగావించి నెమ్మోమునను నగవు । మొలవంగ నప్పు డప్పుడమీశు కనియె :
"గంగ యెవ్వనిఁ దన గర్భంబునందు । సంగతిగాఁ బాల్చి జగతిపైఁ గనియె ;
పరమశిష్యుఁడుగాఁగ భార్గవుఁ డెవని । కరయంగ నిఖిల విద్యలు కృపచేసె ;
తెలియ నిరవదిమూఁడు దినములు పోరి । యిలలోన నా రాముఁ డెవ్వనికోడె ;
కాశీశు కన్యల కారణంబుగను । వాసిగా నృపతు లెవ్వని కోడి రనిని ;
వేదంబులును ధనుర్వేద మస్త్రములు । నాదట నెవ్వనియందు నొప్పెడిని ;
అట్టి దేవవ్రతుం డాత్మలో నన్ను । గట్టిగాఁ దలఁప నీకరణి నుండితిని.
మునుమిడి యమ్మహాత్ముండు వశిష్ఠ । ముని శిష్యుఁ డత్యంత పుణ్యశీలుండు
పలలిత భూత భావ్యద్వర్తమాన (?) । కలితుండు ధన్యుండు కారుణ్యమూర్తి.
లీల నీ వతనిపాలికిఁ బోయి [1] ధర్మ । జాలముల్ దెలిసి నిశ్చలుఁడవుగమ్ము."
అని యానతిచ్చిన యమతనూభవుఁడు । ఘనతర గద్గదకంఠుండై పలికె :
"శంతననూనుని సర్వ గౌరవము । చింతించి విప్రులు చెప్పంగ వింటి.
నెలకొని యాతని నీవు మున్నుగను । జెలఁగి వేడుకల దర్శింపఁ గోరెదను."
అనవుడు శ్రీకృష్ణుఁ డంగీకరించి । తనతమ్ముఁడైన సాత్యకి మోము చూచి,
"తేరాయితము చేసి తెమ్మని వేగ । దారుకు కెఱిఁగింపు ; తగ భీమసేను
సవ్యసాచి నకుల సహదేవ కృపుల । భవ్య యుయుత్సునిఁ బరఁగ రావింపు."
మనిన నట్టుల చేసె ; నంత దారుకుఁడు । తనరఁగాఁ దేరాయితముచేసి తెచ్చె.

1. యర్థ. (మూ)

128

ఒగి రత్నకాంతుల నుదయార్కుఁబోలి । జగతిపై నెంతయు [1]సైన్యాది రథ్య
శోభితమై యొప్పె సురుచిరలీల । నాభంగిఁ గార్తస్వరాద్రి చందమున.
ఆసమున్నతంబున నక్కడి మునులు । వ్యాస విశ్వామిత్ర వాత్స్య మతంగ
కౌండిన్య దేవల కాశ్యప కణ్వ । శాండిల్య నారద శౌనకప్రభృతి
పరివేషణంబుగా భాగీరథేయుఁ । దురుశర తల్పుఁడై యుండి శ్రీకృష్ణుఁ
బరమాత్ము నవ్యయు భక్తసంరక్షుఁ । దరమిడి మదిలోనఁ దలఁచి నుతించె :

## భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట

"శుచియును హంసుండు శుద్ధవిజ్ఞాన । శుచిమత్తుఁ బరమేశు సొంపుగాఁ గొలుతు.
అఖిల దేవతలును నఖిల సంయములు । నఖిల బోధజ్ఞులు నతులితస్ఫూర్తి
నెలమి నెవ్వనిరూప మెఱుఁగంగలేరు । పొలుపొంద నట్టిసత్పురుషు నేఁ గొలుతు.
జగతిలో వేదముల్ చాటిచెప్పంగఁ । [2]దగ మహామతులు దుస్తరదుఃఖములకు
నౌషధం [3]బనుచుఁ బాయక [4]యెంచునట్టి । శేషశాయిని విష్ణుఁ జేకొని కొలుతు.
జగములు పుట్టింప సరవి రక్షింపఁ । దగ నణంపంగల దైవంబుఁ గొలుతు.
[5]విహగ రత్నములకు వెసఁ బుష్పములకు । మహిఁ బంజరము ద్రాడు మఱినారయనఁగ(?)
నుండు చందంబున నుర్వీతలంబు । నుండుట కిరవగు నుగ్రాక్షుఁ గొలుతు
సులభు సహస్రశీర్షునిఁ బరమాత్ము । నలఁతులయ్యినవారి కలఁతి, దయాళుఁ
బరము సహస్రాక్షు భావనాతీతు । గురులఘుక్రమరూపుఁ గోరి యేఁ గొలుతు.
అవ్యయుఁ బద్మపత్రాక్షు ననంతు । భవ్యుని మదిలోనఁ బ్రార్థించి కొలుతు
అరణి ధనంజయుఁ డవతారమందు । కరణి దేవకియందు ఘనతరలీల
జనియించి నిఖిలరాక్షసుల వధించు । ననఘాత్ము శ్రీ చక్రహస్తునిఁ గొలుతు.
అవని ద్వాదశ మూర్తులై యుండునట్టి । ప్రవిమల కనక వర్ణంపు గర్భమున
ధరియించి యదితి యేధన్యునిఁ గాంచె । విరివిగా నయ్యాదివిష్ణువుఁ గొలుతు.
పరఁగఁ బూర్వాపర పక్షదినముల । సుర పితృ కోటుల సొంపుతో సమృత
పాన సంతుష్టులఁ బరఁగంగఁ జేయు । శ్రీనాథు సోమాత్ముఁ జింతించి కొలుతు.

---

1. శైబ్య మని కొన్నిటఁ గలదు. 2. తగు మహామహులు. 3. బగుచు. 4. మించినట్టి. 5. "పక్షి రత్నచయంబు పుష్పవ్రజంబుఁ–బంజరము ద్రాడు నాశ యుపాశ్రయముఁగ–నుండుచొప్పున విశ్వంబు నుండుటకు సు–ఖాస్పదంబగు పుండరీకాక్షుఁ గొలుతు." అని, తిక్కన.

తనర సహస్రవత్సర మహాయోగ । మునఁ గశ్యపబ్రహ్మ మోహనలీలఁ
బొగడొంది ధర నెట్టి పుణ్యునిఁ గాంచె । నగణితామరసేవ్యు నతని నేఁ గొలుతు.
భూతజాలంబెల్లఁ బోరి మ్రింగి భూమి । ఖ్యాతిగా సంబరాక్రాంతంబు చేసి
బాలుఁడై యా వటపత్రంబునందుఁ । దేలాడువాని సుస్థిరబుద్ధిఁ గొలుతు.
కెరలి తోయదములు కేశంబులందుఁ, । దరమిడి నదులును దనుసంధులందు,
జలధులు నుదరదేశముల నున్నట్టి । జలజలోచను హరి శార్ఙ్గి నేఁ గొలుతు.
వదనంబులను విప్రవరుల, బాహువులఁ । బదపడి నిఖిలభూపాల వర్యులను,
ఊరువులందు వైశ్యుల, బాదములను । వారక శూద్రుల వరుసఁ బుట్టించి
ముదముతో వెలుఁగు నమ్మూర్తి సర్వేశుఁ । బదిలంబుగా మ్రొక్కి భక్తితోఁ గొలుతు.
ప్రతిదినమును వారపక్షమాసములు । ఋతువులు వర్షముల్ సృష్టికాలములు
మనువులు రుద్రులు మారుతంబులును । మునులును బ్రహ్మలు భువనాంతరములు
ద్వాదశాదిత్యులు వామదేవులును । ఆదట నెవ్వాని యవయవరూప
కలితులై యుండు రక్తమలాక్షు విష్ణు । జలజనాభునిఁ గొల్తు సర్వకాలమును.
లోకంబులందెల్ల లోనయి యట్టి । లోకముల్ తానయై లోలత్వమునను
దాసానుదాసుల ధరణి రక్షించు । నాసుదర్శన హస్తు నద్వైతుఁ గొలుతు.
ముదముతో వేదముల్ ప్రుచ్చిలిపోయి । యదనుగా డాఁగినయట్టి యక్కసుని
మీనావతారమై మెదిచి వేదముల । నా నలినజు కిచ్చినాతనిఁ గొలుతు.
కూర్మమై మందర కుధరంబు మోచి । యర్మిలి దైవాళి నమరులఁ బ్రోచి
యమృతమిచ్చినయట్టి యాదిమమూర్తిఁ । బ్రమదంబు దీపింప భక్తితోఁ గొలుతు.
భూదార రూపంబు పొగడంగఁ దాల్చి । యాదట నాహిరణ్యాక్షు మర్దించి
క్షితి యెల్ల నుద్ధరించిన వేదమయుని । బ్రతి దివసంబును బ్రార్థించి గొలుతు.
నరసింహరూప మున్నతవృత్తిఁ దాల్చి । గరిమతో నా హేమకశిపునిఁ జంపి
ప్రహ్లాదుఁ గాచి వైభవలీలలందు । నాహ్లాదుఁడైన శ్రీహరిని నేఁ గొలుతు.
వామనుఁడై పోయి వసుధ మూఁడడుగు । లామెయి నడిగి పాయక బలిఁ బట్టి
కట్టి లోకములెల్లఁ గైకొని మించి । నట్టి సర్వాత్ము శ్రీహరి నేను గొలుతు.
పరశువుచేత భూపాలవర్గములఁ । బరిమార్చి పరిమార్చి ప్రాభవలీల
జగతీతలంబు కశ్యపునకు నిచ్చి । నెగడిన పరమేశు నెమ్మిఁ గొలుతు.
దశరథరాముఁడై తగ జనియించి । దశకంఠుఁ జంపి దుర్దశలెల్ల మాన్పి

వరఁగ భూసురపుత్త్రు బ్రదికించి కీర్తిఁ। బరఁగిన శ్రీరామభద్రునిఁ గొలుతు.
హాలధరుఁడై ప్రలంబాసురుఁ జంపి। వెలసిన శ్రీ మహావిష్ణువుఁ గొలుతు.
యదువంశమందుఁ గ్రీడార్థమై ధాత్రి। నుదయించి దైత్యుల నుక్కణఁగించి
రమణఁ బార్థునకు సారథ్యంబు చేసి। క్రమమున భూమిభారంబెల్ల మాన్చి
యలవడ బుద్ధ కల్క్యవతారములను। వెలయంగఁ గలయట్టి విశ్వేశుఁ గొలుతు.
పరమేశ, [1]పుణ్య, సుబ్రహ్మణ్య, దేవ,। వరద, కేశవ, భక్తవత్సల, శార్ఙ్గి,
నారాయ, ణాచ్యుత, నగధర, కృష్ణ,। వారిజనాభ, శ్రీవత్సాంక, యమృత,
గోవింద, చిద్రూప, గోపాలబాల,। భావనాతీత, సౌభాగ్యసంజాత,
శరణాగతుండ వాత్సల్యంబుతోడఁ। బరమ పదంబీయఁ బాడి మీకిపుడు."
అని యిట్టిధంబున హరిని హృత్కమల। విని వేశుఁగాఁ జేసి వేడ్కతో మ్రొక్కె.
స్తవరాజమిది ముని స్తవసీయ మగుచుఁ। దవిలి యెంతయును సద్గతినిచ్చు వినుము.
జనమేజయ క్షితీశ్వర, యీ స్తవంబు। వినినఁ బఠించిన వేడ్క వ్రాసినను
ఆయు రారోగ్యంబు లఖిల సంపదలుఁ। బాయక కలుగును భయము లడంగు."
నని చెప్పి మఱియు నిట్లనియె: "నారీతి। వనజాక్షుఁ దలఁచి దేవవ్రతుం డూర
కున్న నచ్చటి మును లుత్సాహమొదవ। సన్నుతించిరి విష్ణు సర్వేశుఁ డనుచు.
అంత నిక్కడఁ గృష్ణు డాయమనూతి। నెంతయుఁ గనుఁగొని యిట్లని పలికె:
"లీల గాంగేయుపాలికిఁ బోవవలయు। నాలస్యమేల యీయరదంబు లెక్కుఁ
డని వారుఁ దానును నరదంబు లెక్కి। యొనరంగఁ గృపసంజయులు యుయుత్సుండుఁ
గవలును దోడురాఁ గదలి యట్లరిగి। ప్రవిమలగతి భూతపటలి గర్జితము,
లీలఁ గపాల పాళీ నిబిడత్వ। మూలోల కంక గృధ్రావలి రవముఁ
గల కురుక్షేత్రంబు గనుఁగొని యపుడు। జలజదళాక్షుఁ డా జనపతి కనియె:
"దూరంబునం దవె తోఁచు చున్నవియు। నారయ మడుఁగు లయ్యేదును జూడు.
పరశురాముఁడు బాహుబలముల పెంపునను। బరశువుచేత భూపాలురఁ జంపి
రక్తంబునను నమరక్తి దీపింప। భక్తితోఁ బితృతర్పణములు చేసె."
అనిన నద్భుతమంది యమతనూభవుఁడు:। "వనజాక్ష, యెట్లు భూవరులను జంపె?
నేరీతిఁ జరియించె? నేమేమి చేసె?। నాకూఢి నెఱిఁగింపు." మనిన నిట్లనియె:

1. పరపుణ్య. (మూ)

## శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బరశురామ చరిత్రము చెప్పుట

"కలఁడు జహ్నుండనఁగాఁ దొల్లి యొక్క । యిలపతి; యాతని కెలమిఁ బల్లవుఁడు
జనియించెఁ; [1]నాతని తనయుఁడు కుశికుఁ । డను వాఁడు తపమున నమరవల్లభుని
[2]మెచ్చించి జగముల మేటినాఁ బరఁగు । [3]సచ్చరిత్రుం బుత్రు సరవి వేఁడినను
దాన నవ్విభున కుద్భవమయ్యె నంత । మానుగా గాధినామమునఁ గౌశికుఁడు.
ఆతఁడు తనకన్య నా సత్యవతిని । ఆతతగతి నిచ్చె నా ఋచీకునకు.
ఇచ్చిన ఋచికుండు నెలమి దీపించి । యచ్చుగా సత్కర్మ మాచరింపుచును
సంతాన వాంఛమైఁ జరుయుగళంబు । మంత్రనంబున వండి నామమునఁ దనకు
శోభనలీల మెచ్చులుగఁ గల్పించి । యా భృగు నందనుఁ డచ్చరు యుగము
తనభార్య ముందటఁ దప్పక పెట్టి । "వనిత, యీభాగముల్ [4]వలనొప్పఁ గొనుము;
క్షత్రియాజేయుండు క్షత్రియోత్తముఁడు । ధాత్రిపైఁ బుట్టు నోతన్వి, యిందునను.
ఇదియె మీతల్లికి నిమ్ము; రెండవది । చెదరక భూసురశ్రేష్ఠుండు పుట్టు
నీ వుపయోగింపు నెమ్మితో." ననుచుఁ । దా విభజించి 'మీ తల్లియుఁ దండ్రి
యిపుడు వచ్చెద' రని యెలమి భార్గవుఁడు । చపలాక్షి కెఱిఁగించి స్నానార్థ మరిగె.
అంతటఁ దీర్థయాత్రాపరుఁడగుచు । సంతోషచిత్తుఁడై సరవి నాగాధి
తగ గృహిణీ సమేతంబుగా నచటి । కగణితస్ఫూర్తిచే నరుగుదెంచినను,
సత్యవతీదేవి చరుయుగళంబు । సత్యంబుగాఁ దన జననికిఁ జూపి
యందుఁ బ్రభావంబులట నెఱిఁగింప । నందంద కడుఁ బ్రీతయగుచు నద్దేవి
స్నానంబు చేసి యా చరుయుగం బపుడు । భూనాథ, యజ్ఞానమునఁ దనచరువు
కూఁతున కిచ్చి యా కూఁతురి చరువు । బ్రీతిమైఁ గుడిచి సంభృతలీల నుండె.
అత్తఱి భార్గవుఁ డరుదెంచి పత్నిఁ । జిత్తంబునందు వీక్షించి యెఱింగి
గొనకొని నీకును గ్రూరకర్ముండు । ఘన భుజాబలుఁడునై గలుగఁ బుత్రుండు.
పరఁగ మాయత్తకు బ్రహ్మభూతుండు । నరయఁ దపోధనుండగువాఁడు గలుగు."
అనిన నా ముగ్ధ యిట్లనియె భర్తకును: । "మునినాథ, యీజగంబులు మూఁడు మీర
లితరంబు గావింతు; రీక్రూరుఁడైన । సుతునిఁ గాంచుట కోర్వ సుమచిరలీల."
ననుటయు దయతోడ నమ్మహాతపసి । చనవొప్ప "నవ్విశేషంబు పుత్రునకు

1. నతనికి జగతిపై 2. మెప్పించి. 3. సత్పవిత్రుని. 4. వడి నెందు వినుము. (మా)

లేకుండు ; మఱియు నా లీలఁ బౌత్రునకుఁ । జేకూరు." ననుచును జెప్పిన, నదియు
దాంతుండు ఘనతపోధనుఁడు సత్యంత । శాంతుండు నైనట్టి జమదగ్నిఁ గనియె.
వనజగర్భునివంటివానిఁ గౌశికునిఁ । బనివడి యా గాధిభామిని గాంచె.
అంత నా జమదగ్ని యఖిలజ్ఞు ఘనుని । సంతత క్రోధవిస్తారుని రాముఁ
గనియె నంతయును; నా కాలంబునందు । వినుతిగా దుర్జయ విక్రమోన్నతుఁడు
వలనొప్ప హైహయ వంశవర్యుండు । కలిత తేజోనిధి కార్తవీర్యుండు
ఇల నేడు దీవులు నేలుచునుండ, । వెలయంగ నొకనాఁడు వీతిహోత్రుండు
అరుదెంచి తనకును నాహారమడుగ । నరుదంది గిరినగరారణ్యతతులు
నిచ్చిన, వహ్నియు నెలమి నాహార । మచ్చుగాఁ గొనుచును నా తరువాత
తరమిడి వరుణనందను నాశ్రమంబు । విరివి నాతఁడు లేనివేళ భక్షింప,
నెఱిఁగి యాతఁడు వచ్చి యెలమి వహ్నికిని । అఱిముఱి రక్షణం బాచరింపుచును
వర్తింపుచున్నట్టి వరశౌర్యధుర్యుఁ । గార్తవీర్యునిఁ జూచి కనలి యిట్లనియె :
"పొసగ మదీయ తపోవనం బర్థిఁ । బసచెడి కాల్పంగఁ బరిహరింపకయు
జాలిలేక యరణ్య సామాన్యబుద్ధిఁ । గాలిచితివి భుజాగర్వంబు పేర్మి.
ఓరోరి, నీదు బాహువులు రాముండు । వారక నఱికెను వసుధ నిక్కువము."

## పరశురాముఁడు కార్తవీర్యార్జునుఁ జంపుట

అనుచు శపించిన నా హైహయుండు । తనలో విచారించి ధర్మకార్యములు
నడపుచు నుండునంతట, నొక్కనాఁడు । తడయక యాతని తనయులు కడఁగి
జమదగ్ని [1]మౌని యాశ్రమమున కరిగి, । యమరంగ [2]నాతఁడు నందులేకున్నఁ
దగ హోమధేనువు దాని వత్సమును । నొగిఁ దెచ్చి రని హైహయుం డెఱుఁగండు.
అట రాముఁ డెఱిఁగి బాహాటోపవృత్తిఁ । దటుకునఁ బరశువు ధరియించి వచ్చి
యలవడఁ గార్తవీర్యార్జునుతోడఁ । గలహించి చేతులు ఖండించివైచి
పోయిన హైహయ పుత్రు [3]లెత్తింగి । సాయకాననములు శరములుఁ బూని
చని యొంటి[4]మైనున్న జమదగ్నిఁ గాంచి । తనరంగఁ గినిసి యాతని తలఁద్రుంచి
యరిగి; రంతటిలోన నా రాముఁ డట్టి । చరితమంతయుఁ దమ జనని చెప్పంగ

1. యాశ్రమమునకును నరిగి 2. నాతఁ డయ్యెడ లేకయున్న. 3. లుప్పొంగి. 4. నై. (మూ)

విని కోపమెసఁగ న విప్రులసాహసుఁడు । తన కుఠారమున నందఱఁ దునుమాడె.
పదపడి యంతలో బహువత్సరములు । వదలక చనిన విశ్వామిత్ర పౌత్రుఁ
డైన పరావసుఁ డనురాజ కనులు । గానక రాముని గనుఁగొని పలికె:
"వసుధలోపల రాజవరులకు వెఱచి । పసచెడి [1]దాఁగంగఁ బాడియే నీకు!"
నని పల్క బాలవృద్ధాది భూపతులఁ । బనివడి గర్భరూపంబుల, మఱియుఁ
దప్పిపోయినవారి దాఁగినవారిఁ । దప్పక వెదకి [2]యుద్ధమున వధించి,
యీరీతి నెంతయు నిరువదియొక్క । మాఱు క్షత్రియుల నేమఱక ఖండించి
హయమేధ మొనరించి యవనీతలంబు । రయమునఁ గశ్యపబ్రహ్మకు నిచ్చె.
ఇచ్చినఁ గైకొని యెలమిఁ గశ్యపుఁడు । చెచ్చెర ధాత్రి శేషించిన రాజ
నగులను రక్షింపవలెనని తలఁచి । భృగురాముని జూచి భక్తి నిట్లనియె:
"దక్షిణగాఁగ నీధాత్రి యిచ్చితివి; । ఈక్షోణి నుండక యిట నీవు పొమ్ము."
అనిన నట్టిద కాకయని భార్గవుండు । పనివడి వారిధిఁ బ్రార్థించుటయును,
బనిగొని వార్ధి [3]శూర్పాకారదేశ । మును గూడఁగాఁ గొంత భూతలంబిచ్చె.
అటఁ గశ్యపుండు న య్యవనీతలంబు । పటుగతి భూసుర ప్రకరంబులకును
భోగింప నిచ్చి తపోవనంబునకు । వేగంబె యరిగిన, వెలయ నాభూమి
కాశ్యపి యనుపేరఁ గడఁగె; నావెనుక । వైశ్యశూద్రాదు లుర్వరఁ గ్రొవ్వి యంతఁ
దలకొని భూదేవ దార ధనాదు । లలవడ హరియించి; రట విప్రులెల్ల
నలిమీఱి సుద్యపానంబు సేయుచును, । బలిమిని సాధుల బాధించి, మఖము
లనయంబు నెవరు చేయక చెలరేఁగి, । గొనకొని ధర్మంబు గోలుపోఁ జేసి,
దురిత బాహుళ్యంబు దొడికొడి మీఱ, । ధర యతలంబు కెంతయుఁ బోవ నెఱిఁగి
యొసరఁ గశ్యపుఁడు నిజోరువు గ్రుచ్చి । యెనయంగ దాపుగా నిచ్చి యెత్తినను,
అది కారణంబుగా నవనీతలంబు । అదను మీఱఁగ నుర్వి యనుపేరఁ బఱఁగె.
అపుడు సర్వంసహా యతనిని వేఁడి । నృపుల మానిత దండనీతి ప్రయోగ
ములఁ జేసి ధర్మంబు పొసఁగ రక్షించి । చెలరేఁగి తను సురక్షితము సేయుటకు
నలవడు వారుగా నపుడు వరంబు । తలకొని యేలంగఁ దలఁచి యిట్లనియె:

---

1. డాయంగ. 2. యెంతయు వధియించి. 3. శూర్పాకార ప్రదేశంబు బెరయఁ గొంతదేశం బతనికి విహారస్థానము గావించె. అని, తిక్కన.

## పరశురామునిచేఁ జావని రాజుల భూదేవి కశ్యపున కెఱిఁగించుట

"అరయంగ నాయందు నచ్చటచ్చటను । బరశురాముని కగపడని భూవిభులు
నున్నారు వినుము పుణ్యోజ్జ్వలమూర్తి! । నన్ను రక్షింప నున్నతవృత్తిఁ బనుపు."
మని పల్క యుర్వి "హైహయుల్ గొంద । ఱెనయఁ దప్పిరి వారినిట నేర్పఱింతు.
భరత వంశాంభోధి పరిపూర్ణ విధుఁడు, । సారిది విదూరథసుతుఁడు శూరుండు
తమిఁ గ్రోడ ఋక్షవత్పర్వతంబందు । రమణ ఋక్షములచే రక్షితుండయ్యె.
వలనొప్ప సౌదాస వంశ సంజనితుఁ । డల పరాశరముని యధ్వరకాల
మునఁ [1]జేరి తన్ను నిమ్ముల శూద్రుఁడనుచు । మనమార సర్వకర్మములు సేయించి
కొని మాని రక్షింప సుగుణరలీల । మొనసిన సర్వకర్ముండనఁ బఱఁగె.
అనఘుఁడు గోపతి యను వాఁడు శిబికి । మనుముఁడు వనములో మఱి గోవులెల్ల
రక్షింప నెంతయు బ్రదికియున్నాఁడు. । దక్షుత వత్సాభిధానుఁ డుత్తముఁడు
జగతిఁ బ్రతర్దన జనపతి సుతుఁడు । మొగి వత్సముల గోష్ఠమున సంచరించె.
పొలుపొంద దివిరథ పుత్రుఁడైనట్టి । యల దధివాహను నాత్మసంభవుఁడు
అంగుండు గౌతముఁ డట [2]రక్షసేయఁ । బొంగి గంగాతీరమున నున్నవాఁడు.
కోరి బృహద్రథకుల జాతుఁడైన । నారీస్మరుని భూరి నామధేయునిని
గొనకొని యా గృధ్రకూట శైలమున । [3]మునుపు గోలాంగూలములు బ్రదికించె.
ధరణి మరుత్త సంతాన సంభవులు । శరనిధి రక్షింప సరి నున్నవారు.
ఘనులు వా రుత్తమ క్షత్రియుల్ ; వారిఁ । బనుపు రాజులఁ జేసి భక్తితోడుతను."
అని ధాత్రి చెప్పిన నంగీకరించి । మునిపతి వారి నిమ్ములను రావించి
తగినట్లు వారికి ధర విభజించి । యగణిత విస్ఫూర్తి నభిషేకవిధులు
క్రమమునఁ గావించెఁ గశ్యపమౌని. । విమలత నా మహీవిభుల వంశముల
నరపతుల్ పుట్టి సంతానాభివృద్ధి । ధరయెల్లఁ బాలించి ధర్మకీర్తులను
బొదలి భారత యుద్ధమున హతులైరి । యనఁగా." నని చెప్పి [4]యరిగి యాలోనఁ
దిరముగా భాగీరథీ తీరమునను । శరతల్పగతుఁడైన జాహ్నవీ సుతున
కనతిదూరంబున నరదంబు డిగ్గి । పెనుపొంద వ్యాస ప్రభృతి మునీంద్రులకుఁ

---

1 జేసియున్న. 2. సురక్షింప. 3. మునుమిడి లాంగూలములు. (మూ) 4. 'వారితోగూడి' యనుట యథ్యాహార్యము.

ప్రణమిల్లి భీష్మునిఁ బరికించి కాంచి । గణుతింప నుచిత ప్రకారంబులందుఁ
గని పరివేష్టించి కలితాసనముల । ఘనముగాఁ గూర్చుండి గాంగేయుతోడ
జలజనాభుం డను: "సవడిమై నీకుఁ । బొలుపొందఁగా మునుపోలెఁ జిత్తంబు
అరయ నవ్యాకులమై యున్నయదియె ? । తిరముగా నెంతయు దేహంబు పీడ
ఘనము మనఃపీడకంటె దేహమునకు. । [1]ఘనబహు సాయక కలితమైనట్టి
యనుపమాంగంబు నొవ్వఁదగంగ నేల ? । యెనయంగ నిట్లుండి యించుకేనియును
సొలయవు పితృవర స్ఫూర్తిని గాదె ! । వలనొప్ప దేవతావరులకు నైనఁ
దెలుపుదు నిన్నును దేర్పంగ వశమె ! । తలకొని దమము సత్యంబును దపము
దానముఁ జాపవేదమునను గలుగు । నా నైపుణియు వైరి హరణ శక్తియును
నీకును బోలె నే నృపులకుఁ గలదు ! । ప్రకట నిఖిలధర్మ స్వరూపుఁడవు.
శరతల్పమున నుండి చావంగ నొల్ల । పరమతి నాయిచ్చ వచ్చు నందాఁక
నని ధీరచిత్తుఁడై యట నున్నవాఁడు । ఒనరంగఁ గలఁడె యే యుగమున నైన !

ధర్మజునకు ధర్మము లుపదేశింపఁ గృష్ణుఁడు భీష్మునిఁ గోరుట

అనఘాత్మ, వసువులయందును బెద్ద । వనుపమ తేజోమహత్త్వ రాఢ్యుఁడవు.
యమసూతి గురుసుహృదాప్తుల మృతికి । నమిత బాహుళ్య దైన్యమున నున్నాఁడు.
సకలజ్ఞుఁడవు ధర్మశాస్త్ర మార్గమున; । నకలంక మతి సంశయంబెల్ల [2]మాన్పు."
మనిన గాంగేయుఁ డయ్యబ్జాక్షుఁ జూచి, । "ఘనుఁడవు భర్తవు కర్తవు నీవ.
ఇలలోన నాకు మేలెయ్యది దానిఁ । దెలిసి యెంతయును మీదివ్యచిత్తమునఁ
దలఁపుము దేవ, మాధవ !" యన్నఁ బలికె: ... ... ...
"అచల సద్భక్తి నిత్యంబు నాయందు । సుచరిత్ర, [3]నీకు నచ్చుగఁ [4]గల్గఁజేసి
యనిశంబు నుందు నీ యంతరంగమున. । పనివడి యింక నేఁబదియారు దివస
ములకు సూర్యుఁడు మహామోహనస్ఫూర్తి । నలవడు నుత్తరాయణమున ; నపుడు
తెలియంగ నీవును దేహంబు విడిచి । వెలయంగ నపునరావృత్తి నేఁగెదవు.
అంతరిక్షంబున నదె విమానముల । నెంతయు వసువులు నెలమి నున్నారు.
అదియటులుండె ; నీ యమతనూభవుని । బదిలంబుగాఁ [5]దేర్పు ప్రతిభాషణముల."

1. కినియవు సాయక కీలితమైన. 2. బాపు. 3. నీమనస్సున. 4. 'గల్గుటఁజేసి' యనుట; 5. దెల్పుపరి.(మూ)

అనిన శాంతనవుఁ డయ్యఖిలేశు కనియె: । "వనజాక్ష, యోగిభక్తవత్సల, వినుము
సరవి [1]విషానల సదృశంబులైన । శరవేదనల నవశములయి యున్న
యవి [2]యంగకను ; లెట్టులాభాషణములఁ । గవకూడు ?" ననినఁ బంకజనాభుఁ డనియె:
"నీ వినయమునకు నీ జ్ఞానమునకు । నీ వాక్యసరణికి నెఱయ మెచ్చితిని.
శరములవలన మూర్ఛయును దాహంబుఁ । బొరయక యుండ నింపొందియుండంగ
వరమిచ్చితిని నీకు వసుధాతలేశ ! । పరగుము దివ్యరూపంబున." ననిన
మునులు కీర్తించిరి ; మొగిఁ బుష్పవృష్టి । యనిమిషుల్ గురియించి ; రప్సరోగణము
నృత్తవాద్యంబులు నిండె ; నిండుటయు । నత్తఱి పంకేరుహాక్షుండు గ్రుంకె.
హరియును భీష్ముని యనుమతి వడసి । యరదంబుపై నెక్కి యమసూతి కనియె:
"నీవు నీతమ్ములు నిఖిలసేనలును । ఈవేళ కరిపురి కేఁగంగవలయు.
ఏనును వచ్చెద నేతెమ్ము ; రేపు । ఈ నెలవునకును నేతెంతు." ననుచు
వారిఁ దోకొనిపోయె వారణాపురికి. । ఆరాత్రి వేగంగ నర్థజ్ఞులైన
పలువురు మంగళపాఠకుల్ వచ్చి: । "జలజదళాక్ష, సంస్తవనీయచరిత,
పూతనా సంహార, భువనైకవీర, । పాతకదూర, గోపాల, మేల్కనుము.
శకట దైత్యధ్వంస, సర్వప్రశంస, । యకలంక, యవ్యక్త, యజర, మేల్కనుము.
సర్వగుణోదార, నవనీతచోర, । భవ్యాత్మ, దానవభంగ, మేల్కనుము.
కంసభంజన, దేవ, కరుణాకటాక్ష, । సంసారవిరహిత, శౌరి, మేల్కనుము.
నరకాసురాంతక, నగధర, కృష్ణ, । పరమపావన, దివ్యభావ, మేల్కనుము.
పరమాత్మ, పరమేశ, భక్తమందార, । గురులఘుస్థితిరూపగుణిత, మేల్కనుము.
దుష్టనిగ్రహము సంతుష్టిగాఁ జేసి । శిష్టరక్షణమునఁ జెలఁగి యెంతయును
మునిజనుల్ గొనియాడ మూఁడులోకముల । వినుతికెక్కినవిభవ, మేల్కనుము.
ప్రళయాంత్యమున మహాబ్రహ్మాండమెల్ల । నేఁకొని కుక్షిలో నిలిపి వేడుకకు
బాలుఁడవై వటపత్రంబునందుఁ । దేలాడుచుండెడి దేవ, మేల్కనుము.
కరుణతో మతి నాభికమలంబునందు । సరసిజగర్భుని సరవిఁ బుట్టించి
నిరుపమంబుగ సృష్టి నిర్మాణగతులు । గరిమఁ జెప్పిన లోకకర్త, మేల్కనుము.
బాణభంజన, పంచబాణారి వినుత, । వేణునాద వినోద, వేగ మేల్కనుము,
నీలమేఘశ్యామ, నిత్యాభిరామ, । పాలితామరబృంద భరిత, మేల్కనుము.

1. శితానల. 2. యెవ్విధంబున నాభాషణముల. (మా)

శుద్ధబుద్ధజ్ఞాన, సుగుణప్రసిద్ధ । సిద్ధాంత, యద్వైతశ్రీశ, మేల్కనుము."
అని యిత్తెఱంగున నభినుతి సేయ । వనజనాభుఁడు లేచి వైభవం బెనఁగ
విరివిగా సంధ్యాది విహితకృత్యములు । ధరణిఁ బాండవులును దానును జేసి
యరదంబులెక్కి తూర్యంబులు మ్రోయఁ । గరమొప్ప శరతల్పగతుఁ డున్న యెడకు
వచ్చి వందన వచో వ్యాపార లీల । లచ్చుగాఁ బెంపొంద నందఱుఁ గూడి
తగిన తావుల మహోద్ధతి పెంపుమీఱ । నొగిఁ బరివేష్టించి యున్న యాలోనఁ
బాండవాగ్రజుఁడు వైభవభోగ యుతుఁడు । పుండరీకాక్షునితోఁ బూనఁగ నిట్లనియె :
"నీవు దక్కంగ నో నీరజనాభ, భావించి భీష్ముతోఁ బలుకలే రొరులు.
ధరలోన గురువవు ధర్మవేదులకుఁ । బరఁగ సంభాషణ పరుఁడవు గమ్మ."
అనవుడు శ్రీకృష్ణుఁ డయ్యాపగేయుఁ । గనుఁగొని పలికె సద్గాఢ వాక్యముల:
"అమ్ముల గాయమ్ము లతుల ప్రభావ, । నెమ్మి నొవ్వవుగదా! నేఁడు మాతోడఁ
బలుకంగఁ గలుగునే ప్రతిభాషణములు! । సలలిత భూతభావ్యద్వర్తమాన (?)
కలితాత్మ!" యనవుడు గాంగేయుఁ డపుడు । జలజ గర్భాక్షుతో సమ్మతిఁ బలికె:
"వారిజనాభ, భవత్ప్రసాదమునఁ । దేరె నెంతేనియు దేహంబు నొప్పి.
దేవర, నేఁడు మీ దివ్య చిత్తమున । భావింపఁ గొంకక ప్రాయంబు వాఁడు
వోలె నైతిని నాదిపురుష, శ్రీనాథ, । ఈ లోన నెంతయు నెఱిఁగింతు వినుఁడు :
ఎవ్వఁడు పుట్టిన నెల్లదేవతలు । నివ్వటిల్లిన వేడ్క నెగడిరి ధాత్రి ;
పరమ ధార్మికులైన భరతులయందు । వర[1]మతి నెవ్వరెవ్వని సరిగారు;
సత్యంబు శౌచంబు శాంతియు దాంతి । నిత్యమై యెవనికి నెగడు లోకముల ;
బంధుపోషణములుఁ బాత్రదానములు । సంధించి యెవనికి సంప్రీతి సేయు ;
నట్టి ధర్మాత్మజుఁ డతికృపామూర్తి । నెట్టన నడిగిన నే నెఱిఁగింతు."
అనుటయు భీష్ముతో నచ్యుతుఁ డనియె: । "అనఘాత్మ, గురువుల నాప్తుల సఖులఁ
గ్రూర శరంబునఁ గూల్చినయట్టి । కారణంబున మిమ్ముఁ గదియంగ నోడి
యున్నాఁడు దయలేని యుగ్రుండు వీఁడు । వన్నెగా నని నీవు పలుకుదో యనుచు."
అనవుడు గాంగేయుఁ డతని కిట్లనియె: । అనయంబు ద్విజుల కర్థ్యయు [2]నాయులట్లు
రాజవర్యులకు సంరంభంబుతోడ । నాజిలోఁ బుత్ర మిత్రాదులు నైనఁ
గలుషవర్తనులైన ఖండింప నలయు; । పలుకు లేటికి నిది పరమధర్మంబు.

1. నుతి. 2. నాది విధులు. (మూ)

సమయంబు విడిచి నిచ్చలు ను లోభమున । సమితవైఖరుల నన్యాయ మార్గమున
వర్తించువారి నెవ్వరినైనఁ జంపి । మూర్తి భావించి సత్పుణ్యుఁడౌ నతఁడు.
అదియును గాక రక్తాంబు పూరంబు । వదలక కేశశైవలమును గాఁగ
యుద్ధభూమిని నది యొనరించినట్టి । యుద్ధాత్రి పతి ధర్మి యనఁదగుఁ గృష్ణ!"
యనినఁ గృతాంజలియై చేరఁ బోయి । యనయంబు గరముల నతని పాదములు
ధరియించి మ్రొక్కి, నాతని గారవించి । గుఱుతుగా నెంతయుఁ గూర్చుండఁ బనిచి
"నరనాథ, వెఱనక సన్నిమిత్తమైన । వరుసతో నడుగు పావనలీల." ననిన
మనుజవరేణ్యుండు మాధవునకును । ముని పరాశర్యాది (?) మునులకు నెఱఁగి
యనయంబు గాంగేయు కభిముఖుఁ డగుచు "ననఘ, సమాశ్రయమైన త్రివర్గ
మును గురుతరమైన మోక్షంబునకును । బనివడి దాపును బ్రాపును నగుచుఁ
బొలుపొందు నాహాయంబునకు వాగెయును । గొలఁది యేనుఁగుకు నంకుశమునుబోలె,
కమలాప్తుఁ డెపుడు చీఁకటిఁగమిఁబోలెఁ । గ్రమమున ధరలోని కల్మషంబెల్ల
నవనివల్లభుఁడు ధర్మాత్మకమైన । ప్రవిమల మతిచేత భంజించు; నట్టి
రాజధర్మంబులు క్రమమునఁజెప్పు । మోజతో." ననిన నాయుర్వీశుఁ డనియె:

## భీష్ముఁడు ధర్మజునకు రాజధర్మము లుపదేశించుట

"మేలు గోరెడునట్టి మేదినీశ్వరుఁడు । పోలింప సురలకు భూసురులకును
అనిశంబుఁ బూజసేయఁగవలె; మఱియు । వినుము శాంతియు దాంతి విమలమౌశీల
మును సత్యమును ధర్మమును గల్గురాజు । ఘనకీర్తి యుక్తుఁడై కడఁగి భూస్థలిని
ఎలమితోఁ బ్రకృతుల నేడింటి నడఁప । వలయు, దానికిని దావలము సత్యంబు.
తగ దండనీతి యంతటికిని రక్ష. । మొగి బుద్ధిమంతులు ముదముతో దాని
నెనయంగ బ్రాహ్మణులెడఁ బ్రయోగింప । రనఘ, యయ్యర్థంబునందె యొప్పైన
మను వాక్యములు గల్గు మహిమదా వినుము. । "ఇనుముజాతను నీట నేపుతో నగ్ని
వసుమతీదేవుల వలన రాజులును । వెసఁ బుట్టి రదిగాన వీనఁ జేటొందు.
పొలుపొంద శిలఁ ద్రొపఁ బోయినయినుము, । జలములఁ గాల్పంగఁ జనిన యగ్నియును,
బుడమిలో నాశంబు పొందిన రీతిఁ । జెను రాజు విప్రులఁ జెఱుపఁ జూచినను.
తలఁపంగ విప్రుల దండించు నెడలు । గలవు శుక్రుఁడుచెప్పెఁ గడఁకతో వినుము.

[1]శరమొప్ప శాంతుండు గాక యాయుధము । ధరియించి యెదిరిన ధరణీసుపర్వ
వేదాంతినైన భూవిభుఁడు చంపినను । ఆదట ధర్మంబ యనియె వేదములు.
గుఱుతుగా గురుతల్పగుని, భ్రూణహానుని, । సర౹థ విద్వేషి, నలి బ్రాహ్మణఘ్నుఁ
జెలుచన తనభూమిఁ బ్రిమలంగనీక । తొలఁగించవలె దానఁదుది నేమిగాదు.
నయమార వర్ణముల్ నాల్గింటి మీఁద । దయ గలుగఁగ వలె ధరణీశులకును.
పసఁ గేవలక్షమాపరుఁ డగుటకును । వెన సాదులేనుఁగు విధమయి యుండు.
అలర నిందులకు బృహస్పతి వచన । ములుఁ గల్గుఁ జెప్పెద ముదముతో వినుము.
మేదినీనాథుండు మెత్తన యైన । నాదట మావంతుఁ డాయేన్గు నెట్టు
లెక్కఁజూచునో యట్టు లిలఁబ్రజ తన్ను । దక్కక చూచు ; నెంతయుఁ గ్రూరుఁడైన
బెగడొందుఁ ; గావునఁ బృథివీశ్వరుండు । జగతి వసంతంబు సవిత్రుని రీతిఁ
దగియెడు పాటితో ధరణిలోఁ బ్రజల । నిగతి కల్మషవృత్తి వెలయింప వలయు.
మునుకొని పరిహాసములఁ దేలి భృత్య । జనములయెడ మహాసంతోష మెసఁగఁ
బరఁగిన యట్టి భూపాలుని యాజ్ఞ । పరువడిఁ జేయరు; బాగొప్ప నీఁగి
మెచ్చరు; కౌతుక మృదుల వాక్యములఁ । జొచ్చి సమంబుగాఁ జూతురు; గాన
నిగవొప్ప భృత్యుల యెడల నత్యంత । [3]హరుసంబునను దేలియాడంగ వలదు.
మునుకొని సప్తాంగముల విరోధంబు । వెనుకొన్న వానిని విడువంగ వలయు.
వలనొప్పఁ దనకీడు-వైదికవర్త । నలను నణంప నెంతయు వలెఁ బతికి.
ధర్మవర్తనులను దాక్షిణ్య కీర్తి । నిర్మాణులను నీతి నిపుణుల తొల్య
విరహితులను నాజ్ఞ వెసదాఁట నట్టి । పరిజనంబులఁ బెంపఁ బతికి హితంబు.
ధరణిలో ధనమును దారాదికముల । వరుస రక్షింప నెవ్వరికైన వశమె
యలరి రక్షాఘనుండైనట్టి రాజు । గలిగినగాక యో కారుణ్యమూర్తి!
మరలక రాజధర్మ ప్రకారంబు । పరఁగ సంక్షేపరూపంబున నీకుఁ
జెలిమితో నర్పితించితిని; సందేహ । మలవడఁగల్గిన నడుగు చెప్పెదను."
అనుడు ధర్మజుఁ డమ్మహాత్మున కనియె: । "ఇనుఁ డస్తగిరిఁ జేరె; నెల్లి రేపాడి
యడిగెద" ననుచు నయ్యెడ మ్రొక్కి కదలి । కడువేడ్క మునులఁ దక్కటివారి ననిపి,
తనరంగఁ దాఁదృషద్వతి యను నదిని । వెనుకొని సంధ్యాది విధు[4]లెల్లఁ దీర్చి

1. శరము చాపము శరాసన ముఖ్యతతులు. 2 జగెలెదు వానితో. 3. హరుషంబు.
4. లందు. (మూ)

కరిపురంబున కేఁగి కడఁగి యారాత్రి । హరియును దాను నెయ్యంబునఁ [1]గడపి
మఱునాఁడు [2]సంధ్యాది విహిత కృత్యములు । తెఱఁగొప్ప వేవేగఁ దీర్చి ధర్మజుఁడు
వంతంబుతో భీష్ముపాలికిఁ బోయె. । నంతకుమున్న సంయమివరులెల్ల
వచ్చినఁ గనుఁగొని వారివారికిని । అచ్చుగా ధర్మజుఁ డంజలిచేసి
బలసి కూర్చుండి యా భాగీరథేయుఁ । బలికె సద్భక్తితోఁ బ్రాంజలి చేసి :
"రాజనామము నరు [3]భాజనంబగుచు । రాజిల్లుపురుషుఁ డుర్వరలోన నొకఁడు
కలిమికి మూలంబు ఘనవిశేషంబు । గలుగంగ నోపు నో కౌరవ [4]ముఖ్య !
పొలుపొంద నవయవంబులుఁ బ్రాణచిత్త । ములు జన్మ మరణముల్ మొగిమీఱ దేహ
యాత్రలు నెట్టుల యట్టుల గాని । ధాత్రి నెవ్వరికి భేదంబులు లేవు.
రాజొక్కరుండు శౌర్యప్రభాబుద్ధి । నోజ గ్రొక్కులు గాన నొగిఁ జంప మనవఁ
గర్త యెట్లయ్యెఁ దక్కక చెప్పు." మనిన । మూర్తితో నా రాజముఖ్యున కనియె:

భీష్ముఁడు ధర్మజునకు దండనీతి జన్మప్రకార మెఱిఁగించుట

ధృతమతి విను తొల్లి కృతయుగంబునను । హితవృత్తి మనుజులయెడ దండనీతి
మంతుఁడై [5]రాజునా మహిలేఁడు నిజము; । అంతట రక్షకులై యొండొరులకు
[6]నుండుదు; రారీతి నుండ దైన్యంబు । లొండొండ మించి యత్యుగ్రంబు గాఁగ
గరిమతో లోభ మగ్గలముగా నంతఁ । బెరుగ ధర్మముచెడి పేర్మిఁ గామంబు
రాగంబుఁ బొంది విభ్రమమొంది ప్రజలు । నాగమధ్వంసకులై ; రధర్మంబు
నడచిన, నింద్రాది నాయకుల్ పోయి । కడుశీఘ్రవృత్తి నక్కంజజుఁ గాంచి
" భారతీనాయక, పాపసంహార, । నీరజాసన, దేవ, నిగమాంతవేద్య,
మనుజలోకమున ధర్మములు వేదములుఁ । బొనర యాగంబులుఁ బొడవడంగినను
బసచెడి మేము దుర్బలులమై యిటకు । నసమున వచ్చితి మభవ, రక్షింపు."
మని విన్నవించిన నాదితేయులను । బనివడి మన్నించి పద్మసంభవుఁడు
'బలువిడి దానికిఁ బ్రతివిధానంబు । వెలయఁ జేసెద మీరు వెఱవంగ వలదు.'
అని పల్కి స్వామ్యమాత్యాది దుర్గములుఁ, । గినుకక యాన్వీక్షకియుఁద్ర యీవార్త,
దండనీతియు, మఱి ద్వాదశ రాజ । మండలంబులును, సమాశ్రయాదులును,

1. గడలి. 2. రేపాడి. 3. ప్రాభవంబగుచు. 4. వర్య. 5. రాజున; రాజు ఇమ్మహి. (మూ).
6. ప్రజలు కర్త అధ్యాహార్యము.

మొదలుగా ధర్మార్థ ముఖ వర్గములకు । నదనున సాధకంబై యుండునట్లు
అధికత నూఱువే లధ్యాయములను । బుధలోక హితముగాఁ బొలుపొందుచుండ
నిరుపమ స్ఫూర్తుల నీతిశాస్త్రంబు । విరచించె నంతయు విశ్వహితముగ.
తగనంత లోక పితామహు నొనట । నిగమోన్నతుఁ డనాది నిధనుండు కర్త
యొనర విరూపాక్షుఁ డొగి విశాలాక్షుఁ । డను నామము నఁబుట్టి యాగ్రంథమర్థి
నధిగమించెను; దాని నధిగమించుటకు । బుధనుత, మనుజుల బుద్ధులు చాల
వని యది దశ సహస్రాధ్యాయములను । ననఘ, వైశాలాక్షమునఁగ నిర్మించె.
హరునిచేత నెఱింగి యాశాస్త్ర మింద్రుఁ । డరయంగ నొనరించె నైదువేలుగను;
అది బృహస్పతి సేసె నట మూఁడు వేలు; । అది శుక్రుఁడొనరించె నట సహస్రముగ.
మఱియును మునులెల్ల మనుజులశక్తి । యెఱిఁగి సంక్షేపించి; రిది నీతి శాస్త్ర
సరణి; యిత్తెఱఁగున సకలదేవతలుఁ । బరువడి నామేలు వడసి లోకేశుఁ
డగు విష్ణుపాలికి నరిగి కార్యంబు । తగ విన్నవించి యంతట నీతిశాస్త్ర
జనన మెఱింగించి 'సరవి నిందులకు । ఘనశక్తుఁ డగువానిఁ గల్పింపు దేవ'
యనిన నవ్విష్ణుండు నట్లకా కనుచుఁ । బొనరంగ మానసపుత్రు నిర్మించి
యవనిలోన విరజుఁ డను పేరుపెట్టి । సవినయంబుగ నంప, జగతికి నతఁడు
గరిమతోడుత రాజు కానొల్లఁడయ్యె. । అరయంగఁ దత్సుతుఁడగు కర్దముండు
నృపుఁడు కానొల్లక నెఱి నంతలోనఁ । దపమున కరిగెను; దత్పుత్రుఁడైన
యంగుండు నృపతియై యట దండనీతి । సంగతిగాఁ గొని జనులఁ బాలించె.
అతని పుత్రుఁడు నీతి యనువాఁడు ధరకుఁ । బతియయి యింద్రియ పరవశుఁ డగుచు
[1]సునిసద యను భామ శుభమృత్యుపుత్రి । ఘనముగాఁ బెండ్లియై కాయజుకేళి
[2]ననయంబు నుండె; నయ్యాసక్తిఁ జేసి । మొనసి రాగద్వేషగులఁ బ్రజలకును
మొగి విరుద్ధుండైన, మునులెల్లఁగూడి । పొగడొందఁగా మంత్రపూతంబులైన
కుశసంచయంబుల గొనకొని యతనిఁ । బ్రశమితుఁ జేసి తప్పక దక్షిణోరు
తలము మథించునంతట, నల్లనైన । కలిత దేహంబును గన్నుల యెఱుపు
రూఢిమై నశుచియౌ రూపంబుతోడ । నోడకొక్కఁడు పుట్టె; నొగి నానివలన
వెన నిషాదులు పుట్టి వింధ్యాద్రిచెంత । ననదృశంబుగ నుండి; రంత నారాజు

---

1. 'సునీథ' యని కవిత్రయ భారతము. 2. ననయంగసక్తుఁ డయ్యున సక్తిఁ జేసి. (మూ)

## వైన్యుఁ డను రాజు చరిత్రము

దక్షిణ బాహువు దృఢముగ[1]మధించినను । నక్షీణ కవచ శరాసన బాణ
కలితుఁ డుద్భవమందఁగా, దండనీతి । పొలుపు మీఱంగ నప్పురుషునిఁ జేరె.
చేరినా [2]వైన్యుండు చేతులు మొగిచి । యారూఢి నిఖిల దేవావలి కనియె:
"ఎయ్యది గావలె? నేమి సేయుదును? । ఇయ్యెడ నది నాకు నెఱిఁగింపుఁ" డనుడు
వైన్యుఁ దప్పక చూచి వసుధ దీపించి । "మాన్యుఁడవై నీవు మామాటఁ జేసి
మానలోభములఁ గామ క్రోధములను । మానగాఁ బాసి యిమ్మహి సర్వజంతు
వులకు సముండవై యొనరు ధర్మంబు । వలనొప్ప నడపుము [3]వసుధ లోపలను."
అనిన నవ్వైన్యుండు: "నట్ల చేసెదను । అనిమిషులార, నా కవని దేవతలు
ననిశంబు సాహాయ్య మాచరించినను । ఎనయంగ నాపని యేఁ జేతు." ననిన,
నమ్మతి వడి [4]సురల్ సామ్రాజ్యమునకు । నెమ్మితో నభిషిక్తు నెఱయంగఁ జేసి
యెలమి శుక్రుని బురోహితుని గావింప । వెలయంగ నింద్రుఁడు విభవంబు, మఱియు
సురగిరి కనకంబు సొంపుతో నొసఁగెఁ । గరి తురగాదులుఁ గలిగెను నంత.
ఈరీతి రాజయి యెలమి శాస్త్రోక్త । చారుమార్గమున నిచ్చలు దండనీతి
పరిపాలనంబు తప్పక చేయుచుండె । వరుసతో నాతని వంశజులెల్ల
ధరణిపాలించిరి దండనీతులను; । ధరణీ వల్లభు లిట్లు దైవత సములు.
అలవడ నాల్గు వర్ణాశ్రమ ధర్మ । ములు నొగిఁ జెప్పెద ముదము దీపింప.
తనర బ్రాహ్మణునకుఁ దపము ధర్మంబు । ననిశంబు యజనాదు లతనికి వలయు.
నరనాథులకు వేడ్క నరులఁ బ్రోచుటయు, । దురమున వెన్నీక దొడరుట; విప్ర
వరులఁ బోషించుట; వైశ్యుల కెలమి । నరయ యజ్ఞాధ్యయనాది కర్మములు
ధరణిలోపల విహితములు; శూద్రులకు । వరుసతో నీ మూఁడు వర్ణంబులకును
బనులు సేయుట చేసెఁ బద్మసంభవుఁడు. । మునుమిడి యల వర్ణములు నాశ్రమములు
నరపతి తగురీతి నడపుటఁ జేసి । సరవి నింద్రుఁడు వాని నరిగాఁడు వినుము.
ఏనుఁగు పాదములో నెల్లమృగముల । యానిన పాదములు నడఁగిన యట్లు
మునుకొని నృపధర్మమునకు లోనగుచు । మనమార సర్వ ధర్మంబులుఁ బరఁగు
రీతిగా వేదాదివృత్తముల్ దండ । నీతి మానినఁ జెడు నిక్క మెంతయును.

---

1. దహించినను, 2. దైన్యుండు 3. వరుసతోఁడుతను. 4. వైన్య. (మూ)

ధరణిలోఁ దొల్లి మాంధాత యనంగఁ । బరఁగినయట్టి భూపాలవర్యుండు
వరవితో శ్రీహరి సందర్శనంబు । గుఱుతుగా వలెనని కోరి యాగంబు
సేయంగ, నంతలో జిష్ణుండు తనకు । నాయెడఁ బ్రత్యక్షమై యిట్టులనియె:
"సొలయక విష్ణునిఁ జూడంగ నీవు । వెలయంగ నెంతయు వేడుక పడితి.
పరఁగంగ నాకైనఁ బద్మజుకైన । నరిది శ్రీహరిఁ జూడ నవనీశ తిలక!"
అనవుడు మాంధాత యమర వల్లభునిఁ । గనుఁగొని యిట్లనెఁ: "గరుణాఢ్య, వినుము
వరుస సాంసారిక వర్తన ముడిపి । సరస మహా భైక్షచరణ తత్పరత
పొనరంగ నామనంబున దృఢంబుగను । నొనరించి నన్ను ధన్యునిఁ జేయు." మనిన
నగుచు దేవేంద్రుఁడా నరనాథుకనియె: । [1]"నెగడంగ నెంతయు నృపధర్మ పదము
దండత్వ; మదిగాన ధరణీశు గతికి । ఖండించి పోవ శక్యంబె యెవ్వారికి?
అవనిలో లోకపాలాత్మకుల్ మీరు; । ప్రవిమల నృపనీతి పాలించి సమర
మున ముక్తదేహులై పొందుఁడు సుఖము." । అనిచెప్పి దివమున కరిగె నింద్రుండు.
అదియేల, వేదములందు శాస్త్రముల । విదితమీయర్థంబు విధువంశ తిలక!"
అనిన ధర్మజుఁ డప్పు డనియె భీష్మునకు: । "ననఘాత్మ, రాష్ట్రజనావళి యెద్ది
యొనరించి సుఖులౌదు రొగిఁ జెప్పు." మనిన । ఘనుఁడు శాంతనవుఁ డాక్ష్మావతికనియె:

## రాష్ట్రజనుల కర్మాధర్మములు భీష్ముఁడు ధర్మజున కెఱిఁగించుట

అవనీశు నుత్తము నభిషిక్తుఁ జేసి । భువి నెల్లపనులుఁ దన్ముఖమునఁ జెల్ల
నతి సౌఖ్యమున నుందు; రదిలేకయున్న । నతులిత దుఃఖబద్ధులై మహీజనులు
[2]దపియించి యన్యోన్యదారధనాదు । లపహరింతురు; మీల యట్టులపోలె
బలవంతులెల్ల దుర్బలుల నాహార । ములు గాఁగఁ గొందు రిమ్ముల; నదిగాన
... ... ... ... .. । ... ... ... ... ...
జనులెల్లఁ దొల్లి కంజజుఁ గానఁ బోయి । "మనుజేశు నొకని మాకు రక్షకునిఁ

1. ధరణీశా నృపధర్మ ముత్తమము సద్ధర్మంబులం దెల్ల నే
 తెరువున్ రాజరయంగఁ గాదె తగ సిద్ధింబొందుఁ గామంబుఁ గ్రో
 ధ రయంబున్ మగిడించి దండము సమత్వవ్యాప్తిఁ జెల్లించుమన్
 ధరఁ బాలించినరాజు వొందుగతి పొందన్ శక్యమే యెరికిన్. అని తిక్కన, శాం: 2-247.
2. 'దర్పించి' యని వ్రాసినేమొ!

గా నిరూపింపు పంకజగర్భ!'' యనిన । జానొప్పఁ గరుణ నా సరసిజాననుఁడు
మనువు నిరూపింప, మనువు 'నేనొల్ల' । ననిన, భూప్రజలెల్ల నతని కిట్లనిరి :
"నీ కేల శంకింప నింతటి పనికి ? । ప్రాకట విస్ఫూర్తిఁ బశువులయందుఁ
బసిఁడి నేఁబదియగు భాగంబు, మఱియు । దశమ భాగంబును ధాన్యంబులందుఁ,
బరఁగంగ నీకును భండారముగను । గురుతరగతిఁ బుచ్చుకొని మహామహిమఁ
జెలరేఁగి, శస్త్రోపజీవుల నెల్ల । నెలకొన్న వేడ్కతో నీవారిఁ జేసి
కొని దుష్టశిక్షణ గావించి శిష్ట । జనరక్షణంబుగాఁ జరియింపు నీవు.
తడయక ధర్మవర్తనులు నీచేతఁ । జెడుచారు ; ధర్మంబు చేసినయట్టి
వారి ధర్మంబున వచ్చును నీకు । నారూఢితోడ షష్ఠాంశ.'' మిట్లనుచుఁ
జెప్పిన నొడఁబడి క్షితియెల్ల నేల । నప్పుడు సుఖమంది రఖిల భూప్రజలు.''
అనిచెప్పి మఱియు నిట్లనియె భీష్ముండు : । "అనఘాత్మ, వసుమనస్సను భూవిభుండు
పొలుపొందఁగా [1]నీవపోలెఁ దర్కించి । యలవడ సురగురు నడిగిన, నతఁడు
నతనికిఁ జెప్పిన యాభంగి వినుము. । అతులిత స్ఫూర్తి శశాంకుండు రవియుఁ
గానుపింపక యున్నగతి మహీజనము । భూనాయకుఁడు లేక పొందుధ్వాంతంబు.
తన ధన మిదియని తగమహోత్సవము । లును యాగ భోగంబులును ద్యాగములును
గొనియాడ వచ్చునే కోరి నిర్భయత । జనపతి లేకున్న జగతీతలేశ !
అని బృహస్పతి చెప్పె.'' నని చెప్పుటయును । విని ధర్మసుతుఁడు భావించి యిట్లనియె:
"అనిలోన ననివర్తులై శౌర్యమహిమఁ । దనువు దొఱంగిన ధన్యు లేలోక
[2]మున వసింపుదు ?'' రన్నఁ బుడమిఱేఁడు కనియె : । ... ... ... ...

## శక్రాంబరీష సంవాదము

"నృపవర, శక్రాంబరీష సంవాద । మిపుడు చెప్పెద వినుమెంతయుఁ బ్రీతి.
అంబరీషుఁడు ధాత్రి నంత నానాధ్వ । రంబులు చేసి సుత్రాముని కడకుఁ
గడచనిపోయి యక్కడ విమానమునఁ । దడయక విహరించు తనభటుఁడైన
యా సుదేవునిఁ గాంచి యంతటిలోన । వాసవు కనియె: "దేవా, వీఁడు నాడు

1. నీవలెపోలి తర్కించి. 2. తిక్కన శాంతిపర్వములోని 266 వ పద్యము మొదలు 427 వ పద్యము వరకుఁ గల విషయము లుప్తమో, వ్రాయక విడిచెనో తెలియదు.

[1]భృత్యుండు క్రతుముఖ్య విహితకర్మములు । నిత్యము చేయఁడు; నెఱి నెవ్విధమున
నాకంటె నెక్కుడై నవ్య విస్ఫూర్తి । నాకిమ్మై యిప్పుడున్నాఁ? డిట్టి తెఱఁగు
విన వేడ్క యయ్యెడు వినిపింపు." మనిన । ననిమిషేశ్వరుఁడని నంబరీషునకు :
"అనఘాత్మ, శతశృంగుఁడను రాక్షసేంద్రు । తనయులు నదసు విదమ దములనఁగ
ముగ్వురు రక్కసుల్ భుజబల ప్రౌఢి । నివ్వటిల్లఁగ నంత నిన్ను మార్కొనఁగఁ
దలఁచి నీపురికిని దాడి వెట్టినను । దలఁకి సుదేవుతోఁ దప్పక నీవు.
వలికితి 'దైత్యులఁ బరిమార్చి కాని । వలనొప్ప నిచటికి వచ్చుట గాదు.'
అని యంప నితఁడును నట్లకాకనుచుఁ । బనిపూని చతురంగబలముతో వెడలి
దనుజుల శౌర్యంబు దప్పక చూచి । పనినడి సేనఁ జంపఁగనేల యనుచు
మరలంగ నంపి క్రమ్మఱి రుద్రభూమి । కరిగి చిత్తంబున నభవు భూతేశు
నిలిపి వాలును మెడ నిలిపిన, శివుఁడు । తలకొన్న ప్రేమఁ బ్రత్యక్షమై యపుడు
గళముపై నున్న ఖడ్గమును శీఘ్రమునఁ । దొలఁగించి, నీకోర్కి తుదినిత్తు ననినఁ,
జక్క జాఁగిలి మ్రొక్కి "శాంభవీరమణ, । దిక్కరిదంత వార్ధిశయనశయన
హార నీహార తారాద్రి మందార । శారద నీరద శారదా హీర
నిర్మల విగ్రహా, నీకృపపేర్మి । నర్మిలి దైత్యుల నణఁపఁగనీవె!"
యని విన్నవించిన నంగీకరించి । ఘన దివ్యరథమును గలితాస్త్రములును
దయచేసి చనిన, నంతట సుదేవుండు । జయలీల రథమెక్కి సవడిమైఁబోయి
దనుజులఁ జెండాడి ధరణిలోఁ బ్రజల । గొనకొన్న వేడ్కలు కొనసాగఁ జేసి
యింతటి పదమున కితఁ డర్హుఁడయ్యె. । సంతతాధ్వరములు సంగ్రామసదృశ
ములు గావు వినుము నృపుల మస్త రాశి । యలవడ వేదిగా, నాయుధ ముఖ్య
ములు స్రుక్స్రువములుగా, మొగి శోణితములు । కలితాజ్యముగ, మాంసఖండంబులర్థి
[2]ప్రోడాశనంబుగాఁ (?) బొలుపు దీపించి । వేడుకతోడుత వీరవ్రతమున
నరవి దీక్షితుఁడునై సంగరాధ్వరము । కర మొప్పఁజేసి రక్తజలపూరమును
ధీశక్తితోడ మస్తిష్క కర్దమముఁ । గేశశైవాలముఁ గృతకాంత్రఫేన

1. భృత్యుఁ డుగ్రముగాఁగ ముఖ్య (మూ). 2. 'పురోడాశ' మునకుఁ గల్గిన మాఱుపాటు.

యును హేతి మీనయు నొగిమత్తనాగ । తనుసైకతయు నయి తగు పుణ్యనదిని
నరవితో నవభృథస్నానంబు చేసి । యిరవొప్పఁ బ్రాపించె నిట్టి సత్పదము
పరువడి యేనును బ్రబలుడై తేజు । వరులఁ జంపినయట్టి వరసుకృతమునఁ
గాదె యింద్రత్వంబు గాంచితి ననిన । నాదట మోదించె నంబరీషుండు”
అనుచు దేవవ్రతుఁ డాధర్మజునకుఁ । బెనుపొంద నెఱిఁగించెఁ బ్రీతితో ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నని చెప్ప వెండియుమునులు
అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
ఆదినారాయణ, యాద్యంతరహిత, । వేద గోచర, దేవ, విశ్వసంరక్ష,
యక్షర, యవ్యక్త, యభవ, శ్రీకృష్ణ, । పక్షివాహన, శార్ఙ్గి, పాపసంహార,
అంజనాచలవాస, హరనుత చరిత, । ఆంజనేయప్రియ, యచ్యుత, యజర,
ఘన మాని హృద్గేహకలిత సందోహ । వినుత ప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్త వత్సల, జగత్పావన మూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పద పద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై శాంతి పర్వమున నాశ్వాస । మొచితార్థ యుతముగా నొప్పె రెండవది.

# తృతీయాశ్వాసము



శ్రీ భోగిశయన, సుస్థిర, దివ్యమూర్తి, । వైభవనిలయ, శ్రీవర, వాసుదేవ,
బాణాసురాంతక, పర్వత నిలయ, । వేణునాద వినోద, వేంకటనాథ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె :
ఆరీతి "శూరు లత్యంతపుణ్యాత్ము । లాయోధి" నన విని యమతనూభవుఁడు

## రణోపాయ ప్రకారము

"కాల నిరూపణ క్రమ రణోపాయ । జాల మెఱింగింపు సరవితో నాకు."
ననవుడు గాంగేయుఁ డట్లకాకనుచు । "వినుము ధర్మాత్మజ, విశ్వంబులోన
వానయు సీతును వర్జించి మఱియు । జానొప్ప మండువేసవి గాకమునుపి
యదను మీఱంగ సస్యంబుల పంట । లొదవెడుకత్రి, [1]నీళ్లు నొగిఁ గట్టియలును
గసవును గల త్రోవగాఁ జూచి [2] నడచి । యసదృశ విస్ఫూర్తి నఖిలాయుధములు
హయములు గజములు స్యందనంబులును । రయము మీఱఁగ నవకణలు పూర్వంపుఁ
గలిమిచే శత్రుభీకరములై యుండ । వలయు; నిస్సాణాది వాద్యముల్ వలయు;
వఱలుచు వేగులవారిచే నరుల । తెఱఁగెఱుఁగుచువచ్చి తెరువున, డప్పి
పొందినచోటఁ జొప్పుగ వేలములను । బొందుగా విడియంగఁ బోయెడువేళఁ,
బొలుపు మీఱఁగ నిద్రపోయెడువేళఁ, । దలకొని యశనంబు తడసినవేళ,
నలసిన వేళ పాయక విచారించి । చలమున శత్రులఁ జంపంగ వలయు.
చెట్టును ఱాళ్లను జెలఁగి పల్లంబు । మిట్టయు నీళ్లను మెదలని రొంపి
యును లేక [3] సమమునై యున్నట్టి చోటు, । అనయంబు హయములు నరదముల్ చనఁగ
ననువైనమార్గంబు, నరసి వేపోయి । ఘనముగాఁ [4] బోరినఁ గలుగు జయంబు.
ఎలమితోడుత నుత్సహించి శాత్రువులు । పొలు పొంకఁ 'బోయిరి పోయి' గటంచు
నార్పులు బొబ్బలు నార్భటంబులును । దర్పిత సింహనాదములును జేసి

---

1. 'శత్రుపై నెత్తునది' యనుట యధ్యాహార్యము. 2. 'నడచుటకర్జ' మనుట యధ్యాహార్యము.
3. సమమయి. 4. బోడిచిన.

యతిరయంబునఁ బోరునట్లుగా రాజు । తతభంగితో సముద్ధతి చూపవలయు.
నూల్కొని యేనుఁ గేనుఁగు బేర్చినట్లు । గాల్కొల్పి పులికిని గంఠీరవంబు
నకుఁ బుట్టినట్టి యున్నతియును గలుగు । ప్రకట యోధులు వలె బవరంబునకును
బోనఁగ దేశవిశేషములు విను మనఘ! । కసటున సౌవీర గాంధార సింధు
దేశయోధులు మహాతీవ్ర శౌర్యమున । లాసి కఠారంబులను సబళములఁ
గసిమసంగినరీతిఁ గదనరంగమున । వసుధ శత్రులఁ బొడువంగఁ జాలుదురు.
ఎలయ నౌశీనరు లెల్లకైదువుల । కును నేర్చి సత్వంబు గుఱుతెఱుంగుదురు.
నెఱయంగఁ బ్రాచ్యు లేనికకయ్యములను । నెఱిఁగి దంభంబుల నేపు మీఱుదురు.
పోట్లమై యవన కాంభోజులు మధుర । చుట్ల నుండెడువారు శూరత్వమెసఁగ
బలిమిమై గుజ్జువు బవరంబునకును । అలవడి యుండుదు రందంద వొగడ.
రూపింపఁగా ఘూర్జరులు బ్రద్ధపరుల । నాపజ్జ బరిణతులై యుందు రెపుడు.
కడఁగి మాళవులు పెక్కండ్రువచ్చినను । బడలక చతురంగబల సంగరములఁ
జతురులై ఘనయుద్ధ సన్నద్ధ మహిమ । ధృతిగల్గి గెల్వంగఁ దివిరి యుండుదురు.
నరవిభో సకల దేశంబులవారు । గరిమయు శౌర్యంబుఁ గలిగియుండుదురు."
అనుచుఁ జెప్పిన విని యమతనూభవుఁడు । పనివడి గాంగేయుఁ బలికె నెంతయును:
"నరపతితో సౌమ్యు లసౌమ్యుల భంగి । నరన నసౌమ్యులు సౌమ్యుల గతిని
జరియింత్రు వారల చందంబు చెపుము । కరుణతో" ననిన నగ్గాంగేయుఁ డనియె :

## వ్యాఘ్ర గోమాయు సంవాదము

"మనుజేశ, వ్యాఘ్ర గోమాయు సంవాద । మను నితిహాసంబు గల దెఱిఁగింతు.
పురిక యనంగ నొప్పులు గలయట్టి । పురిఁ బౌరికుండను భూపతి క్రూర
కర్మకుఁడై మఱి కాలగతిఁ జొచ్చి, యంత । నర్మిలి గోమాయువై ధాత్రిఁ బుట్టి
తనపుట్టు వెఱిఁగియుఁ దాత్పర్యవృత్తి । చెనసి రూఢవ్రత శీలత్వమునను
మాంసంబు ముట్టక మహిత సద్వృత్తి । హింస సేయక కడు నేపుతోడుతను
ఫలములు మూలములుఁ బత్రసంచయము । జలములు నాహార సరణిగాఁ జేసి
వర్తింపఁ దొడఁగిన, వలనేది యపుడు । మార్తురై తోడి గోమాయువులెల్ల
"నెక్కడి వ్రతమిది? యొలమితో వినుము । మక్కువతోడుత మన జాతియందు
లేనిది తగునె! మేలిమి మాంసమిపుడు । ధీమత, నేమిదె తెచ్చి యిచ్చెదము.

సాలవక భక్షించి సుఖివి గ" మ్మనుచు । నలవడఁ బ్రార్థింప నందుకుఁ జొరక
నక్కడ దృఢ నిశ్చయంబుతో నుండె. । ఒక్కనాఁ డావార్త యొప్పగా నెఱిఁగి
భూనుత, వన మృగంబులకెల్ల ముఖ్య । మైన శార్దూల మయ్యెడ కేఁగుదెంచి (?)
సారిది గోమాయువుఁ జూచి యిట్లనియె : । "పరమ పుణ్యాత్మక, భావంబులోన
నరయంగ సౌమ్యుఁడవని యెఱిఁగితిని. । పురుషవరేణ్య, యిప్పుడు నన్ను జెంది
యతులిత సౌఖ్యంబులందిన మేలు. । కుతలంబునందు నుగ్రుండనుమాట
చిరభక్తి నుమగంగఁ జేసి శిక్షింపు. । వరుసతో, నా బాంధవంబు సేయుచును
మెలఁగంగ వలయు నిమ్మెయి." నన్న నపుడు । పొలుపొంద శార్దూలముఖ్యున కనియె :
"అనయ మాశ్రయణీయుఁడవుగావె నీవు ; । ఘనుఁడ, భోగంబులు గాకున్న నేమి ?
పరఁగ భోగంబులపై నాకు వాంఛ । యరసిన లేదు ; కార్యాకార్యవితతి
నా యెఱింగినరీతి నయబుద్ధితోడఁ । బాయక చెప్పిన, భవదీయ భృత్య
వరులు కోపముచేసి వడిని భేదింతు ; । రురవడి దానిచే నొప్పమి పుట్టు.
కలయంగ వారలు గలఁచిన నీవు । కలఁగకుండుటకును గరిమ నాబుద్ధి
పాటించుటకును దప్పక సమయంబు । నీటుతోఁ జేసి మన్నింపు ; మట్లైన
నీకడ వర్తింతు నెమ్మితో" ననినఁ । జేకొని సమయంబు చేసిన, నక్క
పొలుపొంద సంప్రీతిపొంది పెంపొంది । పులికి దినంబును బుద్ధులు చెప్పి
కొనుచు వర్తింపంగఁ, గొండొకకాల । మునకుఁ జూపోప నప్పులి మూలబలము
తిరముగా నప్పులి దినెడు మాంసంబు । నరయంగ హరియించి యానక్కయింటఁ
గర మొప్ప గొందిలోఁ గానరాకుండ । నెరవుగాఁ బెట్టిన, నింతటిలోన
రీతిఁ బదార్థ పరీరక్షణమును । జాతిగాఁ దాన నిచ్చలుఁ జేయుఁగానఁ
బరఁగ గోమాయు వప్పనికి నేతెంచి । గరిమతో మాంసంబు గానక యంత
'నెవ్వారు ముచ్చిలి రీ మాంస !' మనుచు । [1]నివ్వటిల్లిన వగ నెఱయ నప్పులికి
నెఱిఁగింపఁ బులియును నేవు దీపించి । తఱలక ముచ్చిలితన మరయంగ,
గనుఁగొని యెప్పటి కపటసేవకులు । పనివడి కపటంబుపన్ని మాంసంబు
నరయు తెఱఁగును నపుడు ఘటించి, । దొరకొని మఱియు శార్దూలంబు మనసు
వెస నక్కమీఁదను విఱుఁగంగఁ జేసి । [2]తసుకులు గల భృత్యపతి యిట్టులనియె :
"కరుణాఢ్య, వినుము నక్కకు నేటివ్రతము ! । చిరతరమతిఁ 'బిల్లిశీలంబు' గాదె !

---

1. నివ్వటిల్లఁగ నక్క. 2. తసగులు. (మూ).

నయమును మీఱంగ నిన్నాళ్ళు నీయాన । భయమున మఱుమాట పలుకంగ నోడి
యుంటిమి; యింతలో నోదవె[1]మ్రుచ్చిమియు; । నంటున దాఁచె నెంతయు మాంసమిదిగో.
అదిగాక మఱియు నేమైనను జేయు । నిది పాపజాతి నీకేమి చెప్పుదుము!"
అనుటయుఁ గోపించి యాపులి నక్కఁ । గనుఁగొని దీనిని ఖండింపుఁ డనుచుఁ
బనిచిన, దానిఁ దప్పక గొనిపోవ । విని పులితల్లి భావించి వ్యాఘ్రంబు
కనియె: "నిత్తెఱఁగెల్ల నకట! కృతిమను । పెనుపొంద జేసివై భృత్యులమాట
వలన గోమాయువు వధియింపఁ బనుపు । తలఁ పెట్టుపుట్టెనో తనయుండ, నీకు (?)
వడి బుద్ధిమంతునివలన దుర్బుద్ధి, । నడుకొని యధికువల్లను హీనజనులు
వలనొప్ప రూపసివలనఁ గురూపి । చెలరేఁగి కోపంబు సేయుదురిట్లు
తలకొని ధర్మ మధర్మంబు భంగిఁ, । దలఁగి యధర్మంబు ధర్మంబుమాడ్కిఁ
దోఁచును; కటకటా! ధూర్తులై నట్టి । నీచుల మాటల నెఱి విన[2]దగునె?
ఎలమి దీపింపంగ 'నెద్దినె' ననఁగఁ । గలగొని 'గొందిని [3]గ' ట్టనఁ దగునె!
చెనసి యీనక్క వచ్చిన నాఁటనుండి । మనకుఁ జెప్పినబుద్ధి మఱువంగఁ దగునె!"
యనవుడు శార్దూల మానక్కఁ బిలువఁ । బనిచి కౌఁగిటఁజేర్చి బాష్పముల్ గ్రమ్మ
తవణించి మంచిమాటల గారవింపఁ, । బ్రవిమలమతి నక్కపలికె [4]నవ్వుచును:
"నను మంచివాఁడని నయము దీపించి । కొనియాడి కొనియాడి కొలఁదిగా కిపుడు
మానంబు వోకార్చి మర్దింపఁ బనిచి । పూని యిప్పుడు ప్రియంబులు వల్కనేల!
నను బదస్థునిఁ గాఁగ నశిఁ జేయునపుడు । పెనుపొంద నీభృత్యబృందంబు దలఁపు
లను బడకునికికి, లలి నాదుబుద్ధి । వినుటకు బాస గావింపవే నీవు?
ఎఱిఁగిన నైనను నెఱుఁగమినైనఁ । బరుసున నొక్కని భంగ పెట్టుదురె!"
యని పాసి వనమున కరిగి యానక్క । దినమును నిరశన దీక్షచే నెగడి
పలుతెఱంగులను సద్భావ విఖ్యాతిఁ । దలకొని పరఁగు పదంబున కరిగె."
అని చెప్పినను విని యాధర్మరాజు । "తనర నేభంగి వర్తనమున నృపతి
సునిశిత విస్ఫూర్తి సుఖియునై యుండు?" । ననుటయు గాంగేయుఁ డర్థినిట్లనియె:
"ఆలస్యమును ననహాయత్వమెపుడు । చాలంగఁ గొఱగాదు జగతిలోపలను.
ఒక్క యుష్ట్రములోల్లి యురుతపోనిష్ఠఁ । దక్కకయున్న నంతట బ్రహ్మమెచ్చి
'వరమేది యడుగు పావన లీల' ననిన । సరవి నయ్యుష్ట్రంబు సంతోషమంది

1. మ్రుచ్చిలియు. 2. దగదు. 3. గట్టింప. 4. నప్పలికె. (మా)

"భారతీ నాయక, భావనాతీత, । నీరజాసన, దేవ, నిగమాంత వేద్య,
జడమతి నామీఁద శతయోజనముల । నిడుపుగా నీవె మన్నించి" నావుడును
ఆవిరించియు దాని కారీతివరము । వావిరి నిచ్చి పూర్వవు సీమకరిగె.
వరమతి నదియును వరగర్వమునను । అరుదారఁగా సహాయంబు నొల్లకయుఁ
దిరుగుచు నంతలో ధృతి నొక్కనాఁడు । సరసంబుగా నక్కుచాది మేయుచును
జెనువాన వట్టినఁ, జేర్చి యుష్ట్రంబు । తనమీఁద యొకగుహాద్వారంబు చొరఁగ
నిడి నిద్ర వోవంగ, నెఱినొక్క నక్క । కడఁకతోడుతఁ దనకాంతయుఁ దాను
నాగవి వడిఁ జొచ్చి యాఁకలిచేత । బాగొప్ప నుష్ట్రంబు బంధుర గళము
కబళించి నెత్తురు కండలొండొండ । ప్రబలంబుగాఁ దినఁ, బరగ మేల్కాంచి
తనమీఁద పొరలించు తఱి, నక్కలంతఁ । దినుచు నరంబులు ద్రెంప నుష్ట్రంబు
తీపులగ్గలమయి ధృతిదప్పి యంతఁ । బ్రాపుగా నిర్గత ప్రాణంబు నయ్యె.
ఇట్టి చందంబున నీవును గాక । గట్టిగా సాహాయ్యకలన వర్తింపు."
మనవు డిట్లనిపల్కె నాధర్మరాజు : । "అనఘాత్మ, పరిపంథి యధికుఁడయ్యేనను
భావింపఁగా నల్పబలుఁడైన రాజు । ఏవిధి నాపద నిట నిస్తరించు?
చెప్పవే" యనవుడు చెలఁగి భీష్ముండు । అప్పుడిట్లని పల్కెయమతనూజునకు :

## నదీ జలధి సంవాదము

"జననాథ, విను నదీ జలధి సంవాద । మను కథ గలదు ; పాయకసముద్రంబు
తగ సుఖగోష్ఠి నెంతయునుండి వేడ్క । మిగులంగ నదులతో మెఱసి యిట్లనియె :
"పాలుపొంద మీతటంబుల వృక్షసమితి । తలకొని మీరలు తఱిమి పాఱినను
ధరఁ గూలుచుండ వేతసము లవేల । గురుతరలీలఁ గుదురయి యుండు?
పెను పొంద మీకేమి ప్రియమొనరించె? । మునుకొని వాని నున్మూలన చేయ
మీకు శక్యముగాదొ మెఱయంగ?" ననినఁ । గైకొని యుదధితో గంగయిట్లనియె:
"ఎడపక తమబిగు వెడలక నిలిచి । పడును భూజంబులు ; వడి వేతసంబు
అలవడఁగా నమ్రమై వేగమెల్ల । వలనొప్పఁ గడచి పూర్వస్థితి బ్రదుకు."
ఆరీతి గైకొని యరిమహీపతుల । శూరత పెంపును సురుచిరలీల
తనశక్తియు నెఱింగి తాలిమితోడ । నొనరంగ నెంతయు నుచితవర్తనల
నతని యుద్ధతి మాన్చి యటహీనబలుఁడు । చతురతఁ జెడక నిచ్చలును వర్తిల్లు."

నన విని మోదించి యాధర్మరాజు । తనరంగ నిట్లను : "తగుపదంబులకు
నరయంగఁ గులవంతులగు పరిజనులు । దొరకక యున్న నుద్ధురవృత్తితోడ
నవనీశుఁ డేమి సేయఁగఁ గలవాఁడు ? । వివరింపు." మనుటయు వెండియు ననియె :

## కుర్కురోపాఖ్యానము

ఇతిహాస మొక్కటి యిందుకు వినుము । అతుల విస్ఫూర్తి సంయమివరుఁ డొకఁడు
తగఁ దపోనిష్ఠమైఁ దనయాశ్రమమున । నెగడంగ నచ్చట నిఖలజంతువులు
ననువొంద నతని దయావిశేషమున । ఘనముగా నిల్చి సుఖంబున్న యంతఁ,
బరగంగ వానిలోపల నొక్క కుక్క । వరభక్తి నమ్మౌనివర్యునిఁ గొలిచి
తిరుగుచు నుండె ; నంతట నొక్కనాఁడు । ఉరువడిఁ బఱతెంచి యొక వింతదువ్వ
పట్టంగ వచ్చినఁ బాఱి యాకుక్క । గట్టిగా నమ్మౌనికడకు నే తేరఁ,
గనుఁగొని యది దువ్వగాఁ జేయుటయును । బనివడి కవియంగ భయమంది పాఱె.
అంత బెబ్బులివచ్చి యడరిన దాని । నెంతయుఁ బులిఁజేసి యిట గెలిపించె ;
ఒక మత్తకరిఁ జూచి యొదిఁగిన దానిఁ । బ్రకటించి కరిఁ జేసి పాపె భయంబు ;
కంఠీరవము వచ్చి కడఁగిన దానిఁ । గంఠీరవంబునుగా నొనరించె ;
శరభమే తేరంగఁ జలితమయ్యెనను । శరభంబుగాఁ జేసి సంతోషమిచ్చె.
మానుగా దినక్రమంబున నక్కు । దైన సత్త్వము తనకబ్బినఁ గుక్క
శరభరూపంబున సాహసస్ఫూర్తిఁ । దిరుగుచు నుండి మత్తిలి యంతలోనఁ
దనలో విచారించెఁ "దాపసోత్తముఁడు । ఒనరంగ ననుఁగని యొందుసత్త్వంబు
ఘనముగా మదిని బెగ్గిలి పాఱునప్పుడు । ఎనయంగఁ గృపతోడ నివ్విధంబునను
ధృతి శరభము నొనరించునో దాని ! । నతులిత విస్ఫూర్తి ; నట్టైన నాకు
వే విధంబుల మీఱి నిహరింపరాదు ; । కావున నీ మౌనిఁ [1]గడఁగి వధింతు."
నని విచారము సేయ నమ్మౌని యెఱిఁగి । "యనిశంబు నకట, యీ యధమ [2]జాతికిని
ఉన్నతస్థితి తగదూహింప." ననుచుఁ । బ్రన్నన శ్వానంబుగా నొనరించె.
అదిగానఁ గులహీను లవని లోపలను । ఒదవంగ మాననీయులుగారు వినుము."
అనిచెప్ప భూవిభుం డాపగాసూతిఁ । గనుఁగొని యనియె : "నో కారుణ్యమూర్తి,
యాశ [3]యనంతమై యభివృద్ధిఁ బొందు ; । ఆసాన[4]తోనున్న యా సుయోధనుని

---

1. ఖండింతుననుచు. 2. కుజాతి – కున్నత. 3. యొంతైనను. 4. తోడుత.

[1]గలిసి యుండఁగఁ జూడఁగా [2]మదీయాశ । [3]చెలఁగి కుంఠితమునుజేసి దుర్బుద్ధిఁ
గావించె నన్ను ; నక్కట యాశ యడఁప । నే విధంబుననైన నిది దుర్లభంబు."

## సుమిత్రోపాఖ్యానము

అనవుడు భీష్ముఁ డిట్లనియె: "హైహయుఁడు । ఘనుఁడు సుమిత్రుండు గలఁ డొక్కరాజు
వేఁట వోయినచోట వెసఁదనచేతి । వాలంబుగా నేటువడిన మృగంబు
అమ్ముతోఁ బాఱంగ నట దానివెంటఁ । గ్రమ్మనరీతి భూకాంతుండు వోవ
నొకమరి దవ్వయ్యు నొకమరి చేర్వ । బ్రకటితగతి నయ్యుఁ బాఱఁ బాఱంగ,
నానపెంపున నృపుండరుగంగ, నదియు । గాసిల్లఁగా ఘోర గహనంబు చొచ్చె.
మనుజేశుఁ డలసి వేసఱు సంతనొక్క । మునిపల్లె కేఁగి యమ్మునులకు మ్రొక్కి
యాగాఢిఁ గందమూలాదులు వారు । నారక యీయంగ వడి దప్పిదేఱి
కృతమతి యన్నచో ఋషభాఖ్యుఁడైన । యతి సుమిత్రునిఁ జూచి యంత నిట్లనియె :
"వనరుచు నొంటిమై వనమున కేమి । పనికినై వచ్చితి పార్థివవర్య!"
యనవుడు ఋషితోడ నవనీశుఁ డనియె : । "మునికులాధీశ్వర, మునిసార్వభౌమ,
అరయంగ నొకమృగం బమ్ముతోడుతను । అరుగంగ వచ్చితి నాపాప నిటకు.
కరుణాఢ్య, యాసకుఁ గడలేదు వినుము । వరసుతి" ననిన భూవరున కిట్లనియె :
"విను తీర్థయాత్రకై వెస నేనుబోయి । పనిపడి యంతలో బదరికాశ్రమము
నందును గృశగాత్రు నత్యంత పుణ్యుఁ । బొందుగా దనుఁడను మునివతంసంబుఁ
గని భక్తిఁ బ్రణమిల్లఁగా వేడ్కనతఁడు । నొనర నాతిథ్యంబు నొనరించె నాకు.
ఈ రీతి నొనరింప నిట మునియొద్దఁ । బౌరుషంబుల ధర్మఫణితులు వినుచు
నుండంగ నొక్కనాఁ డుర్వీశుఁ డొకఁడు । నిండు నేత్రంబుల నీరు గాఱంగఁ
బనవించి పనవించి బలములుఁ దాను । మునిపతిఁ గాంచిన, మునుకొని యతఁడు
అతిథి సత్కారంబు లాచరించియును । గతులు మీఱంగ నాగమనకారణము
నడిగిన, భూపతి యతని కిట్లనియె : । "తడయక మునినాథ, తనయుఁ డొక్కరుఁడు
మృగయావినోదినై మొఱఁగి కానలను । దగిలి రాకుండినఁ దగ వానివెనుక
వచ్చి, కానక యాసపడిఁ ద్రిప్పుకొనుచు । వచ్చితి." ననవుడు వదనంబు వాంచి

1. కలసియుండఁగ మదీయాశచేనపుడు – చెలువారకుండి పడఁజేసె దుర్బుద్ధి (?). ఓరియంటల్ ప్రతి.
2. 'వాఁడు తేలక' యనుట యధ్యాహార్యము. 3. చెలువారఁ గుంఠితచేసి.

చింతించి యిట్లనె క్షితిపతిఁ జూచి: । "అంతంత స్వర్గాదులగు ఫలంబులను
బ్రార్థింపఁగా సిగ్గు పఱుపక యర్థి । నర్థితోఁ దుష్ట సులభార్థునిఁ జేయు
ననఘ కృతార్థుండు సరిది తలంప." । అని పల్కి మఱియును ననియె నమ్మౌని:
"గొనకొని వినుము సద్గుణవంతు డొకఁడు । ధనవంతుఁడగు నొక్క ధరణినాయకునిఁ
దనకూడు సీరక్కై ధనము నర్థించి । చనవొవ్వఁ దద్బాలిశత్వంబు పేర్మి
నలవడ విహతాశుఁడై లజ్జవొంది । వలనొవ్వ నిస్పృహావ్రత మాచరించె."
అనిచెప్పి "తొల్లి యే నప్పార్థివేంద్రు । వెనుకొని ధన మర్థి వేఁడి, లేకున్న,
జననుత! తత్కాల జనిత వైరాగ్య । మునఁ దపంబునకును మునుకొంటిఁ దెలిసి.
'ఆన దొలంగిన నతుల సౌఖ్యంబు । వాసిగాఁ గల్గుఁ బావనవృత్తి' ననుచు
నయము వీరద్యుమ్ను నకుఁ గరుణించి । జయసిద్ధిఁ దనతపస్సంపద వలన
నరయ భూరిద్యుమ్ను సతని నందనునిఁ । గరుణ తోడుతను నాకర్షించి యిచ్చి
వీడ్కొల్పె" ననిచెప్పి వెసబుషభుండు । వేడ్క సుమిత్రుని వివిధ రీతులను
రమణతో మృగయాభిరతుఁడు గాకుండఁ । గ్రమమున బోధించెఁ; గౌంతేయ, నీవు
తగ నిరాశుండవై తాపంబు దక్కి । యగణిత సుఖివి గ" మ్మనిన నిట్లనియె:
"అనఘ, నీ వాక్యామృతా [1]స్వాదనమునఁ । దనియదు నామది; ధర్మమార్గములు
వివరింపు" మనుటయు వెండియు ననియె: । "తవిలి యెంతేనియుఁ దమభూమిఁ బరుల
యవనిని ధనము లుపార్జింపవలయు. । ప్రవిమల రాజ్యధర్మంబులు గలుగు (?)
తగు నుపాయంబున ధనములు గూర్చి । నెగడఁగ వలయును నిఖిల ధర్మముల.
మేదినిఁ [2]దెరవాటు ప్రముచ్ఛిమి గలుగు । నా దయాహీనుల నటనెంత సత్య
వంతులైనను వారి వసుధేశ్వరుండు । పంతంబుతో నేలఁ బాపంబువచ్చు.
పొలుపొంద నన్యాయమున వృద్ధిఁబొందు । బలములచే గెల్పు ప్రాపింపదనఘ!

## కావవ్యోపాఖ్యానము

ఇతిహాస మొక్కటి యిందుకు వినుము । అతులిత పారియాత్రాచలంబునను
ఒక బోయ ధర్మసంయుత బుద్ధినుండు; । ప్రకటించి వింట నేర్పరి చతురుండు;
తిరముగా మృగవితతి ప్రకార[3]జ్ఞ । సరసుండు; కాంతార సంచారశాలి.

1. హ్లాదమునను. 2. తెరువాటు 3. రాజ్ఞ. (మూ)

తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తి । మొల్లమౌ మధుమాంసములు ఫలాదులును
గూడు గూరలు దొరకొలిపి వారికిని । వేడుక సేయుచు వివిధరీతులను
అరయంగ వలయు నాహారముల్ మునుల । కరసి యిచ్చుచుఁ, జుట్టునరులఁ జంపుచును,
కాపవ్యుఁ డనువీర ఘనశౌర్యమహిమ । దీపింపనుండ, నత్తేజంబు గాంచి
యా పొలంబునఁ గల్గు నా దస్యు లెల్లఁ । బ్రాపింప మసలకుఁబతివలె ననుచు
నందఱు గమిగూడి యాతనిఁ గాంచి । 'పొందుగా మము నేలు పుత్రులఁబోలె'
నన, విని కాపవ్యుఁ డందఱఁ జూచి । వనివడి యెంతయుఁ బలికె నిట్లనుచు :
"శిశుజన మునిజన స్త్రీ జనంబులను । విశసింపఁగా రాదు వినుఁడు చెప్పెదను.
అనిశంబు నెట్టివాఁడైనను గడఁగి । తనమీఁదఁ గవియక తాఁ జంపరాదు;
చెలరేఁగి స్త్రీలనుఁ జేపట్టఁ దగదు; । బలిమిఁ గోడుతను గోబ్రాహ్మణోత్తముల
సంకట పెట్టంగఁ జనదు; మీరిట్టి । పొంకంబు లెఱఁగి యెప్పుడుఁ బంపు సేసి
బ్రదికెద రేని మీపతినౌగు." ననిన । అదను మీఱఁగ దస్యు లది సమ్మతించి
పరఁగఁ గాపవ్యుని పంపు సేయుచును । ఇరవొప్ప బుధులకు హితవొనరించి
పాపంబులను బాసి ప్రజ్ఞదీపించి । కాపవ్యుఁడును దారుఁ గని రిహపరము.
సరవిఁ గాపవ్యుని చరితంబు వినిన । పురుషులు గాంతురు పుణ్యలోకములు ;
వలనొప్పఁ బఠియింప వనమృగదస్యు । కలిత బాధ తొలంగుఁ గలుగు సౌఖ్యములు"
అని చెప్పి మఱియు నిట్లనియె భీష్ముండు: । "జననాథ, వినుము నిశ్చలబుద్ధితోడ
శ్రీలీల దీర్ఘదర్శియు మఱి ప్రాప్త, । కాలజ్ఞుఁడును, మహాఘనుఁడైన దీర్ఘ
సూత్రుండు ననఁగను సొరిది మత్స్యములు । మైత్రివాటించి వేమఱు తమలోనఁ,
బ్రకటించి జలచర బహుళమైనట్టి । యొక యేటిమడుగులో నుండినయంత
వేసవి చొచ్చిన, వెస దీర్ఘదర్శి । వాసిగా నిద్దఱి వలనొప్పఁ బిలిచి,
"మడువింకఁ బొఱెడు మన మొక్కయెడకుఁ । గడఁకతో నీళులుగలుగుచోటికిని
బోవంగవలె" నన్న బుద్ధిఁ జింతించి । కావరంబునఁ బ్రాప్తకాలజ్ఞుఁ డనియె:
'ప్రాప్తమయ్యెన కార్య భంగు లెఱింగి । యాప్తతి మీఱంగ నప్పటప్పటికిఁ
జలముతోఁ దగినట్లు సలుపంగ వలయుఁ । గొలఁదిగా' ననెడు పల్కులు విని దీర్ఘ
సూత్రుఁ డిట్లని పల్కె "శుభమూర్తులార! । ధాత్రిలో జలధి చందమున నీమడువు
ఉన్నది; ఱిత్త మీకొగిఁ జింతయేల ? । క్రన్ననఁ దఱి రాఁగఁ గందముగాక."
యనుచుఁ బల్కిన విని యా దీర్ఘదర్శి । 'ఘనులార, యిది బుద్ధిగా' దని తలఁగి

కర మొప్పఁగా లోఁతుగఁ జుట్టి మడుఁగు । కరిగెఁ; దక్కిన రెండు నందులో నిలిచె.
అంతలో నొక్కనాఁ డామడుఁగునకు । నెంతయు జాలరు లేతెంచి చొచ్చి
కరముల నా మత్స్యగణములఁ బట్టి । తరమిడి వేడ్కతోఁ ద్రాళ్ళ గ్రువ్వఁగను,
గరిమతోడుతఁ బ్రాప్తకాలజ్ఞుఁ డనియె: । "ఇరవొప్పఁగా నేను సిందొక్కత్రాడు
మొదుగాఁ గఱచి యిమ్మెయిఁ గ్రుచ్చినట్టు । లుండెద; నంతలో నొనరంగ మడుఁగు
చొచ్చెద;" నని మదిఁ జూచి మీనంబు । గ్రుచ్చినరీతి నా గుది మీల నడుమ
దూఱి యాత్రాడు బంధురలీలఁ గఱచి । ధీరత మూర్ఛ చెందిన రీతినుండె.
అంతలో జాలరి యందులో మీల । వింతగాఁ బట్టి యా వేట చాలించి
గుఱుతుగా నామీలగుది రొంపివోవ । దొరఁకొని తెలినీటఁ దొలచినయెడను,
వెలయంగ నది త్రాడువిడిచి పాశంబు । తొలఁగి మీనములున్న తోయధి కరిగె.
తెలివెల్లఁ బోకార్చి దీర్ఘసూత్రుండు । చెలువేది జాలరిచేఁ బట్టువడియె.
తనరంగ వినుము దాదవులకార్యంబు । కనుఁగొనవలయునో కమలారివంశ!
కడఁకతోఁ బని మున్న గావింపలేని । జడుఁ డాపదలఁ బొందు సరిదీర్ఘసూత్రుఁ
డనెడు మత్స్యముభంగి; నప్పటప్పటికిఁ । దనకుఁ దోఁచినయట్టు తప్పకయుండఁ
దెలివితోఁ గార్యంబు దీర్చిన యతఁడు । లలిమీఱఁ బ్రాప్తకాలజ్ఞుండు వోలె
బ్రతుకును ధైర్యంబు పాటించి మించి. । ప్రతి ననాగత కార్యపరత యూహించి
మనమాఱఁ జేసిన, మఱి దీర్ఘదర్శి । యను మీనుగతిని సౌఖ్యంబును బొందు."
అన విని ధర్మజుఁ డాపగేయునకు । వినయంబు దీపింప వేడ్క నిట్లనియె :

## పలిత రోమశుల సంవాద ప్రకారము

"జగతిలోఁ బెక్కండ్రు శాత్రవులకును । అగపడి యెంతయు నట హీనబలుఁడు
అనఘాత్మ, యేగతి నాపదగడచు? । వినిపింపు" మనుటయు వినిపింపఁ దొడఁగె:
"అడవిలో నొక మఱ్ఱియడుగున నొక్క । యెడ లాగఁ బలితుఁ డన్నెలు కొక్కటుండు.
చనవొప్ప నమ్మహీజము కొమ్మమీఁద । ననిశంబు లోమశంబను పిల్లి గలదు.
ఆసమీపమున నిత్యము మృగంబులకుఁ । గాసిగా మాలఁ డొక్కఁడు సంధ్యవేళ
నురులొడ్డి వేఁకువ నొగి వేడ్కతోడ । సరుదెంచి పడినట్టి యా జంతువులను
గరిమ నాహారంబు గల్పించు కొనుచుఁ । దిరుగుచు నుండంగ, ధృతినొక్కనాఁడు
మఱుకొని యాహారమునకును బిల్లి । పొనరంగ నచటికిఁబోయి యాయురినిఁ

బడియె; నచ్చోట నప్పలితుఁడన్నెలుక । జడియక క్రుమ్మరఁ, జంద్రకుఁడనెడు
గూబపుల్గును, హరిణుండను ముంగి । వే బల్మి నెరకునై వెస వచ్చి తోఁప,
నమ్మెలుక రెంటికి నటఁ దప్పిపోవఁ । జయ్యన రామి నిశ్చలతఁ జింతించి
చెలిమితో నప్పిల్లిఁ జేరంగఁబోయి । పలికె: "ఓమార్జాలపతి, యిప్పుడేను
దగిలిన యురుల నెంతయుఁ గొఱికెదను. । వగ యేల యిఁక మైత్రిపాటింపవలయుఁ
గానకొని ముంగికి గూబకు వెఱచి । నినుగోరి వస్తి మన్నింపు." నావుడును
బిల్లి యిట్లనిపల్కెఁ బ్రియము రెట్టింపః । "నెల్లగా నార్తుల నిటఁ బ్రోచు నీకు
హితము సేయఁగ వలదే! జగత్కర్త । చతురత సాక్షిగాఁ జనుదెమ్ము; భయము
మానుము నీ" వన్న మఱి మూషికంబు । జానొప్పఁ బొదిగిట సరివసియించె.
అంత నులూకంబు నా నకులంబు । నంతయుఁ గనుఁగొని యటువాసి చనియె.
ఇటఁ బలితుండను నెలుక యాయురులు । తటుకునఁ గొఱుకక తగనుండు టెఱిఁగి
లోమశుండనియె నాలోకించి "నన్నుఁ । గామించి బంధమోక్షము సేయవలదె!
ఆలస్యమేటికి? ననఘ, కృతఘ్ను । శీలత యొప్పునే చెచ్చెర" ననిన
నెలుక యిట్లనిపల్కు: "నెగ్గుగాఁ గానకు । బలమైన యాయురిఁ బాసి మఱేమి
తలఁతువో! మిగులనెంతయు బలుఁడైన । కలితాత్ముతో సంధి కడునొనర్చియును
ఒప్పు మీఱఁగ నమ్మకుండుటే నీతి. । ఎప్పుడు మాలవాఁడిటఁ జనుదెంచు
నప్పుడె యీయురులన్నియుఁ గొఱికి । తప్పక పోదు; నిత్తఱి నమ్ము" మనిన
"నిన్ను రక్షించితి నేర్పుతో నన్ను । వన్నెగా రక్షింపవలవదె యకట!"
అనినఁ బిల్లికి నెల్కయనె "నీకునేల । పనివడి వేగిరపడఁగ? నివ్వేళ
పదటిమి కొఱగాదు భవ్యాత్ములకును. । పదరంగ నేల యీపట్టున?" ననుచు
నిరువురు వాదింప నెఱివేగుటయును, । నరగున వేఁటకు సంభ్రమించుచును
కుక్కలు వెంటరాఁ గ్రూరకృపాణ । మక్కజంబుగఁ బూని యామాలవాఁడు
చనుదేర, నాపిల్లి చయ్యననంత । నెనయంగ భయమంది యెలుకకిట్లనియె:
"పరిఘనామకుఁడైన పాపకర్ముండు । అరుదెంచె వాఁడుగో యమదూతవోలె."
అనిన నోడకుమని యాయురులెల్లఁ । దననోరఁ గొఱికి యెంతయుఁ బలితుండు
పరువడి బొక్కలోపలికిని బోయె: । అరిగె లోమశుఁడును నాభూజమునకు.
అంత నా పరిఘుండు నాయురుల్ వోవఁ । జింతించి దుఃఖించి చేరె నింటికిని.
ఇట లోమశుండు నీయెలుక నీక్షించి । పటుతరామృత వాక్యపద్ధతి ననియె:

" పరమ పుణ్యాత్మక, ప్రాణదానంబు । తరమిడి చేసి మిత్రత వహించితివి.
బొక్కలోపలనేల పొందుగానిటకు । నక్కజంబుగ వచ్చి యఖిలసౌఖ్యములు
పొందుము ; నన్ను నమ్ముము ; రమ్ము వేగ ; । సందేహమేటికి సర్వజ్ఞ, నీకు ? "
అనవుడు పిల్లితో నాయెల్కయనియె : । " పనివడి యెంతయుఁ బగవానియెడల
వలనొప్ప మిత్రభావంబు గల్గినను । నలిమీఱ నతనిని నమ్మంగరాదు.
అదిగాక నీబాంధవావళి యెల్లఁ । బదపడి నను జూచి పాటించుటెట్లు ?
ఆయురిఁ జొచ్చి పేరాకలితోడ । రేయెల్ల గాసిల్లి ప్రియముతో నిపుడు
పిలిచిన నినునమ్మి ఖేలచందమున । వలనొప్ప నాకును వచ్చుట తగునె !
నీవల్ల బ్రదికితి నేనును ; నీవు । నావల్ల బ్రదికితి నయ మింతెచాలు.
ఎలమిదీపింపంగ నిత్తెఱంగునకు । నలవడ శుక్రవాక్యంబులుఁ గలవు.
బలవంతుఁడైన యా పరిపంథివలనఁ । గలగొనఁగార్యంబు గల్గఁ గూడియును
అనయ మాకార్యమైనను వానిఁ దొలఁగి । మనవలెఁ ; గాకున్న మఱి చేటువొందు ;
అదిగాన నినునమ్మ నటుపొమ్ము చాలు । పదివేలు వచ్చె నీ బాంధవం " బనుచుఁ
బలుక నంతట సిగ్గువడి పిల్లి తనకు । వలసిన చోటికి వడి నేఁగె ; నెలుక
యును బోయె మఱియు వేఱొక్కచోటికిని. । ... ... ... ...
ఎలమితో శత్రుని [1] హీనుని నైనఁ । గలసి యాపదలను గడవంగవలయు.
అందుకుఁ బిల్లియు నాయెలుకయును । బొందుగా [2] నెఱిఁగించె భూనాథ ! " యనిన
యమసూతి యిట్లను : " నవనిలోపలను । విమలాత్మ, యెవ్వరి విశ్వసించినను
దురితంబు చేకూరు ! దొరకొని యెవరిఁ । బరువడి విశ్వసింపకయున్న సౌఖ్య
ములులేవు ? చెప్పుమిమ్ముల నాకు. " ననినఁ, । గలిత విస్ఫూర్తి నగ్గాంగేయుఁడనియె:

## పూజనీ బ్రహ్మదత్త సంవాదము

ఈ యర్థమునకు నే నితిహాస మొకటి । పాయక చెప్పెద భవ్యాత్మ, వినుము :
"ధరణిలోపల బ్రహ్మదత్తుఁడనంగఁ । బరఁగినయట్టి భూపాలుని నగరఁ
బూజనియను నామమునఁ జతురత్వ । భాజని మంజులభాషిణి యొక్క
శారిక వర్తించు సరస రీతులను । ఆహూఢి విఖ్యాతి నట నొక్కనాఁడు

1. హితమతికైన. 2. ఎఱుకపఱిచెను ననుట.

అది పిల్ల వెట్టి యింపారఁగఁ బెంచు | బెదరక తెచ్చి యాపిల్లకుఁ బెట్టి
యందులో మేలేరి యారాజసుతుని | కందంద యిచ్చుచో, నారాజసుతుఁడు
అద్భుగా నేతెంచి యాపిల్లతోడఁ | జెచ్చెర దినమును జెల్లాటమాడు.
ఒకనాఁడు తమదాది యొద్దలేకున్నఁ | బ్రకటించి యాపిల్లఁ బట్టిచంపినను
దలకొని మఱిదానితల్లి యేతెంచి | కలియంగ శోకాంధకారంబు నిగుడ
"అక్కటా! యిటఁ గూడియాడుచు దీని | నొక్కటఁ జంపునే యుర్వీశుకొడుకు!
ధట్టుఁడై ; యేమైన దయతోడఁ దనకుఁ | బెట్టకకాని తాఁ బ్రియముతోఁ దినదు.
అట్టిపిల్లనుజంపె ; నవనీశుకొడుకు | గట్టిగా నెంతయుఁ గాఁడె ! రాజులకు
నెక్కడి పరిచయ ! మెక్కడి కరుణ ! | యెక్కడి సత్య ! మేనీ పగదీర్తు"
ననుచుఁ గోపంబున నారాచకొడుకు | కనుగ్రుడ్లు రెండును గ్రక్కున గోళ్ళఁ
బెఱికి వియద్వీథిఁ బేర్మితో నిలిచి | తలఁలక యా బ్రహ్మదత్తున కనియె :
"ధరణీతలేశ, నీతనయ రత్నంబు | దురితంబు గావించి తోడ్తోనగుడిచెఁ
గాని యేఁ జేసినక్రౌర్యంబు లేదు ; | మానుగాఁ జేతకు మాఱుచేసితిని
అందంద యెంతయు; నదిగానఁ గీడు | చెందదు నన్ను నో క్షితినాథ" యనినఁ
దలకొని యా బ్రహ్మదత్తుఁ డిట్లనియె: | "తెలియంగ వినుము నీదెస కీడులేదు ;
నలినీవు చనుటకు నామనంబర్థి | నిలిచి దుఃఖమును జెందెదుఁ ; దొంటియట్ల
నమ్మియుండుము నీవు నయబుద్ధి." ననిన | నెమ్మి శారిక వల్కె "నీపుత్రు నిట్లు
గావించి మఱియును గడఁగి నీయింట | భూవర, యుండంగఁ బోలునే!" యనిన
క్షితిపతి యిట్లనుఁ "జేసినందులకుఁ | బ్రతి చేసితివి, దానఁ బగ వాసిపోయె.
చెలిమితో గుణములు డాసిన మేలువిడిచి | యొలసి [1]దోషంబు సేయుదురె! నిక్కంబు
నమ్మిర" మ్మనవు డెంతయును శారికయుఁ | గ్రమ్మఱ ననియె భూకాంతునితోడ:
"నెయ్యంబు చెడినను నృప, వచనముల | [2]తియ్యఁదనమున మదిం బగమఱువఁ,
జావయ్యెఁ జేటయ్యె సరి మూఁడుఁగాక | యే విధంబుననైన నేటికిపూను?
వినుము ధారుణిఁదోఁచి వెనకొన్న, మఱియు | ననిశంబు దాయాదులైనను, మాట

---

1. 'దోషంబు పట్టుదురె!' యని యుండఁదగును 2. తియ్యఁదనంబున ధీరతమఱువ. (ఓరియంటల్ ప్రతి) "నెయ్యము సెడినను మాటల | తియ్యఁదనము వట్టిపగ మదిన్ మఱచిన్ జా | వయ్యెం జేటయ్యెఁ గలఁక | యయ్యె నొకటి మూఁడుఁగాక యది మేలగునే" అని. తిక్కన. శాం. 3–256.

మాటకునేని, భామలయెడనేని, । వాటంబుగాఁ గీడు వారకసేయఁ,
బగ జనియించు నే న్పగిది నెంతయును. । పగ గల్గనేనియుఁ బాయునే! గూఢ
మై వృక్షముననున్న యగ్నిచందమున । భూవర, యేవిధంబున నుండుఁగాక.
తల్లినిఁ దండ్రి బాంధవుల సోదరుల । నెల్లగా మిత్రుల నిల నమ్మరాదు.
కర ముప్పుఁగాఁ బగగల్గినవారి । నరనాథ, యేరీతి నమ్మంగవచ్చు?
క్రందుగా నమ్మినఁ గాలాంతరంబు । నందైనఁ జెడు సంశయం బేమిలేదు."
అనుటయు వెండియు నా బ్రహ్మదత్తుఁ । డనియె శారికఁజూచి "యట మేలుఁగీడుఁ
గాలవశంబునఁ గాక నేయంగ । నేలీల వచ్చును నెవ్వరికైన?
పొసఁగ 'నవశ్యమను భోక్తవ్య' మనెడు । ననదృశ వాక్యంబు [1]లవి యవునుమ్ము."
అనవిని పూజని యతని మొగంబుఁ । గనుఁగొని "మంచి వాక్యములందు నలుక
పరఁగ వారిధిలోని బడబాగ్ని రీతి । నరయంగ [2]నకనకమనుచు నున్నదియు"
అనిపల్కి నిలువక యచ్చోటు పాసి । చనియె నప్పూజని జగతీతలేశ!"
అనవుడు ధర్మజుఁ డాపగాతనయు । కనియె: "నాహారంబు గానక ధర్మ
కలితులు ద్విజు లప్రగహాముఖ్యదురిత । ములఁ బ్రాణ మేభంగి మునుకొని నిలుపు

## విశ్వామిత్ర చండాల సంవాదము

వా" రన్న నిట్లనె: "వసుధేశ, వినుము । ధారుణిఁ దొల్లి త్రేతాద్వాపరముల
నందున క్షామంబు సకలజనముల । నందంద చంపుచు నటఁ జనుదెంచె;
ఇరవొప్పఁ జెరువులు నేఱులు నింకెఁ; । గరిసనంబులును వృక్షంబులుఁ గమరె.
మహనీయ వర్ణాశ్రమములన్ని కలసె; । తహతహఁ బ్రాణులు ధరణిపైఁ బడియె.
ఆసమయమున విశ్వామిత్రమౌని । గాసిల్లి మిగుల నాకఁటఁ గుంద కంది
"ద్వాదశాబ్దంబుల పఱపిది; యింకఁ । బోదు; ఏవిధమున బొంది నిల్పుదును!"
అని యన్నపానాదు లఖిల భూజనులఁ । బనివడి యడిగెందుఁ బడయంగ లేక
యాఁకలి దప్పిచే నలసి యెంతయును । జోకతో దేహంబు సుడివడుచుండఁ
బసరపు డొక్కలఁ బంది యెమ్ములను । ఎసఁగు దుర్గంధంబు [3]హేయంబు నైన
మాలవాడకుఁ బోక మది విచారించి, । యాలోనఁ బోఁజాలకపనిపైఁ బొరలి

---

1. లవినివినుమ్ము ; లవివినమిమ్ము (?) 2. బలగర్వియగు. 3. నేహంబ్యబునైన.

“[1]మొగిని బ్రాణంబులు పోవ నుపేక్ష । దగదు ; రక్షించుట ధర్మ మిత్తఱిని.”
అని యని చింతించి, యామాలవాడఁ । గొనకొని యొకమాల కుక్కనుజంపి
తోలొల్చి మాంసంబు తుది గాలి నార । నాలోన వైచిన నది కౌశికుండు
గనుఁగొని, ‘ంఁదితప్పఁ గాయంబు నిలువ’ । దని యూహసేయుచుఁ ‘బ్రాణముల్ వోవ
కుండఁ బరిహరింప నొండుపాయంబు । దండిగా లేకున్న ధర బ్రముచ్చిలించి
యైనఁ బ్రాణము నిల్పుటది ధర్మపథము. । కానఁ జండాలుని ఘన ధనంబైన
మేలిమి యా సారమేయమాంసంబు । నీలోన హరియింతు నేనని యుండ
రవి బింబ మపరాంబురాశిలో మునిఁగె ; । అవిరళగతిమించె నంధకారంబు.
అప్పుడు కౌశికుఁ డా మాలవాఁడు । చొప్పడ నిద్రింపఁ జూచి వేపోయి
మాలవానింటి యా మాంసంబు వట్టి । యాలోనఁ దిగిచిన నచట నిద్రించు
మాలఁడు మేల్కాంచి “మాంస మీవేళ । నేల దొంగిలితి ? వీ వెవ్వఁడ ? విట్టె
పొరిగొందు.” ననిన నప్పుడు భయమంది । సురుచిరంబుగ ‘గాధినూనుండ’ ననిన
వినయంబుతో వాఁడు వెస శయ్య డిగ్గి । మునుకొని చేతులు మొగిచి దుఃఖించి
“యనఘాత్మ, నీతలంపదియేమి? నాకు । ననయంబు నెఱిఁగింపు” మనిన నిట్లనియె:
“ఆఁకటిచేఁ బ్రాణహానికి నులికి । బ్రాకట గతి[2]నిట్లు పాపమయ్యునను
దుది కుక్కమాంసంబు దొంగిలించితిని. । వదల కెంతేనియు వైశ్వానరుండు
క్షితిమీఁద మిగుల శుచిత్వసంపదలఁ । జతురుఁడై సర్వభక్షతఁ బొందినట్లు.”
అన విని చండాలుఁ డతని కిట్లనియె : । “ఘనుఁడ, శ్వానంబు మృగంబులలోన
నెల్లఁ గుత్సితము నీకిది [3]ముట్టఁదగునె ! । చెల్లఁబో యక్లేల చేసెద !” వనిన
మునిపతి చండాలముఖ్యున కనియె : । “తనువుగల్గినఁ జాలఁ దపమున విద్యఁ
బొపుకొనఁగనేర్తుఁ బాపజాలముల, । నేపుమీఱంగ నేనిదియేల విడుతు ?”
అనవు డంత్యజుఁ డను : “[4]నధమంబుగాక । యొనయంగ నెంతయు నిది ధర్మమగునె !
పెనుపొంద మీవంటి పెద్దల” కనిన । “విను మగస్త్యుఁడు తొల్లి వెస దైత్యమాంస
భక్షణం బొనరించి పాయఁడే యఘము ! । దక్షత.” ననిన నత్తఱి మాలఁడనియె :
“పరహితంబునకునై పాపంబు చేసి । పురుషుఁడు కీడునఁ బొందఁడు నిజము.
ఒగి నగస్త్యుండు పరోపకార్థ । మగుపాడి చేసి కృతార్థుఁడై మించె.

---

1. పూని (?) ; యొగిని బ్రాణంబు వోవుట యుపేక్షింప (?) 2. నిట్టి. 3. ధర్మమగునె. 4. నధర్మంబు గాక (?)

ఎలమిని మాంసంబు లీలేక నట్టి । పలుకులు పలుకంగఁ బాడియే నీకు ?
నిరుపమ చారిత్ర, నీకు నామీఁదఁ । గరుణ గల్గిన వేగఁ గావు మీవేళ.
తొడరి ముచ్చిలినట్టి దోషంబు లేదు; । బడిని దానస్వరూపముగ నాకిమ్ము."
అనినఁ జండాలుఁ డిట్లనియె వెండియును: । "మునిచంద్ర, మీవంటి పుణ్యులకెల్ల
గరిమ నీచప్రతిగ్రహ మర్హ మగున! । చిరమతి నింక మీ చిత్తమేరీతి
నారీతి నొనరింపుఁ డనుచు మాంసంబు । కూరిమితో నీయఁ, గొని కౌశికుండు
రమణతోఁ బ్రాణంబు రక్షించుకొనుచు । సమధిక విస్ఫూర్తిఁ జనియె; నంతటను
గరపుదీఱంగ నాఖండలుండగ్గి । గుఱి మీఱ వానలు కురియించె ధరణి;
సకల సస్యంబులుఁ జాలంగఁ బండె. । అకలంక మతిఁ బూని యా కౌశికుండు
పొలుపుమీఱంగఁ దపోవిశేషమునఁ । గలుషంబు వాసి సౌఖ్యంబులఁ బొందె.
పోసఁగ నాపత్కాలమునఁ జేయు సమయ । మనమున నిట్టిది యనిచెప్పె " ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నని చెప్ప వెండియు మునులు
'అనఘాత్మ, తరువాతనైనవృత్తాంత । మనువొప్పఁ జెప్పవే!' యని యడుగుటయు,
భవరోగసంహార, ప్రహ్లాద వరద. । శివ, పితామహరూప, చిన్మయాకార,
గజరాజరక్షణ, కంజదళాక్ష, । విజయగుణోపాయ, వేదవిధేయ,
బాణభంజన, దేవ, భావనాతీత, । వేణునాద వినోద, విశ్వప్రమోద,
ఘనమాని హృద్గేహ కలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తి ప్రదాయక, మ్రొక్కెదనీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమై శాంతి పర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె మూఁడవది.

# చతుర్థాశ్వాసము



శ్రీ భూసమేత, యాశ్రిత పారిజాత, । శోభితాకార, రక్షోవర్గమథన,
[1] మనసిజ జనక, నిర్మలగాత్ర, కలుష । వన ఘన దావపావక, వేంకటేశ!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
భూమి నాపత్కాలమునఁ జేయునదియు । మా మెయిఁ జెప్పినయంత, ధర్మజుఁడు
‘ శరణాగతులఁ బ్రోచు సజ్జనులకును । బరువడి నేరీతి ఫలమబ్బు ? ’ ననిన
గాంగేయుఁ డిట్లను: “ కడఁకతోఁ దొల్లి । రంగుగా ముచికుంద రాజవర్యునకు
దైతేయమంత్రి యెంతయుఁ జెప్పినట్టి । [2] యాతతంబగు నితిహాసంబు వినుము.

## కపోతోపాఖ్యానము

పాపాత్ముఁ డొకబోయ పక్షులఁ జంపి । యేపుతోఁ దనియును నిటనమ్ముకొనియు
బ్రతు కదిగాఁ జేసి బహుతర లీలఁ । బ్రతిదివసంబును బాగైన వలలు
జిగురుకండెలుఁ జల్దిచిక్కంబు నురులు । మొగి ధనువును శరంబును ధరియించి
బహుతరాటవిఁ జరింపఁగ నొక్కనాఁడు । గహనభూమిని వాన గాలియుఁ బట్టె.
సకలజీవులకు నాశంబగునట్లు । ప్రకటించి దట్టమై పర్వి యెంతయును
గడవల జలము లొక్కట వంచినట్లు । పిడుగులఁ బడుచును భీమమై మిగుల
గాలియు వానయు గగనంబు నిండి । కాల రాత్రియుఁ బోలెఁ గడఁగినయంతఁ,
బాపకర్ముఁడు బోయ భయము రెట్టింప । నేపెల్లఁ దక్కి యెంతేనియు సొలసి,
వగచెడి చలిచేత వడవడ వణఁకి । వెగడొంది మిక్కిన వృక్షంబు చూచి
రాత్రియు నగుటయు రమణతో నాఁడు । గాత్రంబు మిక్కిలి గజగజ వణఁక
నొలసి ‘ యీతరువున నున్నభూతాళిఁ । గొలిచెద నన్నును గూర్మిఁ గాచుటకు.
అని లుబ్ధకుఁడు వల్క, నమ్మహీరుహము । ఘన కోటరమున సంకలితమై యుండి
యొక కపోతము తన యిల్లాలి రాక । యకలంక గతి నున్నయంత శోకించి

1. ఈద్విపద మద్రాసు ప్రతిలో లేదు. 2. యాతత యితిహాసమది వినుమనఘ. (మూ)

“యెక్కడ నున్నదో! యిటఁ బొద్దువోయె; । నిక్కము నను బాసి [1]నిమిషమయ్యెనను
ఒక్కచో నుండ దా యుజ్జ్వలదేహ, । ఏకారణంబున నేమైనయదియొ!
మునుకొన్న వానపెంపునఁ దెగనోపు. । తనరంగ మఱి దాని తనువు లేకున్నఁ
దన శరీరము నిరర్థకమగు నిజము. । మునుమిడి యైహికాముష్మికంబులకు
సతియెపో మూలంబు చర్చింపఁ బతికి, । సతిలేని సుఖమేల! సర్వంబు నేల!
ఏమిసేయుదు [2]నిప్పు డిల్లుపాడఱెను! । ఏమిగాఁగలవాఁడ నిటమీఁద నేను!”
అని పలవింపంగ నబ్బోయ వలను । జెనసి యెంతేనియుఁ జిక్కినయట్టి
యా కపోతము విని హర్షంబు నొంది । “ప్రాకటవిస్ఫూర్తిఁ బతికి హితంబు
చేసిన యదిగదా చికురాకుఁబోఁడి । వాసిగా ఘనపుణ్యవతి యది గాన,
మత్ప్రియాలాపంబు మనమారఁ గంటి; । సుప్రసన్నత నాకు సుకృతంబు గలిగె;
గెలిచితి యముని నంకిలిలేక.” । యనుచుఁ । దలకొని పతికిని దనవిధంబంత
నెఱిఁగించి “యా విధికృత్యంబునకును । మఱి వగవగ నేల మానసీయులకు;
శరణనిచొచ్చె నీశబరుండు; వీనిఁ । గరుణతో రక్షింపఁ గలుగుఁబుణ్యములు.”
అని సతి చెప్పంగ, నా కపోతంబు । తనలోని శోకమంతయు దిగవిడిచి
మనుజభాషలతోడ మఱి బోయఁజూచి । “యనఘచారిత్ర, యోయన్న, డస్సితివి.
అలవడ మాయింటి కతిథి వయ్యితివి; । వలనొప్ప నేఁ జేయవలయు నాతిథ్య
మెఱిఁగింపు” మనుటయు నేపుదీపించి । గుఱిమీఱ నా లుబ్ధకుం డిట్టులనియె:
“కరుణాఢ్య, సకలాంగకంబులు చలిని । ఇరవుగా నొచ్చె నీవిది మాన్పు” మనిన
ఆ కపోతంబు రయంబున వాఁడు । చాకుండఁ బోయి యచ్చటి పుల్లలెల్ల
ముక్కునఁ గొనితెచ్చి మొగిఁబ్రోవువెట్టి । తక్కక వేగ నా దావు పల్లియకుఁ
బోయి కాలినయట్టి పుల్ల ముక్కునను । బాయక తెచ్చి యాపయి రగిలించి
‘కరమొప్ప దేహంబు కాచుకొ’ మ్మనిన, । సరయంగ వాఁడు దేహంబెల్లఁ గాచు
కొని చలిఁ బాసి ‘యాఁకొంటి నే’ ననినఁ । గనుఁగొని గువ్వ వగచి క్షుత్తుమాన్పఁ
గా నుపాయము లేక కడఁక నిట్లనియె: । “మానవోత్తమ, విను మహి ఖగంబులకు
గలదె జీవనము సంగ్రహము చేసినది? । యలరి నానాఁటి యాహారమె కాక.
ఐనను నాతిథ్యమది సేయవలయుఁ । బూని నా దేహంబు భుక్తిగాఁ గొనుము.”
అని పల్కి వలగొని యయ్యగ్నిలోనఁ । దన దేహ మిడిన, నెంతయు బోయచూచి

1. నిమిషమైనాను (నా. అం.) 2. నిట్టు ఇల్లుపాడరిచె; పాడఱె.

యాశ్చర్యచిత్తుఁడై "యవనిలో నిట్టి । నిశ్చలతాస్థితి నెఱయంగఁ గలదె!
ఎంత కారుణ్యంబు! ఎంతపౌరుషము! । ఎంతపుణ్యంబిది యేపుతోఁ జేసె!
ఈపక్షి గురువయి యిటు సంభవించెఁ । బ్రాపుగా సద్భోగ బాహ్యుండ నగుదు."
అని యంత నిలువక యధిక వైరాగ్య । మున వలలోని యాపులుఁగుల విడిచి
నిరుపమంబగు పక్షినిహతిసాధనము । లరయంగ నబ్బోయఁ డచ్చోట విడిచి
పాపంబులెల్లఁ ద్రుంపఁగ నిశ్చయించి । వేపోయె నియతుఁడై ; వెస నక్కపోతి
యనఘుఁడు నిజనాథుఁడగ్నిలోఁబడుట । కును దనచిత్త మాకులమంద నడుమ
కన్నుల శోకాశ్రుకణములు రాలఁ । బన్నుగా నిట్లని పలవింపఁ దొడఁగె:
"ఇగురు జొంపంబుల నింపారు [1] లతల । నగణితంబగు పొదలందును దూర్చి,
యెలమావితోటలో నింపైనగిరుల । సెలయేర్లఁ గొలఁకులఁ జెన్నొందఁ జేసి,
యొనర నా కూఁకటి కోర్కి కైమైన । ననుభవింపఁగ వేసినవి తెచ్చియిచ్చి
నన్నుసంరక్షించి నాథ, నీవిపుడు । పన్నుగా విడువంగఁ బాడియే యకట!
ఎక్కడి కేఁగితి? వేమిసేయుదును? । యక్కటా! ప్రాణేశ! హా [2] పాపవిధి!
అనఘాత్మ, యిపుడు నీ యనుమరణమునఁ । దనువు దొఱంగి యెంతయు నీవుచనిన
పుణ్యలోకమున కిప్పుడు చనుదెంతు । గణ్యత." నని హృద్వికాసము దోఁప
వలనొప్ప నగ్నికి వలగొని వచ్చి । కలిత విస్ఫూర్తితోఁ గాంతుఁ దలఁచి
యనలంబులోఁ జొచ్చి యతనితోఁ గూడఁ । గనక విమాన సంకలితయై చనియె.
[3]దేవతావలి గొల్వ దివ్యదుందుభులు । వేవిధంబుల మ్రోయ విభవంబు మెఱసి.
అంతయు మదిలోన నబ్బోయ యెఱిఁగి । యెంతయుఁ జింతించి యేను నిట్లగుదు ;
నని దవానలములో నప్పుడు చొచ్చి । చనియె వైమానిక సదనంబునకును.
ఈ యితిహాసంబు [4]నెవ్వరు వినినఁ । బాయక [5]చదివినఁ బరఁగ [6]వ్రాసినను
బాయు గోహత్యాది పాపంబులైన, । వేయి విధంబుల విభవముల్ గలుగు."
అనుచుఁ జెప్పిన విని యాధర్మరాజు: । "అనఘ, పాపముఁ బొందినప్పుడు నరుఁడు
పరఁగంగ నేరీతిఁ బాపుకొనంగ । ధరణిలోఁ జాలు? నెంతయు నానతీవె!"
అని విన్నపముసేయ నాపగేయుండు । వినుమని యొకకథ వినిపింపఁ దొడఁగె:
"ఉర్విలో జనమేజయుండను రాజు । పూర్వంబు తనకును భూసురహత్య
ప్రాపింపఁ దన్నును బ్రజలు నిందింపఁ । దాపంబు నొంది యద్ధరణీవిభుండు

---

1. విరుల. 2. బాపువిదియ. 3. దేవాలి గొలువంగ. 4. నెవ్వఁడు. 5. వ్రాసిన. 6. చదివిన. (మూ)

పురము వెల్వడి పోయిపోయి శౌనకుని । సురుచిరాశ్రమభూమిఁ జొచ్చి యామౌని
పాదపద్మములకు భక్తితో మ్రొక్కి । యాకట నిలిచిన, నాతనిఁజూచి
శౌనకుఁ డిట్లను : "శవముఁ గన్గొనిన । పూనిక తోఁ జెడిఁ బాలసువచ్చెడిని.
ఏల వచ్చితివిట ? కిక్కడికైన । వాలాయము నరకవాసివై పొమ్ము."
అనుటయు నిందకు నర్హుండైనట్టి । జనమేజయుఁడు వల్కె : "శరణు చొచ్చితిని ;
పరఁగ నీపాదంబు పాయంగఁ జేసి । కరుణింపు." మనవుకుఁ గరుణ శౌనకుఁడు
తిరముగా నాతనిఁ దీర్ఘసేవాది । పరికరణంబుల భవ్యునిఁ జేసి
తలకొని యశ్వమేధములు సేయింపఁ । గలితపుణ్యాత్ముఁడై కనెఁ బుణ్యపదవి"

## గృధ్రజంబుకోపాఖ్యానము

అనిచెప్పి మఱియు నిట్లనియె భీష్ముండు : । "జననాథ, విను విదిశాపట్టణమున
లోలత నొక్కబాలుఁడు మృతుండైనఁ । దూలుచు వాని బంధువులెల్లఁ గూడి
పెనుపొంద నెంతయుఁ బ్రేతభూమికిని । గొనిపోయి శోకింప, గృధ్రమే తెంచి
వారలఁ గనుఁగొని వలనొప్పఁ బలికెఁ : । "మీరేల యున్నారు మిన్నక యిచట ?
కృతమతితోఁ, బ్రొద్దుగ్రుంకంగవచ్చె (?) । చతురత భూతరాక్షస పిశాచములు
చనుదెంచు నిచటికిఁ జనుఁడు మీరింక ; । జననంబు మరణంబు జనులకు నింతే.
వరమతిఁ జచ్చినవారి కేడ్చినను । ఉరుమతి నత్తురే! యో వెఱ్ఱులార !
సరవితో శిశువు నిచటఁ బాఱవైచి । యరుగుఁడు [1]చావక." యనవుడు వారు
నిదియె కర్జంబని యెసఁగిన భీతి । విదితమై పీనుఁగు విడిచి పోఁజూడ
నక్కయొక్కటివచ్చి నయము దీపించి । తక్కక వారి నెంతయుఁ జూచి యనియె :
"గ్రద్దమాటలకేఁ కడుభీతిఁ బొంద ! । తద్దయు బాలునిఁ దారుణ్యమూర్తి
నిటువైచి పోవఁ గాళ్ళెట్లాడె మీకు ? । కటకటా ! కొంతదుఃఖము మాననేర్వఁ
డంతలోపల విధి యధిక క్రూరత్వ । మెంతయుఁ బాసి తానిచ్చుఁ బ్రాణములు.
కాకున్నఁ బ్రాణంబు క్రమ్మఱమరలి । రా కల్గునో యేమొ! రవిగ్రుంకఁ ; డేల
వెఱచెద ?" రనిన భావింపంగ వారు । మరలి రాఁ గనుఁగొని మఱి గ్రద్దయనియె :
"నక్కమాటలు మీరు నమ్మంగవలదు ; । చక్క మీవచ్చినజాడనే పొండు.

---

1. 'మీరుం చెగుదురు దడసిన' అని తిక్కన.

కాలుఁడు మిక్కిలి కఠినచిత్తుండు ; । బాలుఁడు వచ్చునే పామరులార !
అరుగుఁడు మీరట్టియాసలు విడిచి. । కరమొప్ప శిశువుకు గతిగల్గునట్లు
పరలోకవిధులును బహుదానములును । సరగునఁ జేయుఁడు చనుఁ." డన్న నక్క
మఱియు వారలఁజూచి మసలకపలికె : । "తఱలకుఁ డక్కటా ! దయమాలనేల ?
బాలుఁడు మీకును బ్రాణంబులట్ల ; । జాలిలేదా ? చాలఁ జక్కనివాఁడు !
గుణగరిష్ఠుఁడు ముద్దు గురియుచున్నాఁడు ; । ప్రణుతింపఁగా దైవబలమున బ్రదుకు.
బ్రదుకకుండిన మీఁద పాఱంగవైచి । ప్రిదులక పోరాదె ! పెక్కులేమిటికి ?"
అనుటయు గృధ్రమయ్యెడ వారికనియె : । "వినరయ్య, యేఁబుట్టి వేయునిన్నూరు
గలవు వత్సరములు గాన నీ వింత. । అలనడ బాలుఁడు యౌవనస్థుఁడు
దొరకొని ప్రౌఢవృద్ధుఁడు చచ్చిపోయి । మరలి వచ్చినవాఁడు మహిలోన లేరు.
ఉత్తలపడనేల యొక్కటి గలదు । వత్తురు వేఱొక్క వరగర్భమునకు."
అనవుడు విని వారలాబిడ్డవైచి । యనయంబుఁ బోనంగ నడ్డంబువచ్చి
గోమాయు విట్లనుఁ: "గుంభినిఁ దొల్లి । రామచంద్రుండు పురాణపూరుషుఁడు
ప్రతిలేక చచ్చిన బ్రాహ్మణసుతుని । గృతమతితో బ్రతికింపఁడే మగుడ !
గుఱిగల సృంజయుకొడుకు చచ్చినను । మఱి నారదుండు క్రమ్మర వానిఁ దేఁడె !
ఉరువడి నటువలె నొక్కసిద్ధుండు । అరయంగ మీయేపు లాలించి వచ్చి
బాలునిఁ గనుఁగొని ప్రాణమిచ్చినను । మేలుగాదే ! యేల మీకు వోయెదరు !
వల" దన్న నంతలో వారలు మగిడి । కలఁగుచు శోకమగ్నలముగా నేడ్వ
వనజాప్తుఁ డపరదిగ్వనధిని మునిఁగె. । అనయంబు గృధ్రము నా జంబుకంబు
ఘనమైనయట్టి యాఁకలిచేతఁ గుంది । పనివడి శవమును భక్షింపఁ గోరి
తగఁ బ్రేతబంధులఁ దమపల్కునేర్పు । నెగడంగ నారీతి నెఱిఁ గ్రమ్మరించె.
పొలుపు మీఱంగ గ్రద్ద ప్రొద్దు గ్రుంకినను । నిలువనేరదుగాన నిపుణతతోడ
వారుపోయెడునట్టి వచనముల్ పలికె. । గారవంబెనఁగ నక్కకు రాత్రియైన
మేలు గావున, వారు మెఱయంగ నిలువఁ । జాలు చందముచెప్పె ; పనినంతలోన
వరకృపతోఁ బ్రేతవన సద్విహార । నిరతుండు శర్వుండు నీలకంఠుండు
శంకరుఁ డభవుండు చంద్రశేఖరుఁడు । పంకజహిత విధు పావకనేత్రుఁ
డాలోనఁ బ్రత్యక్షమయ్యెన, వారు । చాల నద్భక్తితో సాష్టాంగ మెఱఁగి

"విశ్వేశ, చిన్మూర్తి, విశ్వప్రకాశ, । శాశ్వత, యీశాన, శాంభవీరమణ,
భూతాత్మ, భూతేశ, భూతప్రబోధ, । చేతనాచేతన స్థిర, నిత్యనశ్య,
యీ పిన్నపాపని నిట బ్రదికించి । పాపంబు లెల్లను బాపి రక్షింపు."
మని సన్నుతులు సేయ నంగజారాతి । పనివడి యంత నా బాలు ప్రాణంబు
కృపచేసి, జంబుక గృధ్రంబులకును । నపుడు వేడుకతోడ నాఁకలిలేక
యుండుఁడు మీరని యొగిఁ బ్రసాదించి । ఖండేందుజూటుండు కానరాకరిగె.
అంత వారలు బాలు నటనెత్తుకొనుచు । నెంతయు ముద్దాడి యేఁగిరి పురికి.
సరవితో నాగృధ్ర జంబుకంబులును । గుఱుతుగాఁ జని తమకులమునఁ గూడి
పెద్దలై వర్తించెఁ బేర్మి దీపించి । తద్దయు." నని చెప్పి ధర్మజు కనియె :

## పవన శాల్మలీతరు సంవాదము

"ఎలమితోడుత విను హిమగిరియందుఁ । గలదొక్క బూరుగు ఘనమూల దృఢము.
నారదముని యొక్కనాఁడు మోదమున । నారూఢి నాభూరుహముపొంతఁ జనుచు
" బూరువా! యిదియేమి పొలుపుదీపించి । సారస పక్షి సంశ్రయణీయ మగుచుఁ
బవనునిచేతను బడక నిల్చితివి? । పవనునకును నీకు బాంధవం బర్థిఁ
గలదో! నీబల్మిని ఘనత నిల్చితివో! । ఎలమి దీపింపంగ నెఱిఁగింపు." మనిన
ఆవృక్ష మిట్లను " ననిలుని బలిమి । భావింపఁగా నాదుబలిమికి సరియె? "
అనివల్కుటయు విని " యమ్మక చెల్ల! । పనివడి యీమాట పలుకకు నీవు.
రవణించి ధాత్రిఁ గొండలు లోనుగాఁగఁ । బవనునిచేఁ బడి భగంబు నొందు.
మఱువక యుండుమీ మాటల బిరుదు । కఱకఱి" ననిపోయి గంధవాహునకు
నెఱిఁగింపఁ గోపించి యిట సమీరణుఁడు । నతిముఱిఁ జనుదెంచి యామహీరుహముఁ
గనుఁగొని పల్కె నుద్గాఢ వాక్యములఁ: । " వినుము బూరుగ, నీవు విశ్వంబులోన
నను గెల్తుననుచు నా నారదుతోడ । ననయంబు బల్కితివంట! సంహరింతు."
ననినఁ గోపంబున నమ్మహీరుహము । అనిలునిఁ గనుఁగొని యంత నిట్లనియె.
" ధరణిలో నేనింత తక్కువా నీకు? । గరిమ సామాన్య వృక్షమ్ముల నన్ను
సరిగాఁగఁ జూచితే! శ్వసన, నీవెంత! । పరిపరి విధముల భజించి వైతు. "
అనిన సమీరణుండమ్మహీరుహముఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
" ఓరి వృక్షాధమ, యొక్కనాఁడఱుఁడు । నేరుపుతో వచ్చి నీనీడ నిలిచి

యలరి మన్నించినయట్టి గర్వమునఁ । బలికితి వీరీతిఁ; బలుకుమీ రేపు!"
అనివల్కి పోయిన [1] నవనీరుహాంబు । తనమనంబునఁ గొంతతడవు చింతించి
"చెల్లఁబో మునిమాట చేకొననైతి; । నెల్లగా నాబలంబెంత వాయువుకు!
ఘనమైన యతని రాకకు నోర్వఁజాల; । కివియక యొకభంగి గెల్తునా ఘనుని."
అని యని తలపోసి యాకులఁ గొనలు । మునుకొని నిడుదకొమ్మలుఁ దానవిఱిచి
యున్నంత, వేకువ నుగ్రుఁడై యనిలుఁ । డన్నలువునకు వచ్చి యాపాదపంబుఁ
గనుఁగొని 'సీ' యని ఘనతతో మరలి । చనియె; నీరీతిని సత్వాఢ్యుతోడఁ
దుది దుర్బలుండును దొడర్చి యిట్లగును, । అదనుగా." నని చెప్ప ననియె ధర్మజుఁడు:
'వలనుగా నృపులకు వలయువారలను । వలవని వారల వడి నెఱిఁగించు'
మనవుడు భీష్ముఁ డిట్లనియెఁ: "దాలిమియు । ఘన ధర్మ [2] సత్యముల్ గలిగినవారు
లోలత మది రోష లోభ వర్జితులు । శీల సమేతులు శిష్టసమ్మతులు
కలిత పుణ్యాత్ములుఁ గారుణ్యపరులు । వలనొప్ప రాజుకు వలసినవారు.
క్రూరుఁడు లోభియుఁ గొండీఁడు శఠుఁడు । నోరువలేనివాఁ డుగ్రుండు ఖలుఁడు
జడుఁడు కృతఘ్నుండు సత్యహీనుండు । నుడుగక నిందల కోర్చినవాఁడు
కారుణ్య వర్జితుల్ కలుషాత్మకులును । జేరువ నుండినఁ జెడును భూవిభుఁడు.
ఇట్టి పాతకులలో నిటఁ గృతఘ్నుండు । గట్టిగాఁ గొఱగాఁడు కంజారివంశ!
ఈ యర్థమునకు నే నితిహాస మొకటి । పాయక చెప్పెద భక్తితో వినుము:

## నాడీజంఘోపాఖ్యానము

"ఉర్వీశ, ధాత్రిలో నొక్క విప్రుండు । సర్వకర్మంబులు సవడిమై విడిచి
తనరంగ నొక [3] బోయదానినంద నను । గొని కిరాతులతోడఁ గూడి వేటకును
జని మాంసములు తెచ్చి సతియును దాను । ననిశంబు భుజియించి యంగజకేళి
కలితుఁడై ధనమును గడియింపఁ దలఁచి । సలలితంబుగ వణిగ్జనముతోఁ బొందు
గావించి, కోమట్లు కడఁకతోఁ గొంద । ఱావేళఁ గడఁగి దేశాంతరంబులకు
వ్యవహారమున కేఁగ, వడి వారివెంట । నవిరళగతిఁ బోవ నవనిలోవలను
వనగజంబొక్కటి వడి నేఁగుదెంచి । జనములఁ ద్రొక్కియచ్చటఁ జంపుటయును,
సరవి నావిప్రుండు చావుకుఁ దప్పి । పరఁగ నుత్తరముగాఁ బాఱి యాలోన

1. నటభూ. 2. సత్వముల్. 3. బోయతను బాలికలను ;

నొక్కమార్గము గాంచి యొగిఁ బోయిపోయి । పొక్కుచు నొక వటభూజంబు చూచి
కలయంగ జలనిధిగాలి చేతేర । నెలకొన్న యా మ్రాని నీడఁ గూర్చుండె.
అంతఁ బద్మజునకు [1] నతి పాత్రమగుచు । నెంతయుఁ జెంపొంది యేపుదీపించి
యొనర నాడీజంఘుఁడను రాజధర్ముఁ । డనియెడు పేర్మి నొప్పారుచునున్న
కొక్కెర కామటి గృహమయి యుండ, । నిక్కడి కేతెంచి యది విప్రుఁగాంచి
"యెందుండి వచ్చితి? యెందుఁ బోయెదవు? । విందవైతివి నీదు విధ మెఱిఁగింపు
మానతో." నవుడు నతఁ "డేను మధ్య । దేశీయుఁడను విను ధీవర [2]వినుత!
అనఘాత్మ, గౌతముఁడను మహామాని । తనయుండ ; భూదేవతా కర్మమెల్ల
విడిచి బోయతఁ గూడి వేదంబు మఱచి । పుడమిలో విప్రులఁ బొరిపొరిఁ దిట్టి
యొనఁగ నభక్ష్యాదులెల్ల భక్షించి । పొనఁగిన దారిద్ర్యమునకును వగచి
కోమటివారలఁ గూడి యేతెంచి, । వేమఱు నడవిలో విహరించి యంత
వనకరిచేఁ దప్పి వచ్చితి నిటకు." । ననవుడుఁ గొక్కెర యనియె వానికిని :
'దారిద్ర్య మెల్లను దలఁగింతు నిపుడు । గౌరవాతిథ్యంబు గైకొను.' మనుచు
నెలకొని మందాకినీ మత్స్యములను । జెలరేగి పక్వంబు చేసియు మఱియు
వన్యఫలంబులు వలనొప్పఁ దెచ్చి । మాన్యత నతని వేమఱు తృప్తుఁ జేసి
ప్రొద్దు గ్రుంకినయంతఁ బువ్వులు దెచ్చి । తద్దయుఁ బఱచి యెంతయు నందునునిచి
పరువడి నుచిత సంభాషణంబులను । గరుణించి, యారాత్రిగడిపి వేగుటయు
నలవడఁ గొక్కెర యావిప్రుఁ జూచి । పలికె నిట్లనుచు "నో బ్రాహ్మణోత్తముఁడ!
వినుము మిత్రుండును వెస రజతమును । గనకము బుద్ధియు గరిమ నీనాల్గు
[3]రీతిఁ గల్గినను దారిద్ర్యంబు వాయు । నీతీరు సురగురుఁ డెఱుఁగంగఁ జెప్పె.
మెఱసి యిన్నిటికంటె మిత్రుండు ఘనుఁడు, । తిఱలక కాశ్యపతనయుఁడ నేను
మైత్రి సేయుచునఁట, మహిలో ననీవు । పాత్రంబుగావె! యపారసంపదకు.
రూఢి నానఘుఁడు విరూపాక్షుఁడనెడు । ప్రోడ మధువ్రజపుర మేలువాఁడు.
మునుమిడి యిచటికి మూఁడు యోజనము । లనయంబు నాపురి ; యచటికిఁ బోయి
యా దైత్యపతిఁ గాంచి యతనితోడుతను । మోదంబు రెట్టింప మున్నుగా నేను
అంపితి నని చెప్పు ; మతఁడు నీకిచ్చు । సొంపుతో నిఖిలవస్తువులుఁ గాంచనము."
అనిన నచ్చటికేఁగి యాదైత్యుఁ గాంచి । వినిపించుటయు విని వెసదైత్యవిభుఁడు

1. 'ప్రసాద పాత్రయగుచు.' అని యుండఁదగును. 2. చరిత. (పా) 3. ప్రీతిమానవుని.

నా విప్రవర్యుని నధముగా నెఱిఁగి । "[1] భావింప నాకేల, బకవర్యునకును
సఖుఁడైన యప్పుడే సత్పాత్రుఁ డయ్యె ; । సుఖలీల నితనికిచ్చుట మేలుధనము."
అని నిశ్చయము చేసి యన్నపానాదు । లనయంబు నాతని కటనమకూర్చి
పనివడి కార్త్తిక పౌర్ణిమనాఁడు । అనఘుఁడు విప్రసహస్రంబునకును
బసిఁడి పళ్లెరములఁ బాయసాన్నంబు । ననదృశగతిఁ బెట్టునప్పుడు సకల
నైమిత్తిక క్రియోన్నతి సదాచార । సామగ్రిగల విప్రసమితితోఁ గలిపి
సమధిక మహితపూజా సహితముగ । సమబుద్ధితోడ భోజన మొప్పఁ బెట్టి
కుడిచిన పళ్లెంబు గుఱుతైన మణులుఁ । గడు మోవఁదగినంత కనకంబు నిచ్చె.
ఇచ్చిన వేడ్కతో నిట మహీసురుఁడు । చెచ్చెర నవిగొని చేఁగి భారమున
మెడయును [2] మూపులు మిక్కిలి నొవ్వఁ । గను వేగఁ దెచ్చెఁ జక్కఁగ మఱ్ఱికడకు.
తెచ్చిన ముదమునఁ దేలి యబ్బకము । అచ్చుగా రెక్కల నతనికి విసరి
యలయిక దీర్చి యాహారంబు వెట్టి । చెలిమితో సుఖనిద్ర చెందినఁ, జూచి
సరవితో నా పాపజాతి విప్రుండు । పరఁగంగ రేపటి పయనంబునకును
ఆహారమును గాన కపుడు చింతించి । "యూహింపఁ గొక్కెరయొడలు క్రొవ్వినది
యీ మేనిమాంస మెంతేనియుఁ జాలు. । ఏమఱి నిద్రవోయినఁ జావనడఁచి
గరిమఁ గొంపోదును గా" కని తలఁచి । సరగున నొక్క కాష్ఠము కేలఁ బూని
యుండుండ మెడయును నతని శిరంబు । మందబుద్ధిని బెక్కుమాఱులు మొత్తి
చావుట తెలిసి యచ్చట నిక లెల్లఁ । బోవంగఁ బీకి యాబొందువు వ్రచ్చి
సొలపక మంచి సంజూఁడు వృచ్చి కట్టి । యలవడ వేఘనమైనను జనియె.
ఆసమయంబున నసురవల్లభుఁడు । వాసిగా నా మధువ్రజపురిలోనఁ
దటుకున మేల్కాంచి తనలోననియె: । "ఇట పొలపలచె నేఁడేమొకో యకట !
అదికాక యెడమకన్నదిరెడు ; మఱియుఁ । బడవడి యేకీడు ప్రాప్తమయ్యెడినో !"
అని తనవారితో నంతయుఁ జెప్పి । పౌనర వర్తింపఁగాఁ బ్రొద్దుజామెక్కె.
జామెక్కనంత రాక్షస చక్రవర్తి : । "ఏమొకో మత్సఖుఁడిట నేఁడు రాఁడు !
వెస గుణహీనత విప్రునియందు । మసలక కలదు నామది నెఱింగితిని.
ఏమి తలంచెనో యీ ధూర్తు తులువ ! । ఏమి కాఁగలవాఁడో యిట బకాధిపుఁడు ! '

1. 'ఇతఁడెట్టిఁడైననేమగు – నతనికి సఖుఁడట్టె బకమహత్తరసఖ్యం – బితనిం బాత్రముజేయుదె – యితనికిఁ దృప్తియగునట్టులిత్తుధనంబుల్' అనితిక్కన, శాం. 3 – 492. 2. వీపును.

అని తూర వగచి రయంబున నరయఁ । బనిచిన సేవకుల్ బలువిడిఁ బోయి
బకపతి డొక్క యేర్పడఁ గని వగచి । ప్రకటించి భూసురాగ్రణి చొప్పువట్టి
పాఱి వానిని గట్టి బలువడిఁ దెచ్చి । యా రాక్షసేంద్రున కది మొఱఁగింపఁ
"చెలఁగి కృతఘ్నునిఁ జేరంగఁ దేక । తెలియుంగఁ జంపి కొని దినుఁడు మీ" రనిన
దనుజనాథునిఁ జూచి దైత్యులిట్లనిరి: । "మనమారఁ బోకడ మాలిన వార
[1]మయ్యు నీపాపిదేహంబు తిననొల్ల । మెయ్యెడనైన దైత్యేంద్ర!" నావుడును
'వలనొప్ప మీయిచ్చవచ్చినరీతిఁ । జెలరేఁగి వేవేగ శిక్షింపుఁ' డనిన
వెస వార లప్పరి వెడలంగఁ దెచ్చి । కోసరక వెస [2]గొంతుగోయ నెత్తురులు
దొరుఁగంగఁ గుక్కలు దొడి దొడి వచ్చి । యురువడిఁ గబళింప నొల్లకపోయె.
ధరణీశ, వినుము కృతఘ్నుని తనువు । తిరముగాఁ గుక్కలుఁ దిన రోయునెపుడు"
అనిపల్కి మఱియు నిట్లనియె భీష్ముండు: । "అనఘాత్మ, దనుజేశుఁ డా బకనాథు
దేహంబు చూచి యెందే దుఃఖమంది । 'శ్రీహరీ!' యనియగ్నిఁ జేరిచి వచ్చి,
వలవింప నంతలో బలభేది వచ్చి । నిలిచినఁ గనుఁగొని "నిఖిలలోకేశ!
కులధరిత్రీధర క్షోభనంహర! । యోమితో నాసఖు నిచ్చి రక్షింపు."
అనుచుఁ బ్రార్థించిన నమరవల్లభుఁడు । పనివడి దైత్యుతోఁ బలికె నవ్వేళ,
'సరసిజాసనునకు సఖుఁడు నీసఖుఁడు; । వరమతి వానికై వగవంగ నేల?
అతఁడు నీసఖుఁడు నిత్యంబు రాఁగోరు; । ప్రతినతో నాతఁడు రాకున్న నిట్టి
తెఱఁగొనరించెను ధృతి వగపేల? । మఱి నీదునఖుఁడొట మహితాగ్ని యిచ్చి
తది మేలుగాదె పాయక తలంచినను. । అదనుగా వానికి నగ్నిసంస్కార
మును జేసి వచ్చిన, మురిగి నొక్క సురభి । తన క్షేపు గుడువ, వక్త్రంబు ఫేనంబు
నుడిగాలిఁ దూలి యాసాదపై నిండెను. । నగుకొని యంత దానను జేసి బకము
నంజీవితంబయి నరగున వచ్చు । నంజకు." మనిపల్కు నంతటి లోనఁ
జనుదెంచె బకము రాక్షస చక్రవర్తి । ఘనతర సంతోష కలితుఁడు గాఁగ.
అరయ వాసవుఁడంత నజుని వాక్యమునఁ । బరఁగ విప్రునిఁ బాశబద్ధుఁ గాఁ జేసె.
ఆకొక్కరయు మఱి యుత్తెఱంగెఱిఁగి । 'నాకుఁగా భూసురునకు దురవస్థ
వరగె నీ గతి' యని బలభేది యంత । వరముగా వేడి పావనలీల నపుడు
విడిపింపఁ, గనకంబు వెస మోచికొనుచుఁ । దడయక పోయెను; దదనంతరంబ

1. మయ్యుయౌ యితని. 2. గోఁతఁ ద్రోయ. అని. తిక్కన.

సురనాయకునకు పోయె సురలోకమునకు; । అరిగె బకాధిపుండాలయంబునకు."
అనుచు మిత్రద్రోహ నానాకృతఘ్నకథయు । నెనయంగ వినిపింప నెంతయుఁ బ్రీతి
విని ధర్మసూనుండు వేడుక పొంది । '[1]మనుపు భూజన పర మహితధర్మంబు
తెలుపవే!' యనవుడు దేవవ్రతుండు । అలఘుడ ధర్మజు కర్థి నిట్లనియె:

## భీష్ముఁడు ధర్మజునకు సర్వోత్తమంబగు ధర్మంబు సెప్పుట

" విను మెల్ల తెఱఁగున విస్తారమైన । ఘనతర ధర్మముల్ గల వందులోన
లాలితమోక్షావలంబినై మతులఁ । జాలిన ధర్మంబు జగతి నుత్తమము.
ఎలమి శోకనిందుల కితిహాస మొకటి । తెలియఁ జెప్పెదను ధాత్రీనాథ, వినుము.
అవనిలో సేనజిత్తను మహారాజు । అవిరళ పుత్రశోకార్తుఁడై యున్న
నెనఁగి తదాప్తుఁడయ్యైన విప్రవరుఁడు । మసలక చనుదెంచి మఱి వానికనియె:
" ఇదియేల శోకింతు వినకరతేజ! । వదలక పుట్టిన వారికి నెల్ల
మరణంబు విహితంబు; మాటి మాటికిని । బరువడి దుఃఖంపఁ బాడియే యకట!
కదియును గాష్ఠంబుఁ గాష్ఠంబు నదిని । అది కొంతతడవున కటఁ బాసిపోవు.
తలఁకొని యిట్లుదాఁ దలఁపంగ వలదె! । అలవడఁ బుత్ర మిత్రాదులు హితులు.
తనరంగఁ దనకును దానెర వనినఁ । బనివడి యెంతయు బంధులు సతమె!
పుడమిరాశ, సుఖదుఃఖములు [2]పొందునెపుడు; । తడయక దుఃఖము తగసుఖంబుగను
దఁబోయువలయును ధన్యులకెల్ల; । తలకొని విను పురాతన జన్మమందుఁ
బరఁగఁ జేసిన కర్మఫలములె యెట్టి । పురుషునినైనను బొందు నిక్కముగ
ధరణీతలేశ్వర, దానికి మందు । కర మొప్పఁగా ధైర్యగరిమయె సుమ్ము.
ఆశమానుట విను మత్యంతసుఖము, । వాసిగాఁ జెప్పెద వాని తెఱంగు.
అవనిలోఁ బింగళయను వేశ్య యొల్లి । తవిలి యెంతేనియుఁ దనకూర్చువాని
రాకకు నెదురు వారక చూచి చూచి । ప్రాకటంబుగ వాఁగు రాకుండుటయును
[3]విసుతియై " నేనిటు [4]వేదుఱ నగుచు । వెనుకొని వాని నీవేఁగుఱ పట్ట
జగురుగాఁ గందె! యాశారహితముగఁ । బరవడి విహరింపఁ బరఁగు సౌఖ్యములు.
పమ్మిన యొంటి కంబమ్మున నొప్పు । తొమ్మిది వాకిళ్లు తోడఁబడ మూసి
నిదురవోదును గాక నిజముగా నేను । వదలక పొంతకు వచ్చినవాని

---

1. మనువొప్పనను. 2. చాల. 3. విసుతియై. 4. వెఱక వేకువను.

నరసంబుతోఁ బంచశరునిగాఁ గొనుచు । నొరునిఁ గాంక్షింపక యూఱడిల్లెదను.
ఎలమి నిరాశయే యింద్రియములకు । సలలితంబై కట్టి సౌఖ్యంబునిచ్చు."
అని పల్కి నిద్రించె నని చెప్పుటయును । విని సేనజిత్తును విమలాత్ముఁ డయ్యె.
పరఁగ నీవట్టి తాత్పర్యంబు పూని । దొరకొన్న శాంతిఁ బొందుము ధర్మతనయ!"
అనవుడు ధర్మరాజావగాతనయుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
"అనఘాత్మ, ధరణిలో నర్థవంతులును । ఘనత నిర్ధనులును గలిగియుందురు.
వరబుద్ధి లెక్కింప వారలలోన । నరయంగ సుఖులెవ్వ? రట దుఃఖులెవరు?
వినిపింపు." మనుటయు వినిపింపఁ దొడఁగె : । "అంఘాత్మ, వినుము శమ్యాకుండనంగఁ
బరఁగును ధరనొక్క బ్రాహ్మణోత్తముఁడు. । పరున సంసారంబు పదలంగ విడిచి
[1] చెలువమయ్యెన కూడు సీరకు నవసి । కలయంగఁ దొల్లి నారదకు నేతెంచి
సలలిత గోష్ఠి ప్రసంగంబునందుఁ । బలికిన వాక్యముల్ ప్రకటింతు వినుము.
ధనముకల్మియులేమిఁ ద్రాసునఁ బెట్టి । యొనయఁ దూఁచిన [2] లేమి యెక్కుడై మించె
అది యెట్టులన్నఁ బాయక వివరింతు । వదపడి ధనము నేర్పడఁ గలవాఁడు
తఱలక మృత్యువదనమున నున్న । తెఱఁగున భయము మదిని బిక్కటిల్ల
మును శిఖచోరాది ముఖ్యాపదలకు । నొనరంగ [3] నల్లల నుడుకుచు నుండు.
కోపము లోభము గొనకొని మిగులఁ । దాపము నొందింప ధనికుండు దిరుగు.
సొలవకయధనుఁ డెన్నో నైననుండు । వెలయంగ నేవేళ వెఱపేమిలేక."
అనవుడు "హేమతృష్ణాభిభూతుండు । అనఘ, యేమిట సుఖియగు?" నన్న నసియె:

## మంకి యను బ్రాహ్మణుని చరిత్రము

"మంకినాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛఁ । గొంకక వర్తించి కోడెల రెంటిఁ
గొని లంకె వెట్టినఁ, గొనకొని యవియు । నొనరంగఁ బడియున్న యుష్ట్రంబుమీఁదఁ
బాఱిన, నదిలేచి పఱవంగ, నుభయ । పార్శ్వముల నురి బంధించినట్లు
వ్రేలి చచ్చినఁ జూచి విప్రుండు వగచి । యాలోనఁ గామంబు నంతయు విడిచి
దేవసముండయి ధృతి మించె." ననిన । దేవవ్రతునిఁ జూచి తెఱఁగొప్పఁబలికె :
"యాడిగా నేమిట నూపగు పురుషుఁ । డొడక చేటొందు? నొగిఁజెప్పు." మనిన

---

1. చెలువమైనా. 2. లేమిడెక్కుడై. 3. నల్లన.

## శ్రీ శక్ర సంవాద ప్రకారము

అతిభక్తి నివ్విషయంబున కొఱకు । యితిహాస మెఱిఁగింతు నేర్పడ వినుము:
"నారదుఁ డొకనాఁడు నాకదీర్ఘికకు । నారూఢిఁ బోవంగ నమరవల్లభుఁడు
నచటఁ గృతస్నానుఁడై యున్నఁ జూచి । యచలిత మతి మాటలాడుచునున్న
తఱి, విమానముమీఁద ధవలాక్షి యొకతె । యఱిముఱి నేతెంచి యచ్చోటడిగ్గి
యురయ దేవేంద్రున కభిముఖ యగుచుఁ । గరములు మొగిచిన, గారవంబునను
"ఎవ్వర బ్జానన, యెందుఁ బోయెదవు? । మవ్వంపు భక్తితో మాకెఱిఁగింపు."
అనవుడు నద్దేవి యాదరంబునను । అనిమిషేశ్వరుఁ జూచి యనువొప్పఁబలికె:
"అరుదుగా శ్రీయన నట లక్ష్మియనఁగ । నరయంగ నా భూతి యన వెలుంగుదును.
స్వాహాస్వధా మతి శ్రద్ధాదులందు । నూహింప దనుజుల నొగిమెచ్చి వారి
కడనుండి, మెచ్చక కడఁగి నీయెడకుఁ । దడయక వచ్చితిఁ దగనిప్పు" డనిన
అమరనాయకుఁడును నక్కాంతఁ జూచి । "క్రమమొప్ప నేమికారణమున మెచ్చి?
లేమి కతంబున నిట మెచ్చవైతి? । వేమాఱు నెఱిఁగింపవే?" యన్ననియె:
"అవని వేదాధ్యయనాది గుణములఁ । బ్రవిమలులై యున్నఁ, భక్తిఁ గైకొంటి;
విరివి మీఱఁగ వాని విడిచిగర్వమునఁ । బరఁగిన వారినేర్పడ విడిచితిని.
రాసిగా సత్యధర్మపరుండవగుటఁ । జేసి నీపాల వసింప వచ్చితిని."
అని చెప్పి మఱియు నిట్లనియె నమ్మగువ: । "వనివడి గురుజన భక్తినిరతులు
పొలుపొంద సురపితృపూజన పరులు । చెలిమి గల్గిన దానశీలు రుత్తములు
పరసతీ పరధన పర పరాఙ్ముఖులు । ధరణీసురప్రియుల్ ధర్మవర్తనులు
ఒగి దివానిద్రాభియుక్తులు గాక । నెగడిన వారలు, నిర్మలాత్మకులుఁ
దెలియ దుర్బల వృద్ధ దీనరక్షకులు । వలనొప్ప నామెచ్చువారలు వినుము.
పొసఁగఁ గామక్రోధములు చాలఁగలిగి । తనుకులఁ బోవుచు ధర్మంబు వదలి
బలి భిక్ష యిడక యేర్పడనుండువారు । నలిమీఱ నెంతయు నామెచ్చుగారు;
అదిగాన నిలిచెద." ననునంతలోన । వదలక పూవుల వానలు గురిసె;
దొరకొని గీర్వాణ దుందుభుల్ మ్రోసె; । ఇరవొప్ప సిరివరియింప నింద్రుండు
పరువడి సురనేత్రపర్వమై పొలిచి । తిరమొప్ప నమరావతీపురి కరిగె.
ఈ యితిహాసంబు నెవ్వరు వినినఁ । బాయక చదివినఁ బరఁగు సంపదలు."
అనిచెప్పి సాంఖ్యయోగాదులు మఱియు । మనమొప్ప నిఖిలధర్మంబులు ప్రకృతి

గుణములు నెఱిఁగించి, [1]కోరి వృత్రుండు । గణుతించి విజ్ఞానకలితుఁడై హరినిఁ
దడయక పొందె నెంతయు" ననిచెప్పఁ । గడఁకతో ననియె: "నాఖండలు డతఁడు
నేరీతిఁబోరిరి ? యెఱిఁగింపు." మనిన । నారూఢ విస్ఫూర్తి నతని కిట్లనియె:

## ఇంద్ర వృత్రాసురుల యుద్ధప్రకారము

"ఇంద్రుఁ డుజ్జ్వలరథ మెక్కి యెంతయును । సాంద్రంబుగా దేవసహితుఁడై పోయి
వృత్రుపైఁ దొడఁగిన వేగంబె యతఁడు । ధాత్రీశ, కోపించి దనుజ సైన్యంబు
గూని తాఁకె ; నప్పు డక్కులశైలభేది । కనుఁగొని వడఁకినఁ గడఁగి దానవుఁడు
తనమాయచేత నాతని మూర్ఛవుచ్చె. । ఘనతమీఱఁగ నంతఁ గని వశిష్ఠుండు
ప్రతినతో నా సురపతి మూర్ఛఁ దేర్చి । యతనితో నిట్లను: "నజుఁడును హరియు
హరుఁడు యుద్ధముఁజూడ నరుదెంచినారు. । తరమిడి కడఁగు ముద్ధతితోడ" ననిన,
సురపతి కడఁగె నచ్చో దేవగురుఁడు । ధర నమ్మునీంద్రులుఁ దాను దేవేంద్రు
విజయంబు గోరి భావించి విశ్వేశు । నజుని నవ్యయు సచ్చిదానందమూర్తిఁ
బ్రార్థన సేయ నప్పరమేశు తేజ । మర్థి జ్వరంబయి యా దైత్యవరునిఁ
బొదివె; దంభోళినిఁ బొందె విష్ణుండు. । మదనారి యత్తఱి మఘువు కిట్లనియె:
"అఱువదివేలు దివ్యాబ్దముల్ వీఁడు । తెఱలక యతిఘోర తప మొనరింప
నరవిందభవుఁ డిచ్చె నధిక సత్వంబు. । తిర మొప్ప నదియు నా తేజంబుచేత
నడుగును వేగ మో యనిమిషనాథ! । కడఁగుము నీ" వన్నఁ గడఁక నావజ్రి
శతకోటివైచి రాక్షసచక్రవర్తి । క్షితిమీఁదఁ గూల్చె నచ్చెరువుగా నంత.
సురదుందుభులు మ్రోసె సురలార్చి రంత । హరిహరులును గూని [2]యాడి రావేళ.
అమరనాథుఁడు వృత్రహననంబు చేసి । ప్రమదంబుతో దేవపటలంబుఁ దాను
నమరావతికి వచ్చె; నంతటిలోన । నమరంగ నాబ్రహ్మహత్య దేవేంద్రుఁ
గ్రమమొప్పఁ బట్టినఁ గంది యావజ్రి । కమలజుకడ కేఁగి కరములు మొగిచి
"విమలాత్మ, యిటఁ బాపవే దీని ననిన । ... ... ... ... ...
నాతఁడుఁ దొలఁగింప ననువు చింతించి । యాతఱి జలముల నగ్నిని సతుల
వెనుకొని యోషధీ వృక్షతృణముల । వినుతింపఁ దలఁచి రావించి యిట్లనియె:

---

1. ఇక్కడ శాంతగ్రంథపాతమై యుండును. చూ. వృత్రగీతలు. తిక్కన శాంతిపర్వము. 2. యాడిరి చెలఁగి.

"పరఁగ నింద్రునకును బాటిల్లి నట్టి । దురితంబు మీరు చతుర్భాగములుగఁ
బంచికొనుం" డని పలికిన, నవియు । నెంచఁగా "మీపంపు నేను సేసెదము;
ఎనయంగ నిష్కృతి యెట్టిది దాని । మునుకొని నీచిత్తమునఁ జూడవలదె?"
అనవుడు పద్మజుఁ డంత నిట్లనియె: । "వని నీవు ప్రజ్వలింపక హవిరాది
కములు సేసెడునట్టి కలుషాత్ములందుఁ । బ్రమదంబుతో మిమ్ముఁ బర్వకాలములఁ
జెలరేఁగి భేదన చ్ఛేదన కృత్య । ములు సేయు చుండెడు మూఢులయందు,
నలరి రజస్వలలతో మిమ్ముఁబట్టి । చెలఁగి సంగముచేసెడి వానియందు,
మలమూత్రములును శ్లేష్మంబు మీలోనఁ । జలమున విడిచిన చపలునియందు,
నలమి మీకటనున్న యాబ్రహ్మహత్య । ఘనముగాఁ బ్రాపింపఁ గల" దని చెప్పి
యనిచిన నా బ్రహ్మహత్య ధరించి । యనలాదు లుండిన, నాఖండలుండు
పరఁగ నా ధాతృకృపావిశేషమున । దురితంబు వాసి సంతోషంబుతోడఁ
దడయక యశ్వమేధముచేసి రాజ్య । మెడలని సుఖమున నేలుచునుండె.
వలనొప్ప నీవు నవ్యాసవు రీతిఁ । గలితాత్ముఁడవు గమ్ము కౌరవనాథ!
పర్వంబులందు సద్భక్తి దీపింప । దుర్వార కిల్బిషస్తోమంబు నణఁచు
నీ యింద్రుకథ యెవ్వఁ డెలమిఁ బఠించు । నాయుత్తమోత్తముఁ డఘములఁ బాయు."
అనిన గాంగేయున కనియె ధర్మజుఁడు: । "అనఘాత్మ, జ్వరముచే నావృత్రుఁడిట్లు
పొదువంగఁ బడెనని పొందుగా వింటి; । అదియెట్లు జన్మించె? నా ప్రకారంబు
విదితంబుగాఁ జెప్పవే! నాకు" ననిన । పదపడి యిట్లనిపలికె భీష్ముండు:

## శివజ్వరోద్భవ ప్రకారము

"కైలాసమున రత్న కలితపీఠమున । నీలలోహితుఁడు సన్నిహితయై గిరిజ
యుండంగ నట గొలువున్న యావేళ । దండిగా దేవర్షితతి పోవఁ జూచి
పార్వతి పలికెను: "భర్గ, యుగ్రాక్ష, । శర్వ, భూతేశ్వర, చంద్రకలాప,
పనివడి వీ రేమి పనికి నెచ్చటికి । నరిగెద?" రనిన నా యభవుఁ డిట్లనియె:
"చెలిమితో దక్షుండు సేయుయాగమునఁ । బలుతెఱంగుల హవిర్భాగముల్ గొనఁగ
నరిగెద" రనిన శైలాత్మజపలికె: । "పురహర, నీవేల పోవవు చెపుమ?"
యనిన పార్వతిఁ జూచి యాశంకరుండు । పనివడి భాగకల్పన లేమి నతఁడు
పిలువఁ డేనును బోవ బింబోష్ఠి," యనినఁ । దలకొని పార్వతి తమతండ్రిమీఁద

నెలకొన్న కోపంబు నిగుడంగ, మగువ । తలఁపెల్ల నెఱిఁగి యెంతయు శంకరుండు
ప్రమథసంఘముఁ దానుఁ బాయక యఱిగి । క్రమ మొప్ప నంత నాక్రతువెల్లఁ జెఱుప,
నగణిత మృగరూపమై యధ్వరంబు । గగనంబు కరుగంగఁ గని యీశ్వరుండు
కోపింప నుదుట గ్రక్కున ఘర్మజలము । దీపించె; నందుల దీర్ఘదేహుండు
[ నరుణనేత్రుండు నూర్ధ్వాయతరోముఁ । డతి ఘోరుఁ డుదయించె నట నొక్కరుండు.]
ఈ రీతిఁ బుట్టిన నిట సురల్ మునులుఁ । బాఱంగఁగని యంత బ్రహ్మ యేతెంచి
యీశ్వరుఁ గని మ్రొక్కి "యిభచర్మవసన, । శాశ్వత సంపూర్ణ, సచ్చిదానంద,
పనివడి యమరులు భాగకల్పనము । నొనరింతు రీకోపముపసంహరింపు."
నావుడు నల్లన నగుచు శంకరుఁడు । దేవర్షిగణముల ధృతిని మన్నించె.
అంత శతానందుఁ డభవునిఁ జూచి । యెంతయుఁ భక్తితో నిట్లని పలికె:
"పురణింప నీ ఫాలమునఁ బుట్టినట్టి । పురుషుండు జ్వరనామమున మీఱుఁగాక.
పొనగ నీ జ్వర మేకముఖమున మించి । వసుధకు ధరియింప వశము గాకుండ
[1]సృజియింపవే" యన నిందుశేఖరుఁడు । అజునిఁ గనుంగొని యట్ల కాకనుచు
రమణ నేన్గులకు శిరస్తాపనంబు, । ప్రమదాశ్వములకును బార్శ్వరోగంబు,
నొనర బర్హులకుఁ బత్రోద్ఛేదనంబు, । నెనయఁ జిల్కలకును హిక్కయు, మఱియుఁ
దగ నావులకు ఖురాంతర్బాధనంబు, । మొగి నంత శార్దూలములకు శ్రమంబు,
ధర నజంబులకుఁ జిత్తభ్రమణంబు, । [2]నరులకు జనిమరణముల వేదనయుఁ
గా విభాగించె శంకరుఁడు [3]వేర్వేఱ; । కావున జ్వరము శంకరుని తేజంబు;
మాననీయంబు నమస్కార్య మఖిల । మానవులకును భూమండలంబునను.
నరవి నీ జ్వర కథ చదివిన వినినఁ । బురుషుఁ డారోగ్యంబు పొందు భూనాథ!"
అనినఁ బ్రియంబంది యాధర్మజుండు । వినుతింప పద్ధర్మ విద్వేషులైన
యసురులకును మంత్రియైయుండు నుశను। కెనఁగ శుక్రత్వమహిమ యెట్లు గలిగె."

## భార్గవునకు శుక్రనామంబు గలిగిన విధము

అనవుడు గాంగేయుఁ డవ్వు డిట్లనియె: । "పనివడి కవి యోగబలము పెంపునను
నుసలక నరవాహనుని మోసపుచ్చి । పసగల యతని యుపాత్తధనంబు
కొన్నఁ జింతించి గ్రక్కున నత్తెఱంగు । సన్నుతి నురగభూషణు కెఱిఁగింపఁ

---

1. 'బహువిధంబుగా' అని యుండవలెను. 2. నరులకు నెడనెడ నరివేదయును. 3. భూనాథ.

గోపించి శూలంబు గొనిన నంతటను । ఏపార దూరంబు కేఁగి భార్గవుఁడు
నెలకొన్న భయమున నిలువంగలేక । తలఁకున మిక్కిలి తల్లడంబునను
అనయంబు భూతేశుహస్తంబు గదియఁ । గని మ్రింగి యాతండు కడుపులో నుండి
పటురీతి వెడలంగఁ బొఱలకయుండు । నటులుగాఁ దెరువుల నన్నిటి మూసి
శిశినంబు చూపి 'చెచ్చెఱ నిందు వెడలు । వశముగా' ననిపల్క వరుస భార్గవుఁడు
ఒనరంగ నాతెరువున వెడలంగఁ, । గనుఁగొని కోపించు కఱకంఠుఁ జూచి
శర్వాణి యిట్లను: "సర్వేశ, యీశ, । పార్వణ శశధర ప్రాలేయ హార
శారదా గోక్షీర చందన ఫేన । శారదనీరద స్వచ్ఛ శరీర,
నరవి నీ కడుపున జన్మించె నితఁడు । గురురీతి నాకును గొడుకయ్యె నిపుడు.
అలుగంగఁ దగునె! పాయక దయఁజూడు. । మలహార, నామాట మన్నింపు" మనిన
అంగీకరించి యా యంగజహరుఁడు । "అంగన, నాశిశ్నమందున వెడలె
నదిగాన నీక శుక్రుఁడను పేరఁ బరఁగు, । విదితంబుగా." నన్న వెన శుక్రుఁడయ్యె.
అని శుక్రుచరితంబు నా శుక్రుజన్మ । మును ధర్మసూక్ష్మముల్ పురుషవర్తనము
లెనయంగ ధర్మజు కెఱిఁగించె ననుచు । జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె ననిచెప్ప వెండియు మునులు । [1] వెనుకొని సూతుని వినుతించి యపుడు
అనఘాత్మ, తరువాత నైనవృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు,
[2] వారిజనాభ, శ్రీవనితాసనాథ, । గౌరీశ వినుత, లోకఖ్యాత చరిత,
పాపభంజన, దేవ, భావనాతీత, । గోపికావల్లభ, గోపాలబాల,
నరకాసురాంతక, నాగేంద్రవరద, । మురహర, నగధర, పుండరీకాక్ష,
అణురూప, ఘనరూప, యాద్యంతరహిత, । మణివక్ష, కేశవ, మధుదైత్య హరణ,
ఘనమౌని హృద్గేహకలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన మూర్తి, । ముక్తిప్రదాయక మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పద పద్మమకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమనసుకవీంద్రవర్య
రచితమై శాంతి పర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె నాలవది.
ఈశాంతి పర్వంబు నేపు దీపించి । ధీశక్తి విన్నఁ జదివిన వ్రాసినను

1. ఈ పాఠము ఓరియంటల్ ప్రతిలో లేదు. 2. ఘనతరసంతోషకలితాత్ములైరి.

గంగలోపలఁ గోటికపిలధేనువుల । నంగజ జనకున [1] కర్పితంబుగను,
వేదపారగులైన [2] విప్రపుంగవుల । కాదరంబున నిచ్చినట్టి సత్ఫలము,
పావఁగ సాలగ్రామములు నూఱుకోట్లు । వసుమతీసురల కుర్వర నిచ్చుఫలము
ఆయురారోగ్యంబులఖిలసంపదలు । వేయుభంగులఁ గల్గి వెలయుచుండుదురు.[3]

1. కర్పితంబగుచు. 2. ద్విజవర్యులకును. 3. ఇమ్మహాభారతంబే కాతుకరంబు – నెమ్మితో వినిన యా నిర్మలాత్మకులు.

# ప్రథమాశ్వాసము

శ్రీ గరుడాద్రీశ, సృష్టిప్రకాశ, । ఆగమవినుత, శ్రీ హరి, వాసుదేవ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె :
తెలివిగా నాఁటి దేవవ్రతుండు । వెలయంగ నెంతయు వివిధధర్మములు
వినిపింప వేడుక విని ధర్మసుతుఁడు । పనివడి మఱియును బ్రణమిల్లి పలికె :
" తాత, నీచెప్పిన ధర్మంబులెల్ల । నీకతి వినియు నాహృదయంబు మిగులఁ
దాపంబునొందె; శాంతంబేమిలేదు; । చేపట్టి యేనేమిసేయుదు నింక?
మతికెక్కు దుర్యోధనుఁడు క్రూరుఁడైన । నతనికే నిఖిలరాజ్యంబిచ్చి తొలఁగి
నిలువంగ లేనైతి నెట్టి గాననమున । ... ... ... .. ...
కడఁగి మాయిద్దఱికతమున నింత । పుడమిలోపలఁబుట్టె; పొక్కెదనేను.

## గౌతమీలుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము

అనవుడు భీష్ముఁడిట్లనియె నాతనికి : । " మనుజేశ, విను చంప మనుజుండు కర్త
గాఁ; డీశ్వరుని నియోగంబున మేలు । కీడును బ్రాపించు క్షితి జనులకును.
ఇతిహాసమొక్కటి యిందుకు వినుము । ప్రతిగాఁగఁ జెప్పెదఁ బార్థివోత్తంస!
భూమి గౌతమియను భూసురభామ । యామహిఁ బాముచే నటఁ దనసుతుఁడు
మృతుఁడైన నగచుచు మిక్కిలి నేడ్వఁ । బ్రతిలేని మేటికిరాతుఁ డొక్కరుఁడు
పొలవక పాము రజ్జునఁ గట్టి తెచ్చి । యొలనాగకును జూపి ' యీపాము రెండు
తునుకలు సేతునో! తొడరి నూఱుదునో!' । యనవుడు, గౌతమి యతని కిట్లనియె :
" వెనుకొని యెంతయు విధివశంబునను । జొనిపె నీకీడు; ఇచ్చోఁ బాముఁ జంపఁ
బరఁగ నా పుత్రుండు బ్రతుకునే! విడువు । మరయంగ నీపాము " అనిన వాఁడనియె :
"మదిరాక్షి, యీపేదమాటల నాదు । మదినున్న కోపంబు మానునే యకట!
కావునఁ జంపెదఁ గాక యీపామును । బోవంగ విడువనో పూఁబోఁడి! " యనిన
' పరవితో నేను హింసకు నొడంబడను । ధరణిలో ' ననిన ' బాధకపు జంతువుల
వధియింపఁ బాపంబు వరుస లేదనుచు । బుధులు చెప్పుదు ' రని బోయ పల్కినను

భామినీమణి పల్కెఁ: "బట్టినరిపుని । భూమిపైఁ జంపంగఁబోలదు విడువు"
మనవు డిట్లనియె: "వృత్రాసురుఁబట్టి । యెనయంగ నట చంపఁడే! దేవవిభుఁడు.
యాగంబు చేయుపఁడే యనమలోచనుఁడు? । ధీగతి నట్లుగాదే ధర్మహింస;
నెఱయంగ నీవు దీనిని నియ్యకొనుము, । తెఱలక" యనిన నత్తరళాయతాక్షి
స్రుక్కి పాపమునకుఁ జొరకున్నఁజూచి । యక్కడ బోయ కిట్లనియె నాపాము:
"ధరణిలో నేనేమి తప్పుచేసితిని? । కరమరుదారంగఁ గానవు నీవు;
అలవడ మృత్యువరాధీనమగుచుఁ । గలగొని బాలునిఁ గఱచితిఁగాని
యనయంబు రోషకామాదులు లేవు." । అనవుడు పాముకిట్లనియె నాబోయ:
"సరవి మృత్యువునకు సాధనంబగుటఁ । దరమిడి నిన్నును దండింపవలయు."
ననినఁ, [1] గుమ్మరి సారెనటకోలపోలి । తనిశంబు నావశంబగునె యోలుబ్ధ?
అనవుడు మఱియు నిట్లనియె లుబ్ధకుఁడు: । "ఎనయంగ నెంతయు నేయువాఁడుండ
నమ్మేమి నేయు నటం చుడుగుదురె! । ఇమ్మహి నిన్నును నెవ్వరేఁ బంపఁ
గఱుతుగా కేమి? యుత్కంఠతో నిన్ను । నెఱిఁగి కోపింపంగ నిందయురాదు.
[అల మృత్యువునకు మీ రరయంగ బుద్ధి । గల సాధనంబులు గారొకో! మిమ్ము
ననుమానముడిగి గీటడఁగింపవలయు]." । అనిన భుజంగ మిట్లనియె బోయకును:
"విమలంబుగాఁగ ఋత్విజులు హావిస్సు । లమరంగ వ్రేల్చిన నధ్వరకర్త
ఘనత నాఫలమును గాంచునుగాక । యెనయంగ వారికి నే" మన నపుడు
మృత్యువు చనుదెంచి మెఱసి యాపాము । నత్యంత భక్తితో నంతనిట్లనియె:
"ఎటువలె నిన్నును నేఁగోర పనిచి । తటుల వైవస్వంతుఁ డట నన్ను బనిచె.
ఎనయ నీచావున కీవును నేను । ఘనహేతువులు గాము కాలుండుగాని.
తగ శశి పావక ధరణి సమీర । గగన జలాది సంకలిత వస్తువులు
నలవడఁ గాలుని యఱచేతి వనినఁ । జెలఁగి తక్కినవానిఁ జెప్పఁగనేల?"
అనుచు మృత్యువుపల్క నప్పాము బోయఁ । గనుఁగొని పలికె నంగము పులకింప:
"మహిలోన మృత్యువు మాటలు వింటె! । తహతహపడ నాదు తప్పేమిలేదు?
కడఁగి నాపై నంటఁగట్టంగఁ దగునె! । విడువుము నీ" వన్న వెనబోయ యనియె:
"నీవును మృత్యువు నెఱి పాపమతులు; । కావున వెఱతు నేఁ గడఁకతో మీకు;
కేవతో నొరఁగనాడినఁ దప్పులేదె! । యీవిధి?" ననుపల్క నింతటిలోన

1. నేను కుమ్మరిసారె కోలయుఁబోలె నుందును. ఈక్రియ నావశమగునె! అని, టిక్కన.

నరవిఁ గాలుఁడు ధర్మసంశయంబునుప । నరుదెంచి బోయతో నప్పా డిట్లనియె :
"పాముస మృత్యువుఁ బరఁగంగ నేను । గాము యీమృతికిని గారణంబర్థి.
(అరయఁ బూర్వభవంబునం దేమిచేసె) । మెఱసి యాకర్మమే మృతిని బొందించె.
మనుజున కతని కర్మంబొనరించు । జననంబు మరణంబు సౌఖ్యదుఃఖములు
వావిరి నదిగాన నీవాద ముడుగుఁ । డేవిధంబునసైన నిపుడు మీ." రనిన
వినుతింపఁ బాముసు విడిచె లుబ్ధకుఁడు; । చనియె మృత్యువుఁ గూడి శమనుండు ప్రీతి.
అదిగాన దుర్యోధనాదుల నీవు । కదనభూమిని జంపఁ గర్తవు గావు.
వారును దమతమ వరకర్మ నమితి । కారణంబున నైరి కడఁకతో నట్లు.
అనఘ, యీ యితిహాసమాత్మలో నిలిపి । యనయంబు సుఖివి గమ్మనిన నిట్లనియె :

## అగ్ని సుదర్శన యను కన్యను బరిణయ మాడుట

"మహిని గృహస్థ ధర్మంబున నరుఁడు । మహనీయ, చరియించి మఱి మృత్యుజనిత
భరిత భయంబును బాపికొనంగ । నరవిమైఁ జాలునో? చాలఁడో?" యనిన
నెనయంగ దీనికి నితిహాస మొకటి । వినిపింతు నెంతయు వినుము రాజేంద్ర!
మనువంశమునఁ బుట్టి మనుజులు దన్ను । గొనియాడ నూప సద్గుణ కలాపముల
నుతికెక్కు దుర్యోధనుండను రాజు. । అతని చక్కఁదనంబు నాత్మలో మెచ్చి
మగువ యా నర్మద మఱి వానిఁ బొందె. । అగణితవిస్ఫూర్తి నంత నిర్వురకు
నెస సుదర్శనయను వెలఁది జన్మింప । ననవృశగతిఁ బెంచి యగ్నిహోత్రంబు
పరిచర్యలకుఁ బంచెఁ బార్థివోత్తముఁడు. । వరువడిఁ బనిచిన భామినీమణియు
నయ్యగ్ని భక్తితో నర్చించునపుడు । తొయ్యలి ముఖకాంతి తొరంపుఁ జురుకు
సొంపైన నుదురును జూపు పల్వరున । పెంపైన చెక్కులు బింబోష్ఠరుచులు
మెడయు హస్తంబులు మేల్మి చన్గవయుఁ । గడు నొప్పు నూగారు గంభీరనాభి
కటి యూరుదేశముల్ కలిత జంఘలును । బటువైన మడమలుఁ బాదపద్మములుఁ
గనుఁగొని మోహాంధకారుఁడై వహ్ని । మునుకొని యేకాంతమున ని ట్లనియె :
"అంగన, నీకుఁగా నంగజుచేత భంగ । మొందితి నన్ను బాలింపు వేడ్క."
ననిన సుదర్శన యనలు కిట్లనియె : । "అనఘాత్మ, మాతండ్రి నను గు నీకిచ్చు"
ననవుడు పాతవహుఁ డట్లకా కనుచు । ననుమతిచేసె; నాయవసరంబునను
ఆ నరనాయకుఁ డధ్వరంబొకటి । మానుగాఁ జేయంగ మఱి సమకట్టి

భూసురావలికిని బూజ లొనర్చ । నానసుయంబున నగ్ని యెంతయును
విప్రుఁడై చనుదెంచి విభున కిట్లనియె : । "సుప్రసన్నత నీదుసుత నాకునిమ్ము;
రూపింప దాన స్వరూపంబు గాఁగ । నో పార్థివేశ్వర, యొప్పుగా" ననిన
"అన్యవర్ణుఁడు దీనిఁ డగని నీతనికిఁ । గన్యకామణిని నేగతి నిత్తు" ననుచుఁ
గపటాత్ముఁడైనను, గని వీతిహోత్రుఁ । డప్పుడు భూవల్లభు యాగంబునందుఁ
దనమూర్తి దాఁచినఁ దలఁకి యారాజు । తనదు ఋత్విజులును దాను బ్రార్థింపఁ
దన తెఱంగా యగ్ని ధరణి దేవతల । కినయాగము నెఱిఁగింప నవనీశ్వరునకు
వెలయంగ వార లావిధము చెప్పినను । అలవడ తుష్టాత్ముఁడై మహీవిభుఁడు
మనమొప్పి కన్యకామణిఁ బెండ్లిసేయగ, । ననలుండు బ్రాహ్మణుండై వరియించి
సంతోషచిత్తుఁడై సకల హవ్యములు । సంతయుఁ గైకొని యాగంబు వెలయఁ
జేయించి వేడ్క నచ్చేడియతోడఁ । గాయజు కేళిని గలసి వర్తింప,
ధృతి సుదర్శన నామధేయుండు పుట్టి । క్షితియెల్లఁ బాలించెఁ జెలిమితోడుతను
ఒనరంగ నతనికి నోఘవంతుండు । తనయుఁడై ప్రభవించె; ధరణి నాతనికిఁ
దొరఁకొని యోఘరథుఁడు నోఘవతియుఁ । గర మొప్పఁ బుట్టినఁ గని మహీవిభుఁడు
వరమతి నయ్యోఘవతికిని బగుసి । నరసి సుదర్శనుఁ డను నగ్నిజాతకు
నాలిగా నిచ్చిన, నాసుదర్శనుఁడు । నాలోన వేడ్క గృహస్థధర్మమునఁ
గృతమతి మృత్యువు గెలిచెద ననుచు । సతివంతోడుతఁ గూడి యా కురుక్షేత్ర
మున కేఁగి యందుండి మొగిఁ బర్ణశాల । యొనరించి ప్రీతితో నువిద కిట్లనియె :
"పొలఁతిరో! యతిథులఁ బూజించు వేడ్క । గలదు నాకును నీవుఁ గడఁకతో నట్లు
సేయుమ యేమన్నఁ జెలఁగి లేకున్నఁ । బాయని ప్రీతితో భామాలలామ!

## సుదర్శను నింటికి ధర్మదేవత యతిథియై వచ్చుట

వలనొప్ప నతిథుల వాంఛితంబర్థి । నలరఁగఁ గలిగెడు నటులను జేయు.
నిను గోరెనేనియు నెమ్మనంబునను । బనివడి కింకిరిపడక క్రీడింపు.
పరువడి నతిథినుపాంగ నెక్కొనఁ । దరుణులకును జేయ ధర్మ మెంతయును."
అని యాఁడిచెప్పి పాయక యొక్కనాఁడు । ఎనయ సుదర్శనుం డిధ్మంబులకును
అడవికిఁ బోయిన, నతిథి యొక్కరుఁడు । తనయాక యేతేరఁ దగ నోఘవతియు
వెనకొని యర్ఘ్యాదివిధులఁ బూజింపఁ । గనుఁగొని యిట్లనుఁ "గామాతురుండ

నాతి, నాకోర్కి ప్రియంబునఁ జేయు । మాతతగతి." నన్న నప్పతివ్రతయుఁ
దన పతివాక్యముల్ దలపోయుఁ, గొంకు, । మనమున వెఱచు, నీమాడ్కి నాయింతి
మనలి యాందోళిత మానస యగుచు । వెస భర్త చెప్పిన విమలధర్మంబు
నకుఁ జోరనూర్కొన్న, నాతినిఁ జూచి । యకలంకచిత్తుఁడై యాబ్రాహ్మణుండు
కనుమఱుఁగున నకుఁ జక్కఁగఁ గొనిపోయె; । ఎనయ నత్తఱి వచ్చి యిట సుదర్శనుఁడు
పలుమాఱు పిలిచి యాపడఁతి ‘ యో ’ యనుట । వలనొప్ప లేకున్న వహ్నిసూనుండు
అతుల చింతాక్రాంతుఁడై విచారింప । నతని నుద్దేశించి యతిథి యిట్లనియె:
" అనఘాత్మ, యతిప నా కాతిథ్య మిప్పు । డొనరించుచున్నది; యుగ్మలి నీవు
కినియకుమయ్య మిక్కిలి ధర్మగతివి" । అనవుడు హర్షించి యా సుదర్శనుఁడు
" అనఘ, నీకితమున నటమోద మగ్న । జనుల చిత్తుఁడనైతి జగతిలోపలను.
ఇందుకు సాక్షు లీయిలయును నభము । చందురుండును రవి జలముఁ బావకుఁడు
వాయువు దేవతావలి" యన్న యపుడు । పాయక యాకాశవాణి భాషించె.
అప్పు డయ్యతిథి ప్రత్యక్షమై నిలిచి । "తప్పక విను మేను ధర్మదేవతను
అనయంబు, నీచిత్త మరయ వచ్చితిని. । అనఘ, నీవ్రతమునకు హాని గల్గినను
దెగఁ జూడఁ దలఁచి యొంతే వెనువెంటఁ । దగిలి మృత్యువు వచ్చె దాని గెల్చితివి.
పరమ పతివ్రత భవదీయ భామ; । పరమతి నిశ్చలవ్రతుఁడవు నీవు;
ఒడలి తోడుత నీవు నూర్ధ్వలోకముల । కడరి నీ తలఁచినయపుడు పోవచ్చు.
అతులితంబగు సాధ్వీమణి నోఘ । వతి నాఁగ నది యుయి వర్తించు నీకు
సతి సగబాలున; నరి సగమ్ము సాము । ప్రతిదినంబును నీకుఁ బరిచర్య సేయు."
అనిచెప్పి ధర్ముఁడు హాయనసహాస్రమున । ఘనమైన గథ మొక్కి కదలు సంతతంబును,
ఆ సుదర్శనుఁ డంత నగ్గలం బొదవు । భాసుర సంతోషభరితుఁడై యుండె.
కరమొప్పఁ బాండవాగ్రజ, నీమనమున । నిరవొప్ప నీకథ యెఱుఁగి వర్తింపు.
అతిథిపూజను గడచిన ధర్మంబు । క్షితి గృహస్థులకు సుస్థిర మొకటి లేదు.
ఈ యతిథిసంబు సిపూర్తి నఁ । బాయుఁ బాపంబులు ప్రబలుఁ బుణ్యములు."
అనిన, భీష్మునిఁ జూచి ధర్మసూనుఁడనియె: । "అనఘాత్మ, బ్రాహ్మణ్యమా మాఁదుజాతు
లను జనింపంచిన లలితాత్ములకును । గాంక్షించి పొందఁ దరమకునొకో!" యన ననియె:

## ఇంద్ర మతంగ సంవాదము

ధరణిలో బ్రాహ్మణత్వము దుర్లభంబు; । తరమిడి యింద్ర మతంగ సంవాద
మను నితిహాసంబు నలవొప్ప వినుము. । గొనకొని యొక విప్రుకొడుకు మతంగుఁ
డనువాఁడు యజ్ఞార్థమైనట్టి పనికిఁ । బనివడి తనతండ్రి పనుపునఁ బోయి
తేవతో నొక్క గాడిదపిల్లఁ జూచి । తీవ్రతఁ గోల మొత్తిన నది నొచ్చి
చెలిమితోఁ దనతల్లిఁ జేరంగఁబోయి । "యలవడ నన్నితఁ డడిచె" ననుటయు
నా గార్దభియు బిడ్డనప్పుడు చూచి । వేగంబె యిట్లను: "వీఁడు చండాలుఁ
డొనరఁ బ్రచండభావుఁడు గాకయున్న!" । అనఁ బూర్వజన్మ కర్మాధిక్యమునను
అదనైన నిఖిల తిర్యగ్జాతి వచన । విదుఁడైనయట్టి యా విప్రపుత్రుండు
వెలయ నప్పలుకులు విని "నిశ్చయముగ । సలలితంబుగ నివి సత్యముల్ గాని
పనివడి దూషణ భాషలు గావు." । అనుచు గర్దభికడ కరుదెంచి తనకు
వరుసఁ జండాలత వచ్చిన విధము । కర మొప్ప నడిగిన గర్దభి యనియె:
"మంగలికిని నీదు మాతకుఁ బొందు । సంగతి గలిగిన నరిఁ బుట్టితీవు."
అనుచు నేర్పడఁ జెప్ప నధికదుఃఖమునఁ । దనపోవు పనికి నెంతయుఁ బోక మరలి
జనకున కెఱిఁగించి "నవడి శూద్రునకుఁ । బొనర బ్రాహ్మణికిని బుట్టినవాఁడు
అవనిలోఁ జండాలుఁ డగుట నందియుమె! । సనడి గర్దభి శాపజాతి గాఁబోలు!
నది యున్న రూపంబు నంతయుఁ బలికె । విదితంబుగాఁగ న విప్రత్వమేను
గడఁగి సంపాదింతుఁ గాకని చెప్పి । యడవికిఁ జని తపంబాచరింపంగ
సురపతి పొడసూపి "సువ్రత, నీకు । వరమిత్తు నడుగు పావనవృత్తి" ననిన
నతఁడును దనకు ధరామరత్వంబు । ప్రతినతో నడిగినఁ బాకశాసనుఁడు
"వదలుము బ్రాహ్మణత్వము మహత్వంబు । అదియేల గలుగును అన్యజాతికిని?
ఒండు వేడుము నీకు నొగినిత్తు" ననిన । దండిగా నేనొల్లఁ దక్కినవరము
చను సురేశ్వర," యన్న నస్మితుఁ డగుచుఁ । జనియె సురేంద్రుఁ; డిచ్చట మతంగుండు
ఏకపాదమున నూఱేఁడులు దపము । ప్రాకటంబుగఁ జేయఁ బాకశాసనుఁడు
క్రమ్మఱవచ్చి "తక్కక మాను తపము; । పమ్మిన దుర్లభపద మాసపడక.
అనయంబు నత్యుగ్రమైయున్న తపము । నొనరఁ జండాలున కుచితమే సేయ!
విదిత మిత్తెఱఁగున విమలశీపంబు । పదిమడుంగులు చేసి పరఁగఁ జండాలుఁ

డరుదారఁగా శూద్రుఁడగును నిక్కముగ. । మరల శూద్రుఁడు నూఱుమడుఁగులు చేసి
కర ముప్ప వైశ్యుఁడై కనుపట్టు; నతఁడు । గుఱుతుగా వెయిమడుంగులు నాచరించి
ధరణీశ్వరుండగు ; దగఁ బదివేలు । దొరఁకొని యొనరించి దుర్విప్రుఁడగును.
అతఁ డొకలక్ష పాయక యొనరింపఁ । జతురత దీపింప సద్బ్రాహ్మణుఁడగు ;
అదిగాన విప్రత్వ మది దుర్లభంబు. । అదనుగాఁ బడసియు నది చెడకుండ
నడపంగ శక్యమే! నామాట వినుము. । నడికి యనేకజన్మంబులఁ బొంది
పరఁగ నొకప్పుడు బ్రాహ్మణజన్మ । మరుదారఁగాఁ గాంచి యటఁ గొంద ఱవని
ధనవిషయాదులఁ దవిలి యాచార । మనయంబు విడిచి మోహాంధులై చెడుదు
రిట్టిపదంబు నీవేల గోరెదవు? । నెట్టన చాలించి నెఱి నొక్క వరము
కోరుమిచ్చెద.'' నన్న గొనకొని యతఁడు । ఊరకున్నను ఇంద్రుఁ డొగిఁ బోయె; మఱియు
నంగుష్ఠ మొక్కటి యవనిపై మోపి । యుంగద నూఱేఁడు లామతంగుండు
అపురూపముగ నిరాకారుఁడై మిగులఁ । దపము సేయంగ, నాతని శరీరంబు
నస్థులై చిక్కి కానట శక్తి తఱఁగి । స్వస్థత లేక భూస్థలి వ్రాలె ; నంత
నతిరయంబున వచ్చి యాతనిఁ బట్టి । శతమన్యుఁడనియె: "నిశ్చయముగా నీకుఁ
జెప్పనే! నృపతులచేఁ బట్టు వడని । రొప్పిన విప్ర శార్దూలంబుతోడి
మేలంబు దక్కుము; మేదినిలోన । వాలాయముగ నొక్కవరమిత్తుఁ గొనుము.
చండదేవుండన జగతి సుస్త్రీలు । మెండుగాఁ బూజింప మేలిమిఁ గామ
రూపంబు ధరియించి రూఢిగా విహగ । రూపంబు గలిగి కీర్తుల విలసిల్లు''
మని వరంబిచ్చి యా యమరవల్లభుఁడు । చనియె నని తయు.'' నన్న శమననందనుఁడు
దేవవ్రతునిఁ బల్కె "దేవ, యిట్లు । నీవిధి కౌశికుం డేరీతిఁ బొందె?
ఎఱిఁగింపవే! నాకు నీవేళ'' ననినఁ । దెలుఁగొప్ప ననియె నా దేవవ్రతుండు:

## విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగిన తెఱఁగు

"జాహ్నవీ దేవికి జనకుఁడై వెలయు । జహ్నుని కులమున జగతిలోఁ బుట్టి
గాధినాఁ బ్రకట భూకాంతుఁ; డెంతయును । శోధించి యాతని సుత సత్యవతిని
దన కాలిగాఁగ నాదట ఋచికుండు । ననయంబు నడిగిన నాగాధి యనియె:
" అరుదార నొకకర్ణ మసితమై దేహ । మరయంగఁ దెలుపైనయట్టి గుఱ్ఱములు
కొలఁది సహస్రముంకువగాఁగఁ దెమ్ము । ఎలనాగ నిచ్చెద నిట నీకు '' ననినఁ

బూనరంగ నాభార్గవుఁడు తేరఁబూసి । ఘనముగా వరుణుని కడ కేఁగి పోయి
యట్టి ఘోటకముల నడిగిన, నతఁడు । 'నెట్టన నిచ్చెద నీవెప్పుడైన
వలసినఁ దలఁపుము వచ్చుఁగుఱ్ఱములు । వెలయంగ.' ననిన దీవించి భార్గవుఁడు
అరిగి గంగానదియందును దరువు । దరి నిల్చి నియతుండై తలఁప నాక్షణము
యా గాధి చెప్పినయట్టి యశ్వములు । వేగంబె పొడమెను వేయును నంత.
దానఁబావనమునై తత్ప్రదేశంబు । పూని కన్యాకుబ్జమునకుఁ జేరువను
అశ్వతీర్థంబన నవనిలోపలను । శాశ్వతంబై మించె జగలోకనాథ!
అంత భార్గవుఁడును నత్తురంగముల । నెంతయుఁ గొనివచ్చి యిచ్చిన, గాధి
శాపభయంబును సంతోషమతుల । దీపితాద్భుతమును ధృతి ముమ్మడింప,
బాగొప్ప జనులెల్లఁ బ్రస్తుతి సేయఁ । బ్రాగల్భ్యముగఁ బెండ్లి పరగఁ జేసినను
అట ఋచికుండు గృహస్థ ధర్మంబు । పటుగతి నడపుచు భామ కిట్లనియె:
"ఓలిమై నీకుఁ బుత్రోత్పత్తి గలుగ । జాలిన చరువును సంఘటించెదను.
ప్రీతితో వెలయుము బింబోష్ఠి" యనియె. । అతని తల్లియు నంతకు మున్న
యల్లుని మహిమ మహానుభావత్వ । మెల్లగా మదిలోన నెఱుఁగుటఁ జేసి
యాసత్యవతితోడ నట "నాకు సుతుఁడు । ఆసతోడుతఁ గల్గునట్లుగాఁ బుణ్య
పరుఁడైన నీవిభుఁ బ్రార్థింపు" మనుచు । హరుసంబు దీపింప నన్నది గాన
నతనికిఁ గోమలి యామాట చెప్పె. । అతిధర్మపరుఁడైన యాభార్గవుండు
సరసంబుగా రెండు చరువులొనర్చి । పరువడి నొక్కట బ్రాహ్మణత్వంబు
రమణమై నొక్కట రాజభావంబు । క్రమముతో నెంతయుఁ గలుగునట్లుగను
దన తపశ్శక్తిచేఁ దగఁ జేసి యిట్లు । వనజాక్షియగు సత్యవతికి నారెంటి
దగఁ జూపి వేర్వేఱ తత్స్వభావంబు । సగణితంబుగఁ జెప్పి యప్పుడిట్లనియె:
"జగతి క్షాత్రంబగు చరువు మీతల్లి । కగపడ నిచ్చి, బ్రాహ్మ్యంబైనదాని
నెనయంగఁ గొని, నీవు, ఋతుకాలమునను । బూనర నౌదుంబరంబును నీదు తల్లి
యశ్వత్థభూజంబు నాలింగనంబు । శాశ్వతమతిఁ జేసి చరువులు దినఁడు."
అని నియోగించిన నాసత్యవతియు । వెనుకొని యెంతయు విధివశంబునను
దమతల్లియును మఱి తా నుపయోగ । సమయంబునను దగు చరువులు వృక్ష
ములు వీడ్వడినయంత, మునివతంసంబు । తలకొని దివ్యబోధంబున నెఱిఁగి
తనయింతిఁ గనుఁగొని "తరలాయతాక్షి! । గొనకొని నీ గర్భగోళంబునందు

వినుము భూపతి గాని విప్రుండు గాఁడు.'' । అనివల్కి చనుతరు వ్యత్యాస గతులు
దెలిపినఁ జింతించి "దేవ, నీకర్థి । బాలుపు దీపింపంగఁ బుట్టించువాఁడు
వెలయంగ విప్రత్వవిరహితుఁడైన । మెలపుతో లోకంబు మెచ్చునే! యట్లు
గాకుండ వరమిమ్ము కలితాత్మ!'' యనినఁ । "బ్రాకటంబుగ వీఁడు బ్రాహ్మణుండగును.
పుడమిలో వీనికిఁ బుట్టినవాఁడు । పుడమీశ్వరుం డగుఁ బుష్పసుగంధి!''
అని మునివల్కిన యాకతంబునను । వనజాక్షియగు సత్యవతి పుత్రపౌత్రు
లగు జమదగ్నియు నాభృగురాముఁ । డగణితక్రమమున నవనిలోపలను
దెలియ బ్రహ్మక్షత్త్ర తేజోవిశేష । కలితులైరై ; రంతట గాధి భార్యకును
ఒనర విశ్వామిత్రుఁడుద్భవమంది । యనఘాత్మ, నరనాథుఁ డగుచు నుండియును
గురుతుగాఁ జరుతరు గుణసంక్రమమునఁ । బరమతపంబున బ్రాహ్మణుఁడయ్యె.''
అనుచుఁ జెప్పినవిని యమతనూభవుఁడు । "ఒనరంగ వీతహవ్యుండను రాజు
ఏ తెఱంగునను విప్రేంద్రుఁడై మించె? । ఆ తెఱంగెఱిఁగింపు.'' మనిన నిట్లనియె:

## వీతహవ్యుఁడు విప్రత్వముఁ బడసిన ప్రకారము

"వసుధేశ, విను మనువంశజుఁడైన । వసుధలో శర్యాతివంశంబునందు
హైహయుండను నొక్క యవనీశ్వరుండు । బాహువిక్రమశాలి ప్రభవించె; నాతఁ
డలవడఁగా వీతహవ్యనామంబుఁ । గలిగియుండును ; నంతఁ గడఁగి తదీయ
భార్యలు పదుగురు; పరువడి వారు । శౌర్యాఢ్యులైనట్టి సత్పుత్రకులను
గర మొప్ప నూర్వురఁ గాంచి; రాఘనులు । హరిదశ్వుఁ గాశీశు నాజికిఁబిలిచి
యనిచేసి యాతని నందనుఁ బోదివి । తనరంగఁ జంపిరి; తత్పుత్రుఁడైన
యలసుదేవుండు రాజ్యము సేయునతని । నలవడఁ జంపిరా హైహయసుతులు.
ఆతని నందనుఁడగు దివోదాసుఁ । డాతఱి రాజైన, నాతని మీఁదఁ
గదనంబు సేయంగ, గ్రక్కున నతఁడు । సదనైన భయమున నంతటఁ బోఱి
ప్రకట సంయమిని భరద్వాజమౌని । సకలంక భక్తితో నాశ్రయించినను
అతఁ 'డోడ కోడకు' మని భయముడిపి । 'సుతునిఁ గల్పింతు నిచ్చో రిపువర్గ
విదళన శాలిగా వెఱవకు' మనుచుఁ । బొదలంగా నప్పుడు పుత్రకామేష్టి
క్షితిలోన నెంతయుఁ జేసిన సుతుఁడు । ధృతి ప్రతర్దన నామధేయుండు పుట్టి
యాదట నాతని యానుగ్రహమున (?) । వేదంబులును ధనుర్వేదంబు నెఱిఁగి

యలవడ జనకుండు యౌవరాజ్యమున । నిలిపినఁ గార్య నిర్విద్రప్రతాప
చతురుఁడై జనకుండు సమ్మతిసేయ । నతి వేగమునఁ జని యాజిముఖమున
వీతహవ్యుని పుత్రవితతిని జంపి । యాతనిపైఁ బోవ నా వీతహవ్యుఁ
డరుదారఁగా భృగు నాశ్రమంబునకు । నఱిగి భయంబుతో నాశ్రయించినను
వలనొప్పఁ దన శిష్యవరులలో నునిచె. । తలకొని యాప్రతర్దనుఁడు వెన్వెంటఁ
దగిలి యచ్చటికేఁగి తదనంతరంబ । తగురీతి మునికి వందనము చేసినను
'గరిమ నీరాకకుఁ గారణం బేమి । యరుదుగా నెఱిఁగింపు' మనిపల్కుటయును
వితత విస్ఫూర్తిని వీతహవ్యాఖ్యు । సుతులచే మిక్కిలి సొంపెల్లఁ దక్కఁ
ద్రొక్కఁ దనకులము నశించిన తెఱఁగు, । తతభంగి నెంతయుఁ దాను వారలను
నడఁగించుటయు, వీతహవ్యుండు తనకుఁ । గడు నోడిపాఱిన గతియును జెప్పి
"చెలిమితో మునినాథ, యిటు వచ్చినతనిఁ । బొలియింపవచ్చితి బోరన" ననిన
ఆభృగుఁ డిట్లను "నందఱు వీరు । వేభంగి నాశిష్యవితతి భూసురులు."
అనుచుఁ జూపిన నవ్వి యమ్మౌని కెఱఁగి । "యనఘాత్మ, యేను గృతార్థుండనైతి;
శాత్రవు నీరీతి జాతికిఁ బాపి । ధాత్రిలో సత్కీర్తి ధన్యుండ నైతి.
పరమపుణ్యాత్మ, మీపలుక మోఘంబు, । అరిగెద." నని మ్రొక్కి యాప్రోద్దిపోయె.
ఇట వీతహవ్యుండు నెలమి దీపించి । తటుకున సత్తపోధను సప్రతర్క్య
భంగి భావనఁజేసి బ్రాహ్మణుఁ డయ్యె. । సంగతి నాఁడు కృత్స్నమదసమాఖ్యుఁ
దనయుఁ గాఁ గాంచెను; దత్పుత్ర పౌత్రు । లనయంబు వర్చనుండట విహవ్యుండు
ననువారు సత్యుండు నటఁ దమనుండు । నెనయఁ బ్రకాశవాగీంద్రులు మఱియుఁ
బ్రీతిమంతుండను బేర్మి ధీరుండు । నాతతగతి శునకుఁ డట శౌనకుండు
నను మహాద్విజులు పాయక జనియించి; । రనఘ, మూలంబయి యవ్వీతహవ్యుఁ
డొనర విప్రత్వంబు నొందె నీరీతి." । అని చెప్ప మఱియు నిట్లనియె ధర్మజుఁడు.

## దైవ పౌరుషముల తెఱంగు

"ధారుణిఁ బౌరుష దైవంబులనెడి । యీ రెంటియందును నెయ్యది యధిక
మారూఢిఁ జెప్పవే!" యనిన వశిష్ఠుఁ । డారయ నాబ్రహ్మ నడిగిన నతఁడు
అలవడఁ జెప్పినయట్టి వాక్యములు । చెలిమితోడుత నీకుఁ జెప్పెద వినుము:
భువిని క్షేత్రంబది పురుషకారంబు, । తవిలి యాబీజము దైవము, రెండు

నెలకొని కూడ నేనియుఁ గర్మకరుఁడు । ఫలమునకెంతయుఁ బాత్రమౌ వినుము.
ఘనముగాఁ బురుషుండు గావింపనట్టి । పనికి దైవంబెట్లు ఫల మొసఁగెంచు ?
వరుసఁ బౌరుషము దైవంబు తోడ్పాటు । పరువడి లేకున్న ఫలముఁ బొందంగ
నేరదు; విత్తు నెంతే సహకారి । యూహాఢిఁ గాకున్న నట రిత్తనేల
పనివడి చెడుఁగాక ఫలవంతమగునె ! । తనరంగఁ బౌరుష దైవముల్ రెండు
సమములు ధాత్రిలో జననాథతిలక ! । క్రమముతో" ననిన "సత్కర్మంబునందు
నయ్యెడుఫలముల నానతీవలయు । నెయ్యంబుగా" నన్న నృపతి కిట్లనియె:
"తగు భక్తితోడ [1]సధ్వపరిశ్రాంతుఁ (?) । డగువాని కన్నంబు నటువెట్టునట్టి
ఫల మింత యంతని పరికింపరాదు. । అలవడ నగ్ని సమారాధనమునఁ
జెల రేఁగి పౌరుష శ్రేష్ఠత, భవ్య । కలితదానములకు ఘనతర మహిమ,
నయ మొప్ప మౌనంబునకుఁ బరిజ్ఞాన । జయశక్తియును, బ్రహ్మచర్యంబునకును
బరమాయువును, జలఫలములఁ దినుచు । నిరతిమై నున్నవానికి రాజ్యపదవి,
క్షితిలోనఁ బత్రభక్షకునకు దివము, । నతుల తపంబున కధిక భోగములు
నివి కర్మఫలము లింకేమి గావలయు । నవిరళ వాక్ప్రౌఢి నడుగు నీ." వనిన
యమసూతి వల్కు "నిజాశ్రయుంబునకుఁ । బ్రమదంబుతోడ నాస్పదమైన పురుషు
నెడ భక్తచరితంబు లెట్టివి గాఁగ । నడరంగవలెఁ ? జెప్పు" మనిన నిట్లనియె :

## ఆశ్రయ మపరిత్యాజ్యమని భీష్ముఁడు ధర్మజునకు బోధించుట

"ధీరాత్మ, కాశీశు దేశంబునందుఁ । గోరిక నొకలుబ్ధకుఁడు వేఁటవోయి
ఘనతర విషదష్ట కాండంబు నేయ । నెనయ మృగము దప్పి యొలమి యైనట్టి
పువ్వులఁ గాయలఁ బోలుపారి యున్న । యువ్వలివృక్షంబు నటు దాఁకుటయును
అవ్విషంబున శుష్కమయ్యె భూజంబు. । నివ్వటిల్లఁగ నందు నెటినొక్క శుకము
ఆవాసముననుండి యక్కడ విడిచి । పోవక యెండకుఁ బుడమి గాలికిని
బెదరక ధృతిగల్గి పెంపుతో నచటఁ । గదలక యుండ సంక్రందనుఁ డెఱిఁగి
చనుదెంచి శుకము వృక్షము పొంతనున్నఁ । గనుఁగొని యిట్లనె: "ఖగరాజ, వినుము
ఫలపుష్ప వృద్ధిచేఁ బరగు వనములు । గలవనేకంబులు క్ష్మాతలంబునను.
ఎనయ నిక్లేటికి నిందు-లో నిలువఁ । జను" మన్న శుకము వాసవున కిట్లనియె :

---

1. శ్రద్ధా. అని. మూ.

“అనఘాత్మ, యీవృక్ష మాశ్రయంబునను । ఘనముగా నిలిచి, శుష్కంబైన విడిచి
తగునెపోవంగ! కృతఘ్నత గాదె! । జగతిలో” ననిన దుశ్చ్యవనుండు మెచ్చి
‘కోరుము వరమిత్తు గుఱుతుగా’ ననిన । నాయాఖ్యఁ జిలుక యిట్లనియె నింద్రునకు;
“దేవతాధీశ్వర, దివ్యప్రభావ, । వేవిధంబులఁ దొంటి విధమున నెలమి
గలుగంగ నిమ్ము వృక్షమునకు” ననినఁ । జెలఁగి యింద్రుండమృత సేచనంబునను
మిగుల నెలమిచేసె; మేలి యాశ్రితులు । జగతి రక్షింతురు సరసత నధిపు.”
ననవుడు “విభునకు ననవరతంబు । పనివడి యెవ్వారిఁ బాటింపవలయు?
నెఱిఁగింపవే!” యన నిట్లనుఁబ్రీతి । మఱియు గాంగేయుఁ డమ్మనుజాధిపునకు:

### విభులకుఁ బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట

“జననాథ, విను తపస్స్వాధ్యాయ ముఖ్య । ఘనకర్మ కరంతఁ గలిత లోకములు
వశగతములు సేయు వాఁనొప్పఁజాలు । వసుమతీసురులు భూవర మన్ననలకుఁ
బాత్రంబు లెంతయుఁ; బతి నాతికెట్లు । ధాత్రీశు కట్లపో ధరణీసురుండు
ఒడయఁ; డాతఁడు హర్షమొంద సంపదలుఁ । దడయక యలిగినఁ దగు నాపదలును
దలకొను నింద్రునంతటివానికైన. । అలవడ విప్రుని నవనీశ్వరుండు
కొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁగొలువఁ । బుడమిలో ననలంబుఁబోలె నర్చింప
వలయును; వేదసంవాదంబు నిట్లు. । సలలిత బ్రాహ్మణజాతికిఁ గీడు
చేసిన మఱి మున్ను చేసిన సుకృత । మాసాసఁ జెడిపోవు నవనీతలమున.
జప హోమముఖ కర్మసంచయంబునకు । విప్రులేశ, యధికంబు విప్రున కిడుట.
భూసురారాధనంబునఁ జేసి యొక్క । మాసంబునందును మాయుఁ బాపములు.
అగ్రజన్ములఁ గాంచి యాదరింపకయు । నుగ్రుఁడై యుండిన నొదవును గీడు.
అని క్రమంబున ఋక్కు యజువును సామ । మును నథర్వణమును బొలుపుగాఁ బలుకు
పలుకుల విందుము పరమర్షివరుల । వలనఁ గౌరవనాథ, వన్నెగా.” ననుచుఁ
బరమ ధర్మంబులు భవ్యశాస్త్రములుఁ । బరమ తీర్థంబులు భాసుర యజ్ఞ
కర్త యజ్ఞేశ్వరకలితుండు యజ్ఞ । మూర్తి శ్రీహరియని ముని మద్రపతికి
వ్యాసుఁడు చెప్పిన వాక్యముల్ చెప్ప, । రాసికెక్కిన ధర్మరాజిట్టులనియె:
“అని లాశనారి మహానుభావుండు[1] । అని విందుఁ జెప్పవే యాతని మహిమ.”

---

1 ‘అతఁడు’ అధ్యాహార్యము.

## గరుత్మంతుని చరిత్ర.

**అనవుడు గాంగేయుఁ డర్థినిట్లనియె:** । "వినుము ధర్మాత్మజ, వివరంబుగాఁగఁ
బనివడి కశ్యపు భామినీమణులు । వినత కద్రువ లన వెలసి; రమ్మౌని
వారలఁ గనుఁగొని వరమిత్తు ననినఁ । గోరి యాకద్రువ కొడుకుల వేయి,
వినత యిద్దఱి వేఁడె విశ్రుత బలుల । ననయంబు మునియును నట్లకాకనియె.
పదపడి యతని ప్రభావంబు వలన । విదితాండ తండముల్ వేయును రెండుఁ
బుట్టిన నవి కుండములలోన వేడ్కఁ । బెట్టిన నూఱేండ్లఁ బెకలి యండములు
అహిసహస్రములయ్యె; నంత నారెండు । మహిలోన విఱియక మఱియుండునంతఁ
దన సవతికి సుతుల్ ధరణిఁ బుట్టినను । వినత మాత్సర్యంబు వెరవును గదుర
నవినీతితో నొక్కయండ మంతటను । అవియింపఁ బిచ్చుకుంటై యొకఁడుట్టి
తల్లిఁగనుంగొని "తగునమ్మ నీకు ! । చెల్లఁబో యిట్టేల చేసితి నన్ను !
నేరువులేవైతి; నీసవతికిని । వారక దాసివై వర్తింపు." మనుచు
శపియింప, వణఁకుచు జనని ప్రార్థింప । నపుడనూరుండు "నాయనుజుండు పుట్టి
యలవడ దాసీత్వ మది మాన్పఁజేసి । వెలయంగఁ గలఁ" డని వినతకుఁజెప్పి
చని పద్మబాంధవు సారథి యయ్యె । జననాథ, యేనూఱు సంవత్సరముల
కనఘుండు తార్క్ష్యుండు నవతారమంది । తనతల్లిఁ గనుఁగొని "దాసీత్వమేమి
క్రమమున వచ్చె నిక్కము చెప్పు" మనిన । ... ... ... ...
మును సవతియుఁ దానుఁ బుష్కరరాశి । జనియించినట్టి యుచ్చైశ్శ్రవో హయముఁ
గాంచి పన్నిదమాడుగతి చెప్పుటయును, । అంచితగతిఁ బన్నగాంతకుఁ డపుడు
తమతల్లిదాస్యంబు దప్పింప దలసి । యమరంగఁ గద్రువ యనుమతంబునను
అమృతంబు తేఁబూని యాహారముగను । ... ... ... ...
గరమొప్ప శబర భక్షణ మొనరించి । [ యురుదారఁ గశ్యపు ననుమతంబునను ]
గజ కచ్ఛపంబులఁ గబళించి మించి । విజయుఁడై యంత దివిజులను గెలిచి
సుధ గొని తెచ్చి మెచ్చుగఁ దల్లిదాస్య । మధికుఁడై తప్పించి యవనిలో వెలసె.
ఇమ్మహాచారిత్ర మెవ్వరు వినిన । నెమ్మితోఁ గాంతురు నిఖిల పుణ్యములు."
అనిన ధర్మాత్మజుం "డనఘ, విప్రునకు । నెనయ నేమయినను నిచ్చువాఁడ నని
యొడఁబడి యియ్యక యొగిఁ బోవువాఁడు । వడి నేమిగతిఁ బోవువాఁడకొ!" యనిన

అతఁ డిట్టు లనియె "ధర్మాత్మజ, వినుము। క్షితిలోన నొక నక్క చెలఁగి వానరము
గత జన్మ సంస్కార కలన నొక్కెడను। జతురతతోఁ గూడి సఖ్యంబు చేసి
తిరుగుచు నొకనాఁడు ధృతి వానరంబు। దొరఁకొని యా నక్కతోడ నిట్లనియె:
"కటకటా! నీకిట్లు కడుహేయమైన। మటుమాయ పీనుఁగు మాంసంబు దినఁగ
నేల పాటిల్లె? నిక్లేశమిట నొక్కొ?"। యోలిమై ననవుడు నసురసు రనుచు
నవని జాతిస్మరియగుట దుఃఖించి। "కువలయామునకుఁ గోరిన ధనము
నీయంగ నొడఁబడి యీయకపోయి। యీ యల్పజాతినై యిలఁ బుట్టవలసె."
అనిచెప్పి ననిన న య్యమతనూభవుఁడు। నెనయంగ నిట్లను "హీన వర్ణునకు
నలవడ మంత్ర తంత్రాదు లేమైన। వలసి చెప్పిన ధర్మవైగుణ్య మొక్కొ?"
యనవుడు: "దీనికి నతులేతిహాస। మొనరంగఁ జెప్పెద నుడురాజవంశ!
హిమగిరి మీఁద ననేకులు ద్విజులు। అమితవైఖరిఁ దపమాచరింపంగఁ
బొలుచు నయ్యాశ్రమంబున నొక్క శూద్రుఁ। డలర ధర్మోపేతుఁడనువాఁడు వచ్చి
యా మునీశ్వరులకు నగ్రణియైన। యామహాత్మునిఁ గాంచి యడుగుల కెఱఁగి
'యుపదేశ మొనరింపు మోపుణ్యమూర్తి!। తపముసేసెద' నన్నఁ దపసియిట్లనియె:
"ఒనరంగ శూద్రున కుపదేశమీయఁ। జనదు వైదికము; నిశ్చలత శుశ్రూష
కుండవై వర్తింపు గుణయుతుగా." ననిన। దండిగా వాఁడు నంతట నొక్కగుడిసె
గావించి సురపితృ కలితాది పూజ। వేవేగఁ జేయుచు విహరింప, నతనిఁ
గనుఁగొని మునిపతి గ్రక్కునఁ బోయి। యనఘుఁ డాతఁడు సేయు నయ్యనుష్ఠాన
ములలోనఁ గాని యిమ్ములు మానఁజెప్పి। యలఁగ నీగతిఁ జేయుమని నియోగింప,
నాతఁడు ప్రీతుఁడై యారీతి నడచి। జాతిగాఁ గాలవశత మృతిఁ బొంద
యొక్క భూపాలున కుద్భవంబందె.। తక్కక మునియును దనువును దొఱఁగి
కోరి యాతని జనకుని పురోహితున। కారయ జన్మించి యఖిలంబు నెఱిఁగి
యుండఁ, గుమారుని నుర్వీశ్వరుండు। [1]మొందుగా నెంతయు మేదినీస్థలికిఁ

---

1, పదపడి యక్కుమారకుఁడు పట్టముగట్టి పురోహితత్వమున్
విదిత విభూతితో నొసఁగె విప్రునిపుత్త్రున కవ్విభుండు న
వ్వేదవిదుఁడు మోముతో నతని నోలి వాఱఁగఁజూచు; నాతఁడే
య్యది గతమొక్కొ నవ్వునకు నంచు మదిం దలపోయు భూవరా!"

అని. తిక్క. న. చూ. అను. శా. 1-281.

బట్టంబు గట్టి యా బ్రాహ్మణసుతున । కట్టి పౌరోహిత్య మదియిచ్చె, నతఁడు
కరమొప్పఁగా నవ్వుగల మోముతోడఁ । దిరుగంగ, నాభూమిదేవుంకు చూచి
యలవడ నొక్కనాఁ డవసరంబెఱిఁగి । తలకొని యమ్మహీధవునితో ననియె:
"వావిరి నన్ను దేవా! నవ్వుదీవు; । నావల్ల కీడేమి నాకెఱిఁగింపు
తెలియంగ" ననిన జాతిస్మరణంబు । గలుగుటఁ జేసి తత్కాలంబునందు
ఘనతరానుష్ఠాన గతి విహితములు । తనకుఁ జెప్పుట చెప్పి తా శూద్రుఁడగుట
వినిపించి "తచ్ఛూద్ర విప్రయోపదేశ । మునఁజేసి యీరీతిఁ బుట్టంగవలసె ;
నేను నాపుట్టువు నెఱిఁగినవాఁడ । నై నవ్వుదును; విను మట్టికల్మషము
పాపికో. " మ్మనుచును బాడి గోవులను । ఓపినంతయు ధనమొసఁగిన, నతఁడు
సంతోషచిత్తుఁడై సకల దానములు । నంతత జపహోమ సత్క్రియల్ చేసి
యాకల్మషము పాసి యాపుట్టువీఁగి । సాకల్యము గ మునిసంజాతుఁ డయ్యె!
కావున బ్రాహ్మణ క్షత్త్రి వైశ్యులకు । వావిరిఁ దక్క భూవలయంబు నందుఁ
దక్కినవారి కెంతయు నుపదేశ । మొక్కటఁ జేసిన నొంకు గల్మషము."
అనిచెప్ప ధర్మజుం "డనఘ, శ్రీలక్ష్మి । చనవొప్పఁగా నెట్టి జనములయందు

## లక్ష్మి నివాసస్థానములు

వసియించు? " ననిన దేవవ్రతుండనియె: । "విశద వైఖరితోడ వినుము భూనాథ!
అరుదార నారాయణాంకతలమున । సిరియుండఁగాఁ జూచి చేరి సంప్రీతి
నారుక్మిణీదేవి యడిగె "నీవెట్టి । వారలయందును వసియింతు ?" వనుచు
నాదేవి రుక్మిణి కటఁ జెప్పినట్టి । వేదవాక్యంబులు వినిపింతు వినుము :
నిత్య సత్యులు, శౌచనిరతులు, దక్షు, । లత్యంత గురుభక్తు, లప్రమత్తులును,
సరస నిశ్చలమతుల్, సత్కర్మపరులు, । ధరణి నమత్వంబుఁ దపము దానములు
గలుగువారలు నేను గలిగెడి చోట్లు । తెలియంగఁ గ్రూరు నాస్తికునిఁ గృతఘ్నుఁ
గుమతిని వర్జింతు గురుతర లీల. । క్రమమున నిలువడి ఘటశుద్ధి గలిగి
వలనొప్ప నెంగిలి వర్జించినట్టి । నెలఁతలయందును నిలిచియుండుదును.
తిరముగా నన్యమందిరగామి నధిక । తర నిద్రగనుచు భర్తకుఁ బ్రతికూల
ఘననిష్ఠురాత్మయై గడఁగు మానిని । అనయంబు విడుతు నే" నని చెప్పెఁ గాన
ధరణీతలేశ్వర, తత్ప్రకారంబు । తరమిడి బుద్ధిగతంబును జేయు.

మనిన నిట్లనియె: "*నో యనఘాత్మ, వినుము । వనితాది సంగతివలన సంస్పర్శ
కలిత మెవ్వరికిని గలుగు నెక్కుడుగఁ । దెలుపవే!" యనిన నదీసూనుఁ డనియె:

భంగాస్వను చరిత్రము

"అవని భంగాస్వనుండను రాజు తొల్లి । తివిరి పుత్రార్థియై దేవతాధీశు
కప్రియమగు యాగ మప్పుడు చేసి । సుప్రసన్నులఁ గాంచె సుతుల నూర్వురను.
కని సంతసంబునఁ గ్రాలుచు నుండి । వెనుకొని యొకనాఁడు వేఁటకై పోవఁ
బగగొన వజ్రి దిగ్భ్రాంతి పుట్టించి । యొగిఁ దేరకాఁడు పోయెడునట్లు సేయ (?)
నిరవొప్ప నాస్పృహుఁ డెక్కినయట్టి । తురగంబుతో నొంటి దూరమైనట్టి
యడవికి నేఁగి దాహంబైన నలసి । కడునొప్పిదంబైన కమలాకరంబు
[గనుఁగొని యట తురంగము వెన్నుమునుఁగ] । ననయంబు దిగిచి తాఁనంతయు మునిఁగి
యప్పుడే లేచి దాహముతీఱ నీరు । తప్పక గ్రోలి యంతట నాతి యగుడుఁ,
దనుతాన చూచి చింతామగ్నుఁడగుచు । "నెనయ నీయొడలితో నేభంగిఁ బురికి
నరుగుదుఁ! బోయిన నాపురి జనము । లరయంగ ననుజూచి యంత నేరీతి
దలఁతురో! పుత్రులు తాతలు సఖులు । నలవడ నేమి సేయఁగఁ గలవారో!
చెల్లఁబో దైవమా చేసితివిట్లు! । ఎల్లవారలు నింక నేమి గాఁగలరో!"
యని పురంబున కేఁగి యఖిలమంత్రులను । గొనకొని రావించి కువలయేశ్వరు డు
తనరిన దిగ్భ్రాంతిఁ దాఁబోయి వద్ద । వనమందు మునుఁగుట వనితయునగుట
గుఱుతుగా నెఱిఁగించి, కువలయంబునకుఁ । బరువడిఁ గొడుకులఁ బట్టంబు గట్టి
యడవికి నేఁగి సంయమితతిఁ గాంచి, । తడయక యెంతయుఁ దప మొనరింప,
నందొకమౌని యయ్యతివఁ జేపట్టి । కందర్పకేళిని గవయు, దానికిని
బొలుపొంద నూర్వురు పుత్రు లుట్టినను । గొలఁదిగాఁ బూర్వపుఁ గొడుకులయెడకు
వారలఁ గొనిపోయి వలనొప్పఁ జూపి । యారణ్యమున నొక్కయనఘుండు దన్ను
బొందుట కతన నీపుత్రులు నూర్వు । రందంద జనియించిరని యెఱింగించి,
'మగతనంబున మీరు, మగువతనమునఁ । బొగడొంద వీరలుఁ బుట్టిన కతన
నడరంగఁ దోఁబుట్టు లగుదురు పంచి । కుడువుఁడందఱు;' నన్నఁ గూర్మితో వారు

* "పురుషుల పురంధ్రుల సంగతియందు సంస్పర్శ సుఖంబు నతిశయంబెవ్వరికిఁ గలుగును?"
అను. శా. 1–286.

పొసఁగ భ్రాతృస్నేహములు గల్గి విమతు । లసదృశగతి భయమంద రాజ్యంబు
పరువడి ననుభవింపఁగ నంతలోన । సురపతి యెఱిఁగి "భాసురగతి వీని
కే సహితము సేయ నిది హితమయ్యె. । పూని రాజ్యసమృద్ధి పుత్రాభివృద్ధి
బలిమియు నిమ్మహీపతికిని గలిగె. । చెలువేది విఘటింపఁ జేయుదు వీని."
అని భూసురాకారుఁడై పోయి పూర్వ । తనయులఁ గాంచి యెంతయు నిట్టులనియె:
"మేదినీపతులార, మీజనకుండు । ప్రోడిగా నెవరికో పుట్టినవారిఁ
దోడఁ బుట్టువులని తోడిఁబడఁ దెచ్చి । వేఱుక రాజ్యంబు విభజింపఁ దగునె!
ఎచటి తోఁబుట్టువు? లెన్నటివారు? । కుచరిత్రులగు వారు క్షోణిలోపలను.
అని పగపుట్టించి యపరపుత్రులను । ఎనయంగఁ బూర్వజు లెఱుఁగకుండంగ
నితకరి మాటల నీరిష్యపుట్ట । జతనంబుగాఁ బల్క, నరి వీరువారు
నొనరంగఁ బనిపూని యుద్ధంబు చేసి । యనిలోనఁ జచ్చిన, నాత్మలోవగచి
మునిపతి చన్నులు మోమును మోది । కొనుచు దుఃఖప నా కులశైలభేది
యలవడ విప్రుఁడై యచటికిఁ బోయి । "నలినాక్షి, యింద్రుండ నాకు నిష్టంబు
గాని యాగంబు వేడ్కలఁ జేసితీవు, । జానొప్ప నదిగానఁ జంపితి వీరి."
ననుటయు ఘన సంభ్రమాశ్చర్యచిత్త । మున జాఁగి మ్రొక్కి "యోపుణ్యచారిత్ర,
యవనిలోఁ దనయులకై మూఢబుద్ధిఁ । దివిరి యేఁ [1] జేసితి దేవ, రక్షింపు."
అనినఁ బ్రసన్నుఁడై యమరవల్లభుఁడు । గొనకొని నీకిత్తుఁ గొందఱిసుతులఁ;
గరమొప్ప నెత్తఱి గాంచినవారి । నరయంగ నొసఁగుదు?" ననిన నిట్లనియె:
"కాంతనై యుండి యేఁ గనినట్టిసుతుల । నెంతయు నాకిమ్ము నెలమితో" ననిన
శతమన్యుఁడనియె "నిచ్చలు (?) తొల్లి గనిన । సుతుల నేలడుగవు క్షోణీతలేశ!"
నావుడు సిగ్గుతో "నాతుకెల్ల । నేవిధంబునఁ గూర్మియిల్ల బిడ్డ" లనిన
"సత్యవాక్యుఁడవైతి సకలనందనులు । నిత్యులై బ్రదుకంగ నెగడుదు వీవు;
పురుషభావంబునఁ బొగడొందు." మనిన । సురనాయకునిఁ జూచి సుదతి యిట్లనియె:
"దేవతాధీశ్వర, దివ్యప్రభావ, । భావించి పుత్రులఁ బడసితిఁ జాలు.
వనితనై యుండెద వరముగా నాకు । గొనకొని యివ్వు డొసంగుము ప్రీతితోడ."
ననవుడు విస్మితుండగుచు నింద్రుండు । 'ఘనముగా నిందుకుఁ గతమేమి?' యనినఁ
"బురుషులకంటెను బుష్పగంధులకు । సురత సౌఖ్యంబు లెచ్చైనధికంబు

1. 'తప్పు' అనుమాట అధ్యాహార్యము.

కావున నాకిట్టిగతి రమియింపఁ । గా వేడుకయ్యెడుఁ గరమొప్ప " ననిన
నమరనాయకుఁడును నట్లకాకనుచుఁ । గొమరొప్పఁ జనియె నో క్షోణీతలేశ !"
అనుచు గాంగేయుఁ డయ్యమతనూజునకు । ననయంబు విష్ణుమహాత్వంబు మఱియు
వైష్ణవధర్మముల్ వరభక్తి యుక్తి । విష్ణువాహనమైన వినతాతనూజు
ఘనచరిత్రంబును గలిత విఖ్యాతి । నొనరిన యా సాంఖ్యయోగ యుక్తులును
జ్ఞానప్రకారంబుఁ గరమొప్పఁ జెప్పి । మానుగా నిట్లను : "మనుజలోకేశ !
ఇమ్మహాచారిత్ర మేకాక్షరంబు । నెమ్మితో విన్నట్టి నిఖలమానవులు
దురితంబు లెల్లను దొలఁగి సుజ్ఞాన । భరితులై యుందురు భవ్యవిస్ఫూర్తి."
ననుచు దేవవ్రతుం డా ధర్మజునకుఁ । జెనుపొంద నెఱిఁగించెఁ బ్రీతితో ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించెనని చెప్ప వెండియు మునులు
"అనఘాత్మ, తరువాతనైనవృత్తాంత । మనువొందఁ జెప్పవే!" యని యడుగుటయు
గోవింద, మాధవ, గోపికారమణ, । పావన చారిత్ర, పరమేశ, యీశ,
కారుణ్యసాగర, కంజాత నేత్ర, । వారిజనాభ, శ్రీవనితానాథ,
దానవ సంహార, దైవతారాధ్య, వైనతేయధ్వజ, వైకుంఠనిలయ,
ఘన మానిహృద్గేహకలితసందోహ । వినుత ప్రకాశ, శ్రీవేంకటాధీశ !
భక్త వత్సల, జగత్పావన మూర్తి, । ముక్తి ప్రదాయక, మ్రొక్కెద నీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పద పద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రరచిత
మాను శాసనికాఖ్యమైన పర్వమున । నానుపూర్విగఁ బ్రథమాశ్వాసమయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ భోగిగిరివాస, చిరతరోల్లాస, । వైభవ నిలయ, శ్రీవనితానాథ!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె.
ఆరీతి విష్ణుమహాత్మ్య ధర్మాదు । లారూఢిగా విని యమతనూభవుఁడు
"పొసఁగఁ గన్యాదానమునకు వరుండు । వసుమతిలో నెట్టివాఁడు గావలయు?"

## అష్టావక్రుని చరిత్రము

ననుటయు భీష్ముఁ డిట్లనియె: "నిందులకు । వినుతేతిహాసంబు వినుము చెప్పెదను.
అనఘ, యష్టావక్రుఁడను బ్రహ్మచారి । తనర వదాన్యుఁడన్ తాపసోత్తముని
తనయ సుప్రభయను తరళాయతాక్షిఁ । గొనకొని పెండ్లి కాఁగోరి ప్రార్థింప
నా వదాన్యుండు నిట్లనియె: "నీకిత్తు । నో విప్ర, యంతకు నుత్తర మరిగి
ర" మ్మన్న 'నెచటికి రమణమైఁ బోదు? । పమ్మిన వేడ్క నేపని యాచరింతు?
నానతీవే!' యన్న నావదాన్యుండు । "మానిత చారిత్ర, మనుజవాహనుని
పుటభేదనంబు సొంపులు మీఱఁగడచి । యట హిమగిరి కేఁగు; మభవునిఁగూర్చి
దాక్షాయణీదేవి తపమాచరించె । నక్షీణ భక్తితో నాప్రదేశమున.
ఆడుచుఁ బాడుచు నమరగణములు । గూడి చరింప నుగ్రుం డట నుండు.
అది పుణ్యదేశ మొయ్యన చూచి గడచి । కదలిన మఱి నీపకాననం బర్థిఁ
గానంగనగు; నందు గట్టిప్రాయమున । మానినిగలదు నిర్మ" పుణ్యచరిత.
చూచి వచ్చినఁ జాలు సుదతి నీకిత్తు । నో చతురాత్మక, యుజ్జ్వలతేజ!"
అనవుడష్టావక్రుఁ డట్లకాకనుచుఁ । జని బాహుదానదిఁ జయ్యన దాఁటి
పొసఁగ ధనాధీశు పురమున కరుగ । నసదృశుండగు నమ్మహాత్ముని రాక
విని యెదురేతెంచి వినయంబు నెఱపి । కొనిపోయి పూజించి గురుతరభక్తి
నిలిపిన, రంభాది నెలఁతలుఁగూడి । యలవడఁ బాటల నాటలఁ బ్రొద్దు
నొలసినగతిఁ బుచ్చ నొక్కవత్సరము । నిలిచి యాధనదుండు "నీకేదివలయు
నలరంగఁ జెప్పవే!" యనిన "సర్వమును । ... ... ... ... ...

సంపన్న మిదె విను సంయమి యొకఁడు । అంపినఁ బోయెద నాతనిపనికి
ఇంతియుగాని నాకెద్దియు వాంఛ । యంతరంగమునలే " దని పోయిపోయి
హిమశైలతటమెక్కి యీశుండు క్రీడ । సమరినయెడఁ గాంచి యాతలపోయి
కడిమిభూజంబులకాననం బర్థిఁ । దడయక చూచి చిత్రక రమ్య హర్మ్య
ములు గని యందు సమున్నత మైన । కలితహర్మ్యంబు దగ్గఱఁబోయి నిలిచి
తనరంగ లోనికిఁ దనపేరు చెప్పి । పనిచిన భామలు పఱతెంచి తోడు-
కొనిపోవునప్పు డా కువలయాక్షులను । గనుఁగొని మనమునఁ గలఁ కేమిలేక
చనుచు నభ్యంతర సదనంబు చొచ్చి । కనకభూషణ రత్నకలితయు దివ్య
గంధాంగరాగయుఁ గమలేక్షణయును । బంధుర సౌందర్య భరితయు మఱియు
నంచిత ప్రౌఢ వయస్కయు నగుచు । మించిన సతిఁజూచి ' మేలుగావలయు '
ననుచు దీవించిన, నబ్జలోచనయు । నెనసిన వేడుక నిందు రమ్మనుచు
నొనరఁ బ్రత్యుత్థాన మొగిఁ జేసి ప్రీతి । మునివరుఁ బర్యంకమున వేడ్కనునిచి
భాసురంబుగ నర్ఘ్య పాద్యాదులిచ్చి, । యాసమీపంబున నర్థిఁ గూర్చుండి
పరువడి సతుల విభ్రమవికారములు । గురుతుగా లోచన గోచరమైన
నొల్లక ' వీరేల యుగ్మలి ' యనిన । సల్లాపమున వారి సకియ పోననిచి
వనివడి సముచిత భాషణంబులను । ఎనయంగ రాత్రియయ్యెనయంతలోనఁ
జలియయ్యె ననుచు నిశ్చలవృత్తి నతని । కలిత తల్పమునకు గ్రక్కనవచ్చి
పదపడి యతని గుబ్బల నొత్తియొత్తి । కదియంగ మిక్కిలి కౌఁగిటఁ జేర్ప
మదమేమియును లేక మ్రానయియుండె । నదలని మనసున ; నట్లున్నఁజూచి
యత్తన్వి : " మగవారలట భోగపరులు ; । చిత్తంబులోఁదాల్మి చెలులకుఁగలదు ;
వేఁగోర రతికేళి నేలవు తగునె! । లోఁగక నీమీఁదిలోలతనున్న
నన్ను మన్నింపవే! నాథుండవగుచు । నెన్నిభంగులనైన నీవేళ నీవు. "
అనిన నష్టావక్రుఁడయ్యింతిఁజూచి । " [ఘనకుచ, తగునె యిక్కరణి వచింప !
పరసతి గమనంబు పాపకరంబు] । ధరణి నే నస్ఖలిత బ్రహ్మచర్య
మునమండి పత్ని నిమ్ములఁ గోరినాఁడ " । ననవుడు మఱియు నిట్లనియె నాయింతి :
" వనితలు కామార్తివశతఁ బొంపొంది । తనరంగఁ బురుష శతమ్మునకైన
... ... ... ... ... ... ... ..
కులహాని దలఁపరు, కొడుకులఁజూడ, । రలుకరు మగలకు నది విచారింపు ;

సంగమంబునఁ దృప్తిఁ జనరు నిక్కువము । అంగీకరింపు నీ" వనిన నిట్లనియె:
"కలవడి నిదియేటి కార్యంబు గాఁగఁ । బలికెదు మాటికి భామాలలామ!
మదికి నెక్కనియట్టి మాటలుఁ గలవె! । మదవృత్తి యింతట మానుమేఁబోయి
వచ్చెద." ననిన నవ్వామాక్షి నగుచు । 'నచ్చుగా నీకార్యమగుట యెఱింగి
పోవుదు గా' కన్నఁ "బూఁబోఁడి, నన్ను । గావరంబున వచ్చి కదియకుండినను
నిలిచెద" నని చెప్పి నెమ్మనంబునను । "బాలుపొందని యది శాపమునఁజేసి ముదురు-
తనము నొందిన దేవతరుణి గావలయు. । ఘనముగా నట్లయ్యెఁ గాకుండె నేమి
[తిరముగా నీయమ తెఱఁగు నెఱుంగ] । నరవి నాయాత్మ విచారింపనేల!"
యని యూరకుండిన నంత వేగుటయుఁ । దనరంగ నుచితకృత్యంబులు దీర్చు
మని పల్కి స్నానీయమైన ద్రవ్యంబు । లనయంబుఁ దెచ్చి సంయమియనుమతిని
మృదుకరతలమున మేనెల్లఁ దోమి । సదమల మతిఁ గృతస్నానుఁ జేయింప
నతఁడు సంధ్యాది కృత్యంబులు దీర్చ । నతివేగమున ముని కన్నపానాదు
లలవడఁగాఁ బెట్టి యతుల వాక్యములఁ । బాలుచు వేడుకఁ బొద్దు పుచ్చుచు నుండి,
యెలమితో రాత్రి యయ్యెనఁ దల్పమునకుఁ । బిలిచిన రాకున్న బింబోష్ఠి యనియె:
"ధరఁ గన్య నస్ఖలిత బ్రహ్మచర్య । పరిణతిఁ జువ్వె యేఁ బ్రౌఢ వయస్క-
నైతి; స్వతంత్రను నను బెండ్లియాడి । చేతోభవుని కేళి చెందు నీ." వనిన
సతిఁ జూచి మఱియు నష్టావక్రుఁడనియె: । "సతుల బాల్యంబున జనకుండు, మఱియు
యౌవనంబున భర్త, యట వార్ధకమున । వారిఁ దనయుండు వరుసతో నరసి
నడపుగా కెందును నారీమణులకుఁ । జెడుబుద్ధిఁ దమయిచ్చఁ జేయంగఁ దగునె!
నీవని యిచ్చిన నెఱిఁ బెండ్లియగుట । వేవిధంబులనైన వినుఁ పాడి గాదు."
అనునయంబున నంబుజగంధి । ఘనయౌవనాంగియుఁ గలిత సుందరియు
నయ్యెన దానిపై నటఁ జిత్తవృత్తి । చయ్యన పోనీక సంయమి వరుఁడు
"ఈ కపటములేల యెలనాగ, నిన్ను । బ్రాకటంబుగఁ జెప్పి పనుపుము నన్ను."
అనవుడుఁ బ్రీతయై "యనఘ, నిన్నరయఁ । బూనర వదాన్యుండు పుత్తెంచె; నేను
నుత్తరదిశఁ జుమ్ము; ఓలినీసిష్ఠ । యుత్తమోత్తమము పుణ్యోజ్జ్వలమూర్తి!
నిను మెచ్చునాతఁడు, నెలఁత సుప్రభను । బనివడి పెండ్లియై పరఁగు సౌఖ్యముల."
అనిన నద్దేవికి నంజలి చేసి । చని వదాన్యునిఁగాంచి సకలవార్తలును
జెప్పి యాతనిపుత్రిఁ జగురాకుఁబోఁడిఁ । గప్పురగంధి వేడ్కలఁ బెండ్లియగుచు

నతుల సౌఖ్యంబుల నంది కీర్తులను । జతురుఁడై మించె నష్టావక్రుఁ డధిప ! ”
అనుచుఁ జెప్పిన విని యమతనూభవుఁడు । “ వనిచిన మునుల వల్లను శూద్రజాతి
భామలయందు నుద్భవ మైనవాఁడు । ఆమెయి బ్రహ్మర్షి యనఁ బేరుపడునె !
యిత్తెఱంగంతయు నెఱిఁగింపు. ” మనఁ । నత్తఱి మఱియు నిట్లనియె భీష్ముండు:
“ జగతిలో నాలుగు జాతుల సతులఁ । దగు వివాహంబుగా ధరణీసురునకు.
నరవి రాజునకు మూఁడు జాతులయందుఁ । బరిణయశ్రీ వహింపఁగవచ్చు; వైశ్య
వరునకు రెంటఁ బ్రవర్తింప వచ్చు. । గురుతుగా శూద్రునకును దనజాతి
కన్యక సతియగుఁ; గలిత వివాహ । ధన్య ప్రకారమీ ధర్మంబు దక్క
ప్రతిలోమ నరణిమై పరఁగు సంకరము, । తతభంగి ధరణిలోఁ దల్లియేకులము
నాకులంబేయగు ననులోమజునకు. । సాకల్యముగ నిది సామాన్యమైన
తెఱఁగు; విశేషించి ధృతి మునివరుల । గురుతింప విజ్ఞాన గురుతపో మహిమఁ
జేసి తద్ద్విజజులు సృష్టిలోపలను । వాసికెక్కంగ భూవర, యోని యెద్ది
యైనను భూసురులగుదురు నిజము. । ఆ నెలవున నృపు లనులోమవృత్తి
వరున నాత్మప్రభావముల స్వకీయ । తర (?) బీజజులకును దమకులంబగుటఁ
బరఁగింత్రు; ముని నృపవర్యులవలన । నరవితోఁ గల్గిన జన్మంబులెల్లఁ
దతభంగి బీజప్రధానంబులగుచు । నతిశయిల్లును; విను మా వశిష్ఠుండు
గానకాని ఋశ్యశృంగుఁడు నగస్త్యుండుఁ । బనివడి వ్యాస కృప ద్రోణముఖ్యు
లవని జన్మించిన యవ్విధంబెల్ల । వివిధ రీతుల భువి విందుమే కాదె !
వినుతింపఁగా నిట్టి విషయంబునకును । విను మనువచనంబు విధువంశతిలక !
మునుల జన్మంబును మునుమిడి నదుల । జననంబు సిద్ధుల సంభవం బర్థి
వసుధఁ జర్చింప నెవ్వరికిని వశమె ! । వసుమతీనాయక, వైభవలీల. ”
అనవుడు “దానంబు కర్హమైనట్టి । ఘనుఁడు బ్రాహ్మణుఁ డెట్టిగతివాఁడు ? లింగి
యయ్యెననో ? యలింగై చరించుటనొ ? । యియ్యెడ నాకు నీ వెఱిఁగింపు. ” మనిన

## భీష్ముఁడు ధర్మజునకు దానపాత్రభూతుల తెఱఁగెఱిఁగించుట

“ నిరతిమై విప్రుండు నిజవర్తనమున । ధరఁ జరింపుచునున్న దానార్హుఁడగును
ఎనయ నలింగియైనను లింగియైన. ” । అనవుడు నప్పాండవాగ్రణి యనియె :
“ ఎలమి దానములకు నెట్టిబ్రాహ్మణులు । అలవడఁ బాత్రంబు లది యెఱిఁగింపు. ”

అనవుడు " సద్ధర్మ క్రోధనులును । జనసుత, దాంతులు సత్యశీలురును
నిజకర్మ నిరతులు నెఱి నలుబ్ధకులు । విజితేంద్రియులు శుచుల్ విమలసమ్మతులు
దాన పాత్రములు ; వేదంబు సాంగముగ । జానొప్పఁ జదువుట షట్కర్మనిష్ఠ
గలిగి తత్త్వవిదులౌ ఘనులకు నీఁగి । కొలఁదిగాదు సహస్రగుణ విశ్రుతంబు.
ఆకలంక గతి యోగ్యుఁడైన విప్రుండు । ఒకరుండు సంప్రీతినొందిన సకల
దేవతా పితృతతి తృప్తిఁ బొందుచుండు. । భూవర, పూర్వాహ్ణమును నపరాహ్ణ
మును దేవ పితృకార్య ముఖ్యకాలములు." । అనిచెప్పి మఱియు నిట్లనియె భీష్ముండు:
" మొగిఁ గాలహీనంబు భుక్తశేషంబును । దగ నమంత్రము వీతతంత్రము కీట-
కేశ ప్రదుష్టము క్షితిని రాక్షసుల । వాసిగాఁ గొంద్రు ; దేవపితృక్రియలను
వడి దురాత్ములైనవారికిఁ బెట్ట । దనయుక దానిని దైత్యులు గొంద్రు.
మత్తుని జడుని నున్మత్తునిఁ బతితు । శస్త్రవిక్రయు వైద్యుఁ జెలఁగి రోగస్థు
నంగవిహీనుని నపగతనియమము । నంగనఁ గ్లీబుని నటుని గాయకుని,
బ్రాణి విక్రయమున బ్రదికెడునతని, । రాణించి సోమవిక్రయుని, నామ్నాయ
విక్రయుఁ, గన్యకా విక్రయు, ధర్మ । విక్రయు, సంధ్య తా విడిచినవాని,
నలిమీఱి యౌపాసనము లేనివానిఁ । గొలఁది వడ్డికి నిచ్చి కుడిచెడివాని
దైవపిత్రర్థమై తగదు పెట్టఁగను. । ఓ నృప, చెప్పెద యోగ్యుల వినుము :
భోజనార్థులఁ దృప్తి పొందించు నతఁడు । శ్రీజాశ చోరులచేతఁ జేటొంది
ధనము వాంఛించు నాతఁడు, వ్రతంబునకు । నసంచిన యుద్యాపనము సేయఁ దలఁచి
యర్థించు నాతఁ, డత్యంతంబు భక్తి । సార్థత గురువుల జననీజనకుల
దారపుత్రులఁ బ్రోవఁదలఁచెడి యతఁడు । ధారుణిలోపల దానయోగ్యుండు.
చలివంద్రియును మఱి సత్రసాలయును । గొలఁది మీఱిన అచ్చకొట్టము వ్రచ్చి
తిరిగెడు వాఁడును, దేవతాదులను । గురువుల నిందించు క్రూరకర్ముండు
నతిథి వృద్ధాదుల కాహారకలన । మతులిత గతిని జేయనివాఁడు, మఱియుఁ
గృతమతి విషశస్త్ర కేశవిక్రయుఁడు, । సతుల శస్త్రముచేత నంగనాజనము
లను భూమిదేవతలను గోగణముల । నెనయంగఁ దఱిసి పోయినవాఁడు, జనులు
మొగి నడచెడి మార్గమునఁ గంపయడఁచి । పగగొని కొయ్యలు పాఁతినవాఁడు,
నేరమి లేకయే నెపమిడి ధనము । నూరక కొనియెడి యుర్వీశ్వరుండు

మాయావతులఁ గాఁగ మగువలఁజేసి । పాయక కామంబు ప్రబలఁ గావించె.
అంతటఁ బురుషులు నబ్జలోచనల । చింతావిచేష్టతఁ జిక్కులఁ బడుచు
కోపరోషాది దుర్గుణయుతులైన । భూపాల, సామర్థ్యములు లేకపోయె;
నమరులు ప్రియమంది రట్లుగావునను । గమలేక్షణలు మాయగలిగి యుండుదురు.
ఘనముగా దీనికిఁ గథయొక్క టేను । వినిపింతు వినుము సద్విమలచిత్తమున.

## దేవశర్మయును మునిభార్య రుచియును దాని చరిత్రము

జగతిలోపల దేవశర్మ యనంగఁ । బొగడొంద వెలసిన మునివరు భార్య
రుచియను నంగన రూపలావణ్య । నిచయ మనోహర నీరజాతాక్షి
కల, దొక్కనాఁడు చక్కఁగ దేవశర్మ । కలవడి నొక్క యాగమ్మున కర్థి
నయ మొప్ప నుపదర్శనంబు గావింప । రయముసఁ బోవుచుఁ బ్రకటించి యపుడు
తన శిష్యు విపులునిఁ దగవొప్పఁ బిలిచి । మునుమిడి యేకాంతమున నిట్టులనియె:
" రుచి వేచి తిరుగును రూఢి నింద్రుండు । ఉచిత విస్ఫూర్తుల నోపుణ్యమూర్తి!
దాని నెఱింగి నేఁ దద్దయు రక్ష । శ్రీ నిత్యముఁ జేయఁ జేరలేఁడతఁడు.
కావున నాకింకఁ గ్రతువు సేయింపఁ । బోవంగ వలయు నద్భుతవృత్తి నేఁడు,
ఒగిఁ బరదార సముత్సుకత్వమునఁ । దగిలియున్నాఁడు సుత్రాముండు గాన
ఘనముగా రుచికి రక్షణ విధానంబు । నొనరింపు." మనిన నయ్యెరు తపోధనునిఁ
గనుఁగొని విపులుండు కరమర్థిఁ బలికె: । " అనఘాత్మ, యేరీతి నాఖండలుండు
చనఁ జొచ్చునో పరసతి గమనమున ? " । కనుటయు నిట్లను నా దేవశర్మ:
" అవని ననేకమాయలు గలవాఁడు; । భవదూర, పెక్కురూపములు గానేర్చు;
క్రిమి మృగ పశు పక్షి కీటాది జంతు । సముదాయ రూపంబు నవరింప నేర్చు.
అవియెల్ల నీతితో నరయంగ వలయు । భువిఁ బుణ్యపురుష, యేఁ బోయి వచ్చెదను."
అని యప్పగించుచు యాగంబునకును । మునిపతి పోయిన, మొగి విపులుండు
తనచిత్తమున నవధానంబు గలిగి । వనితఁ గాచుచు నుండె వసుధాధినాథ !
ఆరీతినుండియు నటనొక్క వెరవు । వారక యూహించి వడి విపులుండు
" నొనరఁ బ్రవేశింతు యోగప్రభావ । మున రుచికాంతను ; ముని నెమ్మనమున
నిది తప్పుగా నెన్ను నే! వెరపేల । యదియ చేసెద నుపాయము శంకదక్కి."
అని వితర్కింపుచు నా సతియొద్ద । ననయంబు భక్తితో నాసీనుఁ డగుచుఁ

బనివడి యుచితసంభాషణంబులను । జెనసి యెంతయుఁ గొంతసేపు దెల్లించి
లలి యోగమాయాబలంబునఁ జేసి । తెలివితో యోగ సుస్థితి నడపుటయుఁ,
బవనుఁ డాకసమునఁ బరఁగు విధముసఁ । బ్రవిమలగతిఁ జేసి భామదేహమునఁ
గలిసి నయ్యింతికిఁ గానరాకుండ. । వెలయంగ నిట్లు ప్రవేశించియుండు—
నంతఁ బురందరుఁ డధికతేజము । నంతయుఁ జనుదెంచి యెలమి నవ్విపులు
నిజ శరీరము చూచి నిద్రగాఁ దలఁచి । భజన నున్మత్తుఁడై పరికి పలేక
చెలిమితో మునిపత్నిఁ జేరంగవచ్చి । పలికె నిట్లని మృదుభాషణంబులను:
"తరళాక్షి! నీవుకతంబుగా మరుఁడు । పరుఁడి నెపుడు నా భావంబుఁ గలఁచు.
అరయంగవలవదే యజ్ఞాక్షి, నన్ను । గరమొప్ప నీ నిండుఁగౌఁగిటఁ జేర్చి.
అవిరళవిస్ఫూర్తి నీసుధరామృతంబు । చవిచూపవేనాకుఁ జపలాయతాక్షి!
తలకొని నీ వాక్సుధావృష్టిచేతఁ । జలమున విరహాగ్ని చల్లఁగాఁ జేయు."
మనుచు బల్కినవిని యమ్మునిపత్ని । మన మొప్పఁగా మూఢమతియయి లేచి
యలవున నెదురేఁగి యాదరింపంగఁ । గొలఁదిగాఁ దగిసపల్కినకును జొరఁగ
నేరక యూరక నెఱి నుండె; నంత । వారక తమకించి వాసవుండనియె:
"ఏను సురేంద్రుండ నిభరాజయాన! । జానొప్పఁ గామాగ్ని [1] నలసలఁ గ్రాఁగె;
నన్ను మన్నింపుమెంతయుఁ గృపతోడఁ । గ్రన్నన." ననిన నక్కాంతాలలామ
తనువున నున్నట్టి తాపసోత్తముఁడు । వనితాంగమును బాసి పసున నిజాంగ
వర్తియై యంతలో వాసవుఁజూచి । "ధూర్తవు గాక బంధుర కీర్తినిధివె!
తేవతో మున్ను గూడిన భగాంకత్వ । మూనల మఱచితే! యుఁట్పండ, పొమ్ము.
గుఱుతుగా మద్గురు కోపాగ్నిచేత । నరియ దివేశత్వమది గ్రాఁగిపోదె!
ఒనర నే శపియింప నొల్లనుగాక । ఘనమైన భస్మంబుగాఁ జూడలేనె!
ఇట్టిదుర్గుణముఁ నెన్నఁడు మాన; । వెట్టివాఁడవొ గాని యిందు మేలెద్ది!"
అనవుడు విపులుని యాయోగబంఁము । మనమున నెఱిఁగి వేమఱు బలవైరి
వెలవెలఁ బాఱుచు విధి దూఱిదూఱి । తెలియంగ నమరావతీపురికరిగె.
తదనంతరమున నెంతయు విపులుండు । పొదలంగ రుచినిఁ బ్రబుద్ధఁ గావించె.
అరుదార నంతలో నా దేవశర్మ । యరుగుదెంచినఁ జూచి యాశిష్యవరుఁడు

1. 'పొదగు మానము కామశిఖఁ గ్రాఁగె.' అని, తిక్కన.

ఎనయఁ జేతులుమోడ్చి యేకాంతముననుఁ । 'అనిమిషనాయకుఁ డరుదెంచి సిగ్గు
భయమును బడిపోనో బరువడిననుచు । రయమున నెఱిఁగింపఁ, బ్రకటించి పొగడి
యువనిలో నభిమతంబగు వరమీయఁ । బ్రవిమల స్ఫూర్తిఁ దపం బాచరించె.
ధృతమతి నంతట దేవశర్మయును । శతమన్యుభయము నిచ్చలుఁ దక్కియుండె.
అంతలో నొక్కనాఁ డయ్యాశ్రమమున । కంతంతఁ జదల దేవాంగన యొకర్తు
కొదవంగ దానిచేనుండి వే ప్రిదిలి । ... ... ... ... ...
... ... ... ... .. । తావిగల్గిన పుష్పదామంబు వడిన
దివ్యవికాసంబు దివ్యసౌరభము । దివ్యకాంతియుఁ జూచి ధృతిఁ బెంపుమీఱి
యారుచి కరమున నది ధరియించి । యారూఢగతినున్న యంతటిలోన,
నంగదేశాధీశుఁడగు చిత్రరథుఁడు । నంగతిగాఁ దన నతియును రుచియుఁ
దోడఁబుట్టువులునై తోడరుటఁ జేసి । యోడక తనయింటి యుత్సవంబునకు
సాదరంబున రుచిసహితంబుగాఁగ । నా దేవశర్మఁబాయక పిలిచినను
రమణిఁ జంపానగరంబున కర్థిఁ । బ్రమదంబుతోడుతఁ బయనమై కదలి
కూరిమి నద్దివ్య కుసుమ దామంబు । నారుచి కొప్పున నలవొప్పఁ దూరిచి
చని మహోత్సవమెల్ల నరవితో నడపి । యొనరిన వేడుక నుండఁ, దద్భగిని
వదపడిపువ్వులపరిమళంబునకు । వదలకచ్చెరువంది వామాక్షిఁ జూచి
"యిట్టి సౌరభమును నిట్టిమృదుత్వ । మిట్టికాంతియుఁ గాన ; మీపువ్వులెచటఁ
గలిగెను జెప్పవే కాంతాలలామ ! । యలరంగ." ననిన "మదాశ్రమంబునను
గలవని యెఱిఁగించి కడఁకతో రుచియుఁ । జెలియలి వేడుక చెల్లింపఁ దలఁచి
తనపతి కెఱిఁగింపఁ, దగ దేవశర్మ । యనఘుని శిష్యుఁ బుణ్యాత్ముని విపులు
నలవడ రావించి యత్తెఱంగెల్ల । వలనొప్పఁ గాఁ జెప్పి "నడిఁదెమ్ము పువ్వు"
లనిన నట్టిద కాకయని విపులుండు । పొసరంగ నట్టిపువ్వులు గన్నచోటు
నారుచి నెంతయు నడిగి యావేళ । నేరుపు మెఱయంగ నిజతపశ్శక్తి
గురుని సామర్థ్యంబు గొనకొనియాఁది । పరఁగంగ నప్పుడప్పురికినై పోయి
యెలమి దైవికముగ నెప్పటిచోటఁ । దలకొని సురపుష్పదామకంబున్నఁ
గని పుచ్చుకొని వేడ్కఁ గదలి యేతేరఁ, । జనవొప్ప నొక్కెడ నతియును బటియుఁ
జెనసి యొండొరువులచెట్టలు పట్టు । కొని సంభ్రమంబునఁ గూరిమితోడ
నవ్య చక్రభ్రమణంబుగాఁ దిరిగి । దివ్యత 'వేగంబ తిరిగితి' వనుచుఁ

దమలోన వాదించి తద్దయు నొకఁడు । "క్రమమున నేపట్టిగతిఁ దిరిగినను
సరవితో విపులుండు చన్నట్టిగతికి । నరుగును." నని పల్క నమ్మాట వినుచు
మఱియును బోవంగ మార్గంబునందుఁ । దఱలక యార్వురెంతయు జూదమాడి
యనయంబు దైవాఱ నారీతిఁ బలుక । విని విషాదంబున విపులుఁ "డేనకట
జగతిలో నేమిదోషంబు చేసితినో! । యగణిత మదవృత్తి." నని విచారించి
"రమణమై రుచిశరీరము ప్రవేశించు । నమితవైఖరి తోడ నస్మద్గురునకు
నెఱిఁగింపకుండితి; నిదియ కానోపు । నుఱక తప్పిద." మని యొదవుశోకమునఁ
బొరలుచుఁ జనుదెంచి పుష్పదామంబు । గురువుల కిచ్చినఁ గొని దేవశర్మ
మఱఁదలి కొసఁగి ప్రేమంబున నంత । వెఱచుచున్న యవ్విపులునకనియె:
"ఓదయాకర, తెరువున నతీపతుల । జూదరులను నీవు చూచితె! వారు
నీయందధర్మంబు నెఱయంగ నరసి । పాయక పలికిన పలుకులు వింటె!
అలవడ రుచిఁ గాచినప్పటిమాట । యెలమితోడుత నాకు నెఱిఁగింపకునికి
నలరంగ నిది కడు నన్యాయముగను । దలఁచిరో? వగవకు ధారుణిలోన.
నరసత నది కిల్బిషము గాకయుండ । వరమిచ్చితిని దాని వగమతి మఱవు.
మొనర నమ్మిథున మహోరాత్ర, మర్థి । నెనయు నయ్యార్వురు ఋతువులు." ననిన
గురుని బోధమునకు గురుశరాద్భుతము । నరవిఁ గృపావిశేషమునకు ముదముఁ
బొందు శిష్యునితోడఁ బొలుపు దీపించి । యందంద మఱియు నిట్లనె దేవశర్మ.
... ... ... ... ... । ... ... ... ... ...
పరిహరించితి విట్లు భామ రక్షించి । పరమ పుణ్యుఁడ" వని పలికి యాగురువు
తనసతి శిష్యులుఁ దాను మోదమున । ఘనమైన పుణ్యలోకములను బడసె.
ఓపాండవాగ్రజ, యువిదల విధముఁ । బ్రాపుగా వారినిరక్షించు తెఱఁగు
ననయంబు నీరీతి నరిదియై యుండు." । అనవుడు మఱియు నిట్లనియె ధర్మజుఁడు:

### భీష్ముఁడు ధర్మజునకు గాంధర్వాది వివాహంబుల తెఱఁగెఱిఁగించుట

"నవ్య కన్యా వరణప్రకారంబు । భవ్యాత్మ, చెప్పవే పాపముల్ వాయు."
ననిన ధర్మజుఁ జూచి యాపగేయుండు । వినుమని యెంతయు వినిపింపఁ దొడఁగె:
"కులమును శీలంబు గుణమును విద్య । గలవానిఁ బిలిపించి కన్య నీయంగ
వలయును భక్తితో వారిప్రదాన । కలితంబుగా బ్రాహ్మగతి యిది యనఘ!

పురుషునిఁ గన్యక వలపొందఁ గోరఁ । గరమర్థిఁ బురుషుండు కన్యకఁ గోర,
నరుదార మీఱఁ బరస్పరానురాగమున । నరయంగఁ జేసిన నది క్షాత్రమండ్రు.
కలగొని మనమును గన్నులుఁ దనియ । నెలమితోఁ గన్నియ యెవ్వానిఁ గోరు
వానికి నిచ్చిన వన్నె కెక్కింప । దానిని బుధులు గాంధర్వంబటండ్రు.
కరమొప్ప వెలవన్నె కన్నియఁ దీయ । బరఁగ నాసురమండ్రు పౌరవముఖ్య!
ఘనమగుఁ గన్యక గలవారిఁ బొడిచి । వనిత యేడ్వఁగ నింటివారు దుఃఖంప
బలిమి మైఁ గొనివచ్చి పరిణయం బగుట । యలవడ రాక్షసమని చెప్పఁబడును.
ధీరాత్మ, యీ యైదు తెఱఁగులయందు । ధారుణి మూఁడు విధములు ధర్మములు.
ఆసురంబును రాక్షసాహ్వయం బర్థి । దోసంబు సద్ధర్మ దూరంబు వినుము.
జననియు జనకుండు సరవితో భ్రాత । లును లేకయుండిన లోలాయతాక్షి
యురుతర విస్ఫూర్తి యోగ్యంబుగాదు । పరిణయం బాడంగఁ బార్థివవర్య!
[అవనీసురునకు నిజాన్వయ మందు । నవల రెంటను వివాహంబు యోగ్యంబు;
తగదు శూద్ర వరింపఁ; దనజాతి రమణి । జగతీధవునకు వైశ్యయు విహితంబు.
అమరంగ వైశ్యన కట శూద్రునకును] । దమవంశములఁ బెండ్లి తగు నరనాథ!
రాజును వైశ్యుఁడు వర శూద్రకన్య । నోజ వరించుటయును గల్గియుండు."
అన విని భీష్ముతో యమతనూభవుఁడు । "అనఘ, విప్రునకు శూద్రాంగనఁ బెండ్లి
నేయంగఁ దగు నని చెప్పంగ వింటిఁ । బాయక యతనికి భార్యలు మువ్వు
రని చెప్పితివి యేమి?" యనిన నిట్లనియె: । "అనయంబు విషమమైనట్టి కార్యంబు
వసుధఁ బాటిల్లిన వంచియయ్యెనను । బొసఁగంగ మఱి లాభమున నైన శూద్రి
భార్యగాఁ గొనునట్టి బ్రాహ్మణుండర్థి । ధైర్యాత్మ, యతఁడు పాతకుఁడు; సవ్విధము
నాలసి వేడుకతోడ నొక్కొక్క యెడలఁ । గలిగియుండిన దూష్యకలితమున్ గాదు.
గరిమతో నుత విప్రకన్యకు రాజ । తరుణికి వైశ్యకాంతకుఁ బుట్టినట్టి
తనయులును గురునాథ! ద్విజులనఁగ । ననయంబుఁ బరఁగుదు; రది శూద్రభామ
కును నుదయించిన కొడుకుకు లేదు." । అనవుడిట్లని పల్కె నా ధర్మరాజు:
"దొరఁగొని నాల్గుజాతుల భామలకును । ధరణిదేవునకు నుద్భవమైన సుతుల
కనయంగ భాగంబు లెట్లుండు?" ననినఁ । బనివడి యిట్లని పల్కె భీష్ముండు:
"రాసి బ్రాహ్మణుని యర్థము పదిపాళ్లు । చేసి భూసురతతి శ్రేష్ఠజునకును
నాలుగు, క్షత్రియానందనునకును । బోలంగ నెంతయు మూఁడుభాగములు,

నోలి వైశ్యాంగన కుదయించినట్టి । ... ... ... ... ...
వానికి రెండు, నుర్వర శూద్రసతికి । మానుగాఁ బుట్టిన మహితాత్మునకును
నొకపాలు నీరీతి యుచితంబు" ననినఁ । బ్రకటితంబుగఁ బల్కెఁ బాండవాగ్రజుఁడు :
' ఇతరవర్ణంబుల కెట్లుగా ధనము । క్షితిలోనఁ గలుగును జెప్పవే !' యనినఁ
దనర గంగానదీతనయుఁ డిట్లనియె : । " ఎనిమిది భాగంబు లిలపతి సొమ్ము
గావించి క్షత్రియాంగనపుత్రుకుండు । భావింప నాలుగు భాగముల్, వైశ్య
సతి తనూజుండు నిచ్చలు మూఁడుపాళ్లు, । నతులిత శూద్రజుఁ డరయ నొక్కటియు
భాగముల్ గనువారు పార్థివముఖ్య ! । బాగొప్ప వైశ్యసంపద వైశ్యజునకు
నాలుగు, శూద్రికానందను కొకటి । వాలాయముగ శూద్రవరునకు నెందుఁ
బెనఁగికొనఁదగ దాతని కిఁకతప్ప । ననయంగ నంశంబు లిట్లు వర్తిల్లు.
నరి హవ్య కవ్య మజ్జన భోజనముల । కరయ విప్రునకు విప్రాంగన గాని
గణుతింప నితర పంకజముఖుల్ గారు । గుణనిధి!" యనినఁ గోర్కులు పల్లవింప
మఱి భీష్ముఁజూచి ధర్మజుఁ డిట్టులనియె : । " గరగరి తత్పుత్రక్రమ మెఱిఁగింప
వలయుఁగా" కనిన దేవవ్రతుండపుడు । పలికె ధర్మజుఁ జూచి " పార్థివ, వినుము

## భీష్ముఁడు ధర్మజున కౌరసాది పుత్రభేదము తెఱఁ గెఱిఁగించుట

పరికింపఁగా నాత్మ భామిని యందు । సొరిదిఁ బుట్టిన నౌరసుండనఁ బరఁగుఁ
బనివడి యాతఁడు ప్రథముఁ డుత్తముఁడు. । తన సుత గన్నట్టి తనయునిఁ గొనిన
ఘనత నాతనిఁ బుత్రికా పుత్రుఁడండ్రు । ... ... ... ... ...
ధర్మపథంబునఁ దనపత్ని ననిచి, । యర్మిలిఁ బరపురుషార్థా వంగతిని
గన్నట్టి పుత్రుండు కౌరవనాథ !। యెన్నంగ క్షేత్రజుఁ డీధాత్రిలోన.
ఒనరంగఁ దలిదండ్రు లుదకప్రదాన । మున నీయఁగా దత్రిముఁడనఁ బరఁగు.
తలిదండ్రులను బాయు తనయునిఁ దెచ్చి । సలలితముగ నాత్మ సదృశుఁగాఁ జూచి
చెలిమితోఁ గొడుకుఁగాఁ జేకొన వాఁడు । నలవడఁ గృత్రిముఁ డనఁగఁ బెంపొందు.
ఎఱుఁగక యుండంగ నెవ్వనికైన । నెఱిమిఱిఁ బరభార్య యం దుద్భవించు
కలితాత్మజుఁడు నాతిగల వాని సుతుఁడు । పొలవ కొంతయు గూఢజుండన మీఱు.
లలిఁ దల్లిదండ్రులొల్లక విడిచినను । దలకొని యితరుండు తనపుత్రుఁ జేయ
నలి నాతఁ డపవిద్ధనామకుఁ డండ్రు. । ... ... ... ...

లేవమిఱంగఁ బెండ్లియుఁ గాకయున్న । భూవర, పితృగేహమున సుతుఁ గనిన
దానిఁ బెండ్లాడు నాతని కానుతుండు । కానీన నామంబు గలిగి వర్ధిల్లు.
జననాథ, గర్భిణీసతిఁ బెండ్లియైన । నొనరిన సుతుఁడు సహోఢుఁ డెంతయును.
విభుఁడు తా విడిచిన వెలఁదియు భర్త । రభటిమై నిడిచిన రాజీవనయన
ఘనత నెవ్వరికైనఁ గన్నట్టి తనయుఁ । డనఘ, పౌనర్భవుండనఁగఁ బెంపొందు.
రూఢిమైఁ దల్లిదండ్రులు లేకయున్న, । వీడచే వారలు విడిచినఁ దన్ను
దాన సుతుండుగా ధరణిలోపలను । జానొప్ప నొరునకు సరవిమై నొసఁగు
తనయుఁ డాతఁడు స్వయందత్తుఁ డనంగ । వినుము వర్తిల్లునో విధువంశతిలక!
సరవితో జననియు జనకుండు నమ్మఁ । బరఁగిన క్రీతుండు పాండవముఖ్య!
రూఢి నీబన్నిద్దరునుగూడ భూప । చూడామణీ, కర్మశుద్ధు లౌరసుఁడు
గరిమతోఁడుత నెల్ల కర్మంబులకును । వరమతి ముఖ్యుండు; వానినపోలుఁ
బుత్రికాసూనుండు; భువిఁ దక్కినట్టి । పుత్రు లుభయవంశమునఁ బూజ్యులనఘ!"
అన విని మఱియు నిట్లనియె ధర్మజుఁడు: । "మునికొని సంవాసమునఁ బుట్టినట్టి
యనుపమస్నేహంబు, నావులమహిమ । వినిపింపవే!" యన వేడ్క నిట్లనియె:

## చ్యవన నహుష సంవాదము

"చ్యవనుని నహుషుని సంవాదమర్థి । భువి నితిహాసమై పొలుపు దీపించు.
అందు నీవడిగిన యర్థంబు దెలియుఁ । బొందుగా వినవయ్య భూపాలవర్య!
నవ్య గంగా యమునా సంగమమున । భవ్యుఁడై చ్యవనుండు భార్గవసుతుఁడు
గ్రుంకి తపోనిష్ఠఁ గూర్చుండి యుండ । నంకించి మీనంబు లటఁ జుట్టుకొనుచుఁ
దనువునఁ జెందంగఁ దగ మూర్కొనంగ । మునుకొని కృపయును ముదమును గదుర
వలనొప్పఁ బండ్రెండు వర్షంబులుండె. । కలగొన నట్లుండఁగా నొక్కనాఁడు
జాలరుల్ వలల నచ్చటి మీలనెల్ల । నాలోనఁ బట్టుచు నమ్మహామౌనిఁ
గూడ మత్స్యములతోఁ గొనకొని దివిచి । పాడిదప్పితి మని భయముల మ్రొక్కి
తప్పు సైరింపవే తాపసారాధ్య! । యిప్పుడెఱుంగమి నింతేసి పుట్టె.
ననవుడు మత్స్యంబులందలి కూర్మి । ఘనముగా వలలఁ జిక్కిన వానిఁ జూపి
వదలక వీని సావాసంబు వలన । నదనుగాఁ గడుఁ జాల నర్మిలిఁ బెనిచి,
పొలుపొంద జలచరంబులతోడఁ బ్రాణ । ములు విడుచుటగాదు; మొగి వీని నన్ను

వినుతింపఁగాఁ జేయు వెలలకు నమ్ము । కొనుఁ" డన్న వారు గ్రక్కునఁ బోయి నహుషు
కెఱిఁగింప భటపురోహిత సమేతముగ । వఱలు భయంబుఁ వచ్చి, సాష్టాంగ
దండప్రణామ మత్తపసికిఁ జేసి । నిండిన భక్తితో నృపవర్యుఁ డనియె :
"ఓ సంయమీశ్వర, యుజ్జ్వలతేజ, । భాసుర జ్ఞానప్రభావ, సద్బోధ,
చెలరేఁగి బోయలు చేసిన కీడు । నిలలోన నేభంగి నీఁగంగ నేర్తు
సర్వాపరాధక క్షమ నన్ను గావు । గర్వితేంద్రియ మద ఖండనోద్దండ!"
అనిన దయాళుఁడై యాచ్యవనుండు । ననయంగ నహుష భూమీశ్వరు కనియె :
"కోరి బోయల నిజకుల ధర్మవృత్తి । నాయాధి నపరాధ మనఁదగ దధిప!
వరఁగ వీ రాయాసపడిరి వీరికిని । ధరణి నాయొడలికిఁ దగినట్టి జెట్టి
నీవయ్య, నీ" వన్న నృపుఁడాత్మలోన । "భావింప ధన్యుఁడీ పరమపుణ్యుండు"
అని "కిరాతులకు సహస్రనిష్కములు । వెసఁగొని యిం" డన్న విని భార్గవుండు
"అది వెలగా" దన్న నయుతంబు చెప్పె. । పదపడి మునియు నెప్పటిమాటలాడ
"లక్ష యి" మ్మనిన "నేలా తగ" దనిన । నాక్షణంబునఁ గోటి యప్పగించినను
'వెల తగ' దనిన భూవిభుఁడు "రాజ్యంబు । సలలిత విస్ఫూర్తి సగమిత్తు" ననియె.
"అదియును గా" దన్న "నఖిల రాజ్యంబు । నదను మీఱంగ బోయల కిత్తు" నన్నఁ
దలయూఁచి యాజెట్టి 'తగ' దన్న నృపతి । తలపోసి మంత్రులుఁ దాను నేకాంత
మున విచారింప, నిమ్ముల గవిజాతుఁ । డను ముని చనుదెంచి యవనీశుఁ జూచి
"నహుష భూనాథ, యింతటి మాత్రమునకుఁ । దహతహ పడ నేల! తగిన మూల్యంబు
ననయంగ నీకు నే నెఱిఁగింతు వినుము. । గొనకొని గోవులకును బ్రాహ్మణులకుఁ
గులమొక్కటియ చేసెఁ గూరిమి బ్రహ్మ, । అలవడ వివిధాగ మాశ్రయుండైన
యవని దేవునకు మూల్యంబు వాక్రువ్వ । శివునకు రాద ; యీక్షితి నావుకట్ల.
కావున గోవునొక్కటి నిమ్ము చాలు । నేవేగ" ననిన భూవిభుఁడు మోదించి
చ్యవను డగ్గఱి వచ్చి "సంయమి తిలక ! । భవదీయ తనువుకుఁ బ్రతియిది యనుచుఁ
బలుకంగవచ్చునే బ్రహ్మకునైన! । చెలిమితో నావు నిచ్చెదఁగాక" యనిన
సంతోష చిత్తుఁడై సమ్మతించినను । అంత భూవిభుఁ డిచ్చె నావు బోయలకు.
ఇచ్చిన జాలరులెలమి నమ్మునికి । నచ్చుగాఁ బ్రణమిల్లి "యనఘాత్మ, వినుము
కనుఁగొనుటాదిగాఁ గరుణయ కాని । కినుక యించుక లేదు కృతకృత్యమతివి.
ఈ యావు నిచ్చెద నివుకు మీ" కనుచు । నాయెడ నీయంగ నాచ్యవనుండు

"మీనముల్ మీరును మేనుల తోడ । నా నాకలోకంబు కరుగుఁ డెంతయును."
అని పల్క వారును ఆక్షణంబునను । జనిరి స్వర్గమునకు జనలోకనాథ!
అంతట చ్యవనుండు నాగవిజాతుఁ । డెంతయు సహానుభూమీశ్వరుఁ జూచి
"ధర్మపరత్వంబుఁ దగునింద్ర భోగ । నిర్మల గతియును నీకగు" ననుచుఁ
జనియె; భూవిభుఁడును సదనంబు కరిగె." । అనిచెప్ప మఱియు నిట్లనె ధర్మరాజు
'పరఁగఁ గౌశికుఁడును బరశురాముండు । ధరఁ బుట్టినట్టి విధంబెల్లఁ గొంత
వింటి; సందేహ నివృత్తిగా నాకు । నంటునఁ జెప్పు మంతయు." నన్ననియె:

## చ్యవన కుశిక సంవాదము

చ్యవనుండు నిజకులసంకరంబింక । సవడిమైఁ గుశికువంశము కారణముగఁ
గలయదియని యాత్మఁగని యంతలోన । వలనొప్పఁ గుశికుభూవరునిపాలికిని
జనిన నాతఁడు సతీ సహితంబుగాఁగ । వెనుకొని యర్ఘ్యాది విధులఁ బూజించి
"మునినాథ, రాజ్య మిమ్ముల నిత్తు నీకుఁ । గొను" మన్న "రాజ్యమేఁ గొననొల్లవ్రతము
చరియింప వచ్చితి జనవాథతిలక! । తరుణియు నీవు నెంతయుఁ బరిచర్య
గావింపఁ జోపినఁ గడఁకతో." ననిన । నావేళఁ గుశికుండు నటు సమ్మతించి
మలసి యభ్యంతర మందిరంబునకు । మెలపుతోఁ గొనిపోయి మృదుల తల్పమున
నిలిపె; నతంటిలోన నీరజాప్తుండు । పొలుపొంద నపర సముద్రంబులోన
మునిఁగిన, సంధ్యాది ముఖ్యకర్మములు । మునినాథుఁడును దీర్చి భోజనంబడుగ,
నతులిత పంచమహాపదార్థముల । నతనిఁ దృప్తునిఁ జేయ, నా సెజ్జఁ జేరి
"యేనును నిద్రవోయెద మీరు నిద్ర । మాని భోజనమును మఱి విసర్జించి
కలగొని యే మేలుకనునంతదనుక । దెలుపక యడుగు లొత్తినఁ జాలు" ననిన
'సవుఁగాక' యని వార లంగీకరించి, । దవిలి నిద్రించు నాతని పాదములను
నొత్తంగ నిరువది యొక్కటి చనియె । నత్తఱి దివసంబు; లమ్మఱునాఁడు
కరమొప్ప నిద్రమేల్కని యిల్లు వెడలి । యురువడిఁ బోవంగ, నొగి దంపతులును
వెనుకొని చ్యవనుని వెంటనే పోయి । నను, నాదరింప కంతటఁ బురి వెడలి
యాకుశికుఁడు చూడ నంతర్హితాత్ముఁ । డై కానరాకున్న, నా వధూవరులు
జగతిపైఁ బొరలి మూర్ఛాగతులగుచు । వగపుతో మఱికొంత నడికిని దెలిసి
మగిడి యింటికి వచ్చి మఱి సెజ్జ మీఁదఁ । దెగువతో మున్ను నిద్రించిన పక్కఁ

దక్కి యుండొక పక్క దగ నిద్రవోవు । నక్కమనీయ దివ్యాంగు మునీంద్రుఁ
జ్యవను నట్టులు గాంచి సంతోషమంది । తివిరి పరిశ్రాంతి దిగఁ ద్రావి తొంటి
గతిఁ బాదయుగళంబు గ్రక్కున నొత్తె । ధృతి నిరువది యొక్క దినములు చనియె.
అంత మేల్కాంచి తైలాభ్యంగ మడుగ । నంతయుఁ దెప్పించి యలరెడు మేను
శిరము నభ్యక్తముల్ సేయ, నమ్మౌని । ధరణీశుఁ డిట్టె యంతర్హితుండైన,
మది విచారము లేక మనుజేశ్వరుండు । పదపడి యున్నట్టి పరఘటికందుఁ
గానంగ వచ్చి వేడ్కనుదీర్ఘమాడి । మానుగా వారలు మహితాన్నపాన
ములు పెట్టఁగా లేచిపోయిన, వారు । నలిరేఁగి యూరకున్నంత, నావగలు
రాత్రియుఁ బుచ్చి వారక తెల్లవాఱఁ । జిత్రంబుగా వచ్చి క్షితిపుని జూచి
పరువడి నరదంబు పన్నింపు ; నీవుఁ । దరుణియు వహియింపఁదగు ; వేడ్కనిక్క
యలవడ రత్న గోహయ కనకాది । కలితముల్ యాచక గణము కీవలయు."
ననవుడు కుశికుండు నంగీకరించి । జననుతంబుగఁ దేరు నమకట్టి యపుడు
దాపట నింతియుఁ దా వలపటను । బ్రాపుగా వహియించి భవ్యవస్తువులు
దెచ్చియ మంత్రులఁ దెఱఁగొప్పఁ బనుపఁ, । జెచ్చెర రథమెక్కి చెలరేఁగి మౌని
నిశితమౌ ములుకోల నెత్తురులొలుక । దిశలకు రొప్పుచు దీనకోటులకుఁ
గనకాంబరాదులు ఘనముగా నిచ్చి । మునుమిడిఁ బూచిన మోదుగులట్టు
లుండ, నచ్చెరువంది యొనరు వేడుకను । దండి మీఱంగ రథంబంత డిగ్గి
పొసఁగ వారల శిరంబునఁ గట్టినట్టి । యసదృశ పాశంబు లల్లన విడిచి
రమణ మీఱఁగ శరీరములు హస్తమున నిమిరి । "డస్సితిగదే నృపకులోత్తంస!
వరమిచ్చెదను రేపు, వగవకు మీవుడు । పురమునకరిగి యిమ్ముదితయు నీవుఁ
దిరముగా భాగీరథీ తీరమునకు । నరుదెంచు పొం" డన్న నంజలి చేసి
చ్యవనుని వీడ్కొని సాద్భుత లీలఁ । దవిలి జనంబులు తనవెంట రాఁగఁ
బురము ప్రవేశించి భూపాలవరుఁడు । కిర మొప్పఁగా రాత్రి గడపి వేగుటయుఁ

చ్యవనుఁడు తన యోగబలంబునఁ గుశికునకు నాకలోకంబు చూపుట

గాలోచిత క్రియల్ కడువేగ నడిపి । యాలోనఁ జనిచని యాగంగఁ దరిసి
మనమొప్ప నవరత్న మణిమయ ఖచిత । కనక హర్మ్యము చూచి కడువిస్మయమున
జాసొప్ప వేదాంత సంగీత నృత్త । మానసీయములైన మండపంబులును,

కోకిల శుక భృంగ కూజితంబులకు । నాకరంబైనట్టి యారామములును,
కలహంస టిట్టిభ క్రౌంచ నాదముల । వలితంబులైనట్టి పద్మాకరములుఁ,
బ్రాకట విస్ఫూర్తి బర్హిణస్వచ్ఛ । కేకాధ్వనుల నొప్పు క్రీడాచలములుఁ
గలిగి నాకముఁబోలి గంధర్వయక్ష । కలితాప్సరలు వేడుకల విహరింపఁ
గనుఁగొని కుశికుండు కాంతయుఁ దాను । మనమున హర్షించి "మహనీయమహిమ!
గలదొ! నిక్కమొ! యిది కాక నాకంబొ! । కొలఁదిగా కుత్తర కురువసుమతియొ!
తనువుల తోడ నత్తాపను కరుణ । గనుఁగొనఁ గల్గె నిక్కడ" యని యుబ్బి
యరుదంది యాహేమ హర్మ్యంబు సొచ్చి । పరికించి మణిమయ పర్యంకమునను
గామించి మునివర్యుఁ గనిన యాక్షణము । యామేడయును గన్న యావిశేషములు
గృతమతితోడ నదృశ్యంబులైన । సతివయుఁ దానును నట్టిట్టు మెలఁగి
యకోకన నొక్కడ నతులసమాధిఁ । దక్కకయున్న యత్తాపసుఁ గాంచి
భూపాల వర్యుండు పొలఁతి కిట్లనియె: । "ఓపద్మనయన, యిట్లుండునే మాని
యోగబలంబు? ఈయుర్వీరాజ్యంబు । భోగంబు సులభంబు; భూసురత్వంబుఁ
దపము దుర్లభమిట్టి తపమునఁ గాదె । విపుల దివ్యప్రభా విశ్వరూపమునఁ
జెలరేఁగి తనయిచ్ఛఁ జేయుచున్నాఁడు । వఁ నొప్పు" సన మాని వారలఁబిలిచెఁ.
బిలువ సతీపతుల్ ప్రేమ రెట్టింప । నలి మీఱ దండ ప్రణామముల్ చేసి
ముకుళితహస్తులై ముందఱనున్నఁ । బ్రకటించి దీవించి "పార్థివోత్తంస!
వరమిత్తు వేడుము వలసిన" ననిన । గురుతర భక్తితోఁ గుశికుఁ డిట్లనియె:
"గరిమతో నినుఁ గొల్వఁగను నింతకంటె । వరమెద్ది? యో భక్తవత్సల, మిమ్ము
నడిగెద నొక్కటి యానతీవలయు । నెడపక యీవు మాయింటికి వచ్చి
కేలిమై నొకపక్క కిందుగా నిదుర । యోలిమై నిరువదియొక్కదినములు
పోయితి; వయ్యాది మొదలు నీచరిత । మీయెడ నెఱిఁగింపవే నెమ్మి" ననిన
చ్యవనుఁ డిట్లని పల్కె "జననాథ! వినుము । దిక్షజులు ధాతను దిరిగిరాఁ గొలిచి
యుండంగ, మఱి ప్రసంగోచితంబుగను । నెండుగా నప్పరమేష్ఠి యిట్లనియె:
"కోరికతో భృగు కుశికవంశజుల । భూరి బ్రహ్మక్షత్రములు తడఁబడఁగ
సంకరంబగునని సరవిఁ జెప్పుటయుఁ । బంకించి యోర్వక భవదీయకులము
చెలగి నిర్మూలంబు చేయంగఁ దలఁచి । బలిమి వ్రతంబు నెపంబిడి యున్ని
గలిగించితిని మీరు గడు డస్సి యెపుడు । అలవడి నాకడ్డమాడినఁ బట్టి

కపియింతు ననుచు ; నోజననాథతిలక, । యిపుడు మెచ్చితి వరంబిచ్చితి." ననుచుఁ
దనువులతోడ నెంతయుఁ ద్రిదివంబు । గనుఁగొనునట్లు గంగాతీరమునను
గల్పించితిని ; దానిఁగని నరేంద్రత్వ । కల్పనఁ జొరక నిష్కపట విప్రత్వ
మందుసన్నృపాలుఁడవై తది యెఱుంగుదును. । పొందుగా నీకును మూఁడవవాఁడు
నుసిశిత బ్రహ్మతేజోమూర్తి యగుచు । జనియించు వరము నిచ్చెలు వేడు." మనినఁ
బరువడి మానవపతి "నీని కంటె । వరమును గలదె పావనసుచరిత్ర !
ధరణి మదీయ సంతానంబు ధర్మ । నిరత విప్రప్రాప్తి నిత్యంబుగాఁగఁ
గరుణింపవే ! " యన్నఁ గడుమెచ్చియిచ్చి । "మరలుము నీమనుమందు త్రిలోక
పూజనీయుండన్నఁ బుకమిూశుఁ డేమి । తేజంబుకతమున ద్విజుఁడగు?" ననిన
చ్యవనుఁ డిట్లనియె : "నస్మద్వంశమునను । గువలయంబున బుచీకుండను వాఁడు
జనియించి నీగాత్రసంభవుఁడైన । ఘనుఁడు పుణ్యాత్ముఁడు గాధియన్వాని
కూఁతును భార్యఁగాఁగొను ; దానివలన । నాతతిఁ బుట్టిన యా జమదగ్ని
యందు ధనుర్వేద మావహించి । యందంద యుండును ; అవ్విశేషంబు
తత్పుత్రునందు నెంతయు ఫలియించు. । తాత్పర్యముగ నది దైవకృత్యంబు,
తెలియ బుచీక గాధి వధూజనముల । ఫలితాద్యనుష్ఠాన పరివర్తనంబు
కారణంబుగ నృపక్షయ కారియైన । యారాముఁడును బ్రాహ్మణాగ్రణియైన
కౌశికుండును బుట్టఁగలరు నిక్కపము. । వాసిగా యుష్మదన్వయము భార్గవుని
కులసంయుతం" బని కూర్మితోఁ జెప్పి । తలకొని మాని యంతర్ధాన మైనఁ
గుశికుండు భార్యతోఁ గూడ సంతోష । వశగతుండై ధాత్రిపర్తించె ననఘ !
భృగురామ కౌశికోద్భూత మివ్విధము, । అగణిత క్రమ వృత్తి" ననిన ధర్మజుఁడు
తాతతో నిట్లను "దాన విశేష । మే తెఱంగో నాకు నెఱిఁగింపు ప్రీతి"

## భీష్ముఁడు ధర్మరాజునకు దానవిశేషముల తెఱఁగెఱిఁగించుట

ననవుడు భీష్ముఁ డిట్లనియె : "నోరాజ ! । వినుము చెప్పెద నీకు వివరంబుగాఁగ.
ఉర్విలోపలను గాంశ్యోపదోహయుత, । సర్వ కార్తస్వర చారు శృంగయును,
ఐన గోవును దక్షిణాభియుక్తముగఁ । బూనిక భవ్య విప్రునకు నిచ్చినను
ఎన్నంగ దానికి నెన్ని రోమములు । నన్ని వే లేఁడులు నమరలోకమున
వడి నేడుతరముల వారితో నుండు. । పుడమియుఁ గన్యక పొలుపైనగృహము

కనకంబు వస్త్రంబు ఘనతరాన్నమును । వనము నాసనమును వాహనంబులును
విప్రున కిచ్చిన వెస నిహపరము । లప్రయాసంబున నటఁ గల్గు నిజము"
అన విని ధర్మజుం "డఖిల దానముల । నెనయ నుత్తమమెద్ది యెఱిఁగింపు." మనిన
"వసుధఁ గోరినయట్టి వస్తువిచ్చినను । ఎసఁగ నాదానంబె యెక్కుడై పరఁగు.
అఖిల భూతములకు నభయ మిచ్చుటయు । నిఖిలేశ, వినుమ యన్నిటికన్న ఘనము.
తెలియ శాత్రవుఁడైన దీనుఁడై తన్ను । వెలయంగ శరణని వేడిన వానిఁ
జెనసి మన్నించి రక్షించిన యతఁడు । మునుమిడి పురుషోత్తముండనఁబరఁగు.
ప్రతినగా నిజదార పరులును యజన । రతులు కామక్రోధ రహితులునైన
ధరణి దేవతలకు ధనము లిచ్చినను । సురనాథ సముఁడునై సొంపు దీపించు.
జగతిలోపల నయాచకునిఁగా నెఱిఁగి । యగణిత గతి నిచ్చుటధిక ఫలంబు.
ఎలమి దీపింపంగ నిన్నిటి కంటె । నిలలోన భూదాన మెక్కుడు ఫలము.
ధన ధాన్యములును వస్త్రములు రత్నములు । పొనరంగ నీధాత్రిఁ బుట్టిన కతన
నెనయంగ నన్నియు నిచ్చినఫలము । గనును ధాత్రీదానకర్త యెంతయును.
హెచ్చుగా నల్పమయ్యిన భూతధాత్రి । యిచ్చిన బహుభూమి యేలునా ఘనుఁడు.
రాజు విశేషించి రణమృతి యొందెఁ । బూజిత భూదాన పుణ్యంబు నొందెఁ
బడయంగ వలయును; బాపు భూదాన । మడరిన బ్రహ్మహత్యాది పాపముల
వేగంబె భూదానవిధి యశ్వమేధ । యాగంబు సదృశమం ద్రాదినంయములు.
చెలఁగి దారిద్ర్యంబు చేతఁ గుందుచును । అలవడ నెవ్వరి నడుగంగఁ బోవ
కెంతయుఁ గృశమయి యిలలోనఁ గ్రుంగి । యంతంత సాత్వికుండై పుణ్యుఁడైన
ధరణిదేవునకు భూదానంబు సేయు । నరయంగఁ దత్ఫల మధికమై పరఁగు.
క్రతుకర్తయును శాంత కలితుండునైన । క్షితిసురుఁ బ్రార్థించి చెలిమితో భూమి
దానమిచ్చిన నట్టి దానంబునకును । బూనిక నేదానములు సరిగావు.
విను మర్త్యుఁడైనట్టి విప్రవర్యునకు । మన మొప్ప గోచర్మ మాత్రమయ్యినను
ధరయీయ నెట్టి పాతకమైనఁ జెడును । తరణి తేజంబునఁ దమమును బోలె.
కృతమతితో భూమి గీతలనంగ । క్షితి యీనతిచ్చె నేఁ జెప్పెద వినుము.
మునుమిడి పరశురాముఁడు విని తొల్లి । పనివడి భూదానపరుఁ డయ్యె ననఘ!
ప్రీతితో వసు నిండు రెండులోకముల । నాతఁడెఁ జెడనట్టి యశమును సుఖము
పడయంగఁ గోరినఁ; బ్రతి దీనికింక । నెడపక సరియుఁగా నేదానములును.

తరమిడి యితరుల దానమయ్యెనను । అరయంగఁ దమయిగఁ యయ్యెన నన్న
హరియింపఁగా నరకాగ్నులఁ బొరలు. । కెరలి యీ యర్థంబు గీష్పతి నడుగ
సురపతి కెఱిఁగించె సొంపుగా నతఁడు । ధరణీశ్వరుండు పాతకముల నెలవు
దెలఁగి భూదానంబు చేసినఁ గాక । యలవడ నొక్కట నది వ్రయమగునె !
ధర నొరుఁడిచ్చిన ధర నెవ్వఁడైన । హరియింపఁగా నిరవై యెక్కుతరము
వారిని కౌరవవానులఁ జేసి । నారకంబునఁ దాను నడుముగాఁ బడును.
ఎనయంగ భూదాన మిచ్చెద ననుచుఁ । దనర నీకున్నఁ బాతక మధికంబు ;
అడుగక యిచ్చుట యధిక పుణ్యంబు ; । పుడమిలో నారదముని నాకుఁ జెప్పె.
అన్నదానముఁ బోలు నధిక దానంబు । ఎన్నంగలేదు భూమీశ్వర, వినుము.
దంటగాఁ బ్రాణ విదారక మన్న । మింటి జనంబుల కిడక యయ్యెనను
అతిథికిఁ బెట్టుట యధిక పుణ్యంబు. । అతివథ శాంతుని సంధుని వృద్ధుఁ
బనివడి కావను బాలుని వికలు । వనితను గడపక వడి నిడవలయు.
గృహమేధి కవమతి కినుకయుఁ దగదు. । మహనీయమగు కుక్క మాలండు మొదలు
గాఁగ నాఁకలిగొని కడఁగి వచ్చినను । లోఁగక యిడవలె లోలత్వముసను.
కులమును విద్యయు గుణము వర్తనము । నలవడ వలదెంచ నన్నమిడుటకు.
అన్నదానంబున నమరుఁడై యమృత । మెన్నంగభుజియించు నేవు దీపించి.
వెనుకొని నక్షత్ర విషయంబులైన । ఘనదానములగీతి గణుతింతు వినుము.
కృత్తికా ఋక్షను క్షీరాన్న మిడిన, । హత్తించి రోహిణియందు మాషములు,
నైందవమందు మాంసాన్నంబు, నార్ద్రి । నందంద గోవును, నదితిఁ బుల్గమును,
గురుతారఁ గనకంబుఁ, గోరియాశ్లేష । నరుదార రౌప్యంబు, నట పితృభమునఁ
దిలలు, భగుం డధిదేవత యగుచు । వెలయు తారను తేనె, వెస నుత్తరందు
పరవి క్షీరోన్మిశ్రసాష్టికాన్నంబు, । సరసి జాప్తునితార నకరి రథంబు,
చిత్ర శ్రీగంధంపుఁజెక్క, యాస్వాతి । నత్తరిఁ దనప్రియమైనది, మఱియు
నెలమి విశాఖంచు నె, ద్దనూరాధఁ । దలకొనిపై చీర, తగ శక్రభమునఁ
గఱివేము, మూలఁ దక్కఁగ ఫలంబులును । దఱిని బూర్వాషాఢదధిమాక్షికాన్న
మల యుత్తరాషాఢయందును, వినుము । నలతిత హరి వసు శత తారకములఁ
బరఁగఁ బూర్వోత్తరాభాద్రలఁ బొప్పఁ । బరువడి నశ్వినీ భరణుల యందుఁ
దాంబూలమును బండి తనరంగ యువలుఁ । గంబళంబును మేక కంచుకుండయును

ఒనరంగ ఘోటకయుత శకటమును । ఎనయంగఁ దిలధేను లివి యుక్తమొనఁగ
ఎలమితో నిన్నియు నిచ్చిన ఫలము । గలుగుఁ గాంచన దానకర్తకు నధిప!
ధరణిలోఁ బానీయదాన ముత్తమము. । చెఱువులు నూతులుఁ జెలములు భక్తిఁ
గావింపఁగాఁ బుణ్యగతివచ్చు వినుము. । ... ... ... ...
సరవితో మండువేసవియందు మనుజుఁ । డరయంగ నెవని జలాశయంబులను
స్నాన పానాదులు జరపునో యతఁడు । మానుగా దివిజశ్వమహిమఁ బెంపొందు.
గరగలొసఁగిన ఘనుఁడు భూసురులు । గరిమ నాచమనాది కర్మముల్ సేయ
నలవడ నందు షష్ఠాంశమైనట్టి । ఫలమందు; నెగడికిఁ బచన క్రియలకుఁ
దగ నింధనములిచ్చి ధనవంతుఁ డగును. । తగవొప్ప గోడుగిచ్చి తనయులఁ బడయు.
సకల కామ్యకదాన సముము రథంబు । సకలంక గతి నిచ్చు టనఘాత్మునకును.
రమణతోడుతఁ బాదరక్ష లిచ్చినను । విమతులఁ ద్రొక్కుచు వెలయంగఁ దిరుగు.
ఉర్విలోఁ దిలదాన మొసఁగిన సతుల । బర్వంబులను బొందు పాపంబు లణఁగు.

## నృగ చరిత్రము

గోదాన మిచ్చిన గురుపుణ్య మగును; । ఆదట నృగునకు నది ప్రమాదించె;
నది యితిహాసమై యవనిలోఁ బరఁగు; । విదితంబుగా నీకు వినుపింతు వినుము
పొలుపొంద ద్వారకాపురి నొక్క నూతఁ । దెలియ నూసరవెల్లి తిరుగుచు నుండఁ
గని జనులెల్లరుఁ 'గలఁచె నీనీరు' । అని బలు ద్రెవ్వఁకుల నటఁగట్టి తిగువఁ
గదలక యుండినఁ గని విస్మయముగ । నది కృష్ణు కెఱిఁగింప నాతండు వచ్చి
వెడలంగఁ దివిచి యవ్విధ మెఱింగియును । అడిగిన శ్రీకృష్ణు కనియె నాతొండ:
"ఒక్కనాఁ డేనొక్క యుర్విదేవునకుఁ । దక్కక వేడ్క గోదాన మిచ్చినను
అతఁడు గొనిపోవ నది మేఁత కరిగి । కాతర స్థితిని మాకదుపులఁ గలిసె.
గోవుల మఱియును గోపాలవరులు । వేవిధంబుల దానవిధికిఁ దెచ్చినను
వానిలో నదియును వచ్చిన దెఱఁగ । కేను వేఱొకవిప్రు కిచ్చితిఁ గడఁగి.
ఇచ్చిన నాతఁడు నేవు దీపించి । యచ్చుగాఁ దమయింటికై గొనిపోవ
మునుపటి విప్రుండు మొగి దానిఁజూచి । 'యొనయంగ విమవుము యిది నాదుగోవు'
అనవుడు పిదపఁ గొన్నతఁడు నిట్లనియె: । "జననాయకుండిచ్చె సరవితో నాకు
నీకు నెక్కడిదియావు? నెఱి" నని మిగులఁ । దాఁకొని వాదించి తగ నేఁగుదెంచి

తమ తెఱం గెఱిఁగింపఁ దగ నేను గుంది । కొమరొప్పఁగా మున్ను గొన్న బ్రాహ్మణుని
బ్రార్థించి ప్రార్థించి పరఁగ మన్నింపు; । మర్థితో నూఱువేలావుల నిత్తు;
విడువుమీ ధేనువు విమలాత్మ!' యనినఁ । గడు దీనవదనుఁడై కడఁకతో ననియె:
"కరమొప్పఁగాఁ బాలుగల దిది సాధు । సొరిదిమై నాప్రియసుతుఁడు పాలకును
బరఁగ నేడ్చినఁ జన్నుపట్టంగ నిచ్చు, । నరయంగ నెట్టి ప్రొద్దయ్యెన; నిట్టి
యావు నే విడువ నీయాన వేవేలు । ఆవుల నిచ్చినన్నైన నోరాజ !"
అనిన రెండవ విప్రు నరయఁ బ్రార్థించి । "వినవయ్య ధనము వేవేలు గోవులును
ఎన్నైన మఱియు నీకిత్తు నిష్టములు । మన్నించి యీయావు మముఁజూచి విడువు"
మనవుడు "నీరాజ్య మంతయు నాకు । నెనయంగనిచ్చిన నేనిది విడువ"
నని చలంబునఁ బోయె; నటఁ గాలవశత । ఘనముగాఁ గాలునికడకేఁగ నతఁడు
నన్ను వీక్షించి "భూనాయక, పాప । మున్నది నీయందు; నొగి మున్ను పాప
మనుభవించెదో! పుణ్యమనుభవించెదవో ?" । అనిన నసౌఖ్య మేనట నమ్మతించి
కడఁక మన్నము క్రిందుగా ధరఁ బడఁగ । నడరు నప్పుడు వింటి యముని వాక్యంబు
"నరసిజాక్షుఁ డనేక సంవత్సరముల । కరయంగ నేతెంచి యతి కృపాదృష్టి
నుద్ధరించును నిన్ను నొప్పుగా" ననుచు । నుద్ధరించితివి నేఁడో పుణ్యమూర్తి !"
అని ప్రణామము చేసి యమ్మహీవిభుఁడు । చనె విమానస్థుఁడై స్వర్గంబునకును.
అనవుండు ధర్మజుం "డనఘ, గోదాన । మునఁ గల్గుఫలము చెప్పుము నాకు" ననిన

## గో ప్ర భా వ ము

నితిహాస మొక్కటి యే వినిపింతు । క్షితిలోపలను శ్వేతకేతుఁ డన్మౌని
తలకొని యిధ్మముల్ దర్భకట్టయును । జలపూర్ణకలశంబు నరవిమై మఱచి
నలిమీఱఁ దనయుని నాచికేతాఖ్యు । నలవడఁ బిల్చి తెమ్మని పంపుటయును
అతఁడు పోయిన యంతకు మున్న । వీతెంచి యొకయేటివెల్లువ ముంచె.
ముంచినఁ గానకప్పుడు వచ్చి తండ్రి । కంచితగతిఁ జెప్ప నాఁకలి దనదు
కర్మవైకృతమును గని నిల్వలేక । కర్మిష్ఠి "జముని మొగము చూతుగాక "
యని శాపమిచ్చిన నబ్బాలకుండు । గొనకొని మ్రొక్కి చేకొనుము నన్ననుచు
రహికెక్కఁ జేతనారహితుఁడై పడినఁ । దహతహపడి యంతఁ దండ్రి చింతించి

యురయఁ బశ్చాత్తప్తుఁడై "పుత్రునకట । యిరవుదప్పఁగ శపియించితి" ననుచుఁ
దన్నె యుంగక పడి తద్దయుఁ దెలిసి । కన్నుల నీళులు గారఁ నేడ్చుచును
అద్దినశేషంబు నయ్యామినియును । బద్దనేయుండ, సూర్యోదయవేళ
సతని కన్నీరున నాప్లుతంబైన । సుతుఁడు ప్రాణము వచ్చిచూచినఁ, దండ్రి
యాశ్చర్యచిత్తుఁడై యందంద పొంగి । నిశ్చలితాత్ముఁడై నెమ్మి నిట్లనియె :
"ఎక్కడికేఁగితి? వేమి చూచితివి? । తక్కక యెఱిఁగింపు తనయ, నా" కనిన
నక్కుమారుండును నప్పుడే లేచి । మ్రొక్కి యిట్లని పల్కె ముదము దీపింప :
"వినవయ్య మీయాజ్ఞ వెలుఁగుచు మిగులఁ । గొనకొన్న సమవర్తి కొలువుకూటంబు
చేరంగఁ బోయినఁ జేరంగఁ బిలిచి । యారూఢి నర్ఘ్యపాద్యాదు లర్పించె.
అర్పింపఁ గైకొని యసుధర్మరాజు । నేర్పుతోఁ గనుఁగొని నెమ్మి నిట్లంటి:
"ఏలోకమున వసియింపుదు నేను? । వాలాయముగఁ జెప్పవలయు నా" కనిన
"చావవు నీవు నీజనకునిఁ జూడ । వేవేగఁ బొ" మ్మన్న విని యిటు లంటి
"పుణ్యలోకమ్ము లిమ్ములఁ జూడవలయుఁ । బుణ్యాత్మ, చూపవే! పొందుగా నాకు"
అని విన్నవించిన నట్లకాకనుచు । ఘన వాహనారూఢుఁ గావించుకొనుచు
దయతోడ నాకేలు తనకేలఁ బట్టి । నయమొప్ప *పుణ్యముల్ నాకుఁ జూపినను
ఆనంద మెసఁగ నుద్యాన వాటికలు । జానొప్ప భక్ష్య భోజ్య మహీధరములు
కృతకృత్యమగు దుగ్ధ ఘృత సరిత్తులును । అతులిత భోగయోగ్యపదార్థములును
రాసులై యుండంగ రమణ వీక్షించి । యాసతోఁ గాలుని నడిగితిఁ దెలియ
అడిగిన "నదియెల్ల నవనిలోపలను । ఎడపక గోదాన మిచ్చినయట్టి
పుణ్యుల" వని చెప్పఁ "బొలుపొంద మ్రొక్కి । పుణ్యముల్ గనుఁగొని పొనఁగవచ్చితిని."
అని శ్వేతకేతున కా నాచికేతుఁ । డెనయఁ జెప్పినరీతి నేను జెప్పితిని."
అనుచు దేవవ్రతుం డా ధర్మజునకుఁ । జెనుపొంద నెఱిఁగించెఁ బ్రీతితో ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె ననిచెప్ప వెండియు మునులు
అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే! యని యడుగుటయు
రాజశేఖరనుత, రాజీవనయన, । తేజోదివాకర దేదీప్యమాన,
పన్నగాంతక వాహ, పాపసంహార, । పన్నగశయన, శ్రీపతి, పద్మనాభ,

* పుణ్యలోకములనుట.

వైకుంఠనాయక, ద్వారకావాస, । లోకలోచన, ధర్మశీల, ముకుంద,
ఘనమాని హృద్గేహ కలిత సందోహ । వినుత ప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనచరిత, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్య తనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర రచిత
మానుశాసనికాఖ్యమైన పర్వమున । ననుపమంబుగ ద్వితీయాశ్వాస మయ్యె.

# తృతీయాశ్వాసము



శ్రీకామినీసంగ, చిరదైత్యభంగ, । కాకోల గళనుత, కంజదళాక్ష,
జనమేజయునకు వైశంపాయునుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:

**భీష్ముండు ధర్మజునకు శ్రీకృష్ణుని చిత్ర చరిత్రంబు చెప్పుట**

ఆరీతి భీష్మండు యమతనూజునకు । నారాయణాభిధాన ప్రభావంబు
వసుధ దానప్రియ వచనముల్ చెప్పి । మసలక ప్రీతితో మఱియు నిట్లనియె:
"పరగఁ గృష్ణుఁడు సుతుఁ బడయుట కొఱకు । సరవితో రుక్మిణీ సహితుండై కదలి
హిమవన్నగంబున కేపుతోఁ బోయి । శమవృత్తి ద్వాదశ సంవత్సరములు
వ్రతనిష్ఠ నుండంగ వత్స గార్గేయ । చతుర పర్వత పైల శౌనక కణ్వ
కౌండిన్య దేవల గాలవ రేభ । శాండిల్య భరత విశ్వామిత్ర రైభ
నారదముఖ్య సన్మౌని వర్గంబు । లారూఢితో వచ్చి యర్ఘ్యాది విధులఁ
బూజితులై యంతఁ బుణ్యసత్కథలు । ఓజతోఁ జెప్పుచు నున్న యావేళ
హరి ముఖంబున నప్పు డనలంబు వెడలి । ధరణీ ధరము నేర్చెఁ దరుమృగయుక్త
ముగ, వెండియును సౌమ్య ముఖ్యావలోక । సుగుణత్వమున దానిఁజొప్పడ నడఁచె
పొసఁగఁ బూర్వాకారమున నవ్వనంబు । అసదృశ గతి మించె నద్భుతంబుగను.
దానికి మునులు చిత్తంబున భయముఁ । బూని యాశ్చర్యంబుఁ బొందుచు నుండి
పరఁగంగఁ జిత్రరూపంబులో యనఁగ । నరుదదందుచుండ శ్రీహరి వారి కనియె:
"ఈ మహిలోన మీరీ యగ్ని తెఱఁగు । నేమిగా నెఱిఁగితి? రెఱిఁగింప వలయు."
అనవుడు తపను లిట్లనిరి: "యోదేవ! । వనజపత్రాక్ష! శ్రీవత్సాంక! కృష్ణ!
ఈ విశ్వమంతయు నేవు దీపింప । నీవలనన పుట్టి నీయందె యణఁగు.
స్థావర జంగమ తతులు నన్నియును । నీవమై యుండంగ నేర్తువు గాన
నీవ చెప్పఁగ వలె; నే మెఱుంగకయు । భావించి నివ్వెఱ పడితి" మనుటయుఁ
గరుణారసము చల్లుఁ గడకంటి దృష్టి । పరఁగించి యిట్లనుఁ బద్మాధవుండు:
"ఒక దానవుండు సర్వోర్వి నాశకుఁడు । ప్రకటించి కలఁడు; చంపఁగఁ జాల వాని.

అది యెటులన్న దివ్యాస్త్రసంపన్న । విదునిఁగాఁ జేసితి వేడ్కతో నేన.
అది నిమిత్తంబున నాదైత్యవరుఁడు । మదియించి లోకముల్ మడియంగఁ జేసె.
కావున నిప్పుడె ఘనతపోనిష్ఠ । గావించి పుత్రునిఁ గాంచి యాధూర్తుఁ
జంపంగ వ్రతములు సలుప, మహాత్మ । పెంపున నగ్నియై పేర్చి పద్మజుని
కడకేఁగ, నాతఁ డంగజుని శీఘ్రముగఁ । గొడుకుగాఁ బంచి మగిడ్చిన వచ్చి
వడిఁ బోవుచును నిట్టి వనమెల్లఁగాల్చె । తడయకేఁ బూర్వవిధమునఁ జూచితిని.
దహనంబు తెఱఁగిది తాపసులార! । విహితమయ్యెన పురావృత్తంబు చెప్పి
నన్ను మన్నింపుఁడు" నావుడు వారు । వెన్ననిఁ గనుఁగొని "విశ్వలోకేశ,
పెనుపొంద మము నింత పెద్దసేయుదువె! । గొనకొని పెద్దలకును బెద్దవీవు.
ఘనదేహ, నీవెఱుంగని కథ గలదె!" । అనవుడు చిఱునగ వాననాబ్జమున
మొలవంగ నిట్లనుఁ: "బుడమిలో నేను । ఒలసి యెంతయు నరయోనిఁ బుట్టితిని
గాన మిమ్మడిగెదఁ గలితాత్ములార! । జానొప్పఁ జెప్పరే సరవితో నాకు."
అనుటయు సన్మునులందఱు నియ్య । కొని నారదునిఁ జూచి కోర్కి దీపింప
"నీవెఱుంగుదు వర్ధి నీరజాక్షునకు । భావించి చెప్పు మేర్పడ" నన్న నతఁడు
నలువొప్ప దేవకీ నందనునకును । అలవడ మ్రొక్కి తదభివందనంబు

## ఉమామహేశ్వర సంవాదము

వడసి యిట్లనియె వైభవ వాక్యసరణి: । "అడరంగ నేఁ దీర్థయాత్రలఁ దిరిగి
హిమగిరి కేతెంచి యీశు విశ్వేశుఁ । బ్రమథాధినాయకు భక్తమందారుఁ
గని వందనము చేసి కిఱుకఁదుఁ గొలిచి । చనవొప్పఁ గూర్చున్న సమయంబునందుఁ
బుణ్యాంగనా రూపములు దాల్చి మిగులఁ । బుణ్యనదుల్ గొల్వ భువనైకమాత
పార్వతి యేతెంచి పరమేశు వెనుక । పర్వసంతోష భరితాత్మ యగుచు
నిలిచి మెల్లనె యీశు నేత్రయుగ్మంబు । లొప్పడఁగాఁ దన హస్తపద్మముల
మూసి యున్నంతలో భువనంబు లెల్ల । నా శశి రవి తారకాదులు లేక
యంధకారంబయ్యె; నఖిలభూతములు । సంధిల్ల నెంతయు సంక్షోభమందె.
పరమేశుఁ డప్పుడు ఫాలలోచనము । విరివిగాఁ దంతట విచ్చిన నగ్ని
గప్పె నా హిమవన్నగంబు; బంతె గౌరి । తప్పక యొప్పుమి తండ్రి కయ్యెనను
ఉల్లంబు బెగ్గిల నగ్గుపాదసుల । కల్లన మ్రొక్కిన నాదాహ ముడిపె.

ఉడిపినఁ గనుఁగొని యుమ సంతసిల్లి । యుడురాజశేఖరు నొప్పుగాఁ జూచి
"కరకంఠ, నిటలంబు కను దెఱచుటకు । మఱి కారణంబేమి? మన్నించి చెపుమ."
అనవుడు గిరిజతో నభవుఁ డిట్లనియె: । "తనర లోకాత్మకత్వము నాకుఁ గలుగు
వలన నన్నిద్ది నివ్వటిలఁ బొందినను । కలగొన నన్నిలోకంబుల నదియు
పొందుఁ గావున నేత్రములు నీవు మూయ । నందంద తిమిరంబు నఖిలంబుఁ గప్పె.
కప్పిన భూతముల్ కంపింపఁ జూచి । తప్పక నీదు హస్తములు ద్రోపక యు
చీఁకటి యంతయుఁ జెఱిచెడి కొఱకు । దాకొని ఫాలనేత్రము తెఱచితిని."
అన విని యంబిక హాసంబు నొంది । ఘనముగాఁ దన కడుగవలయునట్టి
వడుగుట కదియపో యవసరం బనుచుఁ ... ... ... ...
"బురదైత్యహార, నాల్గుముఖములు నీకు । గరిమతోఁ గలుగంగఁ గారణంబేమి?
ఆనతి యీవయ్య!" యనిన శంకరుఁడు । ధీనుత, యామహాదేవి కిట్లనియె:
"సొలవక సుందోపసుందు లనంగఁ । గలరు దైత్యులు భుజాగర్వ విక్రములు.
వారిని జంపంగ వలసి మయుండు । ధారుణిఁ గల యొప్పిదములోని మేలు
మహిమతోడఁ దిలప్రమాణముల్ దివిచి । మహనీయయగు నొక్క మానినిఁ జేసి
నలిఁ దిలోత్తమయను నామధేయంబు । కలితంబు చేసి నాకడకుఁ దెచ్చినను
దరళాక్షి నాకుఁ బ్రదక్షిణంబుగను । అరుగుదెంచిన "నిది యమరకార్యంబు
సేయనోపు, నటంచుఁ జిగురాకుఁబోఁడి । ధీయుక్తిఁ దిరిగిన దిక్కుల కెల్లఁ
గలయ నొక్కొక్క ముఖంబుగాఁ దాల్చి । చెలిమితో దానిఁ జూచితి, నాఁటినుండి
మునుకొని యేఁ జతుర్ముఖుఁడ నయ్యితిని." । అనవుడు పార్వతి యభవుని 'గళము
అఱిముఱి నల్లనై నట్టి కారణము । ఎఱిఁగింపవే!' యన నిట్లను శివుఁడు:
"అలవడ జలధి సుధార్థమై తఱువఁ । గలయఁ ద్రిలోక భీకరమైన విషము
పుట్టిన నే కంఠమున ధరించితిని । గట్టిగా." ననిన శంకరుఁ జూచి గిరిజ
"కలితాయుధంబుల కంటెఁ బినాక । మెలమితోఁ బట్టుదు వేప్రొద్దు నీవు;
గరిమతో దీనికిఁ గతమేమి?" యనినఁ । బురహరుఁ డనియె నా పూఁబోఁడిఁజూచి:
"ఆదియుగంబున నబల, కణ్వుండు । మోదంబుతోఁ దపంబును నిష్ఠనలువఁ
జెనుపొంద నతనిపైఁ బెరిగె వల్మీక; । మనయంబు వేణువు నాపుట్టఁబుట్టె.
ఘనతరాయామంబుఁ గలితవిస్తృతియుఁ । గనుఁగొని యంతలోఁ గంజసంభవుఁడు
మునికిఁ బ్రత్యక్షమై మొగి వరంబిచ్చి । ... ... ...

పేర్మితో మునిమీఁదఁ బెరిగిన పెదురు । నర్మిలిఁబుచ్చి పినాక శార్ఙంబు
లొనరించి కడతున్క నొగి గాండివముగ । ఘనముగాఁ జేసె లోకహితంబుగాఁగ.
తనర మూఁడవవిల్లు దాఁ గొని చనియె." । అని చెప్పటయు మేనకాత్మజ యనియె:
"పుడమిలో వాహనంబులు పెక్కుగలుగ । నెడపక వృషభంబు నెక్కుదు వేమి?
ఎఱిఁగింపు." మనవుడు నింపు సొంపొంద । మఱియుఁ బార్వతితోడ మదనారి యనియె:
"హిమనగంబున లోక హితముగా నేను । దమితోడ నెంతయుఁ దప మొనరింప
గోవులు చుట్టుఁ దేకువచెడి తిరిగి । భావింపగాఁ బెక్కు బాధలు పెట్ట
సొలవ కేఁ గోపించి చూడ గోకులము । వలగొని మిగుల సంతాపంబు నొందె.
అరవిందభవుఁడును నమరు లంతటను । అరుదెంచి నమ్ములై యర్థిఁ బ్రార్థించి
కరమొప్ప వృషభంబు కానుక యిచ్చి । పరఁగంగ నాకు గోపతి నామ మిచ్చి
రప్పుడు గోబాధయంతయు మాన్పి । తప్పక వాహన ధ్వజములు గాఁగ
వృషభంబు గైకొంటి వేడుకతోడ । ఝషనేత్ర!" యనవుడు శాంభవి యనియె:
"సలలితంబగు నివాసంబు లుండంగఁ । బొలుపొందఁగాఁ బ్రేతభూమి నుండెదవు.
అది యేమి నెపమున?" ననిన నిట్లనియె: । ["మదిరాక్షి! యబ్జసంభవుఁడు, భూతములు
జనులను బాధించి నమయించుచుండఁ । గని నన్ను 'దత్ప్రతీకార మొనర్పు
మని వేడ నిశ్చలమగు చోటనుండి । చెనసి ప్రాణుల రక్ష సేయంగఁ దలఁచి ]
క్షితి మోక్షపరులు శుచిస్థాన మర్థి । నతిశయంబుగఁ గొనియాడుచుండుదురు !
క్షితి విజనత్వ విశేష మెఱింగి. । [" సతి, యటుగాన స్మశానంబునందు
నివసించి జగములన్నిటి రక్షసేయు; । దవనిలో నే స్మశానావాసినైతి."
అనిన 'సోమునిఁ దాల్ప నదియేమి హేతు?' । వనవుడు " దక్షుని యజ్ఞంబునకును
అలిగి నే సురలఁ జెండాడెడు నపుడు । నలిగి సోముఁడు శరణంబు వేడినను
మనమునఁ గటకటంపడుచు నే నంతఁ । జెనసి యారీతిఁ జేసిన దురితంబు ]
ఏయుపాయంబుల నిందుని నిట్లు । నేయక పోదని చెలఁగి దాల్చితిని,
అలవడ " ననిన " వర్ణాశ్రమ ధర్మ । ములు చెప్పవే!" యన్న ముదముతోఁ జెప్ప
నప్పుడు ధర్మరహస్యాల తెఱఁగు । చెప్పు." మన్నను బ్రీతిఁ జెప్పంగఁదొడఁగె :

## ధర్మరహస్యములు

" గరిమతోడఁ బిపీలికాప్రముఖములు । పురడింప నాకాశమున మశకాదు
లును నల్లి పేనును లోనైనయట్టి । తనరిన జంతు సంతతులను జంప

కెవ్వరికిని ధాత్రి నెలమి నవశము ; । నివ్వటిల్లఁగఁ బాపనిచయంబు లేదు.
భువిలోన విధివశంబున మృతిఁ బొందు । వివిధ జంతువులను వినుము చెప్పెదను.
వరఁగంగ దీపంబుపైఁ బడఁబుర్వు; । తిరముగా దీపమె త్రినవారిఁ బాప
మలవడఁ జెందెనే ! యదియును గాక । చలమొప్ప నాగేటిచాలునఁ జచ్చు
రమణ నానావిధప్రాణులు నరులు । తమవను లొగిఁ జేయ ధాత్రీవశమున ;
నందుఁ బాపములేదు ; యాగంబులందు । సందంద పశువుల నట విశసింపఁ
దనువు విడిచి దేవతాసౌఖ్యమహిమ । గొనకొనుఁ గావునఁ గుంభిని లోన
నెనయ వేదవిహితహింస హింసగను । మనమునఁ దలఁపరు మహితాత్ములెల్ల.
అని యహింసతెఱంగు లన్నియుఁ జెప్ప । విని గౌరి యిట్లను విశ్వేశ్వరునకు :
"కొందఱు సంపద కొందఱు లేమి । చెంది యుండుటయును జెప్పవే దేవ! "

## కర్మవరిపాకము

అనుటయు శంభుఁ డిట్లను గౌరితోడ: । "విను మెఱింగించెద వివరంబుగాఁగఁ
జేర్మి తోడుత బలి భిక్షముల్ పెట్టి । (యర్మిలిఁ గృపణాదైన్యము వాపి పుణ్యా
పరులయి వర్తించి పరహితవృత్తిఁ) । బరఁగిన వారికి భాగ్యవైభవము
గలుగు ; లోభాత్మ దుఃఖముచేయు ధాత । కలయంగఁ జేసిన కర్మఫలమున."
అని చెప్పి వెండియు ననియె నీశ్వరుఁడు: । "ధనము గలిగి యుండి ధవళాయతాక్షి !
కుడువక కట్టక కుహాకత్వమునను । ఒడలోము కొనువార లొరులు చెప్పంగ
నలవడ నుపకారులై తొలుమేనఁ । జెలఁగినవారలు చిగురాకుఁబోఁడి!
ఆయాసపడకుండ నర్థముల్ గలిగి । వేయి విధంబుల వెలసెడువారు
నరవితోడుతఁ బాత్రజనములఁ బిలిచి । యరసి ధనంబిచ్చినట్టి సజ్జనులు.
కలిగియుండియును రోగంబులకతనఁ । జెలఁగి భోగమున భుజింపఁగలేని
మనుజులు తొలిమేన మరణకాలమునఁ । జెనసి దానంబులు చేసినవారు.
ఆలు బిడ్డలు నోఁజటులై లేమిఁగుంది । బాలరోగములు నిచ్చలు పడు నరులు
మున్ను లోభమునను మొగిఁ బరపీడ । చెన్నుగా నెంతయుఁ జేసినవారు.
కలయ జాత్యంధుండు కన్నులు చెడిన । ఖలుఁడు సొంపునఁ బరకాంతఁ దొల్మేనఁ
జూచినపాపి; నిష్ఠురకర్ణరోగి । సూచింప సుజను నిష్ఠుర కటువాక్య
ములను నొప్పించిన మూఢాత్ముఁడతఁడు. । కలయంగఁ బరసతిఁ గన్యను మహిమి

గోవును దురగిని గొనకొని పట్టి । భావజాకేళిని బరఁగిన యతఁడు
కడుపులోఁ దెవ్వులైన కష్టజన్మమునఁ । బుడమిలో జన్మించుఁ బుష్పనుగంధి!
తలకొని యొరుల బంధన మొనరించి । యులుమురోగంబున నుద్భవమందు.
నలువొప్ప సాధుజనంబుల ముష్టిఁ । జలమునఁ బొడిచిన చపలమానసుఁడు
ఘన తిలకాదులఁ గంతుల చేత । గొనకొన్న దుఃఖంబు గనుచుచునుండు.
అశుచిపాదముల దేవాలయం బర్థి । వశముగాఁ ద్రొక్కి పాపన్ములైనవారిఁ
దప్పులేకింతయుఁ దన్నినవారు । కప్పునఁ బాదరోగమునఁ గుందుదురు.
లీల నిర్దయతఁ దొల్లి వినోదముగను । జాల జీవులఁ బట్టి చంపినవారు
ధారుణి గురువులఁ దల్లడపెట్టు । వారు గుల్మంబుల జ్వరములఁ బుండ్ల
వడి మహోదరముల వాతపిత్తములఁ । గడుకఫాములఁ జాలఁ గందుచుండుదురు.
కలయఁ గొల్చుమ్ముచోఁ గ్రచ్చులు గలుప । నలవడ గూనివాఁడై పుట్టు నతఁడు.
సరకుతూచెడువేళఁ జలమునఁ దరపి । యరయఁగఁ బిచ్చుకుంటైపుట్టు నతఁడు.
మొగి సాధుజనముల మోసపుచ్చుచును । దగు ధనాదులు గొన్నఁ దా వెఱ్ఱియగును.
పైతృకదూరులు బాలఘాతకులు । నాతఱి ననపత్యు లగుచుఁ బుట్టుదురు.
శేవతో నెద్దుఁ బట్టించినవాఁడు, । భావజరతి విఘ్నపఱిచినవాఁడు
ధవుని వంచనచేసి ధనము గూర్చినది । భువినపుంసక జన్మమునఁ బుట్టుచుండు.
దాసత్వమొంది యదల్పులఁ దిట్ల । వేసట పడుచుండు విత్తహీనుండు,
తొలిమేన గర్వియై తుది ప్రల్లదమునఁ । దలకొని పెక్కండ్రఁ దప్పేమి లేక
తిట్టియు నడఁచియుఁ దిరిగినవాఁడు । గట్టిగా నెఱుఁగుము కాంతాలలామ!
ఇందు నాచెప్పిన యీపాపకర్ము । లందంద నరకంబు లనుభవించుచును
భూమిలోపలఁ దిర్గి పుట్టుదురతివ! । కామించి." యనిన నగ్గౌరి యిట్లనియె:
"ఆయువేమిట హెచ్చు? నట నెందుఁ దఱుగు? । పాయక చెప్పవే భవరోగహరణ!"
అనవుడు క్షమయు, సత్యంబును గృపయు । ననఘంబు గురుభక్తి యాయువుఁ బెంచు.
అలుకయు బొంకుఁ గ్రూరాత్మవర్తనము । నలవడ గురువైర మాయువుఁ దఱుగు.
వృద్ధార్కరశ్మియు నిష్టి ధూమంబు । శ్రద్ధతో యువతియౌ సతి సంగమంబు,
నిర్మలోదకమును నెఱి రాత్రిక్షీర । మర్మిలి సేవించు టాయువుఁ బెంచు.
బాలార్కరశ్మిని బలుప్రేతధూమ । జాలమానుట వృద్ధసతిసంగమంబుఁ
బల్వలోదకమును బరఁగ రాత్రులను । నిల్వక దధ్యన్న నియమ మెవ్వనికి

నాయువు దఱిగించు నవనిలో; నిట్లు । వేయువిధంబుల వినువ కిరీటి
సుకృతులు వేడ్కతో సురలోకమందు । నకలంకగతి నుందు రాయువుల్ గలిగి.
దురితవర్తనులెల్ల దుర్గతినుండి । యరయ నాయువు గొంచె మగుచుఁ బుట్టుదురు
మండలంబున." నని మఱియు భీష్ముండు । చండికా పురహర సంవాద మర్థిఁ
జెప్పిన ధర్మజ క్షితిపతి భక్తి । నప్పుణ్యునకు మ్రొక్కి హస్తముల్ మొగిచి
ప్రమదంబుతోఁ "బరప్రాప్తి యొద్దాన । ననుకూరుఁ జెప్పవే! చయ్యన" ననిన

### భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తిగల్గు విధాన మెఱిఁగించుట

నారాయణధ్యాన నవ్యపూజలును । సారంపు హరికథా శ్రవణ తత్పరత
యమ్మేలు గావించు యమతనూజాత! । క్రమ్మి బ్రాహ్మణరక్షఁ గలుషముల్ వాయు.
వేశ్యయొక్కతె తొల్లి విద్యాంసు నొకని । గాశ్యపిలోపలఁ గడఁగి దొంగనుచుఁ
దలవరుల్ గారింప దయతోడ వచ్చి । "వెఱయంగ విడువుఁడు వీఁడు మావాఁడు;
అగడంబులు సేయ నగునయ్య! మీకు, । వేగంబె" యని వాని విడిపించి పుచ్చె.
ఆసుకృతమున బ్రాహ్మణియై జనించె, । వేసర కీవును విప్రులఁ బ్రోవు."
మన విని ధర్మజుం డర్థి నిట్లనియె: । "సునిశిత దారిద్ర్య శోక రోగముల
సరవి హరింపంగఁ జాలెడి జపము । నరుదారఁ జెప్పవే" యనిన నిట్లనియె
"హరి హర బ్రహ్మలు నా వినాయకుఁడు । తరణి చంద్రుఁడు సముద్రంబులు నదులు
మరు దశ్వి వసువులు మారుతంబులును । దరమిడి పితృదేవతలును సిద్ధులును
వ్యాస వాల్మీకి కశ్యప కణ్వ కుత్స । వాసిష్ఠ భరతాది వరమునీశ్వరులు
రమణ రంభాద్యప్సరస్స్త్రీలు మఱియుఁ । బ్రమదంబుతోడఁ దపస్సత్యములును
బొనఁగఁ బుణ్యక్షేత్రములుఁ బుణ్యవనము । లనదృశ గృహంబులు హాయనంబులును
దరులును గిరులును ధరణిదేవతలు । వరమతి మొదలైనవారలఁ దలఁచి
యాయురారోగ్యంబు లధిక సంపదలుఁ । గాయక మాకును బ్రబలుఁ గాకనుచు
'వర నమో భగవతే వాసుదేవాయ । పురుషోత్తమాయ విభూషితాంగాయ
సర్వలోక హరాయ సర్వేశ్వరాయ । సర్వలోక హితాయ జలజనాభాయ
ఘనతర సర్వలోక పితామహాయ । (వనమాలినే భక్త పారిజాతాయ)
పరమాత్మనే నమః పద్మనేత్రాయ । మురసంహరాయ నమో నమో" యనుచు
నెలమితో జపియింపు మిమ్మహాజపము । కలుషంబు లడఁగించుఁ గంజారివంశ!"

అని చెప్ప ధర్మజుఁ డంజలి చేసి । “ఘనుఁడ, పూజానమస్కారంబులకును
ఎవరు భాజనములో యెఱిఁగింపు” మనిన । నవఁడి ట్లనియెఁ: “బూజా నమస్కార
ములకుఁ బాత్రంబులు భూమిదేవతలు. । చెలరేఁగి వారికిఁ జేటొనరింప
వాసవుండును జెడు; వారికి ముదము । చేసిన శుభములు సిద్ధించు నిజము.
ధర్మసేతువు లోకధారకం బఖిల । ధర్మశాస్త్రప్రవర్తకము విప్రతయు.
అమ్మహాత్ముల భిజ్ఞు లఖిలమార్గముల । నెమ్మిఁ బూజ్యులు విను నిర్జరావళికి.
సొరిదిమై బాలుఁ డజ్ఞుండనలేదు । సరవి బ్రాహ్మణుఁడు పూజ కర్హుఁ.” డనిన
ధర్మజుం డిట్లను “ధరణిదేవతల । నర్మిలిఁ బూజింప నగు శుభమెద్ది?
వార్తకెక్కుచుఁ జాల వర్ణింపఁ దగిన । వర్తనం బెయ్యది? వారలయందు.
వినిపింపవే! నాకు వెండియు.” ననిన । అనఘాత్మ, యనిలార్జునాఖ్యసంవాద

## పవన కార్తవీర్యార్జున సంవాదము

మను నితిహాసంబు నట నేర్పరింతు । మునుకొని నీ ప్రశ్నములకు నుత్తరము.
వేవిధంబులఁ గార్తవీర్యుఁ డన్ ఱేఁడు । దీవుల నేలి యుద్దీప్తశౌర్యమునఁ
దలకొని ధాత్రి మత్సములు లేరనుచుఁ । బలికిన నాకాశభాష భాషించె:
“ఎఱుఁగక పలికెద వేల గర్వంబు? । అఱిముఱి నీకంటె నధికులుగారె
ధరణిదేవత” లన్న “ధాత్రీశు వార । నిరవొప్పఁగా నాశ్రయించి రక్షింపఁ
బరఁగుచుందురు; భూపాలునికంటె । నరయ నెవ్విధమున నధికులు? చెపుము.
కూర్చిన రక్షింతు; గోనకొనియలుక । పేర్చిన శిక్షింతుఁ బృథివి భూతముల.”
అనిన భయంబంది యా భూతమురుగ । ... ... ... ... ...
గగనంబు నందుండి గంధవహుఁడు । తగవొప్ప నంతయుఁ దన్నెఱిఁగించి
“విప్రరక్షణఁ గాదె వినుము భూపతులు । ఆ ప్రజారక్ష పాయక యొనర్పుటలు.
అవని బ్రాహ్మణులకంటె నధికులు గలరె! । తివిరి యమహావ్యక్షై దివిజేశ్వరుండు
గౌతముండలిగినఁ గష్టంబు పడఁడె! । ఖ్యాతి కుంభజుచేత నణఁగదే జలధి!
అనలుండు భృగుశాపహతుఁడు గాఁడె!” । అనవుడు మాఱుమాట లాడక యున్నఁ
గార్తవీర్యునిఁ జూచి కరువలి యపుడు । మూర్తీభవించి యుబ్బుత్కల నిట్లనియె:
“జగతి [1]నాంగిరస వంశజుఁడౌ నుచథ్యు । కగణితగతి సోముఁ డాత్మజ నిచ్చె.

1. నాంగిరసవంశజుండైన చైథ్యు. అని. మూ.

ఆదంపతులు తమ యాశ్రమంబునను । మోదంబుతోనుండ, ముని యొక్కనాఁడు
యమునానదికిఁ దీర్థమాడఁ బోవంగఁ, । గ్రమమున నాకాంతఁ గామించి తిరుగు
వరుణుఁ డెత్తుకపోయి వడిఁ దనపురిని । గరమొప్ప నునిచెఁ ; దక్కక నారదుండు
ఆ తెఱంగెఱిఁగింప నాపూని యనియె : । "ఖ్యాతిగాఁ దాను దిక్పతి ; తన కిట్లు
తగునె! యొరుని భార్యఁ దగఁ గొనిపోవ? । అగణితంబుగఁ జెప్పు." మనిన నారదుఁడు
చని యవ్విధంబెల్ల జలధీశ్వరునకు । వినిపింప నెంతయు వినక గర్వమునఁ
గామాంధుఁడై కన్నుఁగానక క్రొవ్వి । భామను విడువ కేర్పడ నున్న యంత
నా[1]యుచథ్యునికడ కవుడునారదుఁడు । పాయక చనియిట్లు పలికెఁ దెల్లముగ :
" అంగన విడువని యంతియగాదు ; । రంగుగా వరుణుండు రాజసంబునను
బరఁగ నన్ బెడతఁ బట్టి త్రోపించెఁ । బరువడి." ననినఁ గోపమున నమ్మౌని
లలిమీఱ సర్వజలంబులు ద్రావి । పొలుపొంద వరుణనిపురి ధూళిసేయ
భయమంది వరుణుఁడు పద్మాక్షిఁ దెచ్చి । రయమున నొప్పించి ప్రణమిల్లి లేచి
"తప్పుచేసితి నేఁడు దయఁ జూడు" మనుచు । నప్పుడె ప్రార్థింప నమ్మౌని యతనిఁ
గరుణించి యనిపెను ; గావున ధరణి । సురులా భూమీశులో క్షోణిలో నెక్కు ?"
డనిన నూఱకయున్న హైహయుఁ జూచి । యనయంబు మఱియు నిట్లనుఁబవనుండు :
"సరవి దైత్యులకోడి శరణు చొచ్చినను । సురలకు నాయకన్యుఁడు జయ మొసఁగె.
తిరముగా భాగీరథీ తీరమునను । గరిమ గీర్వాణులు క్రతువొనరింప
వరుసతోఁ బూర్వగీర్వాణులు గాసి । ... ... ... ...
చేసిన సురలు వసిష్ఠుని కడకుఁ । గాసిల్లిపాఱ, రాక్షసుల నమ్మౌని
కోపించి చూచినఁ, గోపానలంబు । దీపించి దైత్యులఁ దెరలించెఁ ; గాన
ఆ కుంభజుండును ఆ వశిష్ఠుండుఁ । జేకొని తక్కువా క్షితిపులకంటె ?
ఒకతఱి సురలకు నోలి దైత్యులకుఁ । బ్రకటించి రణమైన రాహుశస్త్రములఁ
జల మొప్ప రవియును జంద్రుండు నొచ్చి । పొలుపొంద నయ్యత్రిమునిఁ గావుమనినఁ
జంద్రార్క తనువు లక్షతములు చేసి । సాంద్రంబుగా దైత్యసంఘంబు మదము
ధరణిఁ గటాక్షమాత్రంబున నణఁచె ; । ధరణీశ్వరులకంటెఁ దక్కువా ! యతఁడు.
నిర్జరేశ్వరుఁ డశ్వినీ దేవతలకు । దుర్జయుండై కడు దుర్దాంత మహిమ
చొప్పడఁగా నంత సోమపానంబు । కెప్పు డర్హులుగార యిది నిజంబనుచుఁ

---

1. ఉచథ్యుఁడనుటకుఁ బొరపడినాఁడు,

బరఁగంగ భాగ కల్పన సేయకున్నఁ । బరువడి వారలు భార్గవచ్యవను
నాశ్రయించిన వారి నంగీకరించి । విశ్రామముగ నిల్పి విబుధుల కగ్గు
సేయంగ నింద్రుండు జిష్ణువ నగి । పాయక మానిఁ జంపంగఁ గడంగి
మునుకొని యొకశైలమును శతకోటి । యును దాల్చి కవియంగ, హుమ్మని మాని
జలములు మంత్రించి చల్లినయంత । బలవైరి మూర్ఛచేఁ బడియెను ధాత్రి.
ఒక్కంత సేపున కొయ్యన దెలియ । నెక్కొన్న చ్యవన మునిప్రవరుండు
ధృతి శతయోజన దీర్ఘదంతునిని । క్షితిని మదాఖ్యు సృజించిన, వాఁడు
సురగణంబులతోడ సురరాజు బట్టి । పరువడిఁ గబళింప, భయమంది సురలు
" శరణు లోకారాధ్య ! శరణు యతీంద్ర ! । శరణు భార్గవవంశజాత ! విజ్ఞాత ! "
అని శరణము చొర నతఁడు వారించె. । అనిమిషులును భాగ మయ్యాశ్వినులకుఁ
గలుగంగఁ జేసిరి ; గాన విప్రులకు । నిలపతులెక్కడే ! యెఱుఁగ లేవైతి
వనఘ ! దత్తాత్రేయు కవని శుశ్రూష । దినమును జేసికాదే ! యిట్టిశౌర్య
కలితుండ వైతివి ; గావున విప్ర । కులము సేవింపుము కూరిమితోడ. "
అనవుడు ముదమంది యాహైహయుండు । " అనఘ, నీ చెప్పినయట్ల చేసెదను ;
ధరణీదేవతల పాదము లాశ్రయించి । పరఁగెద నిహమును బరమును గలుగ. "
అనిన సంతసమంది యా సమీరణుఁడు । చనియె నిజేచ్ఛమై జగతీతలేశ !
మఱవక విప్రుల మహిమ యిట్టిదని । యెఱుఁగుము " నీ వన్న నిట ధర్మరాజు
'అనఘాత్మ, మఱియు విప్రానుభావంబు । విన వేడ్క యయ్యెడు వినిపింపు' మనిన
గాంగేయుఁ డిట్లనుఁ " గంజారివంశ ! । సంగతి వాక్కులఁ జటులేంద్రియములు
ధరణి దుర్బలములై తనరుచున్నవియు ; । అరుదుగా నుత్తరాయణము డగ్గరియె.
సరసిజాక్షుఁడు విప్రజనవిశేషములు । విరివిగా నీకును వివరింపఁ గలఁడు
ఏను శ్రీకృష్ణుని నెఱుఁగుదుఁ గొంత । భూనాథ, యాతఁడే భూదార మగుచుఁ
దలకొని తన బొడ్డుతామర యందుఁ । బొలుపొంద నొక్కనిఁ బుట్టంగఁ జేసి
సచరాచరంబులు సంభవింపంగ । సుచరిత్రముగఁ జేసెఁ జోద్యము తలఁప."
అని యుపదేశింప యమతనూభవుఁడు । వనమాలి కెఱఁగి " యోవారిజనయన !
విప్రప్రభావంబు వినవలె నాకు । నిప్పయోసంబున నానతి యీవె ! "

## కృష్ణుఁడు ధర్మజునకు విప్రప్రభావ మెఱిఁగించుట

అనవుడు ప్రద్యుమ్నుఁ డడుగఁ జెప్పితిని । అనఘాత్మ, వర్గత్రయంబు మోక్షమును
జెనుపొంద సాధింపఁ బితృదేవగణము । నెనయఁ దృప్తులఁజేయ నిహపరాదులకు
... ... ... ... .. । ... ... ... ...
దివిజులకయినఁ గీర్తియును సంపదయుఁ । దవిలి ప్రాపించును దత్ప్రసాదమున.
అలిగి భస్మముసేయు నట పెంపొసంగ । నలర విప్రులె కర్త లవనీశలేశ!
నరవి నీకొక్క యాశ్చర్యంబు దెలియ । దొరఁకొని వినిపింతు దుర్వాసమౌని
మందహాసంబున మనమందిరమున । కందంద చనుదెంచి యంతటిలోన
సుముఖత్వ మందుచు, సొలవకంతటనె । విముఖత్వ మందుచు, వేడ్క చెందుచును,
ఎలను మీఱఁగఁ 'గుడువఁగ నొల్ల' ననుచుఁ । గలయఁ బెక్కండ్రకుఁ గావించినట్టి
యన్నపానాదుల నన్నియుఁ దాన । యన్నెలవున నిల్చి యట భుజించుచును,
సెజ్జ నిద్రింపుచుఁ, జెచ్చెర నేల (?) । బుజ్జగింపుచు నిద్రఁబోవుచు, మఱియు
నెందేనిఁ బోవుచు, నిట మరలుచును, । అందంద చరియించు చట నొక్కనాఁడు
"గోవింద, వినుము నాకును బాయసంబు । పై వేడ్కఘుట్టిపుఁ బరఁగఁ బెట్టింపు."
మనవుడు నేనును అట్లకాకనుచు । గొనకొని పెట్టింపఁ గొంత భుజించి
కొంత 'దేహమున మక్కువఁ బూయు' మనిన । నంతంతఁ బూసితి; నంత నమ్మౌని
యూథిఁ జేరువనున్న రుక్మిణిఁ జూచి । మోదక యుకాంతయొడలునఁ బూసి
ఘన రథ్యరూపంబుగా రథంబునను । వనజాక్షిఁ బూన్చి తావచ్చి యుందెక్కి
వెరవొప్ప నెంతయు వీధికి వెడలి । తరమిడి మునికోలఁ దన్నిఁ గొట్టుచును
దలకొన్న ప్రీతి రథము నడిపింప । వెలయంగ నేనును వెంటఁ బోయితిని.
పనివడి నాకుఁ గోపము లేకయున్నఁ । గనుఁగొని యాదవుల్ గంపమునందు
నరదంబు దివియుచు నలసియక్కాంత । ధరణిపైఁ బడినయంతట డిగ్గనఱికి
మానుగాఁ గోపసమన్వితుండగుచు । దాని మీఁదను ధూళి తాఁ జల్లిపాఱె.
పాఱిన నేను నప్పరమర్షి వెనుకఁ । బాఱి ప్రార్థింపంగఁ "బద్మపత్రాక్ష!
మిమ్ము గాఱించితి; మీకుఁ గోపంబు । ఇమ్మహిని జనింప దేవ మెచ్చితిని.
ఎల్లవారును దమకెంత కూరుతురో । గొల్లగా నంతయుఁ గూర్చి నిన్నర్థి
ననుసరింతురు గాక యఖిలైకవంద్య । ఘనమహిమలు నీకుఁ గలుగుఁగా" ననుచు

వరమిచ్చి మఱియు నావంక గన్గొనుచు । "సరసిజనాభ, కేశవ, హృషీకేశ,
నా యంగకంబుల నాఁడు పాయసము । పూయుచు నరకాలఁ బూయవుగానఁ
బాయక కలుగు నపాయ మచ్చటను. । పాయక వరపదప్రాప్తికి నదియ
కారణంబని చెప్పి కాంత రుక్మిణికిఁ । జారువైభవ భాగ్య సౌందర్య మహిమ
యరయ షోడశ సహస్రాంగనాజనుల । కిరవైన విభవంబు నెక్కుడు నిచ్చి
యంతర్హితుండయ్యె నమ్మునీశ్వరుఁడు. । సంతోషమున నేను సకియ రుక్మిణియు
నతుల సంపద గన్గి యతిశయిల్లితిమి. । సుతుఁడ, కావున మహీసుర భక్తిగలిగి
వెలయుము నీవన్న వెలసెఁ బ్రద్యుమ్నుఁ । డలవడ నీవును నాగతిఁ బరఁగు."
మని చెప్పి ముదమంది యమతనూభవుఁడు । వనజమాలి కనియె "దుర్వాసుండు ధాత్రి
నర్వేశ, శర్వాంశ సంభవుఁడంద్రు । శర్వునిమహిమ నిశ్చలవృత్తిఁ జెప్పు"

## కృష్ణుఁడు ధర్మజునకు శివుని మహిమ చెప్పుట

మనవుడు "వినవయ్య యభవుని మహిమ. । దిన దినము శతరుద్రీయంబు నెవఁడు
పఠియించు నతనికి భాగ్యముల్ గలుగు ; । శరతలణంగు నో జగతీతలేశ !
అలరు మహాదేవుఁడనెడు నామంబు । వలనుగా నితర దైవములకు లేదు.
కఱకటి దక్షయాగంబున శివుని । మఱచి యింద్రాదులు మానులేరీతి
భంగింబు పొందిరి; పరఁగంగ మఱియు । సంగతిగాఁ దన శరణు చొచ్చినను
గావఁడే వారలఁ గరుణతోడుతను. । ఈ విధి శివుని పెం పేమనవచ్చు!
పురదానవులఁ గొట్టి, పురముల నొక్క । శరమున నేసి, భస్మంబు గావించి
యమ్మార్గణం బంకమందిడ నదియు । నెమ్మి బాలుఁడయి నిలిచెఁ; దా శివుఁడు
అతనికి దుర్వాసుఁడని నామ మిచ్చె. । అతఁడువో మాయింటి కరుదెంచి యంత
చేసినాఁ" డనిన సచ్చేరువు భక్తి । రాశిగాఁ బెసఁగొన రాజు ధర్మజుఁడు
హరుని నామంబులు హరుని మహాత్మ్య । మరయంగఁ జెప్పిన నానంద మొంది
కరమొప్ప మఱియును గాంగేయుఁ జూచి । "హరికృప నీకృప నఖిలంబుఁ దెలిసె;"
ననుచు సంతోషింప నా వ్యాసమౌని । తనర గంగానదీతనయునిఁ జూచి
"తలకొని తెలివొందె ధర్మాత్మజుండు । అలవడ నీతని ననుపుము పురికి.
క్రమ్మఱవచ్చు నీకడకు నీఘనుఁడు. । నెమ్మినో" ననిన మన్నించి భీష్ముండు
"ధర్మజ, పోవయ్య తాలిమితోడ । ధర్మంబు వర్ధిల్ల ధరణి పాలింపు.

ఎనయుంగ నిన్నాశ్రయించినవారి । ఘనముగా మన్నింపు కలితభోగముల.
అరుదార నుత్తరాయణము వచ్చినను । కరమెప్ప నీవు నాకడకు నేతెమ్ము.
తమ్ములు నీవు గాంధారి విభుండు । నమ్మోద మెసఁగంగ జగతిలో మనుఁడు."

## ధర్మజుఁడు కరిపురంబున కరుగుట

అనవుడు ధర్మజుఁ డానంద మొంది । "అనఘాత్మ, నీ చెప్పినట్లు చేసెదను"
అని ప్రమాణము చేసి యంబుజాక్షుండు । మునులను దోడరాఁ బురమున కరిగి
తల్లికి మ్రొక్కి గాంధారికి నెఱఁగి । యెల్ల జనంబుల కింపు గావించి
ద్రౌపది మన్నించి తరుణుల కెల్లఁ । బ్రొవు మీఱఁగ సమగ్రధనంబు లొసఁగి
హరియును సోదరుల్ హరుసంబు నొంద । నరయ ధర్మజుఁడు రాజ్యాభిషేకఁబు
బొంది జనంబులు పొగడుచు నుండ । నందంద భోగంబు లందుచు నుండె.
అంతఁ బంచాశ ద్దినాంతరమున । నెంతయుఁ గడఁకతో సేవ దీపించి
యర్కుండు నుత్తరాయణ గతుఁడైనఁ । దర్కించి యంతలో ధర్మనందనుఁడు
తల్లియుఁ బెదతండ్రి తమ్ములు హరియు । నల్ల గాంధారియు నట యుయుత్సుండు
సంజయ విదురులు సకలబాంధవులు । రంజిల్లి గొలువ ధర్మము పెంపుమీఱఁ
జనుదెంచి తాతకు సద్భక్తి మ్రొక్కి । తనరంగ ధ్యానతత్పరుఁడైన యతని
డాసి యిట్లనియె నోడక: "యగ్ని మొదలు । గా సమస్తము వచ్చెఁ గంజలోచనుఁడు
నెనయ యుయుత్సుండు ఋత్విజుల్ హితులు । చనవొప్ప ధృతరాష్ట్ర జననాయకుండుఁ
బౌరజనంబులు బ్రాహ్మణోత్తములు । వారల వీరెగో వచ్చిరిచూడు."
అనవుడు కనువిచ్చి యందఱఁ జూచి । మనుజేశుకరముఁ దెమల్చుచు "మేలు
కరమొప్ప దైవయోగంబునఁ గాదె । యరయంగ నీవిప్పు డరుగుదెంచితివి.
మనను రంజిలెఁ బుణ్యమాసన, మఱియు । ఘన శుక్లపక్షంబు గాదె యీవేళ."
అనిపల్కి ప్రీతితో నయ్యంబికేయుఁ । గనుఁగొని యిట్లను "క్ష్మానాథ, వినుము
సరవితో వేదశాస్త్రజ్ఞానకలిత । గరిమను బెద్దలఁ గడఁగి సేవించి
రమణ నశేష ధర్మంబులు నెఱిఁగి । యమరదేహం బనిత్యంబని తలఁచి
వ్యాసులు మిగుల దేహరహస్య మర్థి । వాసిగాఁ జెప్పంగ వగపెల్ల మాను.
శాంతితో నిష్కళంకత నొప్పు మనఘ! । చింతింప వలవదు; చెప్పెద నీకు
వగవకు పాండుభూవరతనూభవులు । తగ నీవు గన్నట్టి తనయులు గారె!

వీరల శుశ్రూష వినుమొల్ల గొనుచు । వీరలఁ గరుణింపు వింతలే కెపుడు.
అరయంగ దుర్యోధనాదు లనీతి । పరు లధర్మజ్ఞులు పాపవర్తనులు.
వారలఁ దలఁపకు వరమతి." యనుచు । వారిజాక్షునిఁ జూచి వలనొప్పఁ బలికె:
"దేవ, జీవాత్మక, దేవేంద్రవంద్య, । భావజజనక, శ్రీపతి, హృషీకేశ,
బలము నీవేనాకు; భక్తుండ నీకు; । ఎలమి నిన్నే గాని యితరంబు నెఱుఁగ.
తవణించి యాలుబిడ్డలు లేనివాఁడ ; । భవదూర, నను గావు పద్మపత్రాక్ష!
పాండుకుమారులఁ బరఁగ రక్షింపు ; । దుండగీఁడై నట్టి దుర్యోధనునకుఁ
జెక్కుమాఱులు బుద్ధి ప్రీతిఁ జెప్పితిని, । ఎక్కడ శ్రీకృష్ణుఁ డేవుమైనుండు
నక్కడ గెల్పుపాయక గల్గుననుచు । నక్కుటిలాత్ముండు నది వినఁడయ్యె."
అనవిని శ్రీకృష్ణుఁ డా భీష్ముఁజూచి । ... ... ... ... ...

## భీష్మ నిర్యాణము

"అనఘ, పుణ్యుండ వీవట తండ్రివలన । ఘన భక్తి పెంపునఁ గాదె బంటగుచు
నీమ్రోల మృత్యువు నిలిచె నెంతయును. । ఈమహి ననుమతి యిచ్చితి నీకు
వసువులఁ బొందుము వనజారివంశ! । యసదృశంబుగ." నన్న నంగీకరించి
యందఱిచేతను ననుమతి వడసి । యందఱఁ గౌఁగిట నందంద చేర్చి
రచ్చగాఁ దొల్లి రారాజుల గెలిచి । తెచ్చినధనము భూదేవతావళికి
దానంబుగా నిచ్చి, ధారణయోగ । మానితుండై యంత మారుతంబులను
గరిమతోడుత నూర్ధ్వగతి గైకొనంగఁ । బరఁగించి యంతంతఁ బ్రాణముల్ వాప
నట్టి చోట్లెల్ల శల్య రహితంబులగుచు । నెట్టన గావచ్చె; నీరజోదరుఁడు
సకల జనంబు లాశ్చర్యంబు నొంద । నకలంకుఁడై కృష్ణు నాత్మలో నిలిపి
బ్రహ్మపదోల్లాస పరత దీపించి । బ్రహ్మరంధ్రంబునఁ బ్రాణముల్ విడిచె.
అప్పుడు దేవతి లఖల యక్షులును । దప్పక యెంతయు దయపెంపుమీఱ
వరుసతోఁ బువ్వుల వానలు గురిసి । దొరకొని దివ్యదుందుభులు మ్రోయింప
శంతనుసూనుండు స్వర్గస్థుఁ డగుచు । నంతంత సౌఖ్యంబు లందుచునుండె.
ఇట ధర్మసూనుండు హితులుఁ దమ్ములును । దటుకున ధృతరాష్ట్ర ధరణీధవుండు
సకలరాజన్యులు సకల బాంధవులు । సకల సన్మునులును సరవి నేతేర,
సకల సంస్కారంబు లమ్మహాత్మునకు । ఘనముగాఁ జేసి గంగానది కరిగి

వరుసఁ దిలోదక వాసోదకములు । విరివిగా నొనరించి వివిధదానములు
కరమొప్పఁ జేయు, గంగామహాదేవి । యరుదెంచి కన్నుల నశ్రులు రాల
“ హా కుమారక, భూమి నణఁగితే యిట్లు! । ఆ కాశిరాజకన్యలకునై పెనఁగి
భూకాంతులను గెల్చి పొలుపు దీపించి । కైకొన్న శౌర్యంబు గ్రాఁగెనే నేఁడు !
పరశురామునిగెల్చి ప్రజ్ఞదీపించి । యరుదైన నీసత్త్వ మణఁగెనే నేఁడు !
ఎనయు శిఖండిచే నీవుర్విఁ గూలఁ । గనియు నాదేహంబు గ్రాఁగదు వజ్ర
మయము గానోపు నిమ్మహిలోన ” ననుచు । రయమున దుఃఖింప రాజీవనేత్రుఁ
డనెను “ శోకము దక్కు మవని నీసుతుఁడు । పనివడి మౌనిశాపప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుండునై వఱలెనొప్ప నీకు । వసుధలోపలఁ బుట్టి వన్నె దీపించి
కడపటఁ బుణ్యసంకలిత సద్గతికిఁ । గడు వేడ్కఁ బోయె వగవఁ బనిలేదు.
అతని శిఖండి యే లమరేశుఁడైన । క్షితిని గూల్పఁగ లేఁడు సిద్ధమీపలుకు.
అతఁడు నిజేచ్ఛమై నర్జునాస్త్రముల । నతుల పదంబందె నడలంగ వలదు.”
అనుచు దుఃఖము మాన్చి యంబుజోదరుఁడు । ఘనతరానందంబు గలుగంగఁ జేసె.
అని యిట్లు జనమేజయ క్షితిపతికి । ముని చెప్పె నని చెప్ప మోదించి మునులు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే! యని యడుగుటయు
కమలదళాక్ష, సంక్రందనవంద్య, । ప్రమథేశ కాంతాజపప్రియ, వరద,
ద్వారకాపురవాస, వైభవోల్లాస, । వారిజనాభ, శ్రీవనితానాథ,
ఘనమాని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీవేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వెంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర రచిత
మానుశాసని కాఖ్యమైన పర్వమున । ననుపమంబుగఁ దృతీయాశ్వాసమయ్యె.

# ప్రథమాశ్వాసము



శ్రీసమంచితవాస, చిరతరోల్లాస, । వాసుకిశయన, భూవర, వాసుదేవ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:

## భీష్మునిమృతికి వగచు ధర్మజుని గృష్ణాదులు ప్రబోధించుట

ఆరీతి ధర్మజుం డాపగేయునకు । వారివిధి యొనర్చి వరుసతోడుతను
ధృతరాష్ట్ర సహితుఁడై తిరిగి యాగంగ । నతులితగతి దాఁటి యా తీరభూమి
నిలిచి కన్నులఁ జాల నీళ్లుగాఱంగ । బలిమిమై నత్యుగ్ర బాణపాతమున
ఘనముగా మొగ్గిన గజము చందమున । నెనయ వ్రాలిన నామహీతలనాథుఁ
గనుఁగొని వగచుచుఁ గరువలిసుతుఁడు । పనివడి పడకుండఁ బట్టి యొంతయును
తనదు పైచీర యాస్తరణంబు చేసి । పెనుపొంద భూమిపైఁ బెట్టిన, నింద్ర
తనయుండు మొదలైన తమ్ములు పొదువ । వనమాలి యుచితపువచనముల్ పలికి
భూపాలవర్యు నప్పుడ ప్రబోధించి । ప్రాపుగాఁ గూర్చుండఁ బనిచి నయంత
వితత వాగ్వైఖరి వెలయ నుర్వీశ । ధృతరాష్ట్రుఁ డిట్లను: "ధీరవివేక,
క్షత్రధర్మంబున సరవిఁ గైకొంటి । ధాత్రీతలంబెల్లఁ దగ వగపేల?
అనుజవర్గము తోడ నిత్యవైభవమున । ననుభవింతువుగాక" యనిపల్కి "విదురు
హితవాక్యములు విన కీకీడుపుట్టె । క్షితిపై నావల్ల వచ్చిన దిట్టి విధము."
అనియని తేటగా నాడి యాలోనఁ । దనకు గాంధారికి దైన్యంబు వగపు
నగ్గడించుచు "మమ్ము నొంటి నున్నట్టి । వగ్గుల భావించి వంతమానుపుము,
ఉర్వీశ!" యనవుడు నూరకయున్న । సర్వేశ్వరుండైన శౌరి యిట్లనియె:
"కురునాథ, నీవిట్లు గురుతరశోక । భరితుండవైన నీబాంధవమిత్ర
వరులకు మిక్కిలి వగవు రెట్టించు. । నరవితోఁ దావకజ్ఞాతులు సమర
మున ననివర్తులై మొగి నూర్ధ్వలోక । మున నున్నవార లిమ్ముల శోకమేల?
జగతీశ, భూమిలోఁ జచ్చినవారు । మగిడి వత్తురె! పెక్కుమాటలేమిటికి?
పలు భీష్మునిచేత నిఖిలశాంతియును । భావించి వినియును బామరురీతి

వగచుట యుచితమే! వలనొప్ప మఱియు । మొగి నారదాదులు బోధించినట్టి
వచనంబు లూహింపు; వాజిమేధంబు । రచియింపు; భూప్రజారక్షఘటింపు;
పితృనివహములకుఁ బ్రీతిగొనర్పు; । మతిథులఁ బూజింపు ననవరతంబు."
అనవిని ధర్మజుం డనియె "నో దేవ! । నను దయాప్రేమలు నాటుకొనంగఁ
బటుతరంబుగఁ బెక్కుభంగులఁ బ్రోచి; । తిటమీఁద ననుమున కేఁగంగవలయు
ననుమతి యిచ్చుటే యదినాకుఁ బ్రియము, । ఘనముగ నీరీతిఁ గాకున్నఁ గర్ణ
గురులఁ జంపినయట్టి క్రూరకర్మలకు । నిరవొందఁగా శాంతి యెటువలెఁ గలుగు?
ఇమ్మహా కిల్బిషం బేమిటఁ బాయు? । నమ్మక్క! నీ!" యన వ్యాసుఁ డిట్లనియె:
"చెల్లఁబో నీ కేమి చెప్పినయట్టి । యెల్ల కార్యంబులు నేటిలోఁ గలిసి
పోయెనే! నీదగు బుద్ధియంతయును । మాయలఁ బొరసెనే! మర్త్యుఁడు కర్త
గాఁడ; యీశ్వరుని యోగంబున మేలుఁ । గీడుఁ బ్రాపించును; గిల్బిషకర్మ
శంక గలిగెనేని సకలదానములు । శంకరప్రీతిగా సరిఁజేయరాదె!
అశ్వమేధముఁ జేయు మఘములు వాయు । శాశ్వతకీర్తులు సఫలంబులగును.
రాజేంద్ర, భుజబల ప్రాప్తమైయున్న । యీ జగతీస్థలం బేల పోవిడువ?"
అని యిట్లు చెప్పంగ నవనీశుఁ డనియె: । "మునినాథ, బలమెల్లఁ బుడమిలోఁ గూలె;
సకలార్థరాసులు సకల ధాన్యములు । సకల బాంధవతతి సమసె యుద్ధమున.
ఘనతరంబుగ నేము కయ్యంబు సేయఁ । బనివడి నొచ్చిరి ప్రజలు నూల్కొనరు.
అదిగాక సేయుట కర్థసంపదలు । వెదకిన లేవుపో వినుమాత్మ, యిపుడు.
మిన్నక యజ్ఞంబు మెలపుట యెట్టు? । లన్నను మౌని యిట్లనియె నాతనికి:

## మరుత్తుని చరిత్రము

"జననాథ, విను *మరుజ్జగదీశ్వరుండు । అనఘ, యజ్ఞము తుహినాద్రిచేరువను
వినుతస్థితిని జేసి విహితదక్షిణలు । కనకరాసు లొసంగ, గైకొనిమునులు
ధనము లిండ్లకు మోచి తనివొంది కడకు । ధనము భూమినిఁ బాతి తారేఁగుచుండి
మనముల ధనముపై మమత వోవిడిచి । 'కనుఁగొన్న వారిదీ కాంచనం' బనుచుఁ
బలికిపోయిరి; గాన దోషంబు లేదు । బలియుర నీవారిఁ బనిచి యాధనము
సరగునఁ దెప్పింపు సవము సాగింపు, । దురితంబు లెల్లను దొలఁగెడు." మనిన

* మరుత్తుఁడని. కవి. త్ర. భా.

ధర్మాత్మజుఁడు పరాశర సూనునకనియె : । "ధర్మస్వరూప, యాధనము నేరీతి
గడియించె నారాజు ? కారుణ్యమొప్పఁ । దడయక యానతీఁగగు నాకు" ననిన
సాత్యవతేయుండు సద్భక్తియుక్తి । సత్యాత్ముఁడైన యా జగదీశునకనియె :
"కృతయుగంబునఁ జిరకీర్తివర్తనుఁడు । ధృతిగల దండనీతిప్రవర్తకుఁడు
నగు మనువునకుఁ బ్రజాని యనంగఁ । దగసుతుఁ డుదయించెఁ ; దఱిఁబ్రజానికిని
క్షుతుఁ డుద్భవించె ; నాక్షుతునకిక్ష్వాకుఁ । డతులితంబుగఁ బుట్టె ; నతనికి నూర్వు
రరయంగఁ బుట్టి ; రందగ్రజుండగుసు । సరస కీర్తిప్రభా సత్వాఢ్యుఁడైన
వింశున కెలమి వివింశుండుపుట్టి । వంశవర్ధనుఁడన వసుధ పాలించె.
అతనికిఁ బదియేవు రావిర్భవించి ; । రతులిత విస్ఫూర్తి నందులోఁ బెద్ద
వాఁడు జగత్త్రయ వసుధావరుండు । పోఁడిమిగాఁగఁ దమ్ములకుఁ బాలిక
నలరేఁగి యాపనుసలువురఁ జెఱచి । యిలయెల్లఁగైకొని యేలుచు నుండి
మంత్రి విద్వేషంబు మాన్యదూషణము । తంత్రప్రజాపీడ తగనొనరించి
మొక్కలీఁడగుటయు, బ్రుచ్చిలి మంత్రు । లక్కజంబైయుండ నాతనిఁ బాపి
యతనినందనుని రాజ్యంబున నిలువ, । నతఁడును మదిఁ దన యయ్యచే కొత్తిఁగి
సర్వబలంబుల సచివుల బుధులఁ । బర్విన సంతోషభరితులఁ జేసి
సత్యంబుఁ బాఁడియు శాంతియు దాంతి । నిత్యంబుఁ గావించి నిఖిలదానములు
నొనరించి ధనమెల్ల నుర్వీసురులకుఁ । దనరంగ నిచ్చిన దారిద్ర్యమబ్బె.
అదినిమిత్తంబున నాతఁడు బలము । మదిచెడి దస్సిన మహిలోన వాని
ప్రతిపక్షు లెఱిఁగి యుద్భటవృత్తి మీఱి । యతులిత సేనాసహాయులై వచ్చి
యతని దేశం బెల్ల నాక్రమించుటయు, । ... ... ... ... ...
నానరపతి తనయాప్తులుఁ దానుఁ । గాననంబుల కేఁగి ఘనతపోమహిమఁ
గరము గ్రోలుగ నట్టి ఘనముగా నణఁచి । సరనుతంబుగ ధమనక్రియ సేయ,
దాన సామజ రథోద్భట హయముఖ్య । సేనాసమూహ, మచ్చెరువుగా ధనముఁ
బొడమిన, సంతోషి భూరిచిహ్నములఁ । బుడమి జేఁ దావైరి భూపాలవరుల
బలములతోఁ గూడఁ బొఱింగఁద్రోలి । కలిత విఖ్యాతిఁ బ్రకాశంబునొంది
కరధమనంబునఁ * గరధముఁ డనఁగఁ । బరఁగి భూస్థలమెల్లఁ బాలింపుచుండి
తగ నంగిరసుఁ డుపదర్శకుం డగుచుఁ । బొగడొంద హయమేధములు చేసె; నతని

* 'కరంధముఁ' డని లిఖ్యన.

మనుమఁ డయ్యెన మరున్మండలేశ్వరుఁడు । దినకరతేజుండు ధీర సన్నుతుఁడు
హరిసమానుండు నాగాయుతబలుఁడు । పరమపుణ్యుఁడు దాన పారాయణుఁడు
పరసుంకు హిమగిరి సానుదేశమున । గరిమతో సమ్మహాక్రతువు గావించె."
అని "యిది యాతని యాభిజాత్యంబు । వినిపించితిని మీకు విశదంబుగాఁగ.
ఘన ధనం బతనికిఁ గలిగిన తెఱఁగు । వినుత మఖక్రియావిధముఁ జెప్పెదను.
వినుము కరంధము విశ్వరక్షకుఁడు । మనువంశతిలకుండు మహనీయమహిమ
నంగిరసుఁడు దన కధిక విఖ్యాతి । రంగుమీఱిన యుపద్రష్టయై యుండ
నవనిలోపల ననేకాశ్వమేధములు । ప్రవిమలంబుగఁ జేసి ప్రాభవంబొప్ప
సకలదానంబుల సకలభోగముల । సకలధర్మంబులఁ జతురుఁడై తనకు
వలసినప్పుడె మహీవరులు నుతింపఁ । బొలుపొంద బొందితోఁ బోయె నాదివికి.
అతని తనూభవుం డతులప్రతాపి । ధృతి నవిక్షిన్నామధేయుండు ధాత్రిఁ
దమతండ్రికీర్తి నెంతయు నేలె; నతని । విమలాత్మజుండును వెన మరుత్తుండు
తమతండ్రి పిమ్మట ధర్మవర్తనల । ... ... ... ... ...
వెలసి బర్హిర్ముఖవిభునిఁ గైకొనక । యొలమి గీపింపంగ, నింద్రుం డెఱింగి
మనమునఁ జింతించి మంత్రివానమున । కనయుంబుఁ జని యప్పు డనియె నాతనికి :
"అనఘ, మరుత్తుండు యజ్ఞంబునకును । నిను నుపద్రష్టగా నియమించు నింక.
అమరుల కధిపతినైనట్టి నాకు । విమలంబుగాఁ జేసి వెన నొక్కనరుని
కై యుపదర్శనం బట సేయఁదగునె ! । వేయుతెఱంగుల వినువకు నన్ను
అతనిఁ దొఱఁగి మదాప్తత మెఱయు । మాతతస్ఫూర్తిఁ బెక్కాడ నేమిటికి"
అనవుడు నవ్వి సురాచార్యుఁ డనియె । "చెనఁటినే! నీవింత చెప్ప నేమిటికి?
అలమి ముల్లోకము కధికుండవైన । బలవైరి, నీగురుప్రజ్ఞ యిట్టిదియె!
దొరఁకొని వీతిహోత్రుఁడు చల్లనైన । హరిదశ్వుఁడును మైలయయ్యెన మేరు
నగము చలించిన నాదు వాక్యముల । నగపడునే బొంకు! అమరేంద్ర, నమ్ము."
అనవుడు విని ప్రమదాతిరేకమునఁ । జనియె నింద్రుఁడు నిజసదనంబునకును.
అదియంతయును విని యమ్మరుత్తుండు । త్రిదశేంద్రగురునిఁ బ్రార్థించి యిట్లనియె :
"నీకు నెఱింగించి నీదువంపునను । ప్రాకటలీల సంభారంబులెల్ల
ఘటియించి యున్నాఁడఁ; గావున నీవు । తటుకున రమ్ముపదర్శనంబునకు."
నావుడు "బలవైరి నను దనయాగ । భావన వరియించె బార్థివ, మున్న.

ఏరీతి రావచ్చు నిటనాకు నతని । మీఱతి ? ” యన్నను బల్కె మేదినీశ్వరుఁడు :
“ అనఘ, మాతాతకు నవని మీతండ్రి । పనివడి తొల్లి యుపద్రష్టయయ్యె,
ఆరీతిఁ గృపసేయు. ” మని పల్క నవ్వి । ధారుణీశ్వరుతోడఁ దగ గురుఁ డనియె :
“ విను మొజ్జగాఁ జాలవెస మనుష్యునకు ; । ఘనుని వేఱొక్కనిఁ గైకొను మరసి.”
అనవుడు లజ్జితుఁడై మహీవిభుఁడు । మనమున ఖిన్నుఁడై మరలి యేతేర
నిరవొప్ప నారదుఁ డెదురైనఁ గాంచి । కరములు మొగిచినఁ గని ముని యనియె :
“ ఎటవోయి వచ్చెద విదియేమి నేఁడు । పటుగతి విన్ననై పార్థివోత్తంస !
నీ తెఱంగెఱిఁగింపు నిక్కంబుగాఁగ । నే తెఱఁగుననైన నేమాంస్తు.” ననిన
ఆమరుత్తుఁడు పల్కు “ ననఘాత్మ, యేను । ప్రేమ యాగమునకై పిలిచిన గురుఁడు
నయమేది పలుమాఱు నన్నుదూషించె. । రయమొప్ప నింక నాబ్రదు కేటిబ్రదుకు.”
అని విన్నవించిన నా దేవమౌని । పనివడి నృపతితోఁ బలికె నంతయును.
“ నెఱయ బృహస్పతి నిన్నొల్లకున్న । మఱియేల శోకింప మనుజేంద్రతిలక !
పరికింప నాబృహస్పతి యవరజుఁడు । తిరముగాఁ దమయన్న ధిక్కరించినను
సకలంబు విడిచి నిశ్చలభక్తితోడఁ । బ్రకటలీలను దిగంబరుఁడునై ధాత్రిఁ
దిరుగుచు నున్నాఁడు; తెఱఁగొప్ప నతని । నరయంగఁ బ్రార్థింపు యాగంబునకును.”
అనవుడు హర్షించి యమ్మహీవిభుఁడు । “ మునినాథ, బ్రదికితి ముదము వాటిల్లె ;
నరగున నెచ్చోట సంవర్తుఁ గాంతు ? । వరమతిఁ బిలిచిన వచ్చునో రాఁడో ;
ఎనయంగ నా కానతీయవే తండ్రి ! ” । యనుచుఁ బ్రార్థించిన నమ్మౌని పలికె :
“ క్షితినాథ, యతఁడు కాశీపురిలోనఁ । బ్రతిదివసంబును బాయక యుండు.

... ... ... ... ... । ... ... ... ... ...

వలనొప్పఁ జూచి నివర్తించువానిఁ । గలగొన సంవర్తుఁగాఁగ నెఱుంగు.
మరలి యల్లంగంగ మఱి పొమ్మువేగ । పరికించి వేయు సద్భక్తి పూర్వముగ
నెచ్చోట నీకును నేకాంతమగునో । యచ్చోట మ్రొక్కి పాయక ప్రీతితోడ
శరణంబు చొరుము ; నిశ్చలత ‘ నాగుఱుతు । లిరవుగా నీకెవ్వ రెఱిఁగించి ’ రనిన
నారదుండని చెప్పు ; ‘ నారదుం డిప్పు । డేరీతి విహరించి యెందున్నవాఁడు ?
చెలిమితోడుత నీవు చెప్పు నా ’ కనిన । ‘ నెలకొన్న ప్రేమతో నిన్నెఱిఁగించి
పనివడి యగ్నిలోపలఁ జొచ్చె ’ ననుము. । అని చెప్పి యనిపిన నమ్మహీవిభుఁడు
గ్రక్కున నంతలోఁ గాశికి నేఁగి । దిక్కుమాలి ధరిత్రిఁ దెగిపడియున్న

రొక్కపీనుఁగుఁ గాంచి యురుతరస్ఫూర్తిఁ । దక్కక పట్టించి, తగఁగొనివచ్చి
తరమిడి యాపురద్వార దేశమున । కరిగి యక్కుణపము నటువైచి యుండ
పెట్టివాఁడొక్కఁడు వెసనేఁగుదెంచి । జట్టిన నచ్చోట శవము నీక్షించి
ధృతి వాటువడ్డట్టి ధేనువువోలె । మతిలోన బెదరి క్రమ్మఱఁ బాఱుటయును
వలనుగా వాని సంవర్తుఁగా నెఱిఁగి । వెలయంగ నాతని వెంటనే చనఁగ
దొరఁకొని యుమిసియు ధూళిచల్లియును । ధరను వేఁదుఱునిచందంబు మీఱంగ
నామహీపతి వినయమునఁ గేల్మొగిచి । వేమఱు నాతని వెంటనే చనఁగ
నతఁడు నిర్జనభూమికరిగి యంతటను । జతురత వటమహీజమునీడ చేరి
ఘనతరంబుగ డప్పిగలవాఁడు పోలె । గొనకొని యచ్చోటఁ గూర్చుండుటయును
ఆరాజు చేరి సాష్టాంగ దండంబు । కూరిమితోఁబెట్టి గురుతరభక్తిఁ
జేతులు మోడ్చి నిల్చినఁ, జూచి యతఁడు । చాతుర్యలీల నాజగదీశుకనియె :
"నను జెప్పి యిచటి కున్నతముగా నిన్ను । ననఘ, వుత్తెంచిన యతని పేరేమి ?
నిజముగా నెఱిఁగింపు ; నీమనోరథము । విజయమ్మై సిద్ధించు ; వెనబొంకితేని
తల యేడువ్రయ్యలై ధరణిపైఁ బడును । నెలకొని" యనవుడు నృపతి యిట్లనియె :
"నారదసంయమి నాకు నెంతయును । నీరూపుచెప్పి మన్నించిన నేను
భాగ్యవశంబునఁ బరువడిఁ గంటి । యోగ్యుండ నైతి నేనుర్విలోపలను."
అనవుడు సంవర్తుఁ డమ్మహీనాథుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
"ఎలమి నారదుఁ డిప్పు డెచట నున్నాఁడు ? । ఇల నేమి సేసెడు నింపుసొంపొంది ?
చెప్పుమా" యనవుడు చెప్పె నిట్లనుచు: । "తప్పక నన్నిందుఁ దగఁ బంపునపుడు
ధర్మపరుండైన తపసి నారదుఁడు । నర్మిలి సొదచొచ్చె" ననిన బిట్టులికి
పలికె సంవర్తుఁ "డేపనికి వచ్చితివి ? । అలవడ నెఱిఁగింపు" మనిన నిట్లనియె :
"అపురూపముగ నాదు యాగంబునకును । ఉపదర్శనము సేయు ముజ్జ్వలమూర్తి !
ఏ మరుత్తుం డను నిలఱేఁడ ; మున్ను । ప్రేమ నీజనకుని బిలిచి యాగంబు
ధర నొనర్చిన కరంధముని పౌత్రుఁడను । వరమతి" ననిన సంవర్తుఁ డిట్లనియె:
"ఈయెడ నా తెఱఁ గెఱిఁగింతు వినుము । మాయన్న నన్నవమానింప నేను
సొరిది ధనాది వస్తువులెల్ల విడిచి । తిరముగా నీరీతిఁ దిరిగెద నొంటి.
ననుబోఁటి కీనుఁగు నలినువద్రష్ట । ఘనముగా నయ్యెనఁ గలదె యేమైన ?
దొరకొని యమ్మహాత్ముని వరియింపు. । గరిమతోడుత నట్లు గాకున్న నీకు

నేన గావలసిన నిపుడె మాయన్న । చే ననుమతిగాంచి చెలఁగు వచ్చెదను."
అనిన నాపతివల్కు: "నాతనికడకు । ఘనుపి పోయితిఁ గృపవుట్టఁ బల్కితిని;
అరుదుమీఱఁగఁబల్క నతఁడు నాపల్కు । సరకుగాఁగొనక 'ఖేచరయాజనంబు
లొనరించు నేను మర్త్యులకు రాఁదగునె!' । యని పల్కె నదిగాన నందేలపోదు?
నీమహత్త్వమున నా నిర్జరాధీశు । భూమి నతిక్రమింపుదునని నమ్మి
యున్నాఁడఁ; గైకొను ముచితమీవేళ । మన్నింపుఁ" డనిన నమ్మనుజేశు కనియె:

## సంవర్తుఁడు మరుత్తుని యజ్ఞమున కుపద్రష్ట యగుట

"అలవడి నేను నీయధ్వరంబునకు । నలిమీఱ యుపదర్శనము సేయుచుండ
నద్దివస్పతియును నాబృహస్పతియుఁ । దద్ద రోషింతురు; దానికి నీవు
చలియింప మఱి నాదు శాపంబువలనఁ । గలుగుఁ గీడది నీవు క్రమమునఁ దెలిసి
యొనర సుస్థిర నిశ్చయుండవు గమ్ము । మనమున." ననిన నమ్మనుజేశ్వరుండు
"నీకృపఁ గాంచితి నిర్మలత్వమున; । సాకల్యమయ్యె విచారంబు లేదు.
పాకశాసన బృహస్పతులననేల । శ్రీకంఠుఁడును విరించియుఁ గలంచినను
గలఁగుదునే నేను? గరుణాఢ్య, వినుము । వెలయ మీసంగతి విడిచినఁ దనకు
సరసిజ బాంధవ చంద్ర తారకము । లరయంగ నుండెడు నంతకాలంబు
పుణ్యలోకము లేకపోవుట నిజము । పుణ్యస్వరూప, యిమ్ముల." నని పలుక
మెచ్చి సంవర్తుండు మేదిని నిన్ను । నచ్చుగా నింద్రునికంటె శ్రీమంతుఁ
గా నొనరించి యాగము నడపుదును । భూనాథ, యెట్లన్నఁ బొందుగా వినుము.
ఒనరంగ హిమగిరి కుత్తరభాగ । మునఁ బోవ మొగిఁ గల్గు ముంజవంతంబు.
శంభుఁ డందుల శివాసహితుఁడై యెపుడు । రంభాది ఖేచర రమణులు గొలువ
విహరింపుచుండును వేడుకతోడ. । బహురోగ మరణముల్ భయజరాదులును
సహజవైర స్నేహచయము లా శైల । గహనభూమిని లేవు గణుతించిచూడ.
చల్లని నీడల సకలవృక్షములు । నెల్లకాలమును బెంపెసఁగుచు నుండి
కుసుమ ఫలంబుల గురుతరశ్రీలఁ । బసమీఱు నగ్గిరి పార్శ్వంబులందు.
నలినాప్తరుచి వితానముఁ బోలి యొప్పు । వెలుఁగుఁ గాంచన శిలావితతి నత్కాంతి.
నదిగాన మన మివ్వ డచ్చోటి కరిగి । మదనారి నీశుఁ బ్రమథగణాధ్యక్షు
హరునిఁ గపర్ది నీహార డిండీర । శరదభ్ర విగ్రహు శంకరు నభవు

నీశ్వరు నీశాను నిభచర్మ వసను । శాశ్వతు శ్రీకంఠు సచ్చిదానందుఁ
బ్రణుతించి ప్రణుతించి ప్రణతులఁ దేల్చి । గణనాథగురుని సత్కరుణమైఁ గాంచి
తపనీయ మొగిఁ ద్రవ్వి తండముల్ దెత్త । ముదమిచ్చి వరానంత సుర్వీశ!" యనుచుఁ
గొనిపోవఁగాఁ బోయి గురుతరలీల । మనసిజపరిపంథి మన్నన వడసి
ధనము మోపులుగొని తగఁ దెచ్చి యిట్లు । ధనవంతుఁడై మరుద్ధరణీశ్వరుండు
అనఘాత్మ, విను తన యజ్ఞవాటములు । కనకమయంబులు గావించి యంత
నతిమానుషంబైనయట్టి వైభవము । నతులితగతిమీఱ యజనంబునకును
దలపడ, నాదేవతాగురు వెఱఁగి । యలరుచునున్న దేహము కృశమగుచు
వగఁ బొంది యుండంగ వాసవుఁ డెఱిఁగి । యగణితస్ఫూర్తి సురాచార్యుఁ బలికె:

## అగ్నిదేవుఁ డింద్ర సందేశంబు మరుత్తున కెఱిఁగించుట

"ఒడలేమిటికి డస్సె నో పుణ్యమూర్తి? । బడలి యున్నాఁడవు! వరువడి నీకు
నపకృతి యొనరించినట్టి నీచులను । ఇపుడె దండించెద నెఱిఁగింపు." మనిన
ఆచార్యుఁ డిట్లను " నది యేమిలేదు; । ఏచి మరున్నృపు డిప్పుడు మఖము
సేయ నుద్యోగించి శ్రీ విలసిల్ల । నాయరాతిని మహోన్నతిఁ దోడితెచ్చి
యాగంబు సేసెదనని యేను వింటి; । నాగమోక్త క్రియ లన్నియు నడచె.
మద్విపాదమునకు మఱి మూల మిదియె. । విద్వేషి సంవర్తు వేగ మాన్పింప
నామహీతలనాథు నట నియమింపు । భూమిలో." ననవు డప్పురుహూతుఁ డపుడు
వీతిహోత్రుని బిల్చి వినుమని పలికె: । "భూతలంబున కేఁగి పొసఁగ మరుత్తుఁ
గని యాతఁ డొగిఁజేయు క్రతువున కొజ్జఁ । జెనసి గీష్పతినిగాఁ జేయుము నీవు;
వలను మీఱంగ సంవర్తు మానుపుము; । వలు తెఱంగుల యాగఫలమబ్బు ననుము
పో." మ్మన్న ననలుఁడు పొసఁగ నావార్త । నిమ్ముల భూపతి కెఱిఁగింపఁగోరి
వరువడి నాతని పాలికిఁబోయి । పురడింప నెంతయుఁ బూజితుఁ డగుచుఁ
జెలఁగి మరుత్తుని జేరంగఁబిలిచి । "బలవైరి యనుప నీపాలికి ననఘ!
యరుగుదెంచితి దూతనై యేను నిజము. । ధరణీశ," యనుచు ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ... ... ... । ... ... వైశ్వానరుం డనియె:
"సురనాయకునకును సుఖము; దేవతలు । పరికించి యాశనివంపు సేయుదురు.

నీదెస దయగల్గు నిజము భూనాథ । ఆదరం బెసఁగ నిశ్చయముగా నేను
వచ్చినవని నీకు వడి నెఱిఁగింతు । సచ్చుగా ధిషణుండె యాజకుం డైన
నీయాగ మొప్పు ; నానిర్జరత్వంబుఁ । బాయక చేకూరు భాగ్యంబుఁ గలుగు.
ఇది మహేంద్రుండు నీ కెఱిఁగింపు మనియె, । విదితంబుగా." నన్న వీతిహోత్రునకుఁ
బనివడి వినయ సద్భక్తిపూర్వముగ । గొనకొని యప్పు డా క్షోణీశుఁ డనియె :
"అనఘ, మ్రొక్కెద వినుమా బృహస్పతికి ; । నను నపహసియించి నాయాగమునకుఁ
జొరకున్న, నేఁబోయి శుద్ధ విజ్ఞాన । భరితుని సంవర్తుఁ బ్రార్థించి తెచ్చి
యిప్పుడు ప్రారంభించి ; తీతండు చాలు । విపులంబుగాఁగ నో విమలాత్మ !" యనిన
ననలుఁ డిట్లను "నట్టి యమరగురుండు । తనరంగ నిట నుపద్రష్టయై యున్నఁ
బురుహూతుఁ డొగి నీకుఁ బుణ్యలోకములు । గరిమతోఁ జేయు సుఖమును మేల్ గాదె!"
అనవుడు సంవర్తుఁ డలిగి యావేళ । ననలున కనియె "నింకాడిన నిజము
తలఁక యేను మద్దారుణ దృష్టి । మఱుపక నినుఁగాల్తు మగుడుము పురికి."
అనుటయు భీతి సురాధీశు కడకుఁ । జని మరుత్తుఁడు వల్కు సకల వాక్యములు
చెప్పిన, ననియె "నా క్షితిపతి కీవు । తప్పక యీమాటు తగఁ జెప్పి పోయి
వెనుకొని నీమాట వినకుండె నేని । పనిచెద వజ్రంబు ; పనివడిఁ దన్ను
ననిచెద జముప్రోలి కనుము పొ" మ్మనిన । ననలుఁ డిట్లను నింద్రు నాస్యంబుచూచి:
'ఇంక వచ్చిన దారుణేక్షణ వహ్ని । శంక లేక వహింతుఁ జను' మని కోప
మూర్తియై సంవర్తమునివల్కె: "నేను । స్ఫూర్తిమై నచటికిఁ బోవంగ వెఱతు ;
రూఢిగా వేఱొక్కరునిఁ బంపు" మనిన । జాడగా నాపాకశాసనుం డనియె :
"నీవు దహింతువు నిన్నొరు లెల్లు । పావక, కాల్తువు ? పరువడి నిట్లు
పేదమాటాడితి వేర్మిలే" కనిన । నాదితేయాధీశు కనలుఁ డిట్లనియె:
"మూఁడులోకమ్ము లిమ్ముల నేలునట్టి । వాఁడి మగంటిమివాని నిన్నట్లు
తోలుత నా వృత్రదైత్యుం డాక్రమించె ? । అలవడఁగా విను మదియును గాక
కలితమై నయ్యాతి క్రతువున నశ్వి । నుల సోమపానంబు నూల్కొననీక
పాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుఁ । డాయెడ వారికై యమర యుక్తముగ
నిన్ను బాధితుఁజేయు నీవల్కుతోడఁ । గ్రన్నన వజ్రంబు కదువడి నేయఁ
గనుఁగొని నవ్వుచు ఖండించెఁ గాదె ! । మునుకొని యాతఁడు పుడిసెఁడునీట
... ... ... ... .. । ... ... ... ... ...

నడరంగ బ్రహ్మ బలాతిశయంబు । గడచినట్టి బలంబు గలుగునే యెందు ?”
అనవుడు “ బ్రహ్మ బలాతిశయంబు । ఘనమగు టెఱుంగుదుఁ; గడఁగి మరుత్తుఁ
గారింప నాకుఁ దగదె! ” యని వజ్రి । వారక గంధర్వవరు ధృతరాష్ట్రుఁ
గనుఁగొని “ నీవేఁగి గాంచి మరుత్తు । ననుము; బృహస్పతి యాజకుఁగాఁగఁ
గొనుము; నీవీరీతిఁ గొనకున్న వజ్రి । మును దన శతకోటి వుత్తెంచు ననుము.
సరవితో నీమాట సంవర్తు నెదుటఁ । బరువడి వెఱవక పలుకు నీ ” వనిన
ధృతరాష్ట్రుఁ డేతెంచి తివిఱి సంవర్త । యుతుఁడైన భూపాలు నొప్పుగాఁ గాంచి
“ ఓమరుత్తుఁడ, వినుమొక్క వాక్యంబు । వేమఱు గంధర్వవిభుఁడను నేను ;
వాసవుం డనుపంగ వచ్చినవాఁడ. । వేసట నీకేల ? వినుమొక్కబుద్ధి.
నెగడి యాజకుని గా నీమఖంబునకుఁ । దగ గురుఁ గొనుము సుత్రాముండు మెచ్చు.
చలిమితో నారీతిఁ జేయకయున్న । బలిమిమై దంభోళిఁ బనుచు నీమీఁద.
చాటిచెప్పితి సభాసదులెల్ల వినఁగ । మాటలేటికి ! ” నన్న మనుజేంద్రుఁ డనియె :
“ అమరగురుండు నా యాగంబు నడప । నమధికమతి రోయ సంవర్తుఁదెచ్చి;
తింక నిట్టులు సేయ నేరీతివచ్చు! । శంక యేమియు లేక జగతీశులకును.
అవని మిత్రద్రోహ మధిక పాతకము. । ఇవి నీవెఱుంగుదు వింద్రుండు నెఱుఁగు ;
సిద్ధ విద్యాధరశ్రేష్ఠులు సురలు । నిద్ధప్రబుద్ధులు నెఱుఁగుదు. ” రనిన
గంధర్వుఁ డిట్లను “ ఘనముగా వినుము । బంధుర వజ్రప్రహార నాదంబు
గొనకొని నీకోర్వఁ గొలదియే! ” యనిన । జననాథుఁ డాలించి సాధ్వసవృత్తిఁ
గలఁగి సంవర్తునిఁ గనుఁగొని మ్రొక్కి । “ కులిశంబు వచ్చె నో గురునాథ, మనసు
చలియింపుచున్నది; సభ్యులు వెఱచి । రలవడ రక్షింపు. ” మన విని యతిఁడు :
“ పార్థివ, వజ్రికి భయమేల నీకు ? । అర్థి నన్నెఱుఁగఁడే యమరవల్లభుఁడు ;
శతకోటి నణఁచెదఁ, జటులాయుధముల । హతము గావించెద నధిప, వరంబు
లడుగుము నీ ” వన్న నా మరుత్తుండు । తడయక ప్రణమిల్లి తపసి కిట్లనియె :
“ వైరంబు దక్కి యీ వాసవాద్యమరు । లారూఢి నాయాగ హవ్యముల్ వేడ్కఁ
గొనునట్లుగా ముని కుంజర, యీవె! ” । అనవుడు కృపసేయ నయ్యోగి మహిమ
నమరాధిపతి మొదలైన దేవతలు । తమతమ రూపముల్ ధరియించి మించి
వచ్చిన, నరపతి వారికి నెదురు । మచ్చికతోఁ జని మహితార్ఘ్యముఖ్య
పూజావిధాన మిమ్ములఁ జేసి దేవ । రాజుకుఁ బ్రణమిల్లి రమణ నిట్లనియె :

“ దేవ, నీవిచటి కేతెంచితిగాన । భావింప మఖము సఫలమయ్యె నేఁడు ;
మఱి కృతార్థుఁడ నైతి మనుజులలోన. । నటిముఱి నామీఁది యలుక వోవిడిచి
సారిదిమ్మైఁ జల్లని చూడ్కులఁ జూడు; । కరుణామృతము చల్లు ఘనముగా.” ననుచుఁ
బ్రార్థించి ప్రార్థించి వరఁగ సంవర్తు । నర్థిమైఁ జూపి “ యీ యతి వతంసంబు
గురుమూర్తి గావునఁ గోరి తెచ్చితిని, । సరవితోఁడుత.” నన్న శతమన్యుఁ డనియె :
“ ధృతిమీఱఁ బ్రీతిఁ బొందితిని నీవలన ; । నితఁ డాబృహస్పతి కెలమి సోదరుఁడు ;
నందియుం బేటికి ? జననాథ ! ” యనిన । నందంద సంవర్తుఁ డనియె నింద్రునకు :
“ దివిజాధినాథ, సాధిత దైత్యయూధ, । తివిటి నీవిచటి కేతెంచితి గానఁ
దరమిడి నేఁడు నాతపము ఫలించె ; । గరిమతో నీరాజు క్రతువు నీడేరె.
సకల దక్షుండవు సర్వము నరసి । సుకృతిఁగాఁ జూడుమీ క్షోణీతలేశు. ”
అని యిట్లు పలికిన నమరవల్లభుఁడు । మనమున హర్షించి మహనీయ మహిమ
నమృతాశనులఁ జూచి “ యజ్ఞవాటంబు । క్రమమున రమ్యంబు గావలె నిపుడు.
రంభ ఘృతాచి యూర్వశి మంజుఘోష । బంధురాలక యలంబస మొదలైన
యచ్చరలేముల యాటపాటలును । మచ్చికతోడ నామర దుందుభులును
నవ్యంబుగావలె.” నావుడు వారు । భవ్యులై గావించి ప్రజ్ఞదీపింప
సకల కర్మంబుల సాహాయ్య మెలమి । బ్రకటించి సేయంగఁ బరఁగ సంవర్త
ముని హవిర్విధి సేయ మోదంబుతోడ । ననిమిషపతి మొదలైన దేవతలు
సోమపానముచేసి సురుచిర తృప్తు । లై మహామహిమతో నానందమంది
యజనంబు గొనియాడి యందందపొంగి । నిజనివాసములకు నెమ్మితోఁ జనిరి.
అంత మరుత్తుండు నవభృథాంతమున । సంతోషచిత్తుఁడై సకల విప్రులకు
ధనరాసులిచ్చి యంతమున సంవర్త । మునిచేత ననుమతి పొందుగాఁ గాంచి
నిజపురి కేతెంచి నెమ్మితో నవని । విజయుఁడై ధర్మంబు వెలయఁ బాలించె.
భూసురు లాధనంబుల నోపినంత । రాసులు గైకొని రమణఁ దక్కినవి
యచట నిక్షేపించి హర్షవిస్ఫూర్తి । పచరించి యిట్లని పలికిరి తెలియ
“ ఎవ్వరెఱింగిన నిది వారి ధనము । నువ్వె సందేహ మించుకయైన లేదు. ”
కామించి యని రది గావున నిప్పు । డా మహాధనరాసు లర్థిమైఁ దెచ్చి
హయమేధ మొనరింపు మఖలంబు మెచ్చ ; । జయము గైకొమ్ము నిశ్చయముగా.” ననిన

## కృష్ణుఁడు ధర్మజునకు మనస్తాపోపశమనంబు సేయుట

సాత్యవతేయు వచనముల కర్థి । నత్యంత శోకంబునంది భూవిభుఁడు
తెలివి పొందకయున్న. దితిజారిఁజూచి । పలికె ధర్మజుతోడఁ "పార్థివవర్య,
కర్మకలాపంబు నిర్మలంబుగను । నర్మిలి నీచేత నడపంగఁబడదు (?)
... ... ... ... ... । ... ... ... ... ...
వెలయంగ నెట్లంటివేని నిందులకును । గలితేతిహాసంబు గలదు చెప్పెదను.
విను మది ధాత్రిని వృత్రుఁడనంగ । దనుజుఁడు వ్యాపించి దానిగంధంబు
గొని ప్రతాపించినఁ, గోపించి యింద్రుఁ । డెనయంగ శతకోటి యేయ, జలంబు
నను దేజమునఁ బవనాంబరంబులను । జెనసి యెంతయుఁ బ్రవేశించి తోడ్తోన
నలలిత రసరూప సంస్పర్శ శబ్ద । ములు నముద్ధతిఁ గొనఁ బురుహూతుఁడపుడు
అతులిత కులిశనిహతి వెల్వరింప । నతి వేగుఁడై దైత్యుఁ డతనిలోఁ జొచ్చె.
చొచ్చిన మూర్ఛిల్లు సురలోకనాథు । నచ్చుగాఁ బ్రదికించె నా వశిష్ఠుండు.
ఆరీతి బోధితుండై పురందరుఁడు । దూరి దేహాంతర్గతుండైన వృత్రు
నట నదృశ్యంబైన యశనిచేఁ జంపె. । తటుకున మునుల కీధర్మరహస్య
మాయింద్రుఁ డెఱిఁగించె నఖిలరీతులను. । పాయక వారు తప్పక నాకుఁ జెప్పి
రిది మానవేశ్వర, యెఱుఁగుము నీవు । విదితంబుగా." నని వెండియు ననియె:
"శారీరమన మానసంబు ననంగ । నా రెండు విధములై వ్యాధి వర్తించు.
మును వాతమును పిత్తమును శ్లేష్మమెలమిఁ । జనుట ననుంబైన స్వస్థుఁడౌ నరుఁడు.
కంది యీమూఁట నొక్కటనైన వికృతి । పొందిన రుజయని పుడమిలోఁ బరఁగు.
మఱియు సత్వరజస్తమములైవమ్య । మెఱుఁగు మనోవ్యాధి; యీద్వితయమున
కొంటి దోఁచుట యుండ; దొదవు నన్యోన్య । మంటిన జనకజన్య స్వాభావమున.
వికృతి కాలము తోఁచు వెసనొకట నొకటి । యకలంక వాతాదులందు గుణముల.
మహి నిది సూక్ష్మకర్మ ప్రకారంబు; । బహురీతి నలవరింపవుగాన నిన్ను
విమల కర్మానుష్ఠాన విధమెఱుఁగ వంటి. । అమిత వాతాదులయందుల గుణము
... ... ... ... ... । ... ... ... ... ...
విభవాఢ్య, చెప్పెద విను మొక్కమాట । సభ కేకవస్త్ర రజస్వల నీదు
సతియైనయట్టి పాంచాలిని దెచ్చి । ప్రతిలేక పఱచినపాట్లను మఱువు.

నరవి జటాసుర సైంధవ ముఖ్యు । దురిత కృత్యంబులుఁ, దొడిఁబడ మాత్స్య
పురమున దైన్యంబు పొందిన తెఱఁగు । నురవడి భీష్మాది యుద్ధతంత్రములు
సత్యముల్ గావ, యసత్యముల్ గాని । సత్యాత్మ, బాంధవ సాహాయ్యకంబు
తగఁ బనిలేదు ; యుద్ధమునకుఁ దోడు । నెగడంగ నాత్మయే నిజము భూనాథ !
పరికింప నీలోని పగ దీర్పుమింకఁ । బురడింపఁగా శాంత బుద్ధినై ఖరిని.
రెండక్షరంబులు మృత్యువు, మూఁడు । దండిగా బ్రహ్మంబు తగ విను మనఘ !
'మమ' యనునవియు 'నమమ' యనునవియుఁ । గ్రమములై యుండును ; గానంగఁ బడక
మును బ్రహ్మమృత్యువుల్ పోరుచునుండు ; । ఘనత మీఱఁగ హింసకత్వంబు లేదు(?)
జలధి వేష్టిత మహీచక్రమంతయును । వెలయఁ బాలించిన, విను దాని మీఁద
మమత లేకున్నను మనుజేంద్రులకును । దమయంతనే దురితము లెట్లుపొందు ?
వనమునఁ దపసినై పరపదార్థముల । మనసు పెట్టిన నది మహనీయతపమె !
కృతమతి వెలిపగ గెలుచుట గెలుపె ! । చతురత లోపలి శత్రుల నెల్ల
గెలిచిన మోక్షంబు గిరికొనుగాక. । కలయంగ నిందుకుఁ గామగీతలును
గలవు చెప్పెద విను కాముండు తొల్లి । తెలివి లోకంబు నుద్దేశించి యనియె :
"అనపాయుఁ డగు నెవ్వఁ డవనిలో నన్ను । బని వడి మిక్కిలి బాధింపఁ జాలఁ ;
డొనరంగ వేదవేద్యుండనై యేను । వినుతింపఁ బరఁగుదు ; విహతుఁ జేయంగఁ
జూచిన భావమై చొప్పడి యుండు. । ఏచి యాతండది యెఱుఁగఁడు గాన
నవనిపై విహతి బొంకైపోవ జయము । తివిఱి లేకుండును ధృతినెవ్వఁడైనఁ
బ్రతిలేని తపమునఁ బ్రహరింతుననిన । నతనికిఁ గోరికనై జనియింతు.
మతిని మోక్షము నూఁది మఱి త్రోతుననిన । నతని మోక్షార్థ మేనగు టవధ్యుఁడను ;
వర సనాతనుఁడఁ ద్రోవఁగఁ జాలఁడొకఁడు, । చిరతరంబుగ." నని చెప్పె నివ్విధము.
విను మదిగావున వేయు నేమిటికి । మనమునఁ గోరిక మఱిచోరనీక
యశ్వమేధము సేయు మవనీశతిలక ! । శాశ్వత ధర్మనిశ్చయుఁడవు గమ్మ.
వారక చచ్చినవారిఁ దేవశమె । వారిఁ దలంపకు వరుసతో" ననుచు
హరిచెప్పె ; నారదుండట ప్రబోధించె ; । నరవిఁ బరాశరసంయమి తెలిపె ;
వలను మీఱఁగ భీమవాసువుల్ కవలు । వెలది ద్రౌపదియును వినిపించి ; రట్టి
శుభ వాక్యములు విని శోకంబుమాని । ప్రభ మీఱ మేదినీపాలనా యాగ
గురుకార్యముల కియ్యకొని ధర్మరాజు । విరివిగాఁ బావన వృత్తికై పూని

పోసఁగ గంగాతీరమునఁ గొన్నిదినము । లనమున నిలుచువాఁడై మునీంద్రులకు
సరిఁ బ్రదక్షిణ నమస్కారముల్ చేసి । "సురుచిరాత్మకులార, శోకంబుమాన
విచ్చేయుఁ" డనుచు భావించి భావించి । మచ్చికతోడ నా మానుల ననిపి
గరిమతో భీష్మముఖ జ్ఞాతులకును । సరసత ధృతరాష్ట్ర సహితుఁడై యపుడు
పరలోక విధులు తప్పకయొనరించి । తరమిడి బహువిధ దానంబులొసఁగి
కతిపయ దినములఁ గరిపురంబునకుఁ । గృతకృత్యుఁడై వచ్చి కీర్తింప జనులు
మునుకొని యనుజులు మునమువహింపఁ । బెనుపొంద నెంతయుఁ బృథివి పాలించె."
అనిచెప్ప జనమేజయ క్షితీశ్వరుఁడు । మునినాథునకుఁ గేలుమోడ్చి యిట్లనియె :
"ధర్మజుఁ డారీతి ధాత్రిఁ బాలింప । శౌరియుఁ బార్థుఁ డెచ్చట వసియించి?
రెఱుఁగఁ జెప్పవె నాకుఋషివర్య!" యనిన । దఱలక యప్పుడత్తపసి యిట్లనియె :
"ధర్మజుండిమ్మయి ధరణి పాలింప । నర్మిలిఁ గృష్ణుండు నాధనంజయుఁడుఁ
బొసఁగ నింద్రప్రస్థపురవరంబునను । వసియించి క్రీడచే వన గిరి సాను
దేశంబులందు సుస్థితిఁ జరింపుచును । భూసుర పూజలఁ బుణ్యకథలను
బొద్దుపుచ్చుచుఁ దమపూర్వవృత్తములఁ । దద్దయు సమరతంత్రములఁ జెప్పుచును,
నరుఁడు శోకంబున నందనుఁదలప । హరి పరితాపంబు నణఁపుచు, నంత
మయసభఁ గూర్చుండి మహితవిస్ఫూర్తి । నయ మొప్పఁ బురుహూతనందను కనియె :
"ధర్మయుద్ధము చేసి తగజయమంది । ధర్మనందనుఁడు విద్వజ్జనావలియు
వినుతింప మానులు వేడుకతోడఁ । గొనియాడఁ గొనియాడఁ గుంభినీతలము
నేలుచు నున్నాఁడు కృతకృత్యుఁ డగుచు; । చాలంగ నాకును సంతోషమయ్యె.
తవిరి దేవకి వసుదేవుని బలుని । సవినయు లైనట్టి సకలయాదవులఁ
జూడంగ మనసయ్యె శోభనాకార! । వేడుక నన్నంపవే! పోయివత్తు.
తనువు ప్రాణంబు బాంధవులును సుతులు । ధనము సహోదరుల్ ధర్మజుసొమ్ము.
తత మహామహిమలఁ దదనువర్తనము । వ్రతము నాకదిగాన వారణపురికిఁ
జని పుణ్యచరితు సజాత శాత్రవునిఁ । గని విన్నవించినఁ గలితాత్ముఁ డేమి
పనిచిన నారీతిఁ బరగఁ జేయుదము । గొనకొని" యనవుడుఁ గొండొకసేపు
నిలిచి విచారించి నీరజనాభు । పలుకుల కొడఁబడి పార్థుఁ డిట్లనియె :
"అనికిఁ దొడంగిన యపుడె నాయాత్మ । ఘనముగా నెంతయుఁ గలఁగినఁ గొన్ని

పొలుపు మీఱిన తత్త్వబోధనవాక్య । ములు కృపసేసితి ముద ముదీపింప ;
అతత విస్ఫూర్తి నవి నిల్పఁజాల । నైతి; నవ్వినుత వాక్యామృతరసము
నింపుగా వీనుల నింకొక్కమాటు । నింపవే!" యనవు డన్నీరజోదరుఁడు
కడఁకతో నాతనిఁ గౌఁగిటఁజేర్చి । తడయ కిట్లను నింద్రతనయునితోడ :

## శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞాన స్థిరీకరణంబు సేయుట

" పరికింపఁగా బ్రహ్మపద విధంబునకుఁ । బరమహేతువులైన ప్రథితవాక్యములు
మతినిల్పవైతివి మఱిచెప్పవశమె ! । ఇతిహాస మొక్కటి యిందుకు వినుము :
" ఒనరంగ నొకడ కొక్క విప్రుండు । చను దేరఁ 'దత్త్వ విజ్ఞానంబు తెలుఁగు
చెప్పు నా' కనవుడు చెప్పె నా ఘనుఁడు । తప్పక వినుసింతుఁ దాల్మితో వినుము ;
ధృతిని గాశ్యప నామధేయుఁడై నట్టి । క్షితిదేవుఁ డొక్కచోఁ జెలఁగి విజ్ఞాన
శాలియుఁ ద్వ్యక్తసంసార భారుఁడు । కాలవేదియు నగు ఘనసిద్ధవరునిఁ
గని శిష్యుఁడైన, నాఘనుఁడు విప్రునకు । వినిపించెఁ జెప్పెద వినుము సద్భక్తి.
పుణ్యంబులగు కర్మములు సంతతంబు । గణ్యుఁడై చేసి సుఖంబున నిహము
పరమును లబ్ధమై పదపడి యొక్క । గరిమ కామోద్రేక కలితంబులందు
మరలి జన్మంబును మరణంబుఁ గలుగ । ధరఁ బుత్రులని తల్లి దండ్రు లనంగ
సంచిత బహువిధ జాతియుక్తులను । గాంచితిఁ; జనుఁబాలు గడఁగి త్రావితిని.
నలి సుహృద్ధన బంధు నాశంబు లొదవె. । తలకొని మానవ తనువుల వివిధ
నిరయ దుఃఖానేక నివహంబు మీఱఁ । దరమిడి లోకతంత్రము విసర్జించి
చల మొప్ప నాత్మప్రసాదంబు వలనఁ । జెలిమిమై నీగతి సిద్ధి గాంచితిని ;
ఘనముగా నింక లోకంబులఁ జూడ; । నొనరఁ బ్రజాసర్గ మున్నంత కాల
మును శుభంబులు గల్గు ; మునుకొని బ్రహ్మ । నునిశితానందంబు చొప్పడె. " ననుచుఁ
బెక్కు విధంబులఁ బీతాంబరుండు । తక్కక బోధించి తగఁ బార్థుకనియె :
"అనఘాత్మ, ద్వారక కరుగంగ వలయు ; । నెనసిన వేడ్కతో నిచటికి వచ్చి
తడవయ్యె ; నఖిల యాదవులఁ జూచెదను । గడఁకతో." ననిన నా కవ్వడి యనియె :
"ఈరీతి నిజమైన నిభపురంబునకు । వారక పోయి యీవార్త ధర్మజుని
కెఱిఁగించి యనిపెద నిందిరారమణ ! । అటమీఁద నచటికి నరుగంగ వలయు. "

## కృష్ణార్జును లింద్రప్రస్థమునుండి హస్తినపురంబునకు వచ్చుట

అన విని శ్రీకృష్ణుఁ డపుడ దారకుని । ననయంబు రావించి ‘యరదంబుఁ బూన్పు’
మని నియోగించిన, నట్లకా కనుచుఁ । దనరంగఁ దేరాయితముచేసి తేరఁ
బరిజనంబును గొల్వఁ బార్థుండుఁ దాను । నరదంబుపై నెక్కి యట చనువేళ
వినయ మొప్పంగ గోవిందునిఁ జూచి । యనియె గాండీవి: “ యోయనఘ, నీకరుణఁ
గౌరవ సైన్య సాగర ముత్తరించి । మీఱితి; గురు భీష్మమిహిరతనూజ
సైంధవ ముఖ్యులు సమయంగఁ గంటి ; । బంధుర సద్భోగ భాగ్యుఁడ నైతి. ”
అని యిట్లు పలుకంగ నంబుజోదరుఁడు । తనర నానందించి తగనాదరించి
సరససల్లాపంబు సలుపుచుఁ బోయి । కరిపురిఁజొచ్చి యాగాంధారియుక్తుఁ
డై యున్న కురువృద్ధు కతిభక్తిమ్రొక్కి । పాయక కుంతికిఁ బ్రణమిల్లి మఱియు
ధర్మజ సంజయ ధౌమ్యాది వరుల । నిర్మలమతిఁ గాంచి నీరజోదరుఁడు
మరలి బీభత్సుని మందిరంబునకు । నరిగి సంతోషియై యారాత్రి గడపి
మఱునాఁడు సంధ్యా సమాధులఁ దీర్చి । మఱువక యాస్థాన మంటపంబునను
గొలువున్నయట్టి యాక్షోణీతలేశు । జలజనాభుఁడు గాంచి సద్గోష్ఠినుండ
నానమయంబున సమరేంద్రనుతుఁడు । భాసుర విస్ఫూర్తిఁ బాండవపూర్వు
వదనంబుపైఁ జూడ్కి వదలక నిలిపి । పదిలమై యిట్లనుఁ : “ బద్మనాభుండు
పెద్దకాలంబయి ప్రియమున నిచటఁ । దద్దయు నున్నాఁడు; తల్లిదండ్రులును
సకల బాంధవులును సహజన్ము లితని । ప్రకట దర్శనము గోరుక యున్నవారు.
ఇమ్మహాత్ముండు మహీశ, ద్వారకకు । నెమ్మిలోఁ డుతఁ జని నిఖిల బాంధవులఁ
దల్లిదండ్రుల సహోదరులను జూచి । యెల్లగా మగిడెడి నిదియ తథ్యంబు.
దేవర, యిప్పని దివ్యచిత్తమున । భావించి యానతిఁ బఱపు”. నావుడును
యమతనూజాతుండు నట్లకాకనుచుఁ । గమలలోచనుఁజూచి కౌఁగిటఁ జేర్చి
“ ద్వారక కరిగి మీతల్లిదండ్రులను । సీరి దక్కనవారి నేమంబు లరసి
వారిని దోడ్కొని వాజి మేధమున । కారయ వేంచేయు మనఘాత్మ! ” యనినఁ
గడు సంతసిల్లి యక్కమల నాభుండు । తోడరి సుభద్రను దోడ్కొనిపోవఁ
దలఁచి యత్తయనుజ్ఞ ధవుని సమ్మతియుఁ । గలయంగఁగొని యంతఁ గ్రమమున నరద
మతివేడ్క నెక్కి మహావైభవమున । వితతమై యాపాండవేయులు జనులు

ననుప రా వెలువడి యందఱు వీడు । కొని మహాపథము గైకొని తనదృష్టి
పాండవమధ్యముపై నిల్పి, చనుచు । మండలేశ్వరులను మరలి చూచుచును
దవ్వగా నరుగంగ, ధర్మజాదులును । ఇవ్విధంబునఁ జూచి యేఁగిరి పురికి.
అటు హృషీకేశుండు నరుగ సాత్యకియుఁ । దటుకున దివ్యరథంబుపై నెక్కి
యరుగంగ దేవేంద్రుఁ డలరులవాన । గురిసె వాయువు లనుకూలమై వీచె.
మఱియును బెక్కైన మంగళ ప్రదము । లఱిముఱి నగు నిమిత్తాదులు మించె.

## శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమమునకుఁ బోవుట

ఆరీతిఁ జనిచని యబ్జలోచనుఁడు । చేరువ కెలన వీక్షించె నుదంకుఁ
డను మునీంద్రుని మహదాశ్రమం బపుడు. । కని పోయి యతిథి సత్కారముల్ వడసి
యతని యనుజ్ఞచే నాసీనుఁ డగుచు । నతులిత. గతినుండ నమ్మౌని యనియె :
" భరతులపాలికిఁ బద్మాక్ష, పోయి । కురుపాఁడవుల మహాక్షోణీ తలమున
వదలక నిల్పితే ! వారి వారికిని । దుదిఁ బక్షపాతాది దోషంబులేక."
అనుచు నెఱుంగని యట్టులువోలెఁ । బొనర నిందాగర్భముగఁ బల్క, శౌరి
యిరవొప్పఁ దానును నెఱుఁగని రీతి । వరుసతో భార్గవు వదనంబు చూచి
"విను మేనుబోయి పర్వీన భీతివుట్టఁ । జనవొప్పఁ గురుపతి సంధి కార్యంబు
నొనరంగ నెంతయు నొత్తి చెప్పినను । మనసునఁ బెట్టక మదము రెట్టించి
యతిలోభమున మహాహంకారముననుు । మతి చెడి వంశధర్మస్థితి విడిచి
సరవి నేవిధమైనన సంధికిఁ జొరక । కురుకుమారులు మహా ఘోరయుద్ధమునఁ
బరిజన గురుమిత్ర బంధు యుక్తముగ । మరణంబు నొందిరి మౌనీంద్రతిలక !
తగ నిటఁ బాండునందనపంచకంబు । జగతిపైఁ బ్రతికిరి సర్వజ్ఞ, వినుము.
కాల పర్యాయంబు గడవనెవ్వరికి । నేలీల శక్యమౌ సిద్ధ విజ్ఞాన ! "
యన విని కోపించి యమ్మునీశ్వరుఁడు । వనమాలి కిట్లను : " వదలక నీవు
కౌరవకులము నొక్కటఁ ద్రుంచితకట ! । ఆరయఁ బాపాత్మ, యందు కేమాయె
శాపింతుని " న్నన్నఁ, జక్రపాణియును । దాపసిఁ జూచి యెంతయు నిట్టులనియె :
" తెలియ నామాటలు తేటపడంగఁ । జెలిమితో విని యట్ల సేయుము గాక.
కినియుట మానుము ; కృతకృత్యుఁడైన । మునికిఁ గోపంబు తపో నాశకంబు.

విపులామ రాధీశ, వినుమల్పమైన । తపమున గిపమున ధరణిలో నేను
గోలుపోవుదునె ! సద్గురు వరాధార । లాలితజ్ఞాన లీలా మహా మహిమ.
బ్రహ్మచర్యంబు నారడిపోదె యకట ! । బ్రహ్మంబు చెందునే పాపియౌకోపి ? ”
యనిన సుదంకుండు నంబుజోదరుని । గనుంగొని యిట్లనుం గడంకతోడుతను :
“ అగుంగాక నీవు చయ్యనం జెప్పుమెద్ది । తగవు తథ్యంబైనం దగ భావబుద్ధి
మగిడింతు. ” ననిన న మ్మధుసూదనుండు । నగుచు సుదంకుతో నయ మొప్పం బలికె :
“ భూమి వాయువు నభంబును బ్రణవమును । సామాది బహువేద శాస్త్రవర్గములు,
నరవిం జతుర్విధాశ్రమములు. సర్వ । పరికర్మములు, మఱి భవ్యమోక్షమును
నేనయివర్తింతు; నీశుండు బ్రహ్మ । దానవాంతకుండు నంతకుండు నేనగుచు
ధర్మంబు గలవారిం దగంబ్రోచి పాప । కర్ముల శిక్షింతు ఘనతరలీల.
వరమతితో నట్టివాండనై యుండి । ధర నధర్మపరుల ధార్తరాష్ట్రులను
ధార్మికులై నట్టి ధర్మజాదులను । బేర్మిం గూర్చుటకునై ప్రియమాడి యాడి
పలు తెఱంగులంబడితిం బరంగ నయ్యాదియుం । గలిత దివ్యజ్ఞాన ఘనులైనయట్టి
వ్యాసాది మునుల పావన చిత్తములకు । వాసిగా నెక్క ; దుర్వార పాతకులు
కౌరవులడరి యక్కాంతేయవరులం । గారించి ధర్మసంగరమునం దెగిరి.
ఏను జేసినదిది యేమైనం జేయు । పూనిక. ” ననిన నమ్ముని పుంగవుండు
వినతుండై మదిని భావించి భావించి । వనజనాభునితోడ వలనొప్పం బలికె :
“ నెలకొని యిప్పుడు నీ మహామహిమ । లలర నేర్పడియె ; నమ్య గనుగ్రహమునం
జెప్పినయట్టి విశేషంబు లెల్లం । దప్పక యెఱుంగుదుం దలంకను మదిని.
కప్పిన యీ రాదుగ్రహపు గర్వంబు । ఒప్పమిగాంగ నీ వొసంగంగ నాకుం
జొప్పడె మున్న; భాసుర వచనముల । నిప్పుడు తేర్చితి వీవ శ్రీకృష్ణ ! ”
అని పల్కి వెండియు ననియె : “ నీకరుణ । కనయంబుం బాత్రుండనైతి నిందులకు
నీ విశ్వరూపంబు నెఱిం జూపవలయు । శ్రీవనితాధీశ, సృష్టిప్రకాశ !

శ్రీకృష్ణుం డుదంకునకుం దన విశ్వరూపంబు చూపుట

అనుడు దయార్థుండై హరి యర్జునునకు । మునుపు చూపిన దివ్యమూర్తి చూపినను
జెఱంగొప్ప నుదము భీతియు విస్మయమును । మఱి పెనంగొనంగ నహస్రాని హస్తములు

మొగిచి యెంతయు " నమఃపురుషోత్తమాయ । జగతీధవాయ కృష్ణాయ తే. " యనుచు
(వనమాలి నిశ్చల భక్తిభావమునఁ) । గొనియాడి కొనియాడి కోర్కులఁ బొదలి
" యగణితక్రమరూప, హరి, ముకుందాఖ్య, । నిగమగోచర, దేవ, నిపుణప్రభావ,
భావనాతీతవైభవ, నిత్యభావ, । భావజజనక, శోభనగుణాధార,
ధారాభ్ర నిభదేహ, దైవతారాధ్య, । వారిజనాభ, నీ వరవిశ్వరూప
మువసంహరింపు మత్యున్నతంబుగను. । తపము ఫలించె నెంతయు నాకు. " ననినఁ
బరమేశ్వరుండు వైభవలీల ననియె : । ' వరము గోరుము నీవు వసుమతిలోన '
ననవుడు " నీమూర్తి యఖిలేశ, కంటి । ఘనముగా నింతటికన్న వరంబు
నరయంగఁ గలుగునే ! యయినఁ జెప్పెదను. । మరుదేశ మిట జలంబరయ దుర్లభము
జలజదళాక్ష, నిశ్చయముగా నెపుడు । సలిలంబు గలుగఁ బ్రసాదింపు నాకు. "
అనవుడు శ్రీకృష్ణుఁ " డట్ల కాకనుచుఁ । దనదు తొల్లిటిమూర్తి ధరియించి యనియె :
" తఱమిడి నన్నును దలఁవంగ ననఘ ! । దొరకును నుదకంబు తోడ్తోన " ననుచు
వీడ్కొని చనియె నవ్విశ్వాత్మకుండు. । వేడ్క నుదంకుండు వెస నొక్కనాఁడు
దాహమై శ్రీహరిఁ దలఁప నవ్వేళ । నూహింప నెంతయు నొక్క చండాలుఁ
డక్కజంబుగ మలినాంగుఁడై తిరిగి । కుక్కలు చుట్టిరా గురుకార్ముకంబు
నతిముతిఁ బట్టి దిగంబరుఁ డగుచు । నెఱయ దేహంబున నీళ్లుగాఱంగఁ
గుఱిగా నుదంకుఁ గన్గొని యిట్టులనియె : । " తఱలక దప్పివోఁ ద్రావుమీ జలము "
ననవుండు ' నేనొల్ల ' నని పల్కుటయును । " వినుమ యుదంక, భావించి నీమీఁది
కరుణవాఁడను నేను గాదనకీవు । అరుదు మీఱఁగఁ ద్రావు. " మనినఁ జండాలుఁ
గని యదల్చిన, వాఁడు గానరాకున్న, । ముని వెఱగంది యిమ్ముల విచారించి
' సరవి నీకపట ప్రచారంబు లెల్ల । హరి మాయలేగాని యన్యముల్ గావు. "
అని యని యూహించు నవసరంబునను । వనజాక్షుఁడే తేర, వరున నమ్మౌని
గనుఁగొని యిట్లనుఁ " గంజదళాక్ష ! । విను నిన్నుఁ దలఁచిన వెసమాలవాని
యొడలఁ గాఱెడునీరు నొగిఁ ద్రావఁ దగునె ! । అడర నీవరము బొంకయ్యె నేఁ " డనిన
మఱియును హరిపల్కు " మౌనీంద్ర, నీవు । ఎఱుఁగలేవైతివి; ఏను నీకొఱకు
సురపతిఁ బ్రార్థించి సుధయడుగుటయు, । " నరులకు నిచ్చుట నాయంబుగాదు
వమయంబు చేసెద సంయమికడకుఁ । దమిని మతంగత దాల్చి యే నరిగి
ప్రీతునిఁ జేసెదఁ బ్రేమ దీపింప । నాతఁ డొల్లకయున్న నర్థిమై వత్తు. "

ననుచు దేవేంద్రుండు నరుదెంచె; దాని । కనయంబు నేమి సేయగవచ్చు నింక !
పొలుపుమీఱ వరంబు బొంకుగాకుండఁ । దలకొని జలము నీతలఁచిన యపుడు
జలదంబు నీమరుస్థలమున నొసఁగు. । మెలపుమీఱ నుదంక మేఘనామంబు
గలిగి యీయెడను మేఘంబులు దిరుగు. । నలిరేఁగి పలుమాఱు నన్ను దూరకుము,
పోయివచ్చెద.” నని పుండరీకాక్షుఁ । డాయెడఁ గానరా కరిగె నెంతయును.”
అని యిట్లు జనమేజయక్షితీంద్రునకు । ముని చెప్పెనని చెప్ప మోదించి మునులు
అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
వారిజనాభ, శ్రీవత్సాంక, దేవ, । గౌరీశ వినుత, లోకఖ్యాత చరిత,
దైతేయమర్దన, దైవతారాధ్య, । చేతోజజనక, నైష్ఠిక హృన్నివాస,
ఘనమౌని హృద్గేహ కలితసందోహ । వినుత ప్రకాశ, శ్రీ వేంకటాధీశ,
భక్తవత్సల, జగత్పావన, భుక్తి । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పాన ద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్య తనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితాశ్వమేధ పర్వమున నాశ్వాస । ముచితార్థ యుతముగా నొక్కటి యయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ మహిళాధీశ, సృష్టి ప్రకాశ, । సోమద్యుమణి నేత్ర, శోభితగాత్ర,
జనమే జయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
"మనుజేశ, యప్పుడు మరుదేశమందు । ఘనత రాశ్చర్యంబు గాఁగ నుదంక
జలద మొక్కొకవేళ నరిఁ బుణ్యతిథుల । వలనొప్పఁ గురియు నవారిత లీల.
అనవుడు జనమేజయావనీ విభుఁడు । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె:

## ఉదంకుని చరిత్రము

"సొలవక హరి శపించుట కుత్సహించె । తెలియు నుందకుఁ; డేవిధమున నతని
కట్టిప్రభావ మోహాయనఘాత్మ, కలిగె? । నెట్టన." ననిన మునిశ్రేష్ఠుఁ డనియె:
కతలేల గురుభక్తి కతన సిద్ధించె! । నతనికి నట్టి మహాప్రభావంబు.
తమగురుఁడైన గౌతమునకు సేవ । గొనకొని సేయంగఁ గొంతకాలమున
కతఁడు శిష్యులకెల్ల నధికవరంబు । లతులిత గతినిచ్చి యాయుదంకాఖ్యుఁ
దలఁపక యుండు నత్తఱి నొక్కనాఁడు । కొలఁది మీఱఁగ నుదంకుఁడు ప్రభాతమున
వంట కట్టియలకై వనమున కరిగి । కంటగింపక ప్రేఁగుగలయట్టి మోపు
గొనితెచ్చి జడ పెనఁగొనియుండ వేగఁ । జని యొఱుంగక యంత సరభసవృత్తి
నైవ నాజడ తెగి వసుధపైఁ బడినఁ । దా వెస నందు సితచ్ఛవి చూచి
వనివడి తన వయఃపరిపాక మెఱిఁగి । ఘనతర శోక సంకలితుఁడై యేడ్వఁ
గనుఁగొని యప్పుడా గౌతమ మునియు । ఘనముగాఁ దనమదిఁ గారుణ్యమెసఁగ
నయ్యశ్రువులు తన యంజలిఁ బట్టఁ । జయ్యన నిజపుత్త్రిఁ జనుమని పలుక
నక్కన్యకామణి యంతటిలోనఁ । గ్రక్కునఁ జని తన కరపుటంబునను
బోఁడిమిఁ బట్ట నప్పుడు హస్తయుగము । వేఁడిమి చూపిన విడిచె నద్ధరను.
తలర నమ్ముని శిష్యుఁ దగఁ జేరఁ బిలిచి । "నలిరేఁగి నీవేల నలత పొందెదవు?"
అనవుడు నీ శిష్యులందఱిమీఁద । ఘనముగాఁ గలిగిన కరుణ నామీఁద
లేదు గావున నుమ్మలింప కెట్లుందు? । నోదయానిధి!" యని యొప్పుగాఁబలుకఁ
గరుణ దీపింప నాగౌతముఁ డనియె: । "పరికింపఁగా లేఁత ప్రాయమిచ్చెదను;

నెలకొని యధిక మనీష యిచ్చెదను; । జెలఁగి నాకూఁతు నిచ్చెదఁ బెండ్లిగమ్ము.
వరవి నీ తేజంబు సహియించి మెలఁగ । నరనుత, యీపద్మనయనకుఁ దక్క-
నొరుల కశక్య మత్యున్నతస్ఫూర్తి. । ... ... ... ... ...
తనరంగ నీతలోదరికి వేఱొక్క- । తనులత చేసినఁ దగఁ బుట్టినట్లు;
ఎలమితోడుత దోసమేమియు లేదు; । మలయక నీవనుమానంబు దక్కు-;
గావ నధర్మంబు గాకుండునట్లు । గా వరంబిచ్చితిఁ గన్య వరింపు
మీలోన." నని పుత్రికెంతయు వేగ । లాలితంబుగఁ దనులత యొందునేయ
నాయుదంకుండును యౌవనలక్ష్మి । పాయక దాల్చి యప్పణఁతి వివాహ
మయ్యెక్క-నాఁడు మహా భక్తితోడఁ । జయ్యన గౌతము సన్నిధి నిలిచి:
"ప్రీతియొయ్యది మీకుఁ బ్రేమతోఁ దెత్తు । నాతత విస్ఫూర్తి." ననిన గౌతముఁడు
పలికె: "దక్షిణ నీదు భక్తియె నాకు । వలవదు పో." మ్మన్న వదల కెంతయును
మునిపత్ని కడకేఁగి మ్రొక్కి- ఇట్లనియె: । "వనజదళాక్షి, నీ వాంఛితంబెద్ది?"
యనుటయు నా యహల్యయు 'మిత్రసహుని । వనితకుండలములు వలనుగాఁ దెమ్ము.'
అని యిట్లువనిచిన నయ్యుదంకుండు । చనియె నప్పటికిని జతురత మెఱసి.
గౌతముఁ డాతనిఁ గాన కహల్యఁ । బ్రీతితో నడిగిన బింబోష్ఠి యతఁడు
చనిన విధంబు నిశ్చయముగాఁ జెప్ప । విని దయాళుండునై వెలఁదిని జూచి
"సౌదాసభూపతి జనమాంసమునకు । మోదించు; నెట్లొకో మునిపతి!" కనిన
నమ్ముగ్ధ భయపడి "యతనికిఁ గీడు । నెమ్మితో రాకుండనీవె రక్షింపు."
అనిన గౌతముఁడును "నక్లేల వెఱవ? । గొనకొని కాచెదఁ గువలయనేత్ర!"
అని యూఱడించె; నట్లరిగి యుదంకుఁ । డానర శూన్యాటవి నుగ్రమూర్తియును
దగ నర రక్తసిక్త తనువు గలిగి । యగణిత శ్రమశక్తి నట్లున్న నృపతిఁ
జూచిన నాతఁడుఁజూచి యిట్లనియె: । "ఏచు నాఁకలిచేత నెక్కుడఁ గలదొ
యాహార? మనుచుండ నరుగు దెంచితివి. । బాహువిస్ఫూర్తిమై భక్షణ గొందు."
ననిన నుదంకుండు నవని వల్లభునిఁ । గనుఁగొని ధైర్యసంకలితుఁడై పలికె:
"గురుకార్యమునకునై క్షోణీతలేశ! । వరమతి నినుగాన వచ్చితి నేను.
గుఱిగారు హింసకు గుర్వర్థపరులు; । మఱచి యాడుదురె ధర్మముగాని మాట!"
అనఁగ "నిన్నర్పించి రనిమిషుల్ నాకు । ఘనతర లీల నాఁకలి దీర్ప" ననిన
నయ్యుదంకుండును నక్షైన వినుము । ఇయ్యెడ గురుకార్య మే నొనరించి

వచ్చెద మగుడ నవశ్య ; మీపలుకు, । అచ్చుగా నిప్పుడు నన్నృతంబు గాదు.
నీవర్థి కోట్లకు నిఖిలార్థ తతులు । భావించి యిత్తువు పాత్రుండ నేను.
గురులకుఁగాన నా కోరిన కోర్కి । యరుదుగాఁ గావింతురని వచ్చినాఁడ.
అనుటయు 'నీవేమి యర్థించి వచ్చి । తనఘాత్మ, చెప్పవే!' యని యడుగుటయుఁ
"దమితోడ నీ యింతి ధరియించు కుండ । లములకై" యనిన భూరమణీశుఁ డనియె :
"నలిరేఁగి యొరుల ధనంబిచ్చువారు । గలరె! కుండలములు గాకెద్దియైన
నడుగుము నీ" వన్న నా యుదంకుండు । కడఁకతో నమ్మహీకాంతున కనియె :
"నీవు పుణ్యుండవు నెపమిడి నన్ను । ద్రోవంగఁజాలవు ; తుది నవ్యవస్తు
వుల నొల్ల నే." నన్న నుర్వీశ్వరుండు (?) । "తెలియంగ నేను బుత్తెంచితి ననుము ;
వరుస నల్లదె తన్నివాస దేశంబు ; । సారిదియైఁ బో."య్మని చూపిన నతఁడు
నద్దేవిఁ గని యంత నట్ల సేయంగ । ముద్దియపల్కె నిమ్ముల నానవాలు
దెమ్మనీ." వనిపల్కఁ దిరిగి యుదంకుఁ । డమ్మహీపతిఁ గాంచి యానవాలడుగ
నాతఁ "డేగతి సేమమగునని తెలియఁ । బ్రీతిమై రా ; దిది వెలిగాఁగ వేఱ
గతియు లేదను పల్కు కమలాక్షికిచ్చు । నతులితాభిజ్ఞాన." మన సంతసిల్లి
మదయంతి కడకేఁగి మఱి తత్ప్రకార । మదనుగాఁ జెప్పిన, నబ్జదళాక్షి
వరువడి పురుషుని వనుపదిగాన । గురుతుగా నిచ్చి తత్కుండల ద్వయము

ఉదంకుఁడు మదయంతివలనఁ గుండలములఁ బడయుట

"గంధర్వు లురగులు ఖచరులు సురలు । బంధురోపాయముల్ ప్రబలంగఁ బొంచి
దీని హరింపంగఁ దివురుచుందురు । మానుగా నెప్పుడు మౌనీంద్ర తిలక !
ముద్రగా నెంగిలి పొరసిన వినుము । నిద్రించినను మఱి నేలపై నిడిన
నపహరింతురు ; భక్తినర్చించి తాల్ప । నపరిమితంబైన యర్థంబు గురియు.
ఆఁకలి నీర్వట్టు నగ్నిభయంబు । ప్రాకట విషభూత బాధలు లేవు.
పెద్దవారలకును బిన్నవారలకుఁ । దద్దయుఁ బెట్టినఁ దగనమరుండు."
అనిచెప్పి మదయంతి యర్చించి మునికి । ఘనకుండలము లీయఁ గడఁగి దీవించి
భూమీశుపాలికిఁ బోయి హర్షమున । నా మహాలాభంబు నర్థిమైఁ జెప్పి
దీవించి యిట్లను : "దేవ, నీ వలనఁ । బావనాత్ముఁడనైతి భవ్యుఁడనైతి.
మదయంతి కానవాల్మఱి నీవు చెప్పి । తది మహాగూఢ మాయర్థంబు దెలియ

వలయు నా." కనిన భూవల్లభుఁడపుడు । చెలిమితో నా మునిశ్రేష్ఠున కనియె:
"క్షితిదేవతలను బూజింతురు నృపులు । ప్రతిదిన ; మటుగాన బ్రాహ్మణసేవ
సేయంగ వెడతప్పు సిద్ధించె ; దానఁ । బాయక దురితంబు ప్రాపించె నిట్లు ;
పుడమిలో భూసురపూజ దుష్కరము ; । వెడమతిఁ గాదన్న వేఱొండు లేదు
గతి యని సంజ్ఞ యక్కమలాక్షికేను । ధృతి మీఱఁ జెప్పి పుత్తెంచితి నట్లు
ఆకుండలము లిచ్చి యణఁచెదఁ గీడు । నీకతంబున నని నిఖిలైకపూజ్య ?"
అనుచు సౌదాసుండు నమ్మహామౌని । ఘనతర సన్నిధి కలిమి సంప్రాప్త
మానసత్వంబున మహిమ దీపింపఁ, । బూని యుదంకుఁ డా భూమీశు కనియె :
"పొగడొంద నాపల్కుపోహంబు గాదు । మగిడి వచ్చెద నమ్ము మనుజేశ !" యనుచు
నతుల చిత్తము కృపాయత్తమై యున్న । నతనిఁ గనుంగొని యర్థి నిట్లనియె :
"అవనిలోఁ జంపెడియట్టి నాకడకు । నవిరళగతి వత్తురయ్య ! మీపెంపు
ప్రేమతోఁ జూచితిఁ బ్రీతుండనైతి. । నా మదార్తిని (?) బాపి నన్నురక్షింపు."
మనినఁ బ్రసన్నుఁడై యయ్యుదంకుండు । మనుజనాయకుఁ జూచి మఱియు నిట్లనియె :
"ఏమిటనైన నరేంద్ర, సజ్జనుని । భూమిపై నొప్పమి పొందదేనియును
మరలును వేగంబ ; మమత గౌతముఁడు । విరివిఁ జల్లని చిత్తవృత్తి నీమీఁదఁ
బరఁగించెఁ గాఁబోలుఁ బార్థివచంద్ర ! । పురణింపఁగా నింకఁ బొందు సౌఖ్యములు.
అని యట్లు దీవించి యతిదయతోడఁ । దనదు హస్తమున నాతని మేను నిమిరి
పోయి వచ్చెదనని పొలుపుగాఁ జెప్పి । యాయుదంకుండు చయ్యనఁ గుండలములు
(ముడిచి కృష్ణాజినంబునఁ బదిలముగఁ । దడయక పోయి గౌతము నాశ్రమంబు
దరిసి ఫలోన్నత తరువర మొకడు । ... ... ... ... ...
గాంచి యాఁకలి పెల్లుగాఁగఁ గుండలము । లంచిత తరుశాఖయందుఁ దగిల్చి
కడువడిఁ బండ్లేర గాలిచేఁ దూలి) । నడుకొని కృష్ణాజినము నేలఁబడినఁ
గనిఁ రొక నాగంబు గ్రక్కున నెత్తి - । కొనిపోవ నాయుదంకుఁడు గాంచి డిగ్గ
నుఱికి పాఱంగ, నాయురగంబు పుట్ట । తెఱలక సొచ్చినఁ, దాపసోత్తముఁడు
గొనకొని కాష్ఠంబుగొని త్రవ్వఁదొడఁగ । నొనరంగ నందుకు నుర్వి చలించె.
అంత నింద్రుఁడు విప్రుఁడై చనుదెంచి । యెంతయు నతనితో నిట్లని పలికె :
"వినుమ యీకోలఁ ద్రవ్వినమాత్రముననె । యెనయఁ బాతాళంబు నెట్లుచేరుదువు ?
( సరవిఁ బాతాళ మిచ్చటికి సహస్ర । పరిమిత యోజన ప్రథితంబు నిజము )

కుండలద్వయము గైకొని పోయినట్టి । దండి భుజంగంబు తక్షకుం." డనిన
విని యాయుదంకుండు "వేఁదెత్తుఁగడఁగి । ఘనముగా నాగలోకమునకుఁ బోయి."
అనుచుఁ ద్రవ్వంగ సురాధినాయకుఁడు । పనివడి మునిదృఢభావం బెఱింగి
కులిశంబుగల వాఁడిఁగోలకు నిచ్చి । బలవైరినని చెప్ప భయమున వణఁకి
యిల తెరువిచ్చె ; మునీశ్వరుఁ డంతఁ । బొలుపు మీఱఁగఁ జొచ్చె భుజగలోకంబు.
ఈలీలఁ జొచ్చి మహిత బహురత్న । జాల దీధితిచేతఁ జాల బెంపొంది
యొనరంగ నట దశయోజనాయామ । మును, బంచయోజన ముఖ్యవిస్తార
కలితంబు నగు నొప్పుగలుగు తద్ద్వార । విలసనంబును గని వెస నుదంకుండు
"పోలదైన కుండలంబులు దుర్లభములు । సందేహమేటి కిచ్చట!" నని చింత
నొంది విచారింప నొగి నంతలోన । నందంద నచ్చోట నరుణముఖంబు
ధవళ విగ్రహమును ధవళవాలంబు । వివిధభంగులఁ గల్గి వెలుఁచునున్న
తురగ మమ్మౌని నుద్ధురగతిఁ జూచి । "నరనుత, నాయపానము నూఁదుమింక
వినుతింప గర్వాణవృత్తి నీమదిని । జొనుపకు ; తొల్లి భాసురముగ నీవు
గౌతమాశ్రమమున ఘనతర భక్తిఁ । బ్రీతుఁగాఁ జేసితి పెనుపుగా నన్ను.
కావున నీకు నా ఘనకుండలములు । వేవిధంబులఁ జేరు వెరవు చెప్పితిని."
అనిన నుదంకుఁ డిట్లను : "నిన్ను నెఱుఁగ । నెసయ సేవించుట యేరీతి నాకుఁ?
దెలుపవే!" యనవుడు ధృతిఁ దురంగంబు । నలవడ నెంతయు నతనితో ననియె :
"మెరవడిగా విను మీగురుకేను । గురుఁడఁ బావకుఁడ సద్గురుతరభక్తిఁ
బూజించితివి మహాద్భుతవృత్తి." ననిన । రాజిల్లి యాప్రకారంబు సేయంగ
గురుతర హయరోమ కూపంబులందు । నరుదుగా ఘనధూమమప్పుడు పుట్టి
కలసి పాతాళలోకంబెల్లఁ గప్పి । యలవడ నైరావతావాస మెల్ల
హాహారవంబుతో నాక్రమించుటయు । సాహసంబుడిగి యాసర్పసంఘములు
భయమంది యట వచ్చిభక్తి నర్చించి । రయమున నతని కార్యంబెల్ల నెఱిఁగి
ధృతిఁ గుండలంబులఁ దెచ్చియిచ్చుటయు । నతఁడును వారిఁబో ననిచి యగ్నికిని
నరిఁ బ్రదక్షిణ నమస్కారముల్ చేసి । యరయంగ వేగంబ యరుదెంచి మించి
యాకుండలంబు లహల్యకుఁ బ్రీతిఁ । బ్రాకటగతి నిచ్చి భక్తితో మ్రొక్కి.

... ... ... ... ... । ... ... ... ... ...

ఆవిధంబున ఘనుఁడగు నుదంకునకు । వావిరిఁ గృష్ణుండు వరమిచ్చి కదలి,

సురుచిరాలంకార శోభితంబైన । పురము సొత్తెంచునప్పుడు నెల్లవారు
రైవతకాద్రి యాత్రామహోత్సవము । గోవిందు రాకయుఁ గొనియాడుచుండి
యెనయ నావేడుక యినుమడించినను । ఘనతర సంతోష కలితాత్ములైరి.
దేవదేవుఁడు వసుదేవుని నంత । దేవకి బలభద్రదేవుని మఱియుఁ
గలుగు బంధువులను గరమర్థిఁజూచి । వలను రెట్టింపంగ వందనాలింగ
మహిత నిర్మల వచోమహిమ సద్గోష్ఠి । విహరింప వసుదేవ విభుఁ డప్పుడనియె :
"ఉరుతర భారత యుద్ధవిధంబు । సరవి యాతాయాత జనములచేత
వింటిఁ ; బ్రస్ఫుటముగా వినవలె." ననిన । దంట శ్రీకృష్ణుఁడంతట నిట్టులనియె :

శ్రీకృష్ణుఁ డుదంకునకు భారతయుద్ధము తెలుఁగెఱిఁగించుట

"అది కడు విస్తార మది కడు చిత్ర । మది చెప్పఁ బెక్కుహాయనములు పట్టు.
కొంతచెప్పెద నది కురుకులంబెల్లఁ । బంతంబు దీపింపఁ బదునొక్కఁడైన
యక్షోహిణీసంఖ్యకయ్యెఁ ; బాండవులు । నక్షీణ సప్తసంఖ్యాక్షోహిణులకుఁ
గూడిరి ; యంతలోఁ గురువల్లభుండు । వేడుక దానికి వీరవట్టంబు
తెలివితో దేవనదీ తనూభవున । కలవడఁగాఁ గట్టి యనిసేయు నెడను,
పార్థుండు తోడుగాఁ బరఁగి శిఖండి । యర్థిమైఁ బోరాడి యనిలో భీష్ముఁ
బది దినంబులఁ గూల్ప, భాగీరథేయుఁ । డదనుగా నుత్తరాయణము గాకున్న
నది వచ్చునంతకు నాశరతల్ప । విదిత శయానుఁడై వెస నుండునంత,
గురుఁడైదు దినములు గుఱుతుగాఁబోరి । పరికించి యర్జునుప్రాపున ద్రుపద
తనయుచే ఘోరయుద్ధంబునఁ దెగియె. । ఇనజుండు గ్రీష్మదిహిర నిభుండగుచు
నలిరేఁగి రెండుదినంబులు పోరి । బలభేది సుతుచేతఁ బడియె భూస్థలిని.
మఱునాఁడు శల్యుండు మహితవిక్రముఁడు । అఱిముఱి దివసార్ధ మంతకుఁ బోరి
బలవైరి ముఖ్య దిక్పాలురు పొగడఁ । జెలరేఁగి ధర్మజుచేఁ దెగటారె.
మూలబలంబుతో మునుకొన్న శకుని । నాలోన సహదేవుఁడవనిపైఁ గూల్చె.
దుర్యోధనుఁడు తన తోడఁ బుట్టువుల । ధైర్యాఢ్యుఁడగు వృకోదరుఁడు చంపంగఁ
బలుచని మూఁకలోపల నుండ వెఱచి । బలహీనుఁడై యంతఁ బాదచారమున
గదగొని పాఱి యొక్కఁడు నొక్కమడుపు । నుదకముల్ స్తంభించి యుండెను దాఁగి.
పాండవులెఱిఁగి యుద్భట వృత్తిఁ బొదివి । దండిగా మర్మభేదములగు మాట

లాడి నొప్పించిన నంతలో వెడలి । పోడిమి భీముతోఁ బోరాడి యాడి
గదచేత నూరు భగ్నంబయి కూలె. । అదిచూచి గురుసుతుం డారేయి వచ్చి
చెలరేఁగి పాండవ శిబిరంబు చొచ్చి । బలిమిమైఁ జతురంగ బలములఁ జంపె.
ఆరాత్రి యేనును నా పాండుసుతులుఁ । బోర నచ్చట లేమిఁ బుట్టె నింతేసి.
సత్యంబుగా నిట్టి సంగ్రామమునను । సాత్యకి యేను నిచ్చలుఁ బాండుసుతులు -
దక్క దక్కినవారు ధరణిపైఁ బడిరి. । అక్కడఁ గృతవర్మ యాద్రౌణి కృపులు
మువ్వురు బ్రతికి రిమ్ముల యుయుత్సుండు । మవ్వంపుభక్తితో మముఁ గూడెఁ గాన
జనులు సన్నుతిసేయఁ జావుకుఁదప్పె. ” । అని చెప్పెఁ గాని యాయభిమన్యు చావు
... ... ... ... ... । ... ... ... ... ...
తక్కక చెప్పమీ తండ్రితో ననుచు । మక్కున మూర్ఛిల్లి మఱి సుభద్రయును
బుడమిపైఁ బడియె ; నప్పుడు రోదనములు । కడు బెట్టిదంబయ్యెఁ ; గంజాక్షుఁడంత
వారల నూరార్చి వారణపురిని । ఆరయ నెంతయు నభిమన్యుఁ గూర్చి
తరళలోచన సుభద్రయు నుత్తరయును । బరితాపమందంగఁ బడఁతి యాకుంతి
తీర్చిన విధమును, దెలియ బ్రాహ్మణుల । నర్చించి దానంబు లతనికై పెక్కు
సేయుటయును, జెప్పి “ చింతిల్ల నేల । పాయక రణము సౌభద్రుండు చేసి
కర్ణాది వీరులఁ గలఁచి గారించి । వర్ణింప రథికుల వసుధపైఁ గూల్చి
యనిమిషుల్ గొనియాడ నమరలోకమున । కనయంబు నరిగె మీరడలంగ నేల ? ”
యని యని యూరార్చి యంబుజోదరుఁడు । తనరంగ నుచితవర్తనముల నుండె.
ఇట ధర్మజాదులు నిభపురంబునను । బటుతర విస్ఫూర్తి బంధు జనములు
తారు ప్రసంగానఁ దగ నభిమన్యుఁ । బేరుకొన్నను మదిఁ బెంపెల్లఁ దక్క
యుత్తర విలపింప నుదిదశోకంబు । మొత్తంబుతో విని మొగిఁ బాండుసుతులు
వనట గూరినయంత వ్యాసుఁడేతెంచి । ఘనముగాఁ దగిన వాక్యముల నూరార్చి
తరమిడి యశ్వమేధము ప్రసంగించి । యరుదు మీఱఁగ జేయుఁడనిన నెంతయును
దమ్ములఁ గనుఁగొని ధర్మనందనుఁడు । సమ్మదంబెనఁగ నుత్సాహియై పలికె :
“ వ్యాసమహాముని వత్సలత్వమున । వాసిగా నాడిన వాక్యంబులెల్ల
వింటిరి ; వసుహీనవృత్తి యీభూమి. । యింటిలోపల ధనంబేమియు లేదు.
తమితోడ బ్రాహ్మణధనము, హేమాద్రి । గమన ప్రకారంబుఁ గడుదుర్లభములు.
అనవుడు పావని యమతనూభవునిఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప ;

"అభవుని శంకరు నఖిలలోకేశు । నిభచర్మపరిధాను నెలమితోఁ గొలిచి
యాతని కరుణచే నఖిల భూతముల । కాతత బలులిచ్చి యర్థమంతయును
దత్తము గా" కన్న ధృతి ధర్మసుతుఁడు । అత్తఱిఁ బ్రీతుమంది యట్లకాకనుచు
ధృతరాష్ట్రుకడకు సుస్థిరబుద్ధి నరిగి । సుతునిఁ దలంపుచు శోకించుచున్నఁ
గనుఁగొని ప్రీతితోఁ గరములు మొగిచి । వినతుఁడై యాకథ విన్నవించుటయు,
ననుమతి సేయ మహావైభవమునఁ । బనివడి యా కుంతిపాలికిఁ బోయి
యాగవిధానంబు కనుమతి వడసి । భోగదేవేంద్రుఁడై భూవల్లభుండు
మనమొప్ప నాస్థాన మండపంబునకుఁ । జనుదెంచి మిక్కిలి సంతోషమునను
రమణ యుయుత్సుని రావించి కార్య । మమర నెఱింగించి హాస్తినాపురికి
రక్షగా నుండుము రాజసంబునను । వీక్షింప నీకును విదురుండు తోడు."
అని నిల్పి బలముల నపుడు రాఁబనిచి । మునుమిడి సురపితృ పూజలం జేసి
నవ్య మహేంద్రార్చనంబు లొనర్చి । భవ్యుఁడై యెంతయు బ్రాహ్మణోత్తములు
దీవింప మంగళస్థిర దివ్యతూర్య । రావముల్ చెలఁగంగ రథ గజ తురగ
నివహముల్ తమ్ములు నెఱిఁ దనవెంట । నవిరళ గతి రాఁగ యమతనూభవుఁడు
ధర గ్రక్కతిల నుచిత ప్రయాణముల । సరి నరణ్యాచల సానుదేశముల
గరిమతోఁ బెక్కులు గడచి హేమాద్రి । కరుదుగాఁ జేరి ధౌమ్యాదుల తోడ
విడిదలగా నొక్క విమల దేశమున । విడిసిన, నంతలో వేదజ్ఞుఁడైన

## వ్యాసుఁడు హిమవత్పర్వతముననున్న పాండవులకడకు వచ్చుట

సాత్యవతేయుండు చనుదేరఁ గాంచి । యత్యంత భక్తితో నాధర్మసుతుఁడు
తమ్ములుఁ దానును దగ నెదురేఁగి । సమ్మదంబెసఁగంగ సాష్టాంగ మెఱఁగి
"కర్తవ్యమెద్ది యోకరుణాఢ్య, నాకు । వర్తింప నానతీవలయు మీ." రనిన
నతఁ "డెల్లి మీరెల్ల హరుఁబూజసేయ । నతులితంబుగ వలె ; నగుట నీరాత్రి
తగ శుచీభూతులై దర్భసంస్తరణ । మొగిఁజేసి శయనించు టుచిత కృత్యంబు."
అని నియోగించిన నట్లకాకనుచుఁ । దనరఁ జప్పరమున దర్భసంస్తరణ
మందుల నుండిరి యాగ సద్మమున । నందమైనట్టి పంచాగ్నులఁ బోలె.
అలవడ నీరీతి నారాత్రి గడపి । కలిత కల్యోచిత కార్యముల్ దీర్చి
వ్యాసమహాముని యనుప ధౌమ్యాది । భూసుర సహితుఁడై భూతేశు నీశు

కాలకంధరు నిత్య కల్యాణు సభవు । నీలలోహితు భర్గు నెమ్మితోఁ గొలిచి
బహుగంధపుష్ప ధూపములు దీపములు । బహువిధాపూప సూపములు శాకములు
మొదలగు నైవేద్యములు సమర్పించి । యరుదుగా వేర్వేఱ నఖిలప్రమథుల
కును మాణిభద్రునకును గుబేరునకు । మునుకొని తక్కిన భూత యక్షులకుఁ
బూజ లొనర్చి యింపులు మీఱ పూని । రాజవతంసంబు రమణ దీపింప
లీల నిధానస్థలికిఁ జనునంతఁ । జాల గంధంబుఁ బుష్పములు మాంసంబు
భూతతృప్తి యొనర్చి భుజబల ప్రౌఢి । నాతలంబునఁ ద్రవ్వి యర్థమంతయును
బ్రకటించి ఘోటక భద్రసుదేభ । శకటోష్ట్ర ఖర సహస్రములపై నెత్తి,
కలశముల్ పీఠముల్ కలపయు రోళ్లు । నలఁకులు రోఁకళ్లు నాదిగాఁ గలుగు
సకల వస్తువులెల్ల నరి వెంట రాఁగ । నకలంక విస్ఫూర్తి నా వ్యాసమౌని
యంత ప్రీతుండైన యమతనూభవుఁడు । సంతోషచిత్తుఁడై చనుదెంచుచుండె.

## కృష్ణుఁడు బాంధవ యుతముగాఁ గరిపురికి వచ్చుట

అంత నక్కడ కృష్ణుఁ డంతకుమున్న । యంతకాత్మజుఁడు తన్నంపెడివేళ
హయమేధ మఖమున కఖిలబాంధవుల । నయమొప్పఁ దెమ్మనినాఁడు గావునను,
మలయక యాతని మధురోక్తి యూఁది । బలభద్ర సాత్యకి ప్రద్యుమ్న సాంబ
సారణ కృతవర్మ చారుదేష్ణాది । వీరులు గొల్వఁ బర్విన వేడ్కతోడఁ
దల్లిదండ్రుల యాజ్ఞఁ దగ నాసుభద్ర । నెల్లగాఁ దోడ్కొని యిభపురంబునకు
నరుదేరఁగా నప్పు డంధభూవిభుఁడు । తరుణి కుంతియును గాంధారియు ననువ
విదుర సమేతుఁడై వెస యుయుత్సుండు । నెదురేఁగి శ్రీకృష్ణు నిటఁ దోడితెచ్చె.
ఆరీతిఁ జనుదెంచి యంబుజోదరుఁడు । వారక యపుడు దుర్వారవైఖరిని
ధృతరాష్ట్రునకును సుస్థిరభక్తి మ్రొక్కి । యతివ గాంధారికి నాకుంతి కెలమిఁ
బ్రణమిల్లి మఱి పెక్కుభంగుల నపుడు । గణుతింప నందఱఁ గౌఁగిటఁ జేర్చి
దీవించె ; నా బలదేవాదులెల్ల । వావిరి నా పాండువనిత గావించు
సకలార్చనంబుల సంభృతాదరము । లకలంక గతినొంది యంబుజోదరుఁడు
మహిమగా శోభిల్లు మందిరంబునను । విహరింపుచుండిరి ; వెస సంతలోనఁ
బొందుగా "నుత్తర పుణ్యగర్భమున । నందనుఁ డుదయించె సవ్యతేజమున ;
మొరవడి బాలుఁడు మృతజాతుఁ," డనుచుఁ । దరమిడి రోదన ధ్వనులు చెలంగ

సాత్యకితోఁగూడ శౌరి యేతెంచి । యత్యంత శోకంబు నందుచున్నట్టి
కాంతాజనంబులఁ గని దుఃఖపడఁగఁ । గుంతి యంతయును డగ్గుత్తిక వెట్టి
తోడేఁబడి నాలుక తొట్రుపడంగఁ, । గదువడి నప్పు డక్కమలాక్షు కనియె :
"గతి నీవెగాని సద్గతి మఱిలేదు । ఇతరంబు ; గురుసుతు నిషికాస్త్రవహ్నిఁ
జూడిన కతన నిచ్చోట నీవేళఁ । జోఁడిమి దక్కి యీపుత్త్రుండు నీల్గె.
బ్రతికింపవే కృష్ణ, భాగ్య వర్ధిష్ణు ! । సతమౌని సురజిష్ణు ! సర్వరోచిష్ణు !
గరిమ నస్త్రప్రయోగము సేయునాఁడు । కరుణమీఱఁగ నీవు గాచితివంటి
ఘనతతో నుత్తరాగర్భ సంజనితుఁ । బనివడి యదిగాన బ్రదికింపవయ్య !
బాలు తోడిద నాకు బ్రదుకును ; సత్య । శీలుండు ధర్మజక్షితిపతి యతని
యనుజులుఁ బాంచాలి యాసుభద్రయును । ... ... ... ... ...
బ్రదుక రన్వయమునఁ బాటించి చూడ । నుదక ప్రదానంబు నొసఁగెడి వార
లెవ్వరు లేరు మహీస్థలిలోన. । మవ్వంపుఁ బ్రేమతో మాత్స్యనందనయు
నొకనాఁడు నీచేత నూరార్పఁ బడియె । నకలంకగతిఁ గావు ;" మని భూమిఁబడినఁ
గుంతి నూరార్చి యాగోవిందుఁడెత్తె. । అంతసుభద్రయు నతనితో ననియె :
"కరువలి తనయుపైఁ గడఁగి యాద్రౌణి । పరమాస్త్ర మెత్తఁ దత్ఫలము నంతంతఁ
బరఁగ నర్జునుఁడుఁ దత్పత్నియుఁ గాంచి ; । రిరవుగా నింక నే నేమందుఁ గృష్ణ !
నీ మఱంది యును దా నెమ్మి నాకొడుకు - । పై మమత్వముపెట్టుఁ ; బరువడి మనుచుఁ
డీమెయి వమ్మైన నేమి గాఁగలఁడో ! । నేమించి దానిని నీవ యెఱుంగు.
యమతనూభవుఁడును ననిలనందనుఁడుఁ । గ్రమమునఁ గవలు నేమని సహించెదరో !
గరిమ నస్త్రప్రయోగమున నీవపుడు । గురుసుతు నదలించి "కుచ్ఛిత, నిన్ను
వెలిఁగి మోఘాస్త్రునిఁ జేసెద" నంటి ; । వలవడ దాన నూఱడియుండు మేము.
అవనిలోపల నాశ్రితాభిరక్షణము । లవి నీకు నైజంబు లంభోరుహాక్ష !
మునుకొని యే నీకు మ్రొక్కి వేడెదను । ఘనముగా నీబాలుఁ గాచి రక్షించు
మొప్పుగా భువనంబు లొక్కపెట్టునను । దప్పక మృతమైనఁ దగ బ్రతికింప
నేర్తువు వలసిన ; నీమహాత్త్వములు । ఆర్తరక్షణ, చాల నత్యద్భుతములు ;
నేత్రోత్సవములును ; నీ మేనమఱఁది । పౌత్రుని బ్రతికించి బ్రతికించు మమ్ము."
అనిన శోకము మాన్చి యతిదయ మీఱ । వనజాక్షుఁ డిట్లను : "వగవంగనేల !

## కృష్ణుఁడు మృతజాతుఁడైన పరీక్షితు బ్రదికించుట

వలదు నే మీ పిన వాని రక్షింతు । సొలవక." యనిపల్కి సూతికాగృహము
కడకేఁగునప్పుడు కలితపుష్పములఁ । బడగలఁ బూర్ణకుంభముల లాజలను
బ్రాఁతిగాఁ బిచుమంద పల్లవముఖ్య । భూత నివారణ భూరివస్తువుల
సరవితోడుతఁ జికిత్సాదక్షవృద్ధ । పరిచారికలచేతఁ బరిపూర్ణమైన
మందిరంబెంతయు మహనీయమహిమ । నందనందనుఁడు నున్నతిమీఱఁ జొచ్చె.
అంతకు మున్న చయ్యన పాండుసుతుల । కాంత శ్రీకృష్ణునిఁ గడచి తాఁ బోయి
శోకించు నుత్తరఁ జూచి "యోతరుణి! । శ్రీకృష్ణుఁడే తెంచె సిద్ధ మీపలుకు."
అనవుడు నుత్థితయగుచు వికీర్ణ । ఘనవేణియై మ్రొక్కి కరములు మొగిచి:
"భర్త్రార్తి బాపుట పరఁగ నీవ్రతము । భక్తవత్సల, కృపఁ బాలింపవయ్య!
నీ మేనమనుమని నే ద్రోణసుతుఁడు । భూమిలో నీరీతిఁ బొలియించువాఁడె!
పతిహీన నైనట్టి పాపాత్మురాలు । సుతుఁడు పోయిన నెట్లుక్షోణిలో బ్రదుకు!
వనజదళాక్షుండు వచ్చిన బాలుఁ । బెనుపొందఁగాఁ జంకఁ బెట్టుకపోయి
మ్రొక్కింతునని యుంటి మొగినట్టి కోర్కి । గ్రక్కువ విఫలంబుగాఁ జేసె ద్రౌణి!"
అని యంత నిలువక యశ్రువులొలుకఁ । దనయుని తనయూరుతలముపైఁ బెట్టి
పదలకెంతయు వాని వదనంబుచూచి । మదిరాక్షి యేడ్చుచు మఱియు నిట్లనియె:
"తనయ, లోకగురుండు దామోదరుండు । చనుదెంచి యుండ నిచ్చలు లేచిమ్రొక్క-
వక్కటా! ధర్మజ్ఞుఁడైన తండ్రికిని । దక్కక పుట్టి యధర్మంబు తగునె!
ఎనయంగఁ గనువిచ్చి యీకుంతిఁజూడు; । (తనయ, చూడుము సుభద్రను; నన్నుజూడు"
మని వలవించుచు నాయమ మూర్ఛ । మునిఁగి యొక్కింత సేపునకుఁ దేల్పొంది
తలఁకుచు నుండంగ దామోదరుండు । జలములఁ దగ నుపస్పర్శంబు చేసి
తనర ద్రౌణిప్రయుక్త బ్రహ్మశీర్ష । మను పేరుగల్గు మహాస్త్రంబు నప్పు)
డుపసంహరించి యత్యున్నతి బాలు । నపుడ శయ్యాతలంబందుఁ బెట్టించి
"ఎల్లవారును జూడుఁ డీబాలు నిప్పు । డెల్లగా బ్రదికింతు నిది నాప్రతిజ్ఞ.
ఎన్నఁడుఁ బగవానియెడనైన బొంకు । సన్నుతిగాఁగ నిచ్చేఁ బల్కనేని,
సరవితో నెన్నఁడు సమరముఖమునఁ । గరమరుదారంగఁ గంపింపనేని,
పొందుగా నెన్నఁడు భూమిదేవతల । యందును నధికప్రియంబు గల్గేని,

వాలాయముగ శ్వేతవాహనునెడను । లీల విరోధంబు లేకుండునేని,
వరుసఁ గంసాదుల వధియించునెల్ల । గురుధర్మమునకు నెక్కువ యయ్యెనేని,
వరికింప నిశ్చలబ్రహ్మచర్యంబు । విరివిగా నాయందు వెసఁగ్గలైనేని,
భవ్యుఁడ నేని యీబాలునకిపుడు । నవ్యవిస్ఫూర్తిఁ బ్రాణము వచ్చుఁగాక.
అని యిట్లు శ్రీకృష్ణుఁ డాదిదేవుండు । వనజోదరుండు భూవరుఁ డర్థిఁబలుక
బాలుని మేనికిఁ బ్రాణమంతటను । బోలంగ వచ్చినఁ బొదలెనంగంబు.
కను విచ్చిచూచి ‘వుంగా’ యని యేడ్చె । మనసిజజనకుని మహిమ యెట్టిదియొ !
అంతఁ గౌరవకాంత లానందమంది । కుంతీసమేతులై గోవిందు నీశుఁ
గృష్ణు నచ్యుతు హరిఁ గేశవు నభవు । జిష్ణు సప్తాశ్వరోచిష్ణు రమేశు
నభినుతింపుచు నుండ నాకాశవాణి । విభవాఢ్యుఁడైన శ్రీవిష్ణుఁ గీర్తించె.
ఉత్తర సంతోషముప్పొంగ బిడ్డ । నెత్తి యొయ్యన వచ్చి యిల జాఁగి మ్రొక్కఁ
గొనియాడి బాలునకును నవరత్న । ఘన భూషణము లిచ్చి కడు వేడ్కతోడ
ధృతి నాత్మకులము పరిక్షీణమైన । వితత సంభవమున విలసిల్లెఁగాన
క్షితిలోవలను బరిక్షిన్నాముఁ డనుచు । నతనికిఁ బేరిచ్చె నంబుజోదరుఁడు.
జగతీశ, పాండవసంతాన మిట్లు । నిగమగోచరునిచే నెగడె; మీతండ్రి
యుట నొక మాస వయస్కుఁడౌనంతఁ । దటుకున మఱునాఁడు ధర్మనందనుఁడు
తమ్ములుఁ దానును ధనము లెత్తించి । యిమ్ములఁ గొనిరాఁగ, నెఱిఁగికృష్ణుండు
విదుర యుయుత్సుల వెసనియోగింపఁ । గదలి పట్టణము శృంగారించిరపుడు.
తొలుతనే వీధులు తొడిఁదొడి నూడ్చి, । కలయంగఁ గస్తూరికలయంపి చల్లి,
పొలుపొందఁ గపురంపు ముగ్గులువెట్టి, । వెలఁది ముత్యంబుల వివిధరత్నముల
బహువిధ తోరణపంక్తు లేర్పఱచి, । మహనీయ పూర్ణకుంభంబులు నిలిపి,
తరమిడి కదళికా స్తంభముల్ మఱియు । సురుచిరాలంకార సుమహితస్ఫూర్తి
యలవడఁ గావింప హస్తినాపురము । జలజశత్రూదయ జలనిధిఁ బోలె.
అట మహాభక్తితో నంబుజోదరుఁడు । పటుగతి సాత్యకి బలభద్రముఖుల
తోడఁ బాండవుల నెదుర్కొన వారు । వేడుక తోడుత విభవ మింపెసఁగఁ
బురము ప్రవేశించి పొలుపు దీపించి । గరిమతో ధృతరాష్ట్రుఁ గాంచి తల్లులకుఁ
బ్రమదంబు లొనరించి ప్రాభవస్ఫూర్తిఁ । గమలాక్షుఁడును దారుఁ గనకాసనములఁ
గూర్చుండి సత్కథాగోష్ఠి వర్తించి । పేర్చి యాలోన సంప్రీతి రెట్టింపఁ

దగువారిఁ గాంచి యత్యద్భుత మోద । మగు భవజ్జనకుని యాకథ చెప్ప
నీరజనాభు ననేక భంగులను । గూరిమి తోడుతఁ గొనియాడియాడి
గుఱుతుగా విహరింపఁ, గొన్నిదినముల । కరయ సాత్యవతేయుఁడరుదేరఁ గాంచి
హరి సమేతముగఁ జయ్యన నెదురేఁగి । విరివిగా నర్ఘ్యాది విధులఁ బూజించి
పొలుపుగా సద్గోష్ఠిఁ బొద్దుపుచ్చుచును । బలికె నమ్మునితోడఁ బాండవాగ్రజుఁడు
వలనొప్ప : " దేవ, భవత్ప్రసాదమునఁ । గలిగిన యర్థంబు గలితాశ్వమేధ
మున నుపయోగంబు పొందఁ గోరెదను, । మనసు ప్రీతిగ ననుమతి యీవె." యనిన
సంతోషచిత్తుఁడై సంయమీంద్ర వరుఁ । డంత నిట్లని పల్కె " హయమేధ మఖల
పాతకహరము శోభనలీలఁ జేయు, । మాతత విస్ఫూర్తి." ననిన మోదించి
సకల సంభారముల్ సరగునఁ గూర్చి । వికసిత వదనుఁడై వివిధంబులైన
మహిత స్రుక్ స్రువ ముఖ్య మఖసాధనములు । సహజ హేమమున నిచ్చలు నొనరించి
జయ మొప్ప సర్వలక్షణములు గలుగు । హయముఁ జూపినఁ జూచి యావ్యాసమౌని
యనురాగచిత్తుఁడై హయమిది యోగ్య । మనుపమ స్ఫూర్తుల; నమరేంద్రసుతుఁడు
క్షితిలోన దీని రక్షింప సర్హుండు. । ప్రతిదినంబును గలరాష్ట్రమంతయును
నకులుండు భీముఁ డున్నతిఁ బ్రోచువారు; । అకలంకమైన గృహాదికృత్యములు
నకులానుజుఁడు భక్తి నడపెడు వాఁడు । ప్రకటలీలల." నని పలికిన యంత

## యజ్ఞాశ్వ రక్షణంబునకు ధర్మజుఁ డర్జును నియోగించుట

నమ్మహీవిభుఁ డప్పు డర్జునుఁ జూచి । " నమ్మిక హయరక్షణంబు సేయంగ
నితరుల కలవియే యింద్రతనూజ! । మతిమంతుఁడవు శౌర్యమహితుండ వీవు
అలవడ నిట్టి కార్యమునకై పోయి । వలనొప్ప సకల భూవరులకు నెల్ల
క్షితి హయమేధ దీక్షితుఁడనై యేను । జతురత నుంచుట చయ్యనఁ జెప్పి,
తడయ కెంతయు నిరోధము గాకయుండ । నడపుము తెగకు మన్నా " యని చెప్పి
యనిలజుఁ గవల నయ్యయి కార్యములకుఁ । బనిచి తక్కినవారిఁ బనుల కేర్పఱచి
యంధ భూవల్లభు ననుమతి బుచ్చి । గాంధారి యాజ్ఞయుఁ గడఁగి యా కుంతి
సమ్మతియును గాంచి సంతోషమెసఁగఁ । గ్రన్నన మఖదీక్ష గైకొని విభుఁడు
కృతమతి దండంబుఁ గృష్ణాజినంబు । నతులితగతిఁ బూని యఖిలభూషణము
లలవడ ధరియించి యంత సందీప్త । కలితాగ్నియును బోలెఁ గనుపట్టియుండె.

ఇట విజయుండును నేపుదీపించి । పటుతర గాండీవ పాణియై కదలి
యా యశ్వరత్నంబు ననుసరింపంగఁ । బాయక వృద్ధులు బాలురు సతులు
లోనుగాఁ బఱతెంచి లోలత నతని । పై నెయ్యమలర సంభావించి పొగడి.
రివ్విధంబున మీఱి యేవగ్గలించి । కవ్వడి యాతురంగము వెంట నడవ
నది ప్రదక్షిణముగా నవనీతలంబు । వదలక తిరిగి పావనలీల నంత
నుత్తరముఖముకై యొగిఁ బోయి పోయి । యత్తఱిఁ జరియింప నా దేశమందు
గర్వంబు మీఱఁ ద్రిగర్తేశు సుతులు । పర్వి ఘోటకమును బట్టంగఁ దలఁచి
రయము దీపింపంగ రథములు దోలి । భయ మేమియును లేక పఱతేరఁ జూచి
తమయన్నయానతిఁ దలఁచి యర్జునుఁడు । మమతతో రాజకుమారుల కనియె :
"విశ్వంబులోపల వినుఁడు ధర్మజుని । యశ్వమేధమునకు నపకృతి సేయ
నత్యంత పాతకం; బదియునుగాక । నిత్యంబు మీరును నేమును గూడి
మాడియుండుట మేలు; మామీఁద నిట్టి । జాడలు వల." దన్న నహియింప లేక

త్రిగర్త దేశాధిపతులర్జునుఁ దలపడుట

ధైర్యాఢ్యుఁడగు శూరతముని పుత్త్రుండు । సూర్యవర్మండను క్షోణీశ్వరుండు
తమకు నగ్రణిగాఁగఁ దఱుముచు రాఁగ । మమత నర్జునుఁడును మఱియు నిట్లనియె :
"సరసుఁ డైనట్టి యజాతశాత్రవుఁడు । తురగంబు రక్షింపఁ దుది నంపు నపుడు
ఉర్విలో భారత యుద్ధంబునందు । సర్వ భూమీశులు చచ్చిరి మున్న;
వరమతి బాలుర వధియింపఁ గాదు. । సరస కృపాస్ఫూర్తిఁ జరియింపు; మఱియు
హయమున కడ్డమై యరుదెంచి రేని । ప్రియ వాక్యములు పల్కు ప్రీతితో; ననిన
మాయన్న వాక్యముల్ మదిఁ దలపోసి । ధీ యుక్తి మీమీఁదఁ దెగకున్న వాఁడ.
చల మేల తొలఁగుఁడు చాటిచెప్పితిని । అలరఁ బ్రాణములు ప్రియంబులు గావా !"
అని పల్క నిలవక యా సూర్యవర్మ । ఘన బాణవృష్టి పైఁ గప్పినఁ జూచి
చెనయంగ నెంతయు నెఱ్ఱని నగవు । తన మోముదమ్మికిఁ దపనుండు గాఁగ
శరముల ద్రుంచి నిశాత బాణములు । పరఁగింప నతనికి బాసట గాఁగ
నేపుతోఁ దమ్ముఁ డయ్యైన కేతువర్మ । చాపమెక్కిడి మహాసాహస స్ఫూర్తి
గాండీవిపై నంత ఘన బాణవృష్టి । నిండింప బెదరక నిష్ఠురాస్త్రముల
ఘనత నాతని నొదుఁగంగ నేయుటయుఁ, । దనరంగ నాతని తమ్ముఁడైనట్టి

ధృతవర్మ మిక్కిలి తీక్ష్ణ నారాచ । తతుల నేయుంగఁ బృథాతనూభవుఁడు
మెచ్చి యా రథివర్యుమీఁద నేయకయ । గ్రుచ్చిన బాణముల్ ద్రుంప, వెండియును
బలు నారసంబులు పయిపయి నేయఁ, । దొలఁగక వానిని దునుకలు చేసి
వరిపరి విధములఁ బది తూపులేయఁ । దిరముగా ధృతవర్మ తీవ్రబాణములఁ
జెలరేఁగి కరము నొచ్చిన ముష్టి సడలి । కలయఁ జోద్యంబుగా గాండీవమిలను
బడిన నాధృతవర్మ బలమెల్ల నార్చె. । కడువడిఁ జేయుంగఁ గల యోధులెల్ల
నక్కుమారోత్తము నవలకుఁ ద్రోచి । పెక్కువిధంబులఁ బ్రీతి నిట్లనిరి:
"తఱలక యింద్ర కోదండంబు రీతి । మెఱయు గాండీవ మిమ్మేదినిఁ బడియె.
కంటిరే చండ విక్రముఁడు గాండీవి । దంట తనంబునఁ దమయన్న ధర్మ
తనయు వాక్యములను దారుణవృత్తి । యును సాహసముఁ జూప నొల్లఁడు గాక,
గిరికొని విక్రము కినుక వచ్చినను । వఱల నెవ్వారు నిల్వం గలవారు!
మనమందఱముఁ గూడి మహనీయ మహిమ । పెనుపొందఁగా నొక్కపెట్టున విజయు
నాక్రమింపఁగ వలె." నని చుట్టు ముట్టి । విక్రమంబులు చూప వివ్వచ్చుఁ డదరి
కొందఱఁ బొరిగొనెఁ గొందఱ నేసెఁ । గొందఱఁ గారించెఁ గొందఱఁ జించె.
కొందఱ భంజించెఁ గొందఱఁ ద్రుంచె । నందంద యీరీతి నందఱఁ జంప
నగణితంబైన శౌర్యముచూచి యదరి । మొగిఁ ద్రిగర్తానీకములు నలుగడలఁ
బాఱి "యోపార్థ, నీ పంపు సేసెదము ; । కూరిమితోఁ బనిగొమ్ము మమ్మిపుడు.
శరణాగతార్త రక్షణ, కృపామూర్తి! । పరమ సత్కీర్తి, శోభన గుణవర్తి!"
అనిన వారలఁ జూచి యాక్రీడి పలికె: । "వినుఁడు ప్రాణంబులు వెసఁ గాచికొనుఁడు
పరఁగ నాపంచినపని సేసి మిగుల । గరిమ తోడుత బుద్ధి గలిగి మనుండు
వెఱవకుఁ" డని పల్కి వేగంబు మీఱ । నతిముఱిఁ గదలెనం. దంతఁ గ్రమమునఁ
బొలుచు ప్రాగ్జ్యోతిష పురవరంబునకు । నెలమితోఁ బోయిన నెఱిఁగియాలోన
భగదత్త తనయుండు బాహుగర్వమునఁ । బగగొని యశ్వంబుఁ బట్టంగఁ, జూచి
వినుతింపఁ బార్థుండు విల్లెక్కువెట్టి । పెనఁచి వాలమ్ములు పెక్కేయుటయును
అవ్వజ్రదత్తుండు హస్తిపై నెక్కి । నివ్వటిల్లెడు బాణ నికరంబు నేసె.
ఏసిన నవి ద్రుంచి యింద్రనందనుఁడు । వాసికి నెక్కు తీవ్ర ప్రదరములు
నిగిడింపఁ, గోపించి నెఱి వజ్రదత్తుఁ । డగణిత క్రమశక్తి నస్త్రంబు లేయఁ
గవగూడి మిడుతల కదుపులరీతిఁ । గవిసిన నగ్నిశిఖలఁ బోలునట్టి

యమ్ముల గమిచేత నవి రూపుమాపి । సమ్మద వృత్తిమై శక్రనందనుఁడు
కరుల మావఁతులను ఖండించివైచి । తురగ సందోహంబుఁ దోడ్తోన దునిమి
రథములఁ జెండి సారథులఁ జక్కాడి । రథికుల భంజించి రయము దీపింపఁ
గంకపత్రమ్ములు గాలిఁబోఁజేసి, । కంకటంబులు ద్రెంచి కాహళుల్ గొట్టి
పడగలు వెసఁ జించి పటహముల్ ద్రచ్చి, । గొడుగులు నుగ్గాడి కుంచెలు విఱిచి,
హరిభక్తుఁ డఘముల నణఁచిన భంగి । నరుమగా విమతుల నవనిపైఁ గూల్చె.
కూల్చిన, మిక్కిలి కోపించి వరుల । ద్రాల్చె నుర్వర మీఁద వజ్రదత్తుండు.
మఱియును గినుకతో మదహస్తిమీఁద । గిరికొని గిరిభేది గిరులపైఁ బోలెఁ
గులిశ సన్నిభమైన ఘోరబాణములు । బలిమి ననంఖ్యలు పరఁగించి యార్చి
పవమాన మొగి మేఘ పటలంబుఁ బోలెఁ । గవిసిన బలములఁ గవియంగఁ దోలి
పృథుతర శంఖంబు పేర్చి పూరించి । ప్రథన నిష్ఠుర వీరభటుల నుగ్గాడి
పరిఘ తోమర గదా ప్రాస కుఠార । శర కుంత తోమర చక్ర కోదండ
కరవాల ముద్గర క్రకచాదులైన । గురుతరాయుధములు కుదులుగా గుచ్చె.
ఇందువంశ వతంస, యేమి చెప్పుదును । బొందుగా శతముఖ పుత్త్రునిఁ గోడఁ
దెలివి దీపింపంగ దివసద్వయంబు । వలిరేఁగి యుగ్రరణం బొనరించె.
మఱునాఁడు మిక్కిలి మహిమ దీపించి । వఱలు శౌర్యంబున వజ్రదత్తుండు
పేర్చి యార్చి కడంగి బీభత్సుమీఁదఁ । గార్చిచ్చుఁ బోలెడి కాండంబు లేసి
యాతపత్రము ద్రుంచి హయములఁ గూల్చి । కేతనం బగలించి గిరికొన్నయలుక
నూతునిఁ బడనేసి జోడు దెరల్చి । శాతబాణముల జర్జరితంబు సేసి
నవ్వుచు నా యింద్రనందనుఁ జూచి । నివ్వటిల్లెడు పేర్మి నెగడ నిట్లనియె :
"ఏను గల్గఁగ నీకు నెందుఁ బోవచ్చు ? । మానుగా వృద్ధుఁడు మాతండ్రిగాన
సమరంబు లోపల సాహసస్ఫూర్తి । సమసె నీతోఁ బోరి జగతిలో మొన్న.
ఆరీతివాఁడనే ! యక్కటా ! చూడు । మారయఁ బోరెద." నని మొదిరించి
మొలమితోఁడుత సెలయేర్లు వాఱంగ । మలయు శైలమువోలె మదముగాఱంగఁ
గనుపట్టు నట్టి యాఘనతరగజముఁ । జననిచ్చి, మృగరాజ సన్నిభుండైన
దివిజేంద్ర సుతునిపైఁ దీవ్రత మీఱ, । నవిరళ గతివచ్చె. నదియు ఘీంకార
కలిత మయ్యును, దానిఘన శీకరములఁ । బొలుపు మీఱంగ నంబుదముక్త సలిల
ధారలఁ బొదలిన ధరణీధ్ర మనఁగ । నారూఢితో నొప్పె నాఫల్గునుండు.

గజ మిట్లు మిక్కిలి గవియంగ నంత । భజన దీపింపంగ భగదత్త సుతుఁడు
చటుల బాణంబులు సంధించియేయ । నట నర్జునుండు ననల్ప కోపమున
దంభోళియును బోలు తన నారసమునఁ । గుంభిని యుగలంగఁ గొనియేయుటయును,
రౌద్రతరాటోపరావంబు మీఱ । భద్రనాగము గూలెఁ బర్వతాకృతిని.
కూలిన యంతటఁ గుంభిని నున్న । బాలునిఁ జూచి కృపాస్ఫూర్తి మెఱయ
సురలోకనాథునిసుతుఁడు మాధుర్య । భరిత వాక్యముల నుద్భటముగాఁ బలికె:
"క్షితి నశ్వమేధ దీక్షితుఁడైన ధర్మ । సుతుఁడు హయము వెంటఁ జొప్పడ నన్ను
బుత్తెంచునప్పుడు 'భూపాలవరుల । మొత్తి చంపకుము సమ్మోదితులఁ జేయు.
మసిళంబు నీదు పెంపను పుష్పమునకు । నొనర నావంపుసేయుటయె సౌరభము."
అని పంపెఁ గావున ననఘ, మీమీఁదఁ । గినుక లేశము లేదు; కృతకృత్యుఁడైన
యమ తనూజాతుని యాగంబునకును । విమల వైభవములు వెలయంగ నీవు
శోభితంబుగఁ జైత్రశుద్ధపౌర్ణమికిఁ । బ్రాభవంబొప్ప నీబాంధవ శ్రేణిఁ
గూడిర." మ్మని పల్కి కువలయాధీశ! । వేడుక గుఱ్ఱము వెను వెంట నరిగె.

## అర్జునుఁడు సింధు దేశాధీశుల నోడించి యజ్ఞాశ్వమును మరల్చుట

అదియును సింధు దేశావర్తి యైన । వదలక తొల్లింటి వైరంబు దలఁచి
రమణతో భారత రణ హతులైన । తమగలయట్టి సైంధవ యోధవరుల
పుత్త్రపౌత్త్రులు మహాద్భుతవృత్తి మీఱ । గోత్ర విశత్రుని కొడుకుపై రేఁగి
కలిత సహస్ర సంఖ్యలు రథికులును । బలిమిమై నడవంగఁ బంతంబు మెఱసి,
తనరంగ నరుణాంబుదంబులు వఱలి । ఘనమైన నెత్తురు కండలు గురిసె;
మసలక కడిమిమై మార్తాండ బింబ । మసితారుణచ్ఛాయ యయ్యె; నుల్కములు
రాలంగఁ దొడఁగె; నుర్వర సంచలించె, । నాలోన నర్జును నట చుట్టుముట్టి
మెఱయు వాద్యంబులు మిన్నంది మ్రోయ, । నఱిముఱిఁ జెలరేఁగి యార్చుచుఁ దఱిమి
వివ్వచ్చు మీఁదను వివిధ బాణములు । దవ్వుగా నేసి సంభ్రమ మొప్ప మఱియు
బిరుదు నామంబులుఁ బేరులుఁ జెప్పి । పరశు తోమర శూల పట్టిస క్రకచ
కరవాల కుంత ముద్గర గదాప్రాస, । ... ... ... ... ...
దీధితుల్ మీఱంగఁ దివిరి పోరాడ । నా ధనంజయుఁడును నతిదాహ మడరఁ
గరము బెండగుటయు, గాండీవ మపుడు । ధరమీఁదఁ బడియె నో ధరణీతలేశ!

అనిమిషుల్ మునులును నప్పుడు శోక । మున నాకసంబున మూఁకలుగట్టి
రయమెుప్ప నర్జున జయకాంక్షులగుచు । నియతి శుద్ధి వహించి నిపుణతమీఱఁ
బరికింప శౌర్య ప్రభావ యుక్తముగఁ । దరమిడి మంత్రసాధన పరులైరి.
అంత నంతటిలోన సమరేంద్రతనయుఁ । డెంతయు డెప్పిరి యేపు దీపించి
గాండీవ మంతటఁ గరమునఁ బట్టి । చండ సాయకముల శత్రులు బెదర
నేయుచుఁ ద్రోయుచు నిభముల హరులఁ । బాయని రథికుల భటసమూహములఁ
గూలంగఁ గొట్టుచుఁ గుంభిని వణఁక । నాలంబు సేయుచు నంతటఁ బోక
యరదముల్ చక్కాడి యఱిముఱి మఱియుఁ । దురగంబులను జెండి దోర్గ్లిల మెఱసి
కరుల నుగ్గాడి యుత్కట భటోత్తముల । శరశరాసనములఁ జక్కాగా నఱికి
జోదుల కాతుల శూరవర్యులను । మేదినిపైఁ గూల్చి మిన్నక కదిసి
సకల బలంబులఁ జంపి యుర్వీశుఁ । బ్రకటించి మించె బీభత్సు నామమున.
అంత దైన్యము నొంది హతశేషసైన్య । మంతంతఁ బోవక యర్జును నంతఁ
జలమునఁ జూచి మాత్సర్యాన మగుడఁ । జెలఁగిన, తమయన్న చెప్పినయట్టి
వచనంబు లూహించి "వలదు మీరేల । పచరించి నాబారిఁ బడియెదరకట!
మేదినిలోపల మీకుఁ బ్రాణములు । చేఁదయ్యెనే! పొందు చేష్టలు మాని."
అని పల్కి నిలువక యరదముల్ దోలి । ఘనముగాఁ బైఁబడఁ గడఁగ, నర్జునుఁడు
నవ్వుచుఁ జెలరేఁగి నానాశరముల । నవ్వీరులను ద్రుంప నంతలో నెఱిఁగి
పరువడి దుశ్శల పౌత్రాన్వితముగ । సురలోకనాథునిసుతుఁ గానవచ్చె.
వచ్చి తాఁ గన్నీళ్ళు వదనంబు నిండఁ । జెచ్చెర దుఃఖించి చెలఁగి యాపౌత్రుఁ
జూపి యిట్లనియె: "నోసుగుణాఢ్య, కావు । మేపుతో నీబాలుఁ డిలలోన నీకు
నల్లుని సుతుఁ" డన్న నర్జునుఁ డనియె: । "నెల్లగా నాయల్లుఁ డెచట నున్నాఁడు?
చెప్పవే!" యనుడు నచ్చిగురాకుఁబోఁడి । తప్పక దేవేంద్రుతనయున కనియె:
"విను మాత్మ జనకుండు వెన రణస్థలిని । లనఘ, నీచేఁ జచ్చుటది విని మిగుల
వనరుచు నిట శోకవార్ధిలో మునిఁగి । వెనుకొని నీరాక వినుచు బిట్టులికి
ప్రాణముల్ విడిచె నీపట్టున." ననుచుఁ । ద్రాణ లేశము లేక ధరణిపై వ్రాలి
తెలిసి శోకంబున ధృతి దిగవిడిచి । తలవాంచియున్నయాతనిఁ జూచి యనియె:
"రమణతోఁదుత ధార్తరాష్ట్రుల కీడు, । కొమరొప్ప సైంధవు కొరగామి మదిని
దలఁప కీ బాలుని దయతోడఁ బ్రోవు । వలనొప్ప నాశ్రితవత్సల!" యనుచు

నా బాలకునిఁ జరణానతుఁ జేసి । ప్రాబల్య మెడలంగ భయభక్తితోడ
"శరణు గాండీవపాణి, శరణుకిరీటి, । శరణు కౌరవబలచయ వనదహన,
శరణు ఖేచరమాని సంస్తూయమాన, । శరణు శరణ్య, యోశార్ఙ్గిసహాయ!
కృపనన్ను రక్షించి కీర్తిధర్మములు । విపులముల్ సేయుము విమలాత్మ!" యనినఁ
గలయంగఁ జిత్తము గలఁగియు రాచ । కులమదిగాల్పనే? కోప మేమిటికి?
అనితలంపుచు నతఁ డాయింతితోడ । "వినుము రారాజు దుర్వృత్తికల్మషుఁడు
గానకొని యేనును గొఱగాను నిజము; । ఎనయంగ మాచేత నింతలు పుట్టె."
ననిపల్కి యారార్చి యతివమస్తకము । తనవక్షమునఁ జేర్చి తగఁ గుస్తరించి
"వగవుమానుము పొమ్మ వనజదళాక్షి! । తగవొప్ప" నని యంపెఁ దద్దయుననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నని చెప్ప వెండియు మునులు
అనఘాత్మ, తరువాత సైన్యవృత్తాంత । మనువొప్పఁ జెప్పవేయని పల్కుటయును
వైకుంఠనాథ, శ్రీవనితాననాథ, । కాకోదరాధిప గ్రైవేయ వినుత,
సగుణ నిర్గుణరూప, సత్యప్రదీప, । నిగమగోచర, కృష్ణ, నీరజనాభ,
నారాయ, ణాచ్యుత, నరకసంహార, । ధారాధ్రనిభదేహ, దైవతారాధ్య,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితాశ్వమేధపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె రెండవది.

# తృతీయాశ్వాసము



శ్రీ సర్వభూధరశ్రేష్ఠ నివాస, । వాసవార్చితకృత్తివాస సంస్తుత్య,
ఘనమానిహృద్గేహ కలిత సంతోష । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
"ఆరీతి దుశ్శల ననిపి యర్జునుఁడు । పౌరుష విఖ్యాతిఁ బరఁగి యెంతయును
ఘన రథారూఢుఁడై కడఁక దీపించి । యనుదినయాత్ర నయ్యశ్వంబు వెంటఁ
దారుణ్య మొప్పారఁ దా రామృగాను । సారి యైనట్టి యీశ్వరుఁడును బోలెఁ
బోవుచునుండె; నప్పుడు ఘోటకంబు । వావిరి గిరులును వనములుఁ గడచి
మలయకంతటిలోన మణిపూరపురము । సొలవక చొచ్చినఁ, జూచియంతటను
బరఁగ నాపురియేలు బభ్రువాహనుఁడు । వరమతిఁ దమతండ్రి వచ్చుటెఱింగి
సవినయంబుగ నార్యజనసమేతముగ । నవిరళగతి వచ్చి యతనిపాదముల
కతి భక్తి మ్రొక్కిన నమరేంద్రసుతుఁడు । ప్రతిమీఱి నాదరింపక యున్నఁ జూచి
పొసఁగ ననాదరంబునకుఁ గారణము । వసుమతి నెఱుఁగనివాఁడు గావునను
నవిచారుఁడై యున్న సవ్యసాచియును । భవదూరుఁడైన యబ్బాలుతో ననియె:
"విరివి యాగమునకై విడువంగఁ బడిన । తురగరత్నముఁ జూచి తుదిఁ బట్టిగాక
జగతిలోపల సాధ్వసము గలయట్టి । జగతివల్లభున కీ జగములు గలవె!
యీ మెయి, నీ గుణహీన! పొ."మ్మనిన । నేమియుఁ బలుకక యింటికి మరలి
చనుచుండ నీవార్త సరగున దివ్య । ఘనబోధమున భుజంగమ రాజతనయ
గాంచి పాతాళంబు గ్రక్కునవెడలి । వంచింప కాబభ్రువాహనుకడకుఁ
జనుదెంచి, "యేను మీజనని నాగేంద్ర । తనయ నులూచిని దద్దయు నీకు
హితవు చెప్పఁగఁగోరి యేఁగుదెంచితిని. । వితత విక్రమరూఢి వెలయంగ వినుము
మెలపుతోడుత నేఁడు మీయయ్యవనుపు । తలకొను మది రాజధర్మమెంతయును;
రణమొనరింపు శౌర్యప్రభావమున. । గుణవంతుఁడైన యక్కురుసత్తమునకు
నిదియె మేలొనరించు నేలతామసము । వదలకు."మన్న నవ్వనితకు మ్రొక్కి
"తల్లి, యీ యానతిఁదగునమ్మ నీకు; । నెల్లగాఁ దండ్రితో నిట ననిసేయ

కేను వచ్చితిని; నన్నెలమింతో నీవు । ధీనిత్య విస్ఫూర్తిఁ దెలిపితి; వతఁడు
నావిధంబున నన్ను నవమతి చేసెఁ; । గావున నొనరింతుఁ గడఁగి యుద్ధంబు."

### బభ్రువాహనుఁ డర్జునుని దాఁకి మూర్ఛితుఁ జేయుట

అనిపల్కి తనదు గృహంబున కంత । వనజాక్షిఁ బుచ్చి దీవనలెల్లఁ బడసి
వెలయు సాధన సమన్వితమైనయట్టి । కలిత రథంబెక్కి గ్రక్కున మరలి
కృత మతితో హంస కేతువు మెఱయ । నతులితాశ్వమునకు నడ్డపడంగ,
సవ్యసాచియుఁ జూచి సంతోషమెసఁగ । సవ్యశౌర్యమున నున్నతి నెదుర్కొనియె.
అమరు లోకసమున నా యోధవరుల । సమరంబు మిగుల నాశ్చర్యంబు సేయఁ
గనుఁగొనుచుండంగఁ గడఁగి యర్జునుఁడు । తన నారి సారించి తనయుని మీఁదఁ
బొరిపోరిఁ బుంఖాను పుంఖంబు గాఁగ । శరవృష్టి గురిసినఁ జలియింప కతఁడు
నవ్వుచు నవిక్రమించి నాలుగస్త్రములు । వివ్వచ్చుపై నేయ వెసఁ గిరీటియును
నడుమునే ఖండించ నలి నాతఁ డెత్తెఁగి । ... ... ... ... ...
గురుబాణ వర్షంబు గురిసిన యంత । సరగున నవలీలఁ జక్కుగా నతికి
యడరి బీభత్సుండు నాత్మనందనుపై । యొడలఁ బెన్నెత్తురు లుబ్బ నేయుటయుఁ
బరువడి బెదరక బభ్రువాహనుఁడు । తిరముగా నరునిపైఁ దీవ్రాస్త్రకోటి
పర్గఁగింపఁ గొనియాడి భల్లంబువింట । నిరవుగా సంధించి యేసిన, నతఁడు
నడుమునె ఖండించి నాలుగస్త్రములు । వడిఁ బార్థుమీఁదను వైచిన, వ్రాలి
విల్లూఁతగా నిల్చి వేగంబె వాల్ల । కల్లోలముగ నార్చి ఘనతరాస్త్రములు
నిగిడించి "బంటవై నిలువంగ వలయు । నగణిత క్రమశక్తి" ననిపల్కి నవ్వి
శాత సాయకములు శతసహస్రములు । ఆతని దేహ మల్లాడంగ నేసి
మఱియు నారసము భీమంబుగాఁ దొడిగి । యఱిముఱిఁ గోపించి యతనిపై నేయ,
విషువక యది తాఁకి పిఛ్ఛున వెడలఁ । బడియె భూస్థలి మీఁదఁ బాకారిసుతుఁడు.
పదవడి యాలోన బభ్రువాహనుఁడు । అపరి మున్నేసిన యట్టి బాణముల
నలసి యలంతచే నవనిపైఁ ద్రెళ్ళె. । బలమరి యీరీతిఁ బతిసుతుల్ పడిన
విని శోక ముప్పొంగ వేగ నులూచి । తన వెంట రాఁగఁ జిత్రాంగద యపుడు
చనుదెంచి యాసవ్యసాచినిఁ గొడుకుఁ । గనుఁగొని మూర్ఛిల్లి కడఁకతోఁ దెలిసి
యా యులూచిని జూచి "యక్కటా! యిట్లు । పోయెనే! నీకతంబునఁ బ్రాణవిభుఁడు;

ఏమియు నెఱుఁగని యీచిన్నవాని । వేమఱు బోధించి వెనవంపఁ దగునె!
తిరముగా నీవు పతివ్రతామణివి ; । తరమిడి ధర్మంబు తప్పంగఁ దగునె !
ఏమికారణమున నిట్లు చేసితివి ? । భామరో పుత్రునిపై నాకు నడలు
లవలేశమును లేదు లలితుఁడై నట్టి । ధవుఁజూచి పొక్కెదఁ దప్పక వినుము.
బలవంతుఁడైనట్టి బలవైరి సుతుఁడు । తలకొని నీదెస తప్పుచేసినను
మనసునఁ బెట్టక మహనీయ కలిత । ఘన కృపామహిమలఁ గాచి రక్షింప
కెలమితో నాథుని నేయంగఁ బనిచి । చలముతో నాతని చావు చూచియును
వగవు లేశము లేదు వామాక్షి, నీవు । జగతిలో మిక్కిలి సాహసి వగుదు.
ఏమని యడలుదు ! నేమందు నిన్ను । భామ, నా నోముల ఫలము గాఁబోలు ! ”
అని పల్కి ప్రాణేశు నటఁ జేరఁ బోయి । కనుఁగవ బాష్పంబు కణములు దొరుఁగ
నురమును వదనంబు నొగి మోఁదుకొనుచు । నరవింద నేత్ర యిట్లని ప్రలాపించె :
“హానాథ, హానాథ, హరిహయతనయ ! । నీ నవ్యశౌర్యంబు నేఁడెందుఁ బోయె !
కాంపిల్యపతిఁ బట్టి ఖండించి నట్టి । పెంపును దెంపును బీరమెందణఁగె !
రమణీయ మత్స్యయంత్రం బేసినట్టి । నమధిక క్రమశక్తి సమసెనే నేఁడు !
గాంధారి తనయుని గంధర్వుఁడేచి । బంధించి కొనిపోవ బలువిడిఁదాఁకి
విడిపించి వుచ్చిన విక్రమస్ఫూర్తి । పుడమిలో నీరీతిఁ బొలిసెనే నేఁడు !
హరుతోడఁ బోరినయట్టి సాహసము, । బురుహూతుపురినుండి పొలుపు దీపించి
కాలకేయాది రాక్షసులఁ బెక్కండ్ర । నాలంబు లోపల నణఁచిన పేర్మి,
గోగ్రహణము నాఁటి గురు శౌర్య మహిమ, । నగ్రేసరత మహాహవమునఁ జెలఁగి
యారూఢి దుర్యోధనాదుల నెల్లఁ । బోరిలో నణఁచిన పొలుపెందుఁ బోయె !
నన్ను మన్నింపుము నాథ, నీ విపుడు । కన్నడింపఁగ నేల కనువిచ్చి చూడు.
శపణించి హయము కడ్డంబు రాకుండ । నవిరళగతి మీఱి నాఁగితి ; వింకఁ
గరము దీపింప నగ్రజుని మఖంబు । అరయంగ నిపుడు వమ్మయి పోవకుండ
లెమ్ము తురంగంబు లీల రక్షింపు । నమ్మతి.” ననుచుఁ బన్నగపుత్రిఁ జూచి
“సుతుఁడిట్టు లుండనీ చొప్పు దీపింపఁ । బతిఁ రక్షింపఁగ భావ్యంబు నీకు.
సరవితోఁ బెక్కండ్ర సతులఁ బెండ్లాట । పురుషులకును దగుఁ; బొలఁతు లీతెరువు
నను మోదమున నెందు నడవరే యోర్చి । మనమున నెఱిఁగి యమ్మనుజేంద్రతిలకు
బరికించి యిప్పుడే బ్రదికింపకున్న । సరవిఁ బ్రాయోపవేశన మాచరింతు.”

అని పల్కి భర్త పాదాంభోజ యుగము । తన మస్తకము సోఁకఁ దగఁ బ్రణమిల్లి
యాసీనయై యుండ నంతటిలోన । వాసిగా నా బభ్రువాహనుఁ డెలమిఁ
దెప్పిఱి లేచి యత్తెఱవ నీక్షించి । తప్పకిట్లనియె : " మాతల్లి యెన్నఁడును
వనట పొందదు నేఁడు వైరి వర్గముల । నినుఁడు మంచును బోలె నిలఁ బరిమార్చు
నీ మహాబలుఁ జూచి యిట్లు దుఃఖింప । నీ మెయిఁ గనుఁగొంటి నేఁ బాతకుండ "
నని విలాపముచేసి యర్జునుతోడఁ । జను దెంచినట్టి యజ్ఞ తురంగమమును
వలగొను నయ్యాజ్ఞ వల్క్య శిష్యాది । కలిత భూసురులను గనుఁగొని వచ్చి
" యాగ హాయంబునకై వీరలేమి । యాగమువిధులు సేయుంగలవారొ !
పార్థుఁడీరీతిని బడియున్న వాఁడు ! । వ్యర్థంబుగాఁ దండ్రి నణఁచినయట్టి
పాపి కేవిధమునఁ బాయు నీ దోష ! । మేపార నింక నే నేమి సేయుదును !
సొలవక యిమ్మహీశుని కపాలమునఁ । జెలఁగి భిక్షావృత్తి సేయంగవలయుఁ !
గాక వేఱొక్కటి గలుగునె యకట ! । ఈకర్మగతి నాకు నెలమిఁ బ్రాపించె."
నని యులూచినిఁ జూచి "యబ్జాక్షి, నీవు । వనుప మాతండ్రిని ఖండనంబునను
విగత జీవునిఁ గాఁగ వేగఁ జేసితిని ; । జగతిలోపల నీవు సంతసంబందు
మిఁకఁ ; దండ్రిఁ జంపిన యీదురాత్మునకు । నకట ! యీప్రాణము లవి ప్రియమగునె !
పరవితో నాతఁడుచనిన సద్గతికి । నరుగంగ నగుఁగాక. "యని యుగ్గడించి
స్థావర జంగమ తతులార, మీరు । భావించి వినుఁడని పన్నగపుత్రి
వినఁ జెప్పి వ్రతనిష్ఠ వేవేగఁ బూని । "తనరంగ నేఁడు మాతండ్రిలేకున్న
నరుదారఁగా నిప్పుడందఱుఁ జూడ । నరవిఁ బ్రాయోపవేశన మాచరింతు.
ధరణిలో వీరవధంబు పాపంబు ; । వరుననెక్కుడు రాజవధ మంతకంటె ;
తనరంగ నినుమడి ధార్మికవధయు ; । జనక వధంబు నిశ్చయ మింతయనుచుఁ
గొలఁది పెట్టగరాదు కుంభిని లోన ; । వెలయంగ నీరీతి వీరుండు రాజు
ధార్మికుండును నైన తండ్రి వధించు । కర్మికి నిట్టిదె గతి. " యని పలికి

## ఉలూచి సంజీవనమణిచే నర్జును బ్రదికించుట

మానవ్రతస్థుఁడై మఱి తెంపుచేసి । తానుఁ దల్లియు నున్నతఱిఁ, బాఁపవెలఁది
మదిని సంజీవనమణిఁ దలంచినను । అది భుజంగమపుత్రి హస్తంబునందు
నిలిచిన, నంతలో నేర్పుదీపింప । వలనొప్పఁగా బభ్రువాహను కనియె ;

"విజయుండు వచ్చునే వేఁదురులార! । భజనతో దేవతావతి చేతనైన.
ఈయెడ నితనికి నేనొక్క ప్రియము । నేయంగఁ గోరియే చేసితి నింత.
మీకు నెఱింగింతు మిన్నక వినుఁడు । ఆకృష్ణుఁడును దివిజాధీశసుతుఁడు
నేకమై విహరించు; నితని తేజంబు । నాకవల్లభుఁడును నలి నాప్పలేఁడు.
ఒలసి మీతండ్రితో యుద్ధంబు సేయు । తలఁపు పుట్టించితిఁ దద్దయు." యనుచు
మణిపూర పురపతి మహిత హస్తమున । మణియిడి యిమ్మహామహుని దేహమున
మోపునీ వసవుడు ముదము రెట్టింప । నాపార్థతనయుండు నట్లన సేయ
లీల నర్జునుఁడును లేచి కూర్చుండి । యాలోనఁ గనవిచ్చి యందఱఁజూచి
యతి మనోహరముగా నాత్మనందనుని । మతిమీఱఁగా 'నేమమా!' యన్న నతఁడు
వినయ సంభరితుఁడై వేడ్కతోఁ బాద । వనజంబులకు మ్రొక్కి "వరశౌర్యధామ!
పనివడి నీదు కృపావీక్షణమున । గొనకొని సర్వంబు కుశలంబె" యనిన
మఱియు నిట్లని పల్కె: "మహితాత్మ, నీవు । అఱిముఱి నాచెప్పినట్ల యుద్ధమున
కరుగు దెంచితివి; యీయఖిల జనముల । ... ... ... ... ...
మొగములయందెల్ల ముదము నచ్చెరువు । వగపును దోఁచెడి; వనిత యులూచి
చిత్రాంగదయు నేల చేరిరిచ్చటికి? । చిత్రంబుగా; నాకుఁ జెప్పునీ." వనిన
నతఁడుఁ జాఁగిలిమ్రొక్కి హస్తముల్ మొగిచి । యతుల విస్ఫూర్తిని నహిసుతఁజూపి
"యంతయు మాతల్లి నడుగుఁడు మీరు । చింతింపవల"దన్నఁ జేడియఁ జూచి
"కలికి! నీరాకకుఁ గారణంబేమి? । వలనొప్ప నిట బభ్రువాహనుమీఁద
నాదేస మది ప్రసన్నంబైన యదియె! । మోదంబెయిప్పు! డిమ్ములఁ దనూభవుఁడు
నేను జిత్రాంగద యేమైననీకుఁ । బూనిక నపరాధముల నెఱుంగమిని
నతులిత గతులఁ జేయుఁడుగదా!" యనిన । నతనిఁ గనుంగొని యల్లన నవ్వి

### ఉలూచి యర్జునునితో వనువుల కోపప్రసాదముల నెఱిఁగించుట

"నలినాప్తనిభతేజ, నాథ, నీయందుఁ । గలుగునె నేరమి? ఘననియతాత్మ!
చిత్రాంగదయుఁ గీడుసేయ దెన్నఁడును । పుత్త్రుఁడు మిక్కిలి పుణ్యవంతుండు.
కినియకు చెప్పెదఁ గృతకృత్య, నీవు । వినుముయుద్ధంబున వేగంబె భీష్ముఁ
బరఁగి శిఖండి నెపంబుగాఁ జంపి; । తరయంగ నట్టిది యధికపాతకము.
దానికి నిష్కృతి తగ నొనర్పకయె । మానుగా దేహ మిమ్మహి వీడితేని

చలమొప్ప నరక వాసమునకుఁ బోవ । వలయుఁ గావున నిట్లు వచ్చి చేసితిని.
అది యెటులం టేని యవనీశ, వినుము । చదురొప్ప నొకనాఁడు సఖులతోఁగూడి
మందాకినీ వారి మజ్జనంబాడ । నందంద పోవంగ నచ్చటికంత
వరమతితోఁ గూడ వసువులేతెంచి । యురవడి మీఱంగ నొక్కరేవునను
జొచ్చి తీర్థములాడ సురనదితోడ । నచ్చుగానిట్లని "రథులైన జనని!
గాండీవధరుఁడు శిఖండి ముందఱఁగ । దండిగా భీష్ముని ధరణిపైఁగూల్చి
యనృత జయమునందె; నట్టియర్జునుని । దనరంగ శాప సంతాపితుఁ జేయ
వలె" నని పలుక దేవనదియు వాని । కలవడ నొడఁబడ, నట్టివాక్యములు
విని తత్క్షణంబున వేగంబె నేను । జనకున కెఱిఁగింప, సరగున నతఁడు
భయమునఁ జనుదెంచి భక్తిపూర్వమునఁ । బ్రియములు రెట్టింపఁ బెక్కుభంగులను
వసువులఁ బ్రార్థింప వారంతలోన । వినుచక కోపంబు విడిచి యిట్లనిరి :
"పార్థుని సూనుండు బభ్రువాహనుఁడు । పార్థుని నటఁ బట్టి బవరంబులోనఁ
బాయక శరములఁ బరువడిఁగూల్పఁ । బాయు నీ దోషంబు వన్నగాధీశ"
అనవుడు మాతండ్రి యత్తెఱంగెల్ల । వినిపించె నాకును విశదంబుగాఁగ.
అది గాన బభ్రువాహనుఁడు నీతోడఁ । గదనంబు సేయక కడఁకతో మ్రొక్కి
మరలి యెంతయుఁ దనమందిరంబునకు । నరుగంగ యుద్ధకార్యంబున కిదియె
యవసరంబని మతి యాత్మలో నెఱిఁగి । ... ... ... ... ...
రయమునఁ బఱతెంచి రణమర్జుననకుఁ । బ్రియమును ధర్మంబుఁ బెంపుననుచుఁ
జెప్పి పోరికినిబుచ్చితి." నన్నవుడు । తప్పక హర్షించి తనదేవిఁ జూచి
"నీరజలోచన, నీచరిత్రంబు । వారక మత్కులవర్ధనకారి
యగుట యెప్పుడుఁ గనినదికాదె!" యనుచు । నగణిత సంతోష మావహిల్లంగఁ
బలికె నాదరమున; బభ్రువాహనుని । నెయమితోఁ గనుఁగొని యిట్లనె మఱియు :
"మహిత విక్రమధుర్య, మత్తనూజాత, । మహిలోపలను జైత్రమాసపౌర్ణమికి
యమతనూజాతుని యశ్వమేధంబు; । ప్రమదంబు దీపింప బాంధువర్గంబుఁ
దల్లులు నీవును దగు పరిజనము । నెల్లగా రావలె నిభపురంబునకు."
అనవుడు ప్రీతుఁడై "యట్లచేసెదను. । జననాథ, నీవు వత్సలత దీపింప
నన్ను మాన్యునిఁ జేసి నాపురంబునకు । వన్నెగా వేంచేసి వైభవంబెసఁగఁ
గొన్నిదినములుండి కోరి యేననుప । మన్నించి గైకొమ్ము మఖహయరత్న."

అనుచుఁ బ్రార్థించిన నమరేంద్రసుతుఁడు । తనయునిఁగనుఁగొని తగవప్పుడనియె:
గుఱి మీఱి దీక్షగైకొనియున్నవాఁడ; । నెఱుఁగవే! పురముల నే నిల్వరాదు
"పోయివచ్చెద నేను బొందుగానుండు । మీ యెడ." నని నను హితపూజసేయ
నంగనాజనముల యనుమతివడసి । సంగతి గాఁగ నశ్వము వెంటఁ జనియె.
అదియును రాజగృహపురికడకును । వదలక యంతటిలోన వచ్చె నుత్తింగి
చలములోఁ దుత మేఘసంధి నామంబు । గలిగినయట్టి మాగధ సహదేవు
తనయుండు బాల్యంబు తనకుఁ గావునను । నెనయంగఁ దన్నును నెదిరి నెఱుంగ
కతుం రథారూఢుఁడై యడ్డపడఁగ । నతనిఁ గనుంగొని యమరేంద్రసుతుఁడు
నవ్వుచు నిట్లను: "నా మనంబునను । ఇవ్విధంబునఁ గోపమేమియు లేదు.
ఇలలోన మాయన్న యెవ్వరియెడను । వలదు క్రౌర్యంబని వడిఁ జెప్పెఁ గాన
నేనట్లు సేయుదు; నెలమితో నీవు । పూని యేతెంచి తిప్పుడు రణంబునకు."

మేఘసంధిని జయించి యర్జునుఁడు యజ్ఞాశ్వమును ముందుకు నడపించుట

అనవుడు నేమియు ననక మాగధుఁడు । సునిశితాస్త్రంబులఁ జొనిపినఁ, జూచి
నడుమనె ఖండించినను; వెస వాఁడుఁ । దడయక మఱియు సుద్ధతశస్త్రసృష్టి
గురియింప, నవియు నెక్కొనఁ ద్రుంచివైచి । కరుణాదైవాఱంగ గాండీవధరుఁడు
సారథి హయములఁ జక్రరక్షకుల । మీఱి నొప్పింపక మెల్లన సేయ,
నది 'బలహీనత' యని మదిఁ దలఁచి । మదముతోఁ దుత నక్కుమారుండు లీలఁ
బదపడి మిక్కిలి పలునారసములఁ । గదిసి యేయుటయు, నాఖండలాత్మజుఁడు
తిరముగా మేఘసంధిని నాటకుండ । శరములు నిగిడించి సారథిఁ గూల్చి
యఱిముఱి హయముల నణఁచి చాపంబు । విఱిచిన మగధుండు విరథుఁడై చేత
గదగొని బిట్టార్చి కవ్వడిమీఁదఁ । గదిసిన, నతఁడు నా గదయును ద్రుంచె.
నివ్వెఱ పడియున్న నృపతనూభవుని । నవ్వుచు దేవేంద్రనందనుఁ డనియె:
"వరికింప నొక్కని ప్రాణంబునకును । ధరణిలోపల నీవు దప్పక మనుచు
నానతి యిచ్చె మాయన్న మోదమున; । కాన నింతతడవుగాఁగ నిల్చితివి.
అది యటులుండె, రాజార్హమైనట్టి । కదనంబు చేసితి కడఁకతోఁ దుతను.
ఇంతియుచాలు నీవింతటితోన । శాంతి పొందుట తగు సహదేవతనయ!"
అనివల్క నూహించి యట్లకాకనుచు । ఘనతతో మ్రొక్కినఁ గౌఁగిటఁ జేర్చి

మన్నించి "యీచైత్రమాసపౌర్ణమికి । మిన్నక విను మశ్వమేధయాగంబు
ధరణీశ, నిఖిల బాంధవులతోఁ, గూడి । యరుదెమ్ము నీ" వన్న నంగీకరించి
పూజింప వాసవపుత్త్రుఁ డాహయము । నోజతోఁ గూడుక యొయ్యనఁబోవ,
నదియును వంగ పుండ్రాది దేశములు । మెడిచి యెంతేనియు మ్లేచ్ఛసీమలను
జరియింప, నచ్చోట జగతివల్లభులు । దురమొనరింపంగఁ దొడరి యర్జునుఁడు
వరశౌర్య విస్ఫూర్తి వారినిగెలిచి । తురగంబువెంట బంధురగతిఁ జనఁగఁ
జేదిదేశంబు చొచ్చిన, శిశుపాలు । గాదిలితనయుఁ డుత్కటకోపుఁడగుచుఁ
బురము వెల్వడి వృద్ధపూర్వకంబుగను । అరుదెంచి యవ్వీరు కర్చన లిచ్చె.
శరభుఁ డీరీతి నర్చన లీయఁగదలి । హరివెంటఁ జనుచుండ నదియును వేగ
గోసల టంకణ క్ష్మోణీశ వరుల । దేశముల్ చొచ్చినఁ దెఱఁగొప్ప గెలిచి
యువనిఁ జిత్రాంగదుఁడను వాదశార్ణ । ధవునిచేఁ బూజలు తప్పక వడసి
పదరి నిషాదాధిపతి దేశమునకు । నదనుగా నేతేర నంతటిలోన
లాలితుండగు నేకలవ్య నందనుఁడు । చాలఁ గోపించి నైషాద సైన్యములఁ
దోరణం బొనరించి తోడ్తోన తీవ్ర । నారాచముల నింద్రనందనుఁ గప్పి
యార్చినఁ, బార్థుండు నవి ద్రుంచివైచి । కార్చిచ్చుఁ బోలిన కాండంబు లేయ
మదమెల్ల నణఁగి సమ్మతి మీఱ మ్రొక్కి । యదనుగాఁ బూజింప నా ధనంజయుఁడు
నయ్యశ్వరత్నంబు నను గమింపంగఁ । జయ్యన నదియును జని దక్షిణాభి
ముఖముగాఁబోయి యిమ్ముల నంధ్రపౌండ్ర । ముఖదేశములు చొచ్చి మునుకొని ద్రవిళ
కేరళ కర్ణాట కేకయ పాండ్య । సౌరాష్ట్ర పతుల నిశ్చయముగా గెలిచి
గౌరవంబున ద్వారకా నగరంబు । చేరువ నరుగంగఁ జెలఁగి యాదవులు
పూజింపఁ గైకొని పొలుపు దీపించి । రాజితంబుగ నపరాబ్ధి నమీప
దేశముల్ గడఁకతోఁ దిరిగి యెంతయును । భాసిల్లు నట్టి యా పంచనదంబు

## శకుని తనయుఁ డర్జును నెదిరించి యోటువడుట

పైఁ జని గాంధారపతి సీమలోనఁ । దేజంబుతోడ వర్తింపంగ, శకుని
తనయుఁడు గోపించి తద్దయుఁ దాఁకఁ, । గనుఁగొని పాండవాగ్రజు నాజ్ఞ దెలుప
నంతటఁ బోవక యులుకమైఁ బొదివి । యెంతయు శరములనేసె ; నేయుటయుఁ
దునియలుగా నేసి తుదిఁ గృపమీఱ । ననిమిషేశ్వర సూనుఁ డతనితో ననియె ;

"చలముతో రాజులఁ జంపకు మనుచు । నలర యుధిష్ఠిరుం డానతి యిచ్చెఁ
గావున నీతోడఁ గయ్యంబు సేయ." । నావిని శకునితనయుఁడు బాణములు
వడి నేయ, నవ్వుచు వాసవాత్మజుఁడు । వెడఁద యమ్ముల వాని వెసఁబడనేయ
నా చిత్రమంతయు నచ్చోటి వారు । చూచి యిట్లనిరి : " యీ సురపతి సుతుఁడు
కడఁకతో నొల్లఁడు గాక శిరంబు । పుడమి నేయఁడె! మహాద్భుత కృపాకరుఁడు."
అని యకుమారుని యరదంబు మరలఁ । గొనిపోవఁబోవ గ్రక్కున రాజసుతుఁడు
దురభిమానము పేర్మిఁ దోడనే మరలి । నరుమీఁద నెంతయు నారాచవృష్టి
వఱలుచుఁ బరఁగింప వాని ఖండించి । మఱియును నేయఁ గుమారుని బలము
చిందఱ వందఱై చెలఁగి పాఱుటయు, । నందంద గనఁగొని యతనిఁ గాచుటకు
వాని తల్లియు మంత్రివర్గంబుఁ గూడి । మానితార్ఘ్యము గొని "మహాత్మ, శరణు
శర" ణని వచ్చినఁ జెలఁగి యాక్రీడి । తరుణి మన్నింపుచుఁ దగ మంత్రివరులఁ
బ్రియవచనంబులఁ బ్రీతులఁ జేసి । భయభక్తుఁడైన యబ్బాలుతో ననియెఁ :
"బరువడి నీవిటఁ బన్ని నామీఁద । నరుదెంచుటయుఁ జూచి యమతనూభవుని
వంపు సేయుటకునై బలముల నెల్లఁ । జంపివైచితి నేను జలమింక నేల?
తివిఱి గాంధారిని ధృతరాష్ట్రుఁ జూచి । యువని గాచితి నిన్ను." నని చెప్పి చైత్ర
శుద్ధ పౌర్ణమికి భాసురలీల నీవు । బుద్ధిపెంపొందంగ మొగి నశ్వమేధ
యాగంబునకును ర."మ్మని వినంబలికి । భోగీంద్రశయను సంపూర్ణసత్కృపను
సరవితో వివిధదేశంబులు గెలిచె. । హరివెంట వెడలినయట్టి యావార్త
చారులు చెప్ప నజాతశాత్రవుఁడు । కూరిమి దీపింపఁ గొలువుననుండి
తమ్ములఁ బిలిపించి తగభీముఁ జూచి । "తమ్ముఁడా, యిదె నీదుతమ్ముండు హయము
గొనివచ్చునని వింటిఁ గుంభినిఁ దిరిగి । మనమొప్ప; నీ మాఘమాస పౌర్ణమియుఁ
దలకొనెఁ; జైత్రంబు తడవులేదింక. । వెలయంగ మునుల భూవిభుల రాజులను
బిలువనంపుము వేగఁ బేర్వేర. వారి. । వలయు శాలలు గట్టవలయు; మందిరము
లలవడ విడిదలు నటఁ గట్ట వలయు." । ... ... ... ... ...
నని యానతిచ్చిన ననిలసంభవుఁడు । గొనకొని సేయించెఁ గోర్కి దైవాఱ.
అంతట రాజుల నఖిలమానవులను । ఎంతయుఁ బిలిపించ నిభపురంబునకు
వెలయంగ మానములువ్విళ్లూరఁ గదలి । పొలుపొంద సకలభూపములఁ గల్గువారు
చనుదేర నెదురేఁగి సంతోషమొనఁగఁ । జనవొప్ప భోజనశయనాసనములు

నృపులకు నొనఁగూర్చి నిఖిల సన్మనుల । కపురూపముగఁ బ్రేమ నర్ఘ్యాదికములు
కందమూలాదులు ఘనముగానొసఁగి, । యందంద చెల్వగు యజ్ఞవాటంబు
దక్కిన గృహములుఁ దగఁ జేసి, మిగుల । నక్కజంబుగ వచ్చినట్టి శిల్పులకు
నలవడఁ బసదనం బంతట నొసఁగి । చెలువుఁడై ధర్మజక్షితిపతి మఱియు
నన్నపర్వతములు నాజ్యరాసులును । బన్నుగా మిక్కిలి ప్రబలంగఁ దోఁణఁగె.
గుఱి లక్షవిప్రులు గుడిచిన నొక్క । మఱి మ్రోయు భేరి వేమఱు నహోరాత్ర
ములు మహామహిమగా మ్రోయంగఁదొడఁగె. । జలధివేష్టితధాత్రి జనము సర్వమును
ఏతెంచి నిండె నయ్యిభపురంబునను. । ఆతఱి నెఱఁగి యాయమతనూభవుఁడు
కలయంగ రాజుఁ గనుఁగొని భీముఁ । బిలిచి ' రాజులకును బ్రియముతోఁబూజ
లి ' మ్మన్న నతఁడును నెలిమిఁ బూజించె. । నెమ్మితో నవ్వేళ నీరజోదరుఁడు

## కృష్ణుఁడు ధర్మజునితో నర్జును సందేశము చెప్పుట

పాండవాగ్రజుతోడ భక్తి నిట్లనియె: । " గాండీవి మా ద్వారకాసమీపమునఁ
బోవంగఁజూచిరి పొసఁగ మావారు. । ఆవిజయుఁడు చెప్పినట్టి వాక్యములు
వినిపింతు వినుము " భూవిభులు వేడుకలఁ । జనుదెంచుచున్నారు జగతీశలేశ !
మున్నెట్టివారైనఁ బూజింపవలయు ; । జన్నమునకుఁ గదా చనుదెంతు రెలమి.
మఱి విశేషించియు సుత్తనూభవుఁడు । నెఱిఁ గార్యధుర్యుండు నీతిమంతుండు
పురడింప మణిపూర పురవరాధిపుఁడు । పరమధార్మికుఁడైన బభ్రువాహనుఁడు
పొలుపొంద మీపదంబులు చూచుకొఱకుఁ । గలవడిఁ జనుదెంచుఁ గరుణింపు మతని
అని చెప్పి పుత్తెంచె " ననుటయు విభుఁడు । వనజదళాక్షుతో వరున నిట్లనియె :
" నేవింటి విజయుఁ డనేకయుద్ధముల । భావించి యలజడి పడుట ; యట్లతఁడు
తొల్లి భీష్మాదులతోఁ బోరి నేఁడు । బల్లిదుం డీరీతిఁ బడియె నాకొఱకు.
నిన్నొక్కటడిగెద నీరజనాభ ! । మన్నించి చెప్పు మిమ్మహి నరుమేను
నాకుఁజూడ సులక్షణ సముచితంబు. । ఏకీడు గలిగెనో ! యిట్టిదుఃఖముల
నలుగుఁడు పడుచుండె నక్కటా! నాకుఁ । దెలుపవే!" యనుటయుఁ దెలిఁగొప్పఁబలికె:
" సకల గాత్రంబులు సవ్యసాచికిని । సకలంక శుభలక్షణాదియుక్తములు.
ఇలలోనఁ జెఱుతోడ లెక్కడయ్యెనను । గలిగెనీయలజడి కౌరవాధీశ ! "
అనియిట్లు వలుకంగ నంత గాండీవి । పనిచిన కాలరి పరువిడి వచ్చి

పాండవాగ్రజునకు భక్తితో మ్రొక్కి । "గాండీవి చనుదెంచెఁ గడఁకతో నెల్లి
పురము ప్రవేశించు భూపాల." యనినఁ । బరఁగంగ వానికిఁ బసదనంబొసఁగి
యానందమునఁ బొంది యారార్తిగడపి, । మానుగా వేగిన, మఱునాఁడు నరుఁడు
హయసమేతంబుగా నరుదేరఁ జూచి । జయజయ ధ్వనులతో జగతి గ్రక్కదలఁ
బురజను లానందమునఁ బొంగిపొంగి । పరివరి విధములఁ బార్థునిఁ బొగడి

## అర్జునుఁడు యజ్ఞాశ్వముతో హస్తిపురంబునకు వచ్చుట

"తలక్రొని యంత్రమత్స్యము తెగనేసి । చెలిమితోఁ బాంచాలిఁ జేకొనె నితఁడు;
సురపతి గెలిచి భాసుర ఖాండవంబు । నరుదుగా వహ్నికి నర్పించె నితఁడు;
ఈశాను మెప్పించి యెలమి దీపించి । పాశుపతాస్త్రంబు ప్రాపించె నితఁడు;
అజిముఖి ద్రోణ భీష్మాదుల గెలిచి । మఱవక గోవుల మరలించె నితఁడు."
అని యని పలుకంగ నాసవ్యసాచి । వినుచు నేతేరఁ బృథ్వీవల్లభుండు
హరి బలభద్ర భీమాదులుఁ దాను । నరగున నెదురేఁగి సంప్రీతుఁ జేసి
కొనివచ్చి ప్రేమలు కొనలు సాఁగంగ । ననువొప్పఁ గూర్చుండె; నానమయమున
భరిత మోహంబున బభ్రువాహనుఁడు । దొరఁకొని తల్లులతో నేఁగుదెంచి
యమతనూభవునకు నతని తమ్ములకుఁ । గమలనాభునకును ఘనభక్తి మఱియుఁ
గలుగు పెద్దలకును గడఁకతో మ్రొక్కి, । పలుదీవనలను శోభనలీలఁ బడసి
హరిచేత విభుచేత నఖిలవస్తువులు । తరమిడి గాంచి యెంతయు నున్నవేళ,
చిత్రాంగదయును నా శేషపుత్రియును । గాత్రముల్పులకింప గాంధారికపుడు
ప్రణమిల్లి కుంతికి భక్తితో నెఱఁగి, । మణిభూషణాదులు మహిమతోఁ గాంచి
యంతటఁ బాంచాలి యానుభద్రయును । సంతోష మొగిఁ జేయ సరస సల్లాప
విదిత సౌఖ్యంబుల విలసిల్లునంతఁ । బదవడి నవనము ప్రాప్తమాటయును
వ్యాసమహాముని వచ్చి యిట్లనియె: । "ఆసన్నమయ్యెను యజనంబునకును
దొడరుము నీవు బంధురకృపామహిమ. । తొడయ కిప్పుడు నీవు ధనికుండవై తి
తనయ, మున్మడిగాఁగ దక్షిణలొసఁగి । మన మొప్పఁగా సూఁడు మఖముల ఫలము
పొందుము; నీకు నెప్పుడు బంధు వధయుఁ । బొందగాఁ బాతకంబను సంశయంబు
దీనిచేఁ దెగును; వర్ధిల్లు శుభంబు । మానవాధీశ్వర, మహిలోన." ననుడు

## ధర్మజుఁ డశ్వమేధయాగము సేయుట

సంతోషచిత్తుఁడై సవనంబునకును । నంత ఋత్విక్కుల నామ్నాయవాక్య
విదిత ప్రవృత్తుల వెలయంగఁ జేయఁ । బదపడి యవ్వేళఁ బౌరవాధీశ,
పొలుపొందఁగా భక్ష్య భోజ్యాదులందుఁ । గడు తృప్తి పొందక గడఁగెడు నరుఁడు,
ధనధాన్య వస్తు సంతతులచే లేమి । పొనరఁ బాయక చిత్తవోయెడు నరుఁడు
మదిని గనుంగొన మందునకైన । వెదకిన లేఁడు; భావించి వాయుజుఁడు
తమ కొనఁగూర్పంగ ధరణిలోపలను । బ్రమదంబుగా నట్టి భవ్యాధ్వరమున.
వరుసతో వ్రతరతత్త్వము లేనివాఁడు । గరిమ వేదాంగ షట్కము లేనివాఁడు
సొలవక యేదిక్కు చూచిన లేఁడు. । సలలితంబుగ నంత సంతోషముగను
దివ్యమునీంద్రులు దివ్యకిన్నరులు । దివ్య గంధర్వులుఁ దెఱఁగొప్పఁ బొగడ
నమర భామినులు నృత్యంబులు సేయ । నమర భూదేవత లాశీర్వదింపఁ
గనక రూపపు టిట్టికలఁ జతుశ్చిత్య । మును వైనతేయ రూపున మహామహిమఁ
దనరు *నష్టాధ్శాత్మకముగ యజన । మొనరించి, యంత మహోజ్వలస్ఫూర్తి
నలరు పాలాశంబు లారును, బిల్వ । ములు నారు, ఖాదిరంబులు నారు, దేవ
దారుమయంబు లెంతయు నట రెండు । ధారుణి శ్లేష్మాత తరువున నొకటి
గాఁగ నిర్వది యొకఘనయూపములను । లోఁగక కల్పించి లోకులు మెచ్చఁ
బరికింపఁ గనకయూపములనేకములు । గరిమ శాస్త్రోక్త ప్రకారంబు నందు
నిరతి నయ్యాజ్ఞికుల్ నిలిపి యవ్వేళ । వరమతి నలుగాలివాని, బక్షులను,
జలచరంబుల విధి సంయుక్తముగను । దలకొని కూర్మ నెంతయును మున్నూఱు
పశువులు పొలిసె; నా ప్రథితాశ్వరత్న । విశదావయవములు వ్రేల్చిరి ప్రీతి;
స్వాహానినాద ముజ్జ్వలముగాఁ జెలఁగె. । ఆహూతులై దేవతానీకమెల్లఁ
దమ హావిర్భాగముల్ దగ స్వీకరించి । కొమరొప్ప దీవింపఁ, గుంభినీవిభుఁడు
ఓడ కెంతయు సదస్యులకు సద్భక్తి । వేడుకతోఁ గోటివేల నిష్కములు
నిచ్చి సాత్యవతేయు కిలయెల్ల నవ్వు । డిచ్చినఁ, గైకొని యిట్లను నతఁడు:
“ఇలయెల్ల మాకును ఋత్విగర్థముగఁ । దలకొని యొసఁగితి ధరణీతలేశ!
నయమునఁ బసిఁడి గొనంగఁ గోరెదను. । రయమొప్ప వెలగ హిరణ్య మీవయ్య!”

---

* ‘అష్టాదశ శరాత్మక’ మనియుండఁదగును

అనవుడు ధర్మజుఁ "డశ్వమేధమున । కొనరంగ దక్షిణ యుర్వియేయంద్రు.
కాన నీకిచ్చితిఁ గరము సంప్రీతిఁ; । గానలకేగి సుఖంబు నొందెదను."
అని పల్కఁ బ్రీతిమై యాజ్ఞసేనియును । అనుజులు నట్టిద యని సమ్మతింప
నఖిల జనంబులు నాకాశవాణి । సుఖలీలఁ బొగడి రాక్షోణీతలేశు.
అంత దేవవ్యాసుఁ డవనీశుకనియె: । "చింతింపనేల సుస్థిరబుద్ధి వినుము;
ఎలమితో దీన నెగ్గేమియు లేదు; । తెలియ విప్రులకోర్కి దీర్పుము భక్తి."
అనిపల్కఁ గృష్ణుఁ డిట్లనియె ధర్మజుని । 'మఁ నివంపు సేయుము మోదంబు నాకు.'
ననవుడు నట్లకాకని కోటికోట్లు । ధనము కుప్పలువోసి ధరవెల యనుచుఁ
జెప్పిన సంతోషచిత్తుఁడై మునియు । నప్పుడు గైకొనె; నంత ధర్మజుఁడు
కనకమయమ్మైన ఘనయజ్ఞవాటి । వినుత శయ్యాభాండ వేదికాయూప
తోరణాదులు నిచ్చెఁ దొడరి విప్రులకు. । ఆయూధి వెండియు నవనీశులకును
సొరిది వైశ్యులకును శూద్రాదులకును । దరిమిడి బహువిధధనముల నొసఁగఁ
దుదిని రెండవ మరుత్తుండని పొగడి । చదురొప్ప నిజనివాసములకుఁ జనిరి.
తనయంశమైన యాధనము కుంతికిని । నెనయ వేదవ్యాసుఁ డిచ్చె నంకటను.
మది మెచ్చ దానధర్మ ప్రకారమున । నది వినియోగించె నవ్వేళఁ గుంతి.
"నరవితో నవభృథస్నానంబు చేసి, । పరగంగ నకల పాపంబులఁ బాసి,
చక్కఁగా వ్యాసుల చరణంబులకును । మ్రొక్కిన, దీవించి ముదము రెట్టింపఁ
దన శిష్యవర్గంబుఁ దాను నేఁగుటయు । ననుజులతోఁ గూడ యమతనూభవుఁడు
సవనంబుఁ జూడంగఁ జనుదెంచినట్టి । వివిధరాజులకును వేర్వేఱ నపుడు
ఘన వస్తువాహన కనకాంబరములు । పనివడ నిచ్చి యా బభ్రువాహనుకు
మేలి వస్తువులిచ్చి మెఱవడి ననుప । నాలోనఁ దనపురి కరిగె హార్షించి.
ఒనరఁ జిత్రాంగదయును నులూచియును । ననిమిషేశ్వర పుత్త్రు నటఁ జేరియుండి
రంతలోపల మున్న యరుదెంచియున్న । కాంత దుశ్శలకు వేడ్కలు తొంగలింప
ధరణిలోఁ గృపతోడఁ దత్పుత్త్రపుత్రు । సరవిమై సింధుదేశంబున నిలిపె.
తమతమ సీమల ధరణి వల్లభులఁ । గ్రమముతోడ విభక్త రాజ్యులుగాఁగ
నిలిపె ధర్మజుఁడు మన్నించి మన్నించి. । అలర నివ్విధమున నఖిల రాజులకుఁ
జెలిమి సంతోషంబు చేసి వీడ్కొలిపె. । ... ... ... ... ...
ఒప్పుగాఁ గృష్ణు దేవోపచారములఁ । దప్పక పూజించి ధన్యత వడసి

బలభద్ర సాత్యకి ప్రభృతి యాదవుల । కలవడ నానాపదార్థంబు లొసఁగి
తగు భక్తి ననిపిన ద్వారకాపురికి । నగణిత విస్ఫూర్తి నరిగి; రంతటను
మంగళతూర్యముల్ మహినిండ మ్రోయ । రంగుగా నాధర్మరాజు వేడుకను
మునుకొని నిజగృహమునకు నేతెంచె." । అనుటయు జనమేజయ క్షితీశ్వరుఁడు
"అనఘాత్మ, హయమేధ యాగంబువేళ । నెనయు నాశ్చర్యంబు లేవేని గలవె!
కలిగిన నాకుఁ జక్కఁగఁ జెప్పు." మనినఁ । బొంపొంద నామునిపుంగవుఁ డనియె:
"ఆరీతి ధర్మజుఁ డశ్వమేధంబు । కూరిమితోఁ జేయ కుసుమవర్షములు
గురిసె నంతటిలోనఁ గువలయాధీశ! । కరమొప్పఁ జిత్రంబుగా నొక్కబిలము
వెలువడి నకులంబు విప్రులనడుమ । నిలిచి యందఱు విన నెమ్మి నిట్లనియె:

## సక్తుప్రస్థ చరిత్రము

"ధరణి సక్తుప్రస్థ ధర్మంబునకును । ఇరవొప్ప సరియుఁ గాదీయాగ." మనిన
నావిప్రు లతివిస్మయంబునఁ బొంది । భావించి యాముంగిఁ బరఁగ వీక్షించి
"సకలదేవతలకు సంతోష మెసఁగ । నకలంక దక్షిణ లర్థిమై నిచ్చి
యాగంబు చేసె నీయమతనూభవుఁడు । బాగుగాఁ గంటి మీపట్టున" ననిన
నకుల మిట్లని పల్కె నయబుద్ధితోడ: । "ప్రకటింతు మీకు శోభనలీల వినుఁడు
నలిఁ గురుక్షేత్రంబునం దొక్క ద్విజుఁడు । వెలయఁ గామక్రోధవిరహితుం డగుచు
వినుతింపఁగా నుంఛవృత్తిమై భార్య । యును కోడలును దనయుఁడు నెనఁగంగఁ
బనుపడి సహచరభావంబుతోడఁ । దనసేవ సేయంగఁ దపము సేయుచును
వెలయంగ నట ననావృష్టిదోషంబు । గలుగ నాహారదుర్ఘటమున్నై తారు
ధీరత్వ మెసఁగంగఁ దృణధాన్య మల్ప । మేటి యాఁకలి దీర్ప, నట నొక్కనాఁడు
అందఱు రేపాడి యరిగి యాధాన్య । మందంద యుపగ్రాహ్యముగ దాఁక వెదకి
కొనితెచ్చి యుఁడుగఁ గుంచెడు పిండి । యనువొప్ప నయ్యెన నానంద మంది
పంచి యానలువురు భక్షింపఁబూని । యుంచితగతినుండ నతిథి యొక్కరుఁడు
చనుదేరఁ గనుఁగొని సద్భక్తి నెదురు । కొని యర్ఘ్యపాద్యముల్ కూరిమినిచ్చి
ఘనముగా దీన నాఁకలి దీర్పుమనుచుఁ । దనభాగమిచ్చినఁ, దగభుజియించి
దానఁదృప్తుఁడు గామిఁ దగఁ దానెటింగి । 'నేనింక నేమిట నీతనిఁదృప్తు
నగునట్లు సేయుదు!' నని విచారింవ । ముగనిఁ గనుంగొని మగువ యిట్లనియె:

"పరగున నాపాలి సక్తువిచ్చెదను । జిరతరంబుగఁ దృప్తిఁ జేయుమీ" యనిన
నతఁడు భామిని దప్పి యాఁకలియెఱిఁగి । మతిలోన నూహించి మఱియు నిట్లనియె
"మృగములుఁ బక్షులు మేదినిలోనఁ । దగుభోజ్యములు దెచ్చి తమకాంతలకును
నిచ్చు నక్కట! నాకు నీపాలి సక్తు । వచ్చుగాఁ గైకొన నర్హమా సాధ్వి!
పాలుపొంద నింతి సంతోషించు తెఱఁగు । పలుతెఱంగుల నాసపడని మనంబు
గలిగిన యుధముఁ డీక్ష్మాతలంబునను । ... ... . ... ...
పడిగను; నచ్చోట జముని కింకరులు । గడువడిఁ గారింపఁ గాసిల్లు." ననఁగ
విని తలోదరి నవ్వి విభువదనంబు । నను జూడ్కి నిలిపి యెంతయు భక్తిఁ బలికె:
"పతియె తల్లియుఁ దండ్రి పతియె చుట్టంబు । పతియె దైవంబు నేపట్టునన్నైన.
అనిశంబు పతనికార్యంబు సేయుటయె । ఘనమైన ధర్మంబు కంబుకంఠికిని.
అదియును గాక నీ వాఁకొనియుంటి । విది భుజింపఁగ దోష మిమ్ము సద్భక్తి."
నని నిశ్చలాత్మయై యావువ్వుఁబోఁడి । తన సక్తువిచ్చినఁ, దగఁ బ్రియంబునను
అమ్మహాద్విజుఁ జూచి "యాకలివోవ । నెమ్మితోఁ గైకొను నీవిది" యనుచు
నిడుటయు, భుజియించి తృప్తిలేకున్నఁ, । గనువిచారించినఁ, గ్రమ్మఱ నతని
తనయుఁ డెఱింగి యాతనిపాలుచూపి । "యనఘాత్మ, యిందున నతిథినిదృప్తుఁ
జేయుము; జనకునిచిత్తవర్తనము । పాయక సేయుట ప్రథితధర్మంబు."
అనిన సక్తుప్రస్థుఁ డాత్మజుఁ జూచి । "పనిపడి విను మెంత ప్రాయంబు చనిన
బాలుఁడె తండ్రికిఁ బరికింపసుతుఁడు; । బాలున కాఁకలి పరఁగ నగ్గలము;
గావున నుచితంబుగాదు." నావుడును । "భావించి సుతుఁడనఁ బరఁగంగఁ దాన;
నెఱి నన్ను గాచుట నిను గాచుకొనుట. । అఱిముఱి నిది యిమ్మహాత్మున కిమ్ము."
అనుటయుఁ బ్రీతుఁడై యంగీకరించి । యెనయంగ విప్రున కిచ్చె; నిచ్చుటయు
నది యుపయోగించి యాఁకలిసుంత । వదలక యుండ నావ్రతుని కోడంబు
కుందినఁ గనుఁగొని కోడలు తెచ్చి । యందంద తన భాగ మర్పించుటయును,
"అక్కటా! యాఁకట నలజడివొంది । చిక్కితి!" వనిన నచ్చేడియ పలికె:
"కొలఁదులా మద్గురు గురువులు మీరు; । కలిత శుశ్రూషకుఁ గాదె ప్రాణంబు!
వినుతింప నిటుసేయ విహితంబు నాకు" । అనవుడు నాభాగ మతిథికి నిచ్చె.
ఇచ్చిన భుజియించి యొలమితోడుతను । మెచ్చి యిట్లనిపల్కె: "మిహిరప్రతాప!
తరమిడి నేఁడు మీదానంబునకును । అరుదంది దేవత లంబరంబునను

నిలిచిరి ; నిన్ను మన్నింపంగఁ గలరు ; । తలఁకొనఁగా నేను ధర్ముండ." ననిన
నవసరంబున మెచ్చియాఖండలుండు । దివినుండి మ్రోయించె దేవదుందుభులు.
పువ్వులవానలు బోరన గురిసె ; । రవ్వగా సురముని ప్రస్తుతులెనఁగె.

యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకమునకుఁ బో నియోగించుట

అప్పుడయ్యతిథి సంయమివరుఁ జూచి । తప్ప కిట్లనిపల్కె "ధన్యాత్మ, నీవు
అలర సతీతనయ స్నుషాయుక్త । మెలమితోడుత దివికేతెమ్ము వేగ.
అదె బ్రహ్మవుత్తెంచె ననఘ, విమాన । మదనుగా నెక్కు మీ"వనుచు ధర్ముండు
తన దివ్యరూపంబు తగఁ జూపునంత । గొనకొని యాలును గొడలు సుతుఁడుఁ
దాను విమానమెంతయు నెక్కియరిగె. । మానుగా బిలమున మఱి యేను వెడల
నాసక్తు గంధంబు నతిథి పాద్యంబు । రాసిగాఁ బొరసి యవ్విరధర్మమహిమఁ
జేసి పార్శ్వంబొండు శిరమును నపుడు । భాసుర హేమప్రభాస్ఫూర్తి యయ్యె.
నాఁటనుండియు నేను నానాధ్వరములు । ధాటిగా వరపుణ్య దాన స్థలములఁ
బుణ్యదేశంబులఁ బుణ్యాలయములఁ । బుణ్యాశ్రమంబులఁ బొందుగాఁ జూతుఁ
దక్కటిపార్శ్వంబు తపనీయ మౌనో । యక్కజంబుగ నాకు నను తలంపునను.
అదిగాన నీరీతి నఖిలంబుఁ దిరిగి । యదనుగా ధర్మజు నశ్వమేధమునఁ
దెలియ నాకోర్కి సిద్ధించు నిశ్చయము । అలవడఁగా నను నాన వచ్చితిని ;
సరవి నించుక విశేషముగాన." ననుచు । మరలి యానకులంబు మాయమైపోయె.
అనుటయు జనమేజయ క్షితీశ్వరుఁడు । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె :
"సకలదేవతులును సకలసంయములు । సకల భూపతులును సన్నుతిసేయ
నొనరించె నావేళ నొప్పుగా మఖము । చెనసి యాముంగి దూషించె;నిందులకుఁ
గారణంబేమి తప్పక చెప్పు" మనిన । వారక యమ్మహీవల్లభు కనియె :
"అనదృశ స్ఫూర్తి హింసాత్మకంబైన । పశుఘుజ్ఞమునకంటెఁ బరఁగ నహింస
కడు నధికంబని ఘనముగాఁ జెప్పి, । పుడమిలో గీర్తి చెప్పుటగాక తనదు
శిరమును బార్శ్వంబుఁ జెలువైన హేమ । భరితంబు లగుటయుఁబలికెను. దాని
కిని నితిహాసంబు కృతకృత్య, యొకటి । ( వినుము చెప్పెదఁ దొల్లి వృత్రహరుండు
జన్నంబొనర్ప యజనసాధనముల । నన్నియు నమకూర్చి యగ్నికార్యముల
నొనరించుచుండంగ యోగ్యులు పశులఁ । గొనితేరఁగాఁ గనుంగొని మునివర్యు

లతిదయాకలితులై యమకేశుఁ గాంచి । "శతమఖ, పశువిశసన మధర్మంబు
కృతయుగంబిది పాతగిలిన బీజంబు ) । ... ... ... .. ...
లట్లసాధనములు; హర్షించి దయను । ఇట్లు జీవ్రుంబ్రోవు మిద్ధచారిత్ర!"
అనిపల్క వినకున్న నతివాదమువుట్ట । విని కర్మకాండ కోవిదుఁడుత్తముండు
పరికింప ధర్మతత్త్వరుఁడైన యుపరి । చర వసువేతేర ...క్షి గాఁగోరఁ
బరువడి దేవతాపక్షపాతమున । సరవితోఁబశువిశసనము కర్తవ్య
మని యధఃపాతంబు ప్రాపించెఁ; గాన । తనర హింసారహితంబైనయట్టి
యజనంబు సంపూజ్య; మదియునుగాక । విజయుఁడైనట్టి యుర్వీసురోత్తముఁడు
తనప్రాణరక్ష కెంతయునున్న సక్తు । వనయంబు భక్తితో నతిథికి నిచ్చె.
చనదె సన్నుతి సేయ జననాథ!" యనిన । జనమేజయుఁడు పల్కె "వంయమితిలక!
తెలుల కేవస్తువు దానంబునకును । సుతి ప్రదానము చెప్పుమా" యన్న ననియె:

## అగస్త్యమహాముని ద్వాదశసత్రయాగ ప్రభావము

"ఎనసినప్రేమతో నిందుకు నొక్క । విను తేతిహాసంబు వినుము చెప్పెదను.
ఇల నగస్త్యుంచు పంద్రెండు వర్షములు । ములయక చేసెడి మహితాధ్వరమున
నలర బుత్విక్కులై యఖిలతంత్రీసులు । చెలమున సన్మునీశ్వరు లొనరింప
నాసమయంబున నమరవల్లభుఁడు । వాసిగా భూమిలో వర్షింపకున్న
వెలయంగ నోషధుల్ వికలత్వ మొందఁ । దలకొ... యత్తపోధనులను జూచి
యన్నదానవు విధి యతిథి కేరీతిఁ । గ్రన్ననఁ జెల్లునో! కటకటా! యితఁడు
తగ ధర్మమార్గ గతంబైనయట్టి । యగణితద్రవ్యంబు నటదక్క యొండు
విని యోగపటపఁడు; వెన వాసలేదు । మునుకొని" యనుచును ముచ్చటలాడ
నకుంభసంభవు డాలించి వారిఁ । దక్కక పల్కె: "సుత్రాముండు వృష్టి
గురియింపకుండిన గురుతర మహిమఁ । బరఁగ దేవేంద్రునిపదము గైకొనుచుఁ
బొలుపొంద జగముల బ్రోతుఁ; గాదేనిఁ । గొలఁదిగా బహుధన కోటులు దెత్తు.
కాదేని నుత్తరఘన కురుభూము । లాదటఁ బండిన వంటు ధాన్యములు
తలఁచిన వచ్చు నింతటికి నీజాలి । వల" దన్న నామునివర్యు కిట్లనిరి:
"మాకుఁగా నింతేల మానీంద్రతిలక! । చేకొని యేము మాచేసినయట్టి
కలిత పుణ్యంబుల ఘనముగా మాకు । వలయు నాహారముల్ వడయుదు" మనుచుఁ

బలుకంగ నంతలోఁ బాకశాసనుఁడు । జలధరంబుల నంపి జడివట్టి కురిసి
తాను నాచార్యుఁడెంతయు నటవచ్చి । 'మానీంద్ర, కావవే! మహితవిస్ఫూర్తి!'
ననిన నర్చనలిచ్చి యమరేంద్రు ననిపి । పనివడి మఖసమాప్తంబైన మునుల
నర్చించి యనిపి, నాశ్రమంబునకుఁ । జేర్చిన వేడ్కలోఁ బ్రియమొప్ప నంతఁ
జని, రివ్విధమున హింసారహితముగ । ఘనయాగ మొనరించెఁ గావున ధర్మ
మార్గాగత ద్రవ్యమయమైనయట్టి । మార్గముత్తమ." మీన మనుజేంద్రుఁడనియె :
"నకులరూపమున నెంతయుఁ బల్కినట్టి । యకలంకుఁ డెవ్వఁడో యనఘాత్మ!" యనిన

## జమదగ్ని పితరులశాపంబున ముంగిసయై పుట్టుట

జనమేజయునకు వైశంపాయనుండు । వినిపింపఁ దొడఁగె నావృత్తాంత. "మనఘ!
జమదగ్ని పితృకార్యసంకల్పవృత్తిఁ । గమనీయ నూతన కలశంబునందుఁ
దిరముగాఁదన హోమధేనువుఁ బిదికి । వరివరి విధములఁ బదిలంబు సేయ
నతని హృదయవృత్తి నరసెదు కొఱకుఁ । దతభంగిఁ గ్రోధాధిదైవంబు వచ్చి
ప్రామాదికంబను భంగి దోఁపంగ । నా మొయిఁ గూల్చిన, నలుకేమి లేక
యూరకయున్న సముజ్జ్వలదైవ । మాయాధ విస్ఫూర్తి నతనికిట్లనియె :
"గురుతుగా భృగువులు క్రోధనులనఁగఁ । బరఁగినయట్టి యాపలుకు బొంకయ్యె.
అపరాధి నోడితి ననఘాత్మ, నీకుఁ; । గృపతోడ నన్ను రక్షింపవే!" యనిన
"ధరణిలో నీవేమితప్పు చేసితివి? । నరగునఁ ద్రోవుము శంకాభయములఁ
బొ" మ్మన్న భూతంబు పోయెఁ; బోవుటయు । నమ్మతిగా నంత జమదగ్నిపితరు
లతనికిఁ బొడసూపియర్థిఁ గోపించి । వితత వాగ్వైఖరి వెలయ నిట్లనిరి:
"కఱకటీ శ్రాద్ధవైకల్యంబు గలుగ । మఱి యూరకుండితి; మహిలోన నీవు
ముంగిసవై పుట్టు మునివృత్తిమాని । నంగతిగా." నన్న జాఁగిలి మ్రొక్కి
'తప్పుచేసితి నన్ను దయఁజూడుఁ' డనుచుఁ । దప్పక ప్రార్థింపఁ దగఁ గోపముడిగి
"విడువక యెన్నఁడే విప్రసమూహ । మడరంగ నొడఁబడునట్టి వాక్యముల
మలసి యత్యంతధర్మంబు కీడనుచుఁ । బలికిన నీకు శాపము మోక్షమగును."
అనుచు నుద్దేశించి; రానకులంబు । ఘనత సక్తుప్రస్థకతమునఁ దగిన
మాటలతోడ ధర్మజుని యజ్ఞంబు । సాటిగా దూషించి శాపవిముక్తి
నొందె నివ్విధమున నొనరంగ." ననుచుఁ । బొందుగా నమ్మునిపుంగవుఁ డక్షి

యమతనూజాతుని యశ్వమేధంబు । ప్రమదంబుతోఁ జెప్పఁ బరితోషమంది
యనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితాశ్వమేధ పర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె మూఁడవది.
* ( శ్రీధవ, కేశవ, చిద్రూప, కృష్ణ, । సాధిత దానవసంఘ, గోవింద,
దినకర శశినేత్ర, దేవాదిదేవ, । మనసిజ జనక, ధర్మప్రభాబోధ,
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెదనీకు.
భోసలాన్వయ సుధాంభోధి చంద్రుండు । భాసుర శౌర్యానుభావ సాంద్రుండు
ఘనసముత్కట జటాధరణాయమాన । ధవళకీర్తి మనోజ్ఞతర గాంగభంగ
గాహనైక పవిత్ర గంధర్వగాన । మోహితామర వధూ ముఖ కాంక్షణీయ
మనుజ భావుండు రామామనోజుండు । అనఘ సన్నుతుఁడు శాహాజీ విభుఁడు
ఒకనాఁడు తనమది నుల్లాస మొదవఁ । బ్రకటిత పద్మినీ భామాధవుండు
తొలుగట్టు నుదయింపఁ దోడ మేల్కాంచి । చెలఁగి పన్నీటను జలకంబులాడి
వరవస్త్ర భూషణావళు లొప్పఁదాల్చి । సరసతఁ గస్తూరి చందనంబలఁది
కమనీయ సౌరభ కమలకహ్లార । సుమదామ సౌరభ శోభితుండగుచు
గరిమ తోడుత నూడిగంబులవారు । సరిగ హెచ్చరికని సందడింపంగఁ,
బ్రచుర నీలస్తంభ బాహుళ్య హేమ । ఖచిత నానారత్న కాంతులతోడ
విప్పైన యాస్థాన వేదికమీఁద । నొప్పుగాఁ గూర్చుండి యున్నంతలోనఁ,
దమ్ము లిర్వురువచ్చి తగిన పీఠముల । నిమ్ములఁగూర్చుండి రెలమితో నపుడు
దశరథ తనయుండు తమ్ములతోడ । విశదమౌ కొల్వుకు వేంచేసె ననఁగ
నొప్పె; నపుడు వేగ నుచితజ్ఞులైన । ... ... ... ... ...

* తంజావూరు మహారాష్ట్ర రాజులలో నొకఁడగు శాహాజీ యాజ్ఞచే నాతని యాస్థానోద్యోగియగు నింబాజిప్రేరణవలన (బహుశా విద్యా శాఖాధికారి కావచ్చును) ఈభారతప్రతి కుప్పయ మంత్రియను లేఖకునిచే వ్రాయఁబడినది. ఈ కుండలీకృతభాగము ఆ వ్రాయసకాని కవిత్వమై యుండవచ్చును' గ్రంథములకుఁ బ్రతులు వ్రాయింపుమని రాజు ముదల యిచ్చుటయు, మంత్రులు లేఖకుల నియమించి వ్రాయించుటయు, వారు ప్రతులువ్రాయుటయే కావ్యములు వ్రాయుటగా తలంచుటయు, లేఖకులను, సమ్మానించుటయు మొదలగు అందమైన యానాఁటిసంప్రదాయములు దీనివలనఁ దెలియవచ్చుచున్నవి,

దొరలును మంత్రులు దుర్గాధిపతులు । వరువిడి సామంతభట సమూహములు
హితులు పురోహితు లెలమి సత్కవులు । ... ... ... ... ...
... ... ... ... ... । పాఠక గాయక ప్రతతి యేతెంచి
కొలువంగ జోడ్గూడి "కువలయాధీశ ! । విలసిత వాగ్జాల, వీరప్రతాప,
భూసురాశీర్వాద పుణ్యచారిత్ర, । దానవజిత భోగవైభవ నిలయ,
శారద డిండీర చంద్రకర్పూర । తారాళి మల్లికా ధవళ సత్కీర్తి
ధామా !" యనుచు భట్లు తగ జయవెట్టఁ, । ... ... ... ...
తెలఁగి యింద్రునిపురిచేడెల నవ్వఁ । గలిగిన రూపముల్‌గల వారకాంత
లలవడఁ జేరి నృత్యంబులు సేయ, । ... ... ... ... ...
దీపింప భూలోక దేవేంద్రుఁడనఁగ । భూపాల తిలకంబు పొలుపుదీపించి
పంచమవేదమై ప్రబలు భారతము । సంచిత పాపముల్ సమయించుఁ గాన
నింబొజిఁ గనుఁగొని "నీవు వ్రాయింపు । మంబుజోదరు లీలలన్నియుఁ దానఁ
గనవచ్చు" ననిచెప్పఁ గడువేడ్కతోడ । ... ... ... ... ...
నరపతితోడ మహాప్రసాదం బటంచు । నిరవొప్పఁగా దనయింటి కేతెంచి
యెలమి నన్బిలిపించి యిట్లను : "నీవుడు । ... ... ... ... ...
భారతపర్వముల్ ప్రభువు శాహేంద్రుఁ । డారయ వ్రాయింపు మనిపల్కెఁగాన
కుదురుగా నొరగక కొదరక తప్పు । లొదవకుండంగ వ్రాయు" మని యావేళ
ఘనసార తాంబూల గంధ మాల్యములు । చనవొప్పఁగా నిచ్చి చనుమన్న నేను
ఘనతర సంతోష కలితుండ నగుచు । మనమున నుప్పొంగి మార్తాండ వంశ
మహితాంబునిధి సుధామయమూర్తి పేర, । విహిత సదాచార విఖ్యాతుపేర,
బ్రహ్మకల్ప స్థాస్య బహుకీర్తి పేర, । బ్రాహ్మణాశీర్వాద ఫలవర్తి పేర,
మండిత శాత్రవ మత్తభూపాల । శుండాల కేసరి శుభమూర్తి పేర
విభవ నిర్జిత దేవ విభుపేర, శాహ । విభుపేర సకల ప్రవీణునిపేర
వ్రాయంగఁ బూనితి వరమతియుతులు । మాయురే యని పలుమాఱులు మెచ్చ
నిటలాక్ష పదపద్మ నిహితప్రసన్న । పటుచిత్తుఁడైన కుప్పయమంత్రి వరుఁడ.
ఎందాఁక రవిచంద్రు లెందాఁక జడధు । లెందాఁకఁ దొలుమిన్కు లెందాఁక నలువ
లెందాఁక శైల జాధీశు సత్కీర్తి । యందాఁక నిది పూజ్యమై యొప్పఁగాక.

# ప్రథమాశ్వాసము



శ్రీ వెంకటేశ, సుస్థిర దయాపూర్ణ, । భావజజనక, శోభన మనోహర!
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:

## పాండవులును గాంధారీధృతరాష్ట్రుల నొండొరులయెడ నడచికొనిన ప్రవర్తనము

పాండవాగ్రజుఁ డట్లు భయభక్తులలర । దండిగా నశ్వమేధం బొనరించి
దక్షిణల్ భక్తితోఁ దగువారికిచ్చి । యక్షయ ధర్మసహాయత్వ మొనఁగఁ
దమ్ములు భూదేవతాకోటి రాజు । లమ్మాధవుండును నర్థితోఁ గొలువఁ
గరిపురి కేతెంచి కంజాక్షుననిచి । పరువడి తా రాజ్యభారమ్ము పూని
తల్లియుఁ దండ్రియుఁ దానయై ప్రజల । నెల్ల రక్షింపుచు నేపుదీపించి
యయ్యాంబికేయుని నతిభక్తితోడఁ । జయ్యన గొలుచుచు సద్వినయమున
నతని యోగక్షేమ మరయు చేప్రొద్దు । వితత ప్రియంబున విదుర యుయుత్సు
సంజయుల్ తమ్ములు సరస రీతులను । రంజిల్ల, నిఖిలరాజ్యంబును నడపి
బంధుత్వ మొనఁగంగఁ బ్రజ్ఞదీపించి । యంధభూపతి చెప్పినట్టులచేయు.
తివిరి కుంతియు ద్రౌపదియు సుభద్రయును । అనిశ చిత్రాంగద యయ్యులూచియును
వినయంబు భయభక్తి వేర్వేఱ గలుగఁ । గొనకొని గాంధారిఁ గొలిచియుండుదురు.
చెఱువులు గుళ్లును జెలఁగి కట్టించు, । నఱిముఱి విప్రాగ్రహారముల్ సేయు,
శమన తనూజుఁడు సమ్మతింపంగ । నమిత ఘనాఢ్యంబున నాంబికేయుండు.
అవని ధర్మజుఁ గొల్వ నరుదెంచునట్టి । యవనీశు లెల్లరు నంబికాసూతిఁ
గూరిమి దీపింపఁ గొలిచి యుండుదురు. । ధారుణీతలనాథ, ధర్మనందనుఁడు
తెలియ నూనులులేని దీనత్వమెల్లఁ । దెలియకుండఁగ సౌఖ్యతేజముల్ నడపు.
మఱియును దమ్ముల మంత్రుల నృపుల । నఱలేని భృత్యుల నాప్తులఁజూచి
"మాపాలిదైవ మీమానవేశ్వరుఁడు । చేపట్టి యీతఁడు చెప్పినయట్లు
నడువుఁడు మీర లున్నతభక్తి" ననుచుఁ । దడయక యెఱిఁగించు ధర్మనందనుఁడు.
చెలిమితో నీరీతి సేవసేయుచును । వలను దీపింపంగ వర్ధిల్లుచుండ,

ననిలతనూభవుం డలుక రెట్టింపఁ । జెనసి రారాజు చేసిన చేఁతలెల్ల
దలఁచును, దలఁచియు ధర్మసూనునకుఁ । దలఁకి యూరకయుండుఁ. దదనంతరంబ
శ్రాద్ధదినంబుల పమరోర్వియందు । బద్ధవైరంబునఁ బడినసూనులకు
భూనాథుచేతను భూకనకాది । దానముల్ సేయించు ధర్మపుత్రుండు.
ఒనర సుయోధనుం డున్నకాలమున । ననసిన సౌఖ్యంబు లేరీతినడచు
నారీతికంటె సత్యధికంబు గాఁగ । ధారుణి నడపంగఁ దగ విలసిల్లు.
వెండియు నొకవేళ వెన మరుత్సుతుఁడు, । పాండవేయాగ్రణి పార్థుండు కుంతి
వినకుండ ధృతరాష్ట్రవిభుఁడు గాంధారి । వినుచుండ నిట్లను విశదంబు గాఁగ:
"నలి మద్భుజాస్ఫాలనము గనినట్టి । కలుషాత్ములగు శత్రుగణములకెల్ల
వెడలంగవచ్చునే! వెంగలు లగుచుఁ । గడఁగిరి నాతోడఁ గౌరవులెల్ల.
అటువంటి దుర్యోధనాదులఁ బోరఁ । బటుగతిఁ జంపిన బాహువులకును
జందనంబలఁది పుష్పములఁ బూజించి । యందంద మ్రొక్కెదు" నని పల్కుచుండు.
అయ్యెడ నకులుండు నతనిసోదరుఁడు । చయ్యన నదివిని సంతసిల్లుదురు.
అతివగాంధారియు నంబికాసూతి । మతిలోన వగచుచు మారుతివాక్య
ములు శ్రోత్రములకును ములుకులవగదిఁ । గలగొని కాడంగఁ గంది కుందుదురు.
విధిఁ జాలదూఱుచు వేదనఁబొంది । యధికదుఃఖంబున నట పదునేను
హాయనంబుల దాఁక హాస్తినాపురిని । బాయక యుండి తప్పక యొక్కనాఁడు
నయమొప్ప బంధుజనాదులఁ గూర్చి । భయభక్తి యుమతనూభవుని రావించి
యడరి గద్గదకంఠుఁడై యంధనృపతి । తడయక వారితోఁ దగ నిట్టులనియె:

### ధృతరాష్ట్రుఁ డాశ్రమావాసమునకు ధర్మజుననుమతి గోరుట

"నాకతంబునఁ జేసి నందనులకును । జేకొని నాశంబు శీఘ్రతఁ గలిగె.
కడుఁ గ్రూరకర్ముని గపటాత్మ మూర్ఖు । జడుఁ గులద్రోహిని శకుని దురాత్మ
రాజుగఁ జేసితి రాజ్యంబునకును; । తేజంబు వనయును ధృతియును జెడియె.
వనమాలిచెప్పిన వాక్యంబులెల్ల । విననేరనైతిని; విదుర సంజయులు
శాంతనవుండును జాపగురుండుఁ । జెంతల జెప్పినఁ జెవిఁబెట్ట నైతి!
అంతరంగంబున నత్తెఱఁగెల్ల । నెంతయు వహ్నియై యెరియు నెప్రొద్దు."
అనిపల్కి వెండియు నాంబికేయుండు । ఘనతర శోక సంకలితుఁడై పలికె:

"వరుసఁ బుత్రులకును వగవంగ నేల! । ధరణిలోపల రాజధర్మమార్గమునఁ
గదనంబుచేసి యా ఖండలుపురిని । వదలని సౌఖ్యత వసియించినారు.
అది యటులుండె; నోయనుతనూజాత! । యిదె రక్షుంర" మ్మని యెలమితోఁ బిలిచి
జగతి నీవరయంగ సకల సౌఖ్యములు । నగపడ నొందితి; సతుల దానములు
పెక్కాచరించితిఁ; బృథివి శ్రాద్ధములు । తక్కక చేసితిఁ దనయులకెల్ల.
వార్ధిగాంభీర్య, యౌవనమెల్లఁ దక్కె । వార్ధక్యమాయె; భూవరునకు సమర
మునఁనొండె మఱి తపంబునఁనొండెఁ బ్రాణ । మును విడువఁగవలె; మునుపటి వారు
నరనాథ, యీ రీతి నడచిరి; గాన । నిరతి గాంధారియు నే వల్కలములు
కలవడి ధరియించి కందమూలముల । ఫలముల నాఁకలి పరిపాటిఁ దీర్చి
విహరింపవలె; మాకు వేగ ననుజ్ఞ । మహనీయగతి నిమ్ము మనుజేంద్రతిలక!"
అనవుడు ధర్మజుఁ డామాట లెల్ల । విని యాంబికేయుతో వెరవొప్పఁ బలికెః
"నరనాథ, నీకుఁ గానల కేఁగుతలఁపు । కర మొప్ప మదిలోనఁ గలిగిన వినుము.
ఈ రాజ్య సౌఖ్యంబు లిఁక నాకునేల! । చేరి నే మీపాదసేవ సేయుదును.
సొలవక మీకు నెచ్చోనుండఁ దలఁపు । కలిగె నచ్చోటనే కడఁగి వర్తింతు.
భూనాథ, విను గూఢబుద్ధివై నీవు । ఏ నెఱుంగకయుండ నిట్లు శోకమున
మునిఁగెద వింక నీభూమి నాకేల! । అనఘాత్మ! గురుఁడును నాత్మనాయకుఁడుఁ
దల్లియుఁ దండ్రియు దైవంబు నీవ. । ఎల్లగా నిట్లానతిచ్చితి వేని
బలిమి యుయుత్సు భూపతిఁ జేయు; వెంటఁ । గొలిచి వచ్చెద." నని కువలయేశ్వరుఁడు
పాదపద్మములపై భక్తిఁ వ్రాలుటయు, । నాదరంబున నెత్తి యాలింగనంబు
గావించి మన్నించి కడఁక నిట్లనియె: । "రావయ్య ధర్మజ, రాజావతంస!
ధర్మమార్గంబున ధరయెల్లఁ బొగడఁ । బేర్మియుఁ గడఁకయుఁ బ్రీతియు మెఱయ
మన్నించి శుశ్రూష మమతతోఁ జేసి । వన్నెకెక్కితిఁ జంద్రవంశంబునందు.
నీకు సమానులౌ నృపతులు గలరె! । రాకాశశాంక నిర్మల కీర్తిధుర్య!
ఏను వృద్ధుఁడనైతి నిందులకీవు । పూని వారింపంగఁ బొందుగాదుసుగు."
అని పల్కి విదురుని నానూతపుత్రుఁ । బెనుపొంద దగ్గఱఁ బిల్చి యిట్లనియె :
"ఎఱిఁగి యెఱిఁగియు నెఱుఁగనివాని । తెఱఁగున నున్నాఁడు తెలివేమిలేక.
యమతనూజాతుని యంతరంగంబు । ప్రముదితంబై యుండ భవ్యవాక్యములఁ
దెలుపుఁడు మీ" రని తెలియంగఁ బలికి । కలయంగ దుఃఖ మగ్గలమైన నవుడు

తోడిఁబడ నాలుక తొట్రుపడంగ । గడగడ వడఁకుచుఁ గడు దాహమొనఁగ
గాంధారిపైఁ దన కాయంబుఁ జేర్చి । యంధభూవిభుఁడు మూర్ఛాక్రాంతుఁడైన,
నదియెల్లఁ గనుఁగొని యమతనూభవుఁడు । తుది మొదలెఱుఁగక దుఃఖంపఁ దొడఁగె:
"హా వంశవర్ధన! హా మేరుధీర! । హా విక్రమాటోప! యంబికాతనయ!
జగతి నయుతగజసత్త్వ విఖ్యాతిఁ । బొగడొందు ఘనుఁడవు భువనైకవీర!
భీముచందము చేసి పట్టిన యినుము । కామించి చూర్ణంబుగాఁ గౌఁగిలించి
వెలసిన సత్త్వ ప్రవిణుండ వనఘ! । నెలఁతపై మైచేర్ప నీకును దగునె!
మానమే కూడుగా మహి మించువాని । సూనుఁగాఁ గాంచిన శూరాగ్రగణ్య!"
అనియని పలుమాఱు నంకించి ధర్మ । తనయుండు దుఃఖంపఁ దరుణి గాంధారి
కన్నుల నీళులు గాఱ శోకించి । పన్నుగా యమతనూభవున కిట్లనియె:
"వినవయ్య ధర్మజ, విభవదేవేంద్ర! । ధననాథ సముదాన, ధర్మస్వరూప!
తపము చేసెదనను తలఁపున నితఁడు । విపరీతగతిఁ గూలి సుడిచియున్నాఁడు.
అనుమతి యీవయ్య!" యనుచును జాల । వనరుచు వనరుచు వలనొప్ప శీత
జలములు హస్తాంబుజమ్మునఁ బుచ్చి । పొలుపొంద నతనిమోమున విదల్చినను
మెల్లనఁ దెలివొంది మేదినీశ్వరుఁడు । ఎల్లగా ధర్మజు నిట్లని పలికె:
"వరతపంబున కేఁగవలయు నాకిపుడు; । నిరతిమై నిచ్చోట నిమిషమాత్రమును
నిలువంగఁ గొలుపదు నెమ్మనంబర్థి । అలవడ దీనికి నడ్డంబు రాక
మనమున సంతోష మగ్నుండవగుచు । ననుమతి యిమ్మని." యనిన ధర్మజుఁడు:
"ఆరగించిన మీఁద నాప (నులెల్ల) । వారక చెప్పెద వసుమతీనాథ!
వనుఁడు శీఘ్రమున నభ్యంతరంబునకు । వదలక." యనిన నవ్వసుధేశ్వరుండు
"మనుజనాయక, పెక్కుమాటలాడంగ । నేనయ నశ్వంబులే దిఁక నీయనుజ్ఞ
వడసి యంతియకాని వరఁగ నన్నంబు । కుడువంగ నొల్లనిక్కువముగా" ననుచుఁ
బలుకుచు నుండంగ భవ్యుఁడుత్తముఁడు । కలిత తపోరాశి కారుణ్యజలధి
మునిసార్వభౌముండు మునివతంసంబు । మునిలోకపూజ్యుండు మునిసన్నుతుండు
సాత్యవతేయుండు చనుదెంచుట యును, । అత్యంత భక్తితో యమతనూభవుఁడు
ఎదురేగి పదముల కెఱఁగి యర్ఘ్యాది । విదిత కృత్యంబులు వెసనొప్ప నలిపి
యాసీనుఁగాఁ జేసి యంత, ధర్మజుఁడు । నాసీనుఁడుగఁజూచి యమ్మౌని పలికె:

## వ్యాసుఁడు ధృతరాష్ట్రునివనవాసమున కనుజ్ఞ యిచ్చుట

“వైచిత్ర్య వీర్యుండు వరుసఁ దపంబు । నాచరించెదనను నభిలాషఁ జేసి
కడు దుఃఖపడుచు నీగతి నున్నవాఁడు. । విడువక నీవును వెసగ మీవార
లేగతి నర్తిల్లి రేగతి నడచి । రాగతి భూనాథు నడవికి ననుపు.
చెలిమితో నిన్నాళ్లుఁ జేసితి వీవు । వెలయ శుశ్రూష భూవిభులెల్ల మెచ్చ.
నీ పాటినృపతు లీ నిఖిలోర్విలోన । నేవు మీఱఁగఁ గలరే! ధర్మతనయ!
అలవడ నీ నామ మాత్రలోపలను । దలఁచిన సర్వపాతకహారం బనఘ!
అరయంగ ధర్మరాజనియెడి పేరు । విరివిగా నెట్టిభూవిభునకుఁ గలదు!”
అనవుడు ధర్మజుఁ డా మునిచంద్రుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :
“ఓమునివల్లభ, యోపుణ్యచరిత, । నీ మాట కడ్డంబు నే నాడ వెఱతు.
తల్లియుఁ దండ్రియు దైవంబు గురుఁడు । నెల్లగా నీవు మా కిద్ధవిజ్ఞాన!
అదిగాన నిప్పుడే ననుమతించితిని । అదనుగా.” యనిన సంయమి వర్యుఁడనియె :
“పార్థివ, పాండుభూపాలుఁ డీతని । అర్థిమైఁ జూచుచు ననుదివసమును
బెద్దగద్దియమీఁదఁ బేరోలగమున । (నొద్దిక నిలిపి భక్త్యుత్సాహ మెసఁగ)
నరయు నీతఁడు చెప్పినటువలెఁ జేసె । వరుసతో నీతని వారల నరసి
రక్షించితివి మహారాజసంబొప్ప. । అక్షయంబైనట్టి యాగంబు లెలమిఁ
జేయించితివి మహాశ్రీ విలసిల్ల. । ఏ యెడఁ జూచిన నించుకంతైనఁ
గలఁక యీతనియందుఁ గానంగ రాదు ; । ఎలమితో నడవికి నీతని ననుపు ;
(వనివడి తపమొనర్పఁగ బుద్ధివొడమె.)” । ననవుడు ధర్మజుఁ డట్లకాకనియె.
తదనంతరంబున ధర్మనందనుఁడు । వదలక ధృతరాష్ట్రవసుధీశు కనియె :
“వినవయ్య యొక్కటి వేఁడెద మిమ్ము । ఘనముగా నామాట గాదనవలదు.
కృతమతితో నారగించిన వెనుక । నతులితంబుగ మీకునట నెద్దితోఁచె
నది సేయుదురుగాక” యనిన భూవిభుఁడు । నదమలాభ్యంతర సదనంబునకును
గాంధారితోఁ గూడఁ గదలి వే పోయి । బంధురంబుగ నన్నపానాదులెల్ల
విదితంబుగాఁ దీర్చ, విదురసంజయులు । అదనుగా నంతఁ గృతాహారులైరి.
తదనంతరంబునఁ దగ నంధనృపతి । విదుర సంజయులును వెన యుయుత్సుండు
వరుస ధర్మజ భీమ వాసవి యమలు । విరివిగాఁ దను బరివేష్టించి కొలువఁ
గ్రమముతో నుండి యేకాంతంబునకును । యమసూతిఁ గొనిపోయి యర్థి నిట్లనియె :

### ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజనీతివిశేషంబులఁ దెలుపుట

“పాలుపొంద రాజ్యంబు పూజ్యంబుగాఁగఁ । గలితాత్మ, నడపుట కడుదుష్కరంబు.
కావునఁ జెప్పెదఁ గడఁక దీపించి । నీవు తప్పక వినునృప సార్వభౌమ !
పృథివి విద్యలయందుఁ బెద్దలైనట్టి । బుధుల నుపాసింపు ; పోషితార్థములఁ
బ్రీతులుగాఁ జేయు ; పెంపుతో వారు । నీతులు చెప్పిన నెఱయంగ వినుము.
నరనాథ, యాప్తజనంబులభంగు । లరయంగ నేర్పరులగువారిఁ బనుపు ;
పురరక్షణము దృఢంబుగఁ జేయుమెపుడు ; । వరుసతో నమ్మిన వారిని నిద్ర
మొదలగు వేళ నిమ్ములఁ గావఁబనుపు. । పదపడి నీమీఁదఁ బక్షంబు గలుగు
నాప్తవృద్ధులఁ బెట్టు మంతఃపురమున. । గుప్తంబుగా మంత్రికుంజరుల్ నీవు
సకలకార్యములు విచారముల్ సేయు ; । ప్రకటించి యేకాంతభాషివి గమ్మ.
వ్యవహారముల శుచులైనట్టి బుధులఁ । దవిలి తోడుగఁ గొను దండించునెడల.
ధరణిలో వారల తప్పుల కొలఁదు । లరసి దండింపుమీ యవనీశచంద్ర !
ఇలలోన నెంతయు ‘నెద్దీన ననినఁ । గలవడి కొందిని గట్టింపు’ మనకు.
ఆయంబు వ్రయమును ననుదివసంబు । పాయక వినుము వైభవవృత్తి వెలయ.
ఎలమి దీపింప నీయిష్టదైవంబు । వలెఁ జూడు బ్రహ్మను వసుమతిమీఁద.
అతిథులఁ బెద్దల నార్యుల మునుల । క్షితిపులు మెచ్చఁ బూజింపు మేప్రొద్దు.
ధర్మంబు మదిలోనఁ దలఁపుచు నుండు ; । నిర్మలకీర్తులు నెగడింపు ముర్విఁ.
మాఁపటి వేళల మతి వీరభటుల । కేవుమైఁ గొలువిమ్ము హిమధామవంశ !
ఘనముగా రాజ్య విఘాతంబు సేయు । జనముల నెఱిఁగినఁ జంపింపు పట్టి.
గారవంబున మేలు గావించినట్టి । వారిని మన్నింపు ; వడి గలయట్టి
వారిని గొలువులో వర్ణింపుచుండు ; । వారక రాత్రుల వనితలఁ బొందు ;
మొదల భక్తిస్నేహములు గలయట్టి । విదిత విక్రము సైన్యవిభునిఁగాఁ జేయు.
తరమిడి యాత్మ రంధ్రము లించుకైన । నొరులకు నెఱుఁగరాకుండంగఁ జేయు.
అన్యరంధ్రంబుల నారసి కనుము ; । అన్యాయ మెన్నఁడు నవనిఁ జేయకుము.
చేరువ నృపులతోఁ జెలఁగి వైరంబు । ఏరీతిఁ గలుగునో యేమరకుండు.
వారి యావలనున్న వారు నీ మిత్రు । లారూఢ విస్ఫూర్తి నాదు రెంతయును.
తన కన్న బలునితోఁ దగ సంధి సేయు । వనివడి దైవత బలము మనుష్య
బలము కొంచెంబైన పార్థివుతోడఁ । జెలరేఁగి వైరంబు సేయంగవలయు.

బలమును దైవత బలమును గలుగు । నిలఁ దితో వైర మెన్నఁడు వలదు.
పరులను గెలిచి నిర్భయముగా సాధు । నరవతులను గాచి సయవృత్తి మెలఁగు;
వలనొప్పఁ గృపపెంపు వదలక ప్రజలఁ । దలిదండ్రులును బోలెఁ దగ రక్షసేయు;
ధర్మమార్గంబున ధరణిఁ బాలింపు; । నిర్మలమతి రాజనీతి యేమఱకు;
అనువొప్పఁ జేయు నిత్యము వృద్ధసేవ." । అనవుడు ధర్మజుఁ డంబికా తనయుఁ
గనుఁగొని (యిట్లనుః "కరుణావిధేయ, । ధరణిపై) నాపగాతనయుండు లేఁడు;
పరికింపఁ గలశసంభవుఁడును లేఁడు; । హరి(యును దనపురి కరిగె; వత్సలత
నెఱపి హితంబును నీవు దక్కఁగఁ) । జేరి యెంతేనియుఁ జెప్పెడి వారు
లేరెవ్వరును గదు లెన్నగా నాకు. । కూ(రిమి దైవాఱ గురువర్య, నీవు
చేరి పంచిన విధిఁ జేయుచుండెదను." । ... ... ... ... ...
అనవుడు నాతఁడు హర్షంబు నొంది) । "తనువున శ్రమమొందె ధర్మజ, పొమ్ము"
అనివల్కి పేర్వేర వందఱ ననిచి, । చ(నియె నభ్యంతర సదనంబునకును.
పదపడి యంత భూవల్లభుఁ జేరి । ముదముతో "నడవికిఁ బోయెదో! లేదో!
యెనయంగ నాలస్య మేల చేసెదవు!" । అనిన గాంధారితో) నాంబికేయుండు
"జనకు ననుజ్ఞయు నరవితో ధర్మ. । తనయుని ప్రీతి యెంతయుఁ బొందినాఁడ.
ఉడుగక బాంధవ) యుతముగా నిపుడు । తడయంగ నేటికి తరలాయతాక్షి!
కల్ల జూదంబాడి కపటాత్ములైన । (బల్లిదుల్ నీదగుపట్టులు పాప-
భాజనులైరి; తవంబున వారి । నోజతో సుగతుల నొందఁ జేసెదను.)
కొన్ని పుణ్యక్రియల్ కోరి యొనర్చి । నన్నుతిఁ బౌరుల సమ్మతి వడసి,
పోవంగ వలయుఁ (దపోవనంబునకు. । వావిరి మనమంత వనజాయతాక్షి!"
యనుచు భూపాలుఁ డా) యతివ నూరార్చి । వనివడి యమతనూభవుని రావించి
పౌర జనంబుల బంధు వర్గముల । వారక (రప్పింపవలె నన్న నతఁడు
బంధు మిత్రులఁ బురప్రజల రావింప । నంధభూపతి వారి కంత) నిట్లనియె:

ధృతరాష్ట్రుఁడు వనవాసమునకుఁ బురజనుల యనుజ్ఞ వడయుట

"పౌర జనములార, బాంధవులార, । కారుణ్యపరులార, ఘనపుణ్యులార,
నెగడంగ మీర లనేకకాలంబు । తగు మిత్రులగుచును ధరఁ బరఁగితిరి.
పరఁగ వృద్ధునకుఁ దపశ్చరణంబు । కరమొప్పు నర్హంబుగావున మీర

లరసి యనుజ్ఞ యిం"డని పల్కుటయును । దొరఁగొని వారలు దుఃఖంబు నొంది
చంద్రవంశాధీశ, సత్యస్వరూప, । సాంద్రకీర్తి విహార, శత్రుసంహార,
నినుబాసి నిముసంబు నిలువంగలేము ; । వెనుకొని యేము నీవెంట వచ్చెదము."
అనవుడు వారల నతికృపాదృష్టిఁ । గనుఁగొని యంధభూకాంతుఁడి ట్లనియె :
"మీరు చింతలనేల మేదినిఁదొల్లి । యారూఢిఁ బ్రజ ముదమందుచునుండఁ
బాలించె శంతనుపార్థివేశ్వరుఁడు ; । పోలి విచిత్రవీర్యుండును నేలె ;
వదవడి పాండునృపాలుండు నేలె ; । అదనుగా ధర్మాత్ముఁడైన ధర్మజుని
మెఱయు చరిత్రంబు మీరలందఱును । ఎఱిఁగి యుండుదు రింక నిది వింతగాదు.
తొలుత దంభంబున దుర్యోధనుండు । కులమెల్ల వరుసఁ జేకొని త్రుంచివైచె.
(అవి యెల్ల మీ మనంబందుఁ దలంప । కవిరళమతి మాకు ననుమతి యిండు."
అనిపల్కి పాండవేయాగ్రణిఁ జూపి । "యెనయంగ వినుఁడితఁ డేమియు నెఱుఁగఁ ;
డనయంబు బుద్ధి మీరందఱుఁ జెప్పి । కొనకొన్న ప్రీతితోఁ గూడుకరండు."
అన విని యుత్తరీయంబులు వదన । వినిహితంబులు చేసి వెస నేడ్చిరంత.
ఆరీతి దుఃఖంచి యా పౌరులెల్ల । నారయ శాకల్యుఁడను విప్రవరున
కెఱిఁగించి "రాజుతో నీక్రమంబునను । ఎఱిగింపు" మనవుడు నృపుఁజేరఁబోయి

### శాకల్యుఁడు ధృతరాష్ట్రునితోఁ బౌరజనసమ్మతి నెఱిఁగించుట

"భరతవంశాధీశ, పౌరులెంతయును । ఉరువడి మీతోడ నొగిఁ జెప్పుమనిన
పరిభాషణంబు తేర్పడ వినవయ్య ! । వరబుద్ధితోడ మీవంశంబునందు
రమణఁ బుట్టినయట్టి రాజులలోనఁ । గ్రమ మొప్ప నొప్పని గానమెన్నఁడును.
దయతోడఁ గన్నట్టి తనయులరీతి । జయమున రక్షించి సంతోషమిచ్చి
మెలిపిరి రిన్నాళ్లు మేదిని లోన. । చెలువొప్ప రారాజు చేసినకీడు
మఱి యొకటియు లేదు మమ్ముమన్నించె. । అఱలేక తొల్లింటి యవనీశు లట్ల
ధరణిఁ బాలించి సంతసముఁ బొందించె. । సరవి దుత భీష్మసైంధవ ద్రోణ
వనజాప్తతనయాది వరశౌర్యనిధులు । పెనుపొందఁ దమ విధిప్రేరణంబునను
బోరిరి దివిజు లద్భుతమంది చూడ. । వారలవలన భూవర, సంక్షయంబు
వాటిల్లె ; నాకురుపతిచేత నట్లు । పోటు వాటిల్లెనే ? భూపాలచంద్ర !
చిరమతిఁ దాము చేసినయట్టివెల్లఁ । బరఁగఁగా ననుభవింపక పోవవశమా !

అదిగాన శౌర్యవిఖ్యాతి దీపింపఁ । గదనంబులోనఁ దక్కక పోరి నీదు
తనయులు నృపులు నత్యంత సౌఖ్యముల । ఘనపుణ్యవంతులు గాంచిన యట్టి
నాకపదంబు నున్నతవృత్తిఁ బడసి । చేకొని యున్నారు సిద్ధమీపలుకు ;
విదితంబుగాఁ బాండవేయు లుత్తములు ; । మదవిలోభిత్వముల్ మందునకైన
వారియందున లేవు వసుధాతలేశ ! । నేరుపుతోడ మన్నింపంగఁ గలరు.
కరము మెప్పు మదిలోని కలఁకపోవిడిచి । యిరవుగా వర్తింపు ; మిప్పుడు కానలకుఁ
బోవంగవలె నన్నఁ బొందుగాఁ జనుము । వారిరి." వని పల్క వసుధేశ్వరుండు.
ప్రీతుఁడై వారలఁ జేర్పర నవిచి । నాతియుఁ దానును నగరికిఁ బోయి
యరయ మజ్జన భోజనాది కృత్యముల । గరిమతో నడపి, తక్కక మఱునాఁడు
విదురుని రావించి "వినవయ్య, విదుర, । కదనరంగంబున ఖండింపఁబడిన
వారికిఁ బుణ్యముల్ వయసతోఁ గలుగఁ । జేరి శ్రాద్ధంబులు చేయంగఁ దలఁచి
గొనకొన్న ప్రీతితోఁ గొన్నిదినములు । మనమారఁ బయనంబు మానితి ; నీవు
నలవడ నిట్టి వృత్తాంత మంతయును । సొలవక ధర్మరాజున కెఱిఁగింపు"
అనవుడు విదుఁడు ఘాయనుసూతిఁ గాంచి । ఘనతర సంతోష కలితుఁడై పలికె :
"వినవయ్య ధర్మజ, విశదంబు గాఁగ । గొనకొని మీతండ్రి కురుకుమారులకు
మఱియు శాంతనవాది మనుజేశులకును । దఱుఁగ నిఖిల బాంధవవర్యులకును
వృద్ధక్రమంబున హృదయ సంశుద్ధి । శ్రాద్ధముల్ చేయు విచారముల్ తోఁచి
మనకెం గార్తికపౌర్ణమాసియుఁ దాఁక । ననదృశ మతితోన నదిగాన నీకు
నిట్టి వృత్తాంతంబు నెఱిఁగింపుమనియె । నెట్టనంబుగ." నన్న నృపుఁ డియ్యకొనియె ;
ఎలమితో నర్జునుఁ డిది యర్హమనియె. । చెలఁగి భీముఁడు గమర్చిన మోముతోడ
వలదక విదురుని వదనంబుచూచి । పెదవులు నదరంగ బెడిదంపుమాట
లాడఁ బూనిన, సురేంద్రాత్మసంభవుఁడు । "ఆడంగఁ దగవుగా దకట ! భూవిభుఁడు
ఘనముగా భీష్మ ముఖ్యజ్ఞాతులకును । మనమార శ్రాద్ధకర్మం బాచరింపఁ
దలఁచి యర్థించినఁ దగినయర్థంబు । వెలమి దీపింపఁగా నీయకయున్న
ధర్మంబు గీర్తి విధ్వంసంబులగును ; । పేర్మి దీపింప నా పృథ్వీతలేశు
వే విధంబులఁ దన్పి వెడలింపవలయు । వారిరి నిల్లాడవల." దన్నమాట
విని ధర్మతనయుండు విజయునిఁ బొగడె. । అనిల తనూజుండు నర్జునుతోడ
"అనఘాత్మ, మును చేసినట్టివే చాలు. । పనివడి భీష్మాది బంధులకెల్ల

వగవక శ్రాద్ధముల్ వలసిన మనము । తగవె సేయుంగ ? నీతఁడు దుష్టుఁడేల ?
మఱవంగ వచ్చునే మనల నీతండు । వఱచిన బన్నముల్ ? బాహ్లీకరాజ
సోమదత్తాదు లేక్షోణికిఁ * జనిరి ? । తామరసాప్తుని తనయున కిద్ది
చేయంగవలసినఁ జేసెడిఁగుంతి. । పాయక పాంచాలిఁ బఱచినపాట్లు
అడవికి ధర్మజుఁ డరిగినవిధము । నడరి నాఁడెటుపోయె నటఁ దండ్రివైన.
విదురుఁ డెఱుంగఁడే వెయ్యాడనేల ? । మది వారి." ననిన ధర్మజుఁ డదలించి
మాతండ్రి పుణ్యకర్మములు బంధులకుఁ । బ్రీతిఁ జేసెదనని పెంపు గైకొనియె.
నాయింటి ధనమును నరుని ధనంబు । నాయెడఁ గాని సేయుమనుము నీవర్థి.
వలను మీఱఁగ వనవాస ప్రయాస । ముల మరుత్తనయుండు మొగిఁ బల్కినట్టి
పలుకులఁ గోపంబు పట్టకు మనుము. । అలవడ నితఁ డేమియనిన నేమగును ?
పరమదేవత మాకుఁ బార్థివేశ్వరుఁడు ; । ధరణిదేవతలకుఁ దగినట్టి యాళ్ళ
నొనసిన భక్తితో నిమ్మను పొమ్ము" । అనవుండు విదురుండు నట్లకాకనుచుఁ
జని యవ్విధంబెల్ల జననాథునకును । వినిపింప నంతయు విని ప్రీతిఁబొంది
మనుజనాథుఁడు పౌర్ణమాసిని సకల । ఘనుల భూదేవులఁ గడఁక రప్పించి
యత్తఱి ధర్మజుఁ డధిక ధనంబు । పుత్త్రేర శంతనుపుత్త్రుకు సోమ
దత్తునకును దన తనయ వర్యులకు । వృత్తిమీఱఁగ శ్రాద్ధవిధి నొనరించి
సకల భూషణములు సకలాంబరములు । సకల రత్నంబులు సకలధేనువులు
దగిన గ్రామంబులు ధవళాశ్వములును । జగతిదేవతలకు సంప్రీతి నిచ్చి
కదలక యంతట గాంధారరాజు । మొదలైనవారి కిమ్ముల శ్రాద్ధవిధులు
నొనరించె నపుడు విధ్యుక్తమార్గమున. । అనువొప్ప ధృతరాష్ట్రుఁ డారీతిఁ జేసి

## ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుఁడై వనమునకుఁ బోవుట

ప్రేమఁ బాద్యమినాఁడు ఋత్విజుల్ దాను । నామెయి నిష్టియు నవ్వాడు చేసి
పాండవేయులను సద్బంధు మిత్రులను । నొండొండ రావించి యుత్సాహలీల
గాంధారియును దాను ఘనవల్కలములు । సంధించి ధరియించి సరసరీతులను
దొరఁకొని సద్గంధ ధూప దీపములఁ । బరిమళ మిళిత సత్ప్రసవమంజరుల
నక్షతంబులను గృహాంబుఁ బూజించి । యక్షీణగతి సొమ్ములవి విసర్జించి

* 'ఆ సమయమున' అనుట అధ్యాహార్యము.

రెయునరంగ నగ్నుల నుపకరణముల । ననువొంద ధరియించి యాజకుల్ నడవఁ,
గుంతియు మొదలైన కువలయనేత్ర । లంతంత నంతాపమందుచుఁ జనఁగ,
నతులవేగంబున నంధభూవిభుఁడు । యతివేషధారియై యడవికిఁ జనియె.
అప్పుడు ధర్మజుఁ డాకురుభర్తఁ । దప్పక చూచి గద్గదకంఠుఁడగుచు
"హా కౌరవేశ్వర! హా సార్వభౌమ! । హా కరుణాకార! హా మేరుధీర!
హా మహిమోజ్జ్వల! యరిగెదె!" యనుచు । భూమిపైఁ బడి యేడ్చె భూలోకనాథ!
నరుఁడంతలోన భూనాయకు నెత్తి । తోరఁగు కన్నీరును దుడిచె నెంతయును.
తడయక కుంతి గాంధారి హస్తంబు । పుడమి నిజస్కంధమున నిడి యేడ్చె.
వరగఁ బాంచాలి సుభద్రాదులైన । తరుణులు నేడ్చిరి ధరణీతలేశ!
ఎనయ నా దురవస్థ యేమిచెప్పెడిది? । తనరఁ జూడమునాఁడు ధర్మాత్మజాదు
లేరీతి నేఁగిన నెనఁగె శోకంబు । ఆరీతిఁజూడ్కికి నతిఘోరమయ్యె.
తలకొని పట్టణద్వారంబు వెడలి । నిలువక పౌరుల నిలువంగఁ బనిచి
చనుచుండ విదురుండు జననాథుతోడ । వనవాసమునఁ గూడివర్తింప నడచె;
వినుము నంజయుఁడు నవ్విధమువాఁడయ్యె । ఒనరఁ గృపాచార్యుఁ డొగి యుయుత్సుండు
నామాటలాడిన, నాంబికేయుండు । ఆమాట గాదని యమనూతిఁ జూపి
కృతమతితో నప్పగించి కోడండ్రఁ । జతురుఁడై మరలించి చనుచుండ, ధర్మ
తనయుఁ డాకుంతిని దప్పకచూచి । "వినవమ్మ మాయయ్య విపినభూములకుఁ

ధర్మజుఁడు కుంతిని వనమునకుఁ బోవలదని ప్రార్థించుట

దపము చేసెదనని తప్పక వాఁడె । యిపుడె పోయెదుఁ గడు నేవుదీపించి.
ఏనును బోయెద నీతనిఁ గొలిచి । మానుగా నీవేఁగు మఱి పురంబునకు.
వాయుతనూజుండు వాసవికవలు । పాయక సేవింప భాగ్యభోగముల
విలసిల్లు." మనిన నవ్విధువంశతిలకు । ... ... ... ... ...
ధర్మమె రూపుగాఁ దనరినయట్టి । ధర్మరాజును జూచి తగఁ గుంతిపలికె :
"వినవయ్యధర్మజ, వివరంబుగాఁగ । నెనసిన ప్రీతితో నే వచ్చుటకును
అనుమతి సేయఁ డీ యవనివల్లభుఁడు. । అనఘాత్మ, యదిగాన నాపని విడువు.
గాంధారి మాయత్త కడఁక దీపింప ; । నంధభూనాయకుఁ దర్శిలిమామ ;
తగ వీరిఁ గొలిచి యే దండకాటవుల । నెగడి వర్తించెద నిజతపోనియతి."

అనిన ధర్మతనూజుఁ డంబ నీక్షించి । "తనయు లేవురు గల్గఁదగునమ్మ నీకు!
నిది యేమి తలఁచితి! వీవేళ నాదు । హృదయంబు మిక్కిలి నెరియుచున్నదియు.
చెలిమితోఁ గోడండ్రు సేవలుసేయఁ । దలకొన్న భక్తితో దానధర్మములఁ
గర మొప్పఁగాఁ బుణ్యకథలను బ్రొద్దు । జరుపుచు మమ్ము నిచ్చలు నరయుచును
బొఁగడొందు." మనిన నావుత్రునిఁజూచి । తగవొప్పఁగాఁగుంతి తద్దయుఁ బలికె:
"ధర్మతనూజాత, తపనప్రతాప, । ధర్మస్వరూప, యెంతయు వినుమనఘ!
చిత్తంబు మిక్కిలి క్షితిపతిఁ గొలువ । హత్తియున్నది నాకు నతిభక్తితోడ;
వదలక యదిగాక వార్ధక్యమయ్యె; । విదితంబుగాఁ దపోవృత్తి గైకొందు;
నీవేమి యనకుము; నెఱి సహదేవు । భావించి మన్నింపు ప్రతి దివసమును.
దినకరసుతునకు దివ్యలోకంబు । ఘనతరవిస్ఫూర్తిఁ గలుగునట్లుగను
మసలక దానధర్మములను జేయు. । అసమువిందపక కర్ణు నాహవశూరు
నెనసి డంభంబున నేన చంపితిని. । పనివడి యట్టి పాపము తొలంగుటకుఁ
గొన్ని పుణ్యంబులు గొనకొని సేయు. । మన్నింపు మాతని మగువల నర్థి."
ననిచెప్పి "మరలుము యమతనూజాత! । మనమున నీ కనుమానంబు వలదు."
అని యని తలవాంచి యాతని మొగము । గనుఁగొన కింతయుఁ గదలుట చూచి
యట వాయుతనయుండు నంబకిట్లనియె: । "ఇటు చనఁ దగునమ్మ! యింటిలోపలను
సకలదానంబులు సకలధర్మములు । సకలపుణ్యంబులు సరవితోఁజేసి
యుండవే! యమడల నూరార్చి యిపుడు. । నిండుదుఃఖమునఁ గన్నీరొల్క ధాత్రిఁ
బొరలుచు నున్నారు పొందుగా వీరి । నిరవొప్ప నూరార్పు మిప్పుడు ప్రీతి."
అనునంత ద్రౌపది యా సుభద్రయును । ఘనతర శోకాంధకారస్తలై యున్న,
నొనరంగఁ దెగనాడకున్నఁబోరనుచు । వనజాక్షి యిట్లను వారు వినంగ:
"ద్యూతంబునందును దూలపోవుటయు, । నేతెఱంగులనైన నిడుమలఁ బడుట,
యేను సహింపక యెల్లభూజనులు । మానుగా నవ్వ నమ్మహిఁ గౌరవులను
గలసివర్తింపుచుఁ గడపట నిట్లు । తలకొని వీరల దైన్యంబు చూడ
వలసె; నావేళ నీవర తేజమెల్ల । నెలకొని నీత్రైన నెఱిఁ బాండుకులము
పనివడి చెప్పఁ జూవఁగ లేకపోదె! । యని యిట్లు పల్కుతి; ననిలనూనుండు
నత్తిప్పెటైను దాని నేమనఁ గలదు! । తత్తరంబున." నన్న ధర్మనందనుఁడు
ననిలతనూజుండు నటసిగ్గువడిరి. । మునుకొని కుంతి భీమునిచిత్త మింక

నట్టగునోయని యొలమితో వాని। నెట్టన చూచి మన్నించి యిట్లనియె:
" పవనతనూజాత, భాగ్యప్రతాప! । వివరించి వినుము నమ్మితినేను; మదినిఁ
గలఁక లేశములేదు; ఘనవైభవమున । వెలసి దానంబులు వివిధపుణ్యములుఁ
జేసితి; యాగముల్ సేయఁ జూచితిని. । ఈనముయంబున సేవనంబునకుఁ
బోవుట యుక్తంబు; భూతలేశునకు । వారిరి నాతనివనితకు సేవ
సేయుచు నెంతయుఁ జిత్తంబులోనఁ । బాయక శ్రీహరిఁ బదిలంబుచేసి
రమణ విధ్యుక్తమార్గమునఁ దపంబు । క్రమమునఁ గావింతుఁ గడఁక దీపించి."
అనియిట్లు పలుకంగ నమ్మాటలెల్ల । విని యాంబికేయుండు విదుర సంజయులఁ
బుత్తేర, వారలు పొదుపుగాఁగుంతి । నత్తఱిఁ గనుఁగొని యర్థి నిట్లనిరి:
"వినవమ్మ యోకుంతి, వివరంబుగాఁగ । మనుజనాథుఁడిదె మమ్ముఁబుత్తెంచె.
నీవు రావలవదు నెమ్మిమై నిపుడు; । వారిఁ దనయులవద్దనే యుండు."
అని యొడఁబఱచిన నమ్మాటలెల్ల । వినక యెంతయుఁ దపోవృత్తికై మనసు
పదిలంబుగాఁ జేసి భావనస్ఫూర్తి । విదితమై పుత్త్రుల వెసనిల్పఁడనుచు
మరలుచోఁ, బోవక మఱిపాండుసుతులు । ధరణీశ్వరునకు గాంధారికిఁ గుంతి
కిని భక్తితోఁ బ్రదక్షిణమొనరించి । ఘనముగా నెంతయుఁ గరములు మొగిచి
తనరు కన్నుల నశ్రుధార లొల్కంగ । వనితలుం దారును వారణపురికిఁ
దిరముగాఁ బోవుచుఁ దిరిగి చూచుచును, । అరిగిరో జనమేజయావనీనాథ!
అటఁ గురుభూపాలుఁ డతివలుఁ దాను । దటుకున విదుర సూతజాలు ఋత్విజులు
గరమరుదేగ గంగాతీరమునకు । నరయంగఁ బోయి యోగ్యప్రదేశమున
విడిసి యచ్చటనున్న వేదవేత్తలకు । నడరిన వేడుక నర్చన లిచ్చి,
చెలఁగి హోమము నమంచితగతిఁ జేసి, । వెలయంగ భోజనవిధి యొనరించి,
వినయంబు తోడుత విదుర సంజయులు । (గొనకొని దర్భలఁ గూర్చినయట్టి)
యా శయ్యచేరువ నంత నింతటను । వాసిగా వసియించి వడి వేగుటయును
నరవిమై మఱునాఁడు జనపతి యుచిత । కరణముల్ దీర్చి గంగానది దాఁటి
పోనఁగఁ గురుక్షేత్రమున కర్థిఁబోయి । మనలక పుణ్యాశ్రమముచేరి యందు
నెలకొన్నతరువుల నీడ నెంతయును । లలితమా సికతాతలంబున నుండె.

## ధృతరాష్ట్రుఁడు శతయూపు నాశ్రమంబున వసించుట

సలినంత శతయూప నామధేయుండు । వలనైన కేకయ వంశవర్ధనుఁడు
తూలని ఘనతపోధుర్యుండు కీర్తి । శాలియునైన రాజర్షి వర్యుండు
విని వచ్చి యా కురువిభునిఁ దోడ్కొనుచుఁ । జని నిజాశ్రమమున సద్భక్తి నునిచి
వినుతించి యర్ఘ్యాది విధులొనరించి । జననాథ, వినవయ్య సత్యసంధుఁడవు ;
ఇన తేజుఁడవు నీకు నెవ్వరు సవతు ? । ... ... ... ... ...
ఇచ్చోట వసియించి యేవు దీపించి । సచ్చరిత్రంబును సంయమీశ్వరులు
కొనియాడి నియతివై ఘోరతపంబు । గొనకొని సేయుము కురుకులశ్రేష్ఠ !"
అనవుడు సంతసమంది యవ్విభుఁడు । జననుతంబుగ నాకు సాలలు గట్టి
తరుణి కుంతియును గాంధారియుఁ దాను । వరతపోనియతివై వర్తింపుచుండె.
విదుర సంజయులును విశదంబుగాఁగ । విదిత తపంబున విహరించిరంత.
నిరతివై యాజకుల్ నిత్యకృత్యములు । వరుసఁ జేయుచు మునివర్గము పొగడ
విలసిల్లుచుండిరి విపులాధినాథ ! । పొలుపొందఁ దత్కాలమున నొక్కనాఁడు

## నారదాది మహర్షులు ధృతరాష్ట్రుఁ జూడవచ్చుట

ఘనతరమూర్తి నాకౌరవభర్తఁ । గనుఁగొనుతలఁపున గార్గేయ రేభ
శాండిల్య రోమశ శౌనక హారిత । కౌండిన్య నారద కణ్వ మౌద్గల్య
మైత్రేయ పులహ ధౌమ్య భరత కాశి । కాత్రి జైమిని రోమహర్షణముఖ్య
వివిధ మునీంద్రులు వెస నేఁగుదేర । నవిరళ భక్తితో నంబికాసూతి
యెదురేగి పదముల కెఱఁగి యర్ఘ్యాదు । లదను దప్పక యిచ్చి హర్షంబు నొంది
" యేను ధన్యుఁడనైతి నిందఱు మీరు । పూని వచ్చుటఁ జేసి పుణ్యాత్ములార ! "
అని యిట్లు పలికెడు నంబికాతనయుఁ । గని నారదుఁడు ప్రీతిఁ గరుణించి యనియె :
" తొల్లి సహస్రచిత్యుండను రాజు । బల్లిదుఁడై తన పట్టివై పరఁగు
శతచిత్యునందు రాజ్యంబిడి నియతిఁ । జితుకుఁడై యీవనస్థలమున నిలిచి
వలనొప్పఁగా దుశ్చ్యవన సఖత్వంబు । నలలితంబుగఁగాంచె ; శైలాలయుండు
పురుకుత్సుఁడును దపంబున నింద్రపదవి । సరవితోఁ గనిరి ; రాజర్షిసత్తముల

నీయెడఁ బొడఁగంటి నిచటఁ గాంచితిని । ఈ యెడ మలఁగిరి యిది పుణ్యభూమి.
అదిగాన నీకు నియ్యెడ నుండఁగలిగె. । విదిత పుణ్యుండవు విధువంశతిలక !
ఆనృపులట్ల నీ వవ్యయపదవిఁ । బూని వర్తింతువు పొలఁతితోఁ గూడి.
చెలఁగి భక్తిని నీకు శిశ్రూషచేసి । వెలసిన కుంతియు విభుఁ జేరఁబోవు.
పాండుభూపతి సురపతి సమీపమున । నుండి నిన్నెతలంచు నుర్వీశతిలక !
ధర్మము మూర్తియై తనరినయట్టి । ధర్మతనూజుని తనువున విదురుఁ
డలరి ప్రవేశించు ; నాసంజయుండు । కలయంగ సురలోకగతిని వెలుంగు.”
అని యిట్లు నారదుఁడాడు వాక్యములు । విని ధృతరాష్ట్రుండు వేడుక పొందె.
శతయూపుఁడంత నాసంయమిఁ జూచి । వితత వాగ్వైఖరి వెలయ నిట్లనియె :
“నారద మునినాథ, నా విన్నపంబు । చేరిక నాలించి చెలువుదీపించి
వినిపింపవలయు నీవిభుఁడు సద్గతికి । నెనయఁ బోవఁగ నిశ్చయించితి విపుడు.
సవరించి తద్విశేషము వినవలయు । వివరింపు.” మనుటయు వివరింపఁ దొడఁగె :
“వినవయ్య శతయూప, విదితప్రతాప, । ఘన తపోవైభవ, కారుణ్యనిలయ,
ఎనయంగ నేను మహేంద్రుని కడకుఁ । బనివడి పోయి సంభాషణసేయ
నాసభ నీ కౌరవాధీశు వార్త । వాసవుఁ డెఱిఁగించె ; వరతపం బితఁడు
చెలిమితో మూఁడేండ్లు చేసి యవ్వెనుక । వెలయు శరీరంబు విడిచి, విత్తేశుఁ
గలిసి వర్తించు నిక్కంబుగా ననుచు । వలనొప్పఁ బాండు భూవరునకుఁ జెప్పె.”
అనవిని ధృతరాష్ట్రుఁ డధిక సంతోష । మునఁ బొందెఁ; బోయిరి మునులు మోదించి.
అని యిట్లు జనమేజయ క్షితీశునకు । మునిచెప్ప నని చెప్ప మోదించి మునులు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
గజరాజ సంరక్ష, కంజదళాక్ష, । అజగరాధిపతల్ప, యానందనిత్య,
ఆదినారాయణ, హరనుత చరిత, । వేదగోచర, యీశ, విశ్వప్రమోద,
ఘనమాని హృద్గేహ కలితసందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ !
భక్తవత్సల, జగత్పావనమూర్తి, । ముక్తిప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
రచితమైనట్టి యాశ్రమవాసమందు । నుచితమై యాశ్వాస మొక్కటియయ్యె.

# ద్వితీయాశ్వాసము



శ్రీ ధారుణీశ, పూరితకృపావేశ, । సాధిత దానవసంఘ, ముకుంద,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగా :
ఆరీతి ధృతరాష్ట్రుఁ డతులితస్ఫూర్తి । ధీరుఁడై భాగీరథీతీర భూమి
శతయూపు నాశ్రమస్థలమున నిలిచి ।, యతుల తపోవృత్తి నతిశయిల్లంగ
దండి మీఱఁగ నంతఁ దత్కాలమునను । బాండుసూనులు తల్లిఁ బలుమాఱు దలఁచి
యంధభూనాథుని నాసూతపుత్రు । గాంధారి విదురునిఁ గర మువ్వఁ దలఁచి
చింతించి చింతించి "చెల్లఁబో యకట ! । కుంతి యేరీతిని గుందుచున్నదియొ !
'కన్నులఁ గానని కవతి' భూవిభుఁడు । ఎన్నాళ్లు దుఃఖంబు నీదంగఁ గలఁడొ !
గాంధారి సర్వలక్షణ కోమలాంగి । సంధించి యేరీతి సంచరించెడినొ !
విదుర సంజయులును వెనఁ గూరదినుచుఁ । బదపడి యెట్లు తపంబు చేసెదరొ !
ధరణిపై సకల బాంధవులను జంపి । యురవడి నొంటిమై నుండంగవలసె."

### పాండవులు బంధుసహితముగా ధృతరాష్ట్రునిఁ జూడఁబోవుట

అని యిట్లు పాండవు లందంద వగచి । పనివడి యంధభూపతిఁ జూడఁగోరి
పడవాళ్ళఁ బిలిపించి "బండ్లనేకములు । తడయక సేయుఁడు ; దగు భక్ష్యభోజ్య
ములు గొనిరాఁగఁ బంపుఁడు ; మంత్రివరుల । బలముగాఁ జతురంగబలములఁ దెండు.
చెచ్చెర రాజుఁ జూచెదమను వేడ్క । వచ్చెడువారల వరుసతో నరయుఁ ;
డెల్లిపయనమని యొలమిఁ జాటింపుఁ । డెల్లవారలు విన నింపుతో." ననిన,
అఱలేక వారలు నట్లకావింప, । మఱునాఁడు ప్రేమ ధర్మజుఁడు యుయుత్సు
నాకృపాచార్యుని హస్తినాపురికిఁ । జేకొని రక్షగాఁ జేసి యెంతయును
బనివడి ద్రౌపదీ ప్రముఖ భామినులు । తనవెంట రాఁగ రథంబెక్కి కవలి
వివిధ వాహనములు వేడుకనెక్క । ప్రవిమల స్ఫూర్తితోఁ బౌరు లేతేరఁ
గృతకృత్యుఁ డేఁగి భాగీరథి దాఁటి । క్షితి నాయకుఁడు కురుక్షేత్రంబు కరిగి
శతయూపు నాశ్రమస్థలము చేరువను । ధృతరాష్ట్రుఁ డుండుట తెలియంగ నెఱిఁగి

తన సహోదరులును దాను ధర్మజుఁడు । కనకరథంబులు గ్రక్కున డిగ్గి
యతనిఁ గనుంగొని యధిక శోకమున । నాతతభక్తి సాష్టాంగప్రణామ
మొనరించి యాతఁడు నొగిఁ గౌఁగిలించి । ఘనముగా మన్నింప, గాంధారరాజ
తనయకుఁ గుంతికెంతయుఁ బ్రణమిల్లి । గొనకొని యున్నంతఁ, గుసుమకోమలులు
ద్రౌపదీ ప్రముఖులు తద్దయుభక్తి । ప్రాపుగా నంతటఁ బ్రణతులొనర్చి
యమునానదీస్నాన మర్థిమైఁ జేసి । క్రమమునఁ దద్వారి కలశముల్ దెచ్చి
గాంధారి కుంతుల కలశముల్ పుచ్చి । యంధరాజుకు మ్రొక్కి; రాసమయమున
నొప్పుగాఁ బాండవేయులఁ జూడఁగోరి । తప్పక వచ్చిన తాపసోత్తముల
కతి వినయంబున నంజలి చేసి । వితతమై యర్ఘ్యాదివిధులఁ బూజించి
యున్నంతలో, సంజయునిఁ జూచి మునులు । చెన్నుగా మాకును జెప్పవే వీరి?
ననవుడు సంజయుఁ డనియె వారలకు: । "కనుఁగొనుఁ డదె మీరు కనకంపుచాయ

### సంజయుఁడు పాండవులను మునులకుఁ బేర్వేరఁ జూపి చెప్పుట

గలిగి దీర్ఘములైన కన్నులతోడఁ । బలుచని మేనున బాగైనవాఁడు
రాజసూయ మహాధ్వరము చేసినట్టి । రాజధర్మమునకుఁ బ్రాపైన వాఁడు
ప్రతి దివసంబును భవ్యులైనట్టి । యతులొకలక్ష బ్రాహ్మణులొకలక్ష
భూరి కాంచనపాత్రముల రుచుల్ పుట్ట । నారగింపఁగఁ బెట్టినట్టి పుణ్యుండు
తరణితేజుఁడు చాల దయగల్గువాఁడు । అరుదుగాఁ గనుఁగొనుఁ డతఁడు ధర్మజుఁడు.
నయమొప్ప నెట్టిదనంబున మించి । భయదమహాజానుబాహులవాఁడు,
కడఁకతో ఘనవృషస్కంధుండు మిగుల । వెడఁదయురంబున విలసిల్లువాఁడు
బక హిడింబాసురప్రముఖ దానవుల । నకలంకవైఖరి నడఁచిన ఘనుఁడు
వేడుక ధర్మజు వెనుకనున్నాఁడు । ఎడపక వీక్షింపుఁడితఁడు భీముండు.
నల్లని మైచాయ నయమొప్పువాఁడు; । తెల్లగా మత్స్యయంత్రము నేసి నృపులఁ
దృణముగా గెలిచి వర్ధిల్లుశౌర్యమున । గణన మీఱినయట్టి కాలకేయాది
రాక్షసవీరుల రణములోఁ గూల్చి । యక్షయాస్త్రంబుల నమరినవాఁడు;
ఖాండవం బాహుతిగాఁ గృశానునకు । దండిమై నిచ్చి సుత్రాముని గెలిచి
యీశాను మెప్పించి యేపుదీపించి । పాశుపతాస్త్రంబు వడసిన ఘనుఁడు,
కౌరవబలముల ఖండించినతఁడు । వారక చూడుఁడు వాఁడర్జునుండు.

సొంపుతోడుత రాజసూయంబునాఁడు । ంపుమైపడ ... ... ...
... ... ... ... ... । ... బుల మహితాశ్వములను
మేదిని లెక్కకు మిక్కిలిగాఁగ । నాదటఁ దెచ్చిన య ... ... ...
... ... ... ... ... । ... ... ... లుండు వాఁడు
లీలమై లంకయేలిన విభీషణుని । చే లాలితంబుగఁ జెలఁగు ... ...
... ... ... ... ... । ... ... ... రె వాఁడు
నీలోత్పలచ్ఛాయ నెగడిన తనువు । నోలిఁ బద్మములన నొప్పు నేత్రములు
(నరయ మధ్యప్రాయ మభిరామమూర్తి । వఱలెడునా యింతి పాంచాలుతనయ)
వరఁగంగ నాయింతి పార్శ్వంబునందు । గఱగఱ నయినట్టి కట్టిఁదనము
గలిగిన (యంగంబుఁ గమలాననంబు । గలిగిన యాయింతి కవ్వడిపత్ని'
నగధరు చెలియ; లున్నతి వారికెలన) । నెగువ నున్నట్టి యాయింతు లులూచి
చిత్రాంగదయు ననఁ జెలఁగు (నాయమలు । సుత్రామజుని సతుల్; సొరిదినావంక
నిందీవరచ్ఛాయకెనయైన మేను । పొం) దన లేమ భీముని కులకాంత.
చేరి యుత్పలకాంతిఁ జెలువైనయట్టి । యా (రామ నకులుని యంగన; నవ్య
చారు చంపక దేహ సలలితాకృతులఁ । దేరునాయమ సహదే) వుని గృహిణి.
చిరతరంబగుచున్న సిత ధౌతవస్త్ర । పరిధాన లైన యా (పడఁతుకలెల్ల
ధృతరాష్ట్రు కోడండ్రు; ధీరాభిమన్యు । నతివ యుత్తర యామె యని చె) ప్పుచున్న
యవసరంబున నంత నాంబికేయుండు । తవిలి ధర్మజుతోడఁ దగనొప్పఁబలికె:
"కుశలమే కురునాథ, గురుపుణ్యయూధ! । విశదకీర్తి విహార, విమతసంహార!
ఘనమైన మంత్రివర్గముఁ బౌరజనము । లనుసరింతురె నిన్ను ననుదివసంబు?
పొసఁగఁ దమ్ములు సౌఖ్యమున నున్నవారె? । అసమున నిష్టభృత్యావళుల్ సఖులు
బాంధవోత్తములెల్ల భాగ్యభోగముల । నంధిల్ల నుందురే జగతీతలేశ?
అక్షయంబగు నగ్రహారంబు లాదుఁ । బక్షమై యుండునే? పద్మారివంశ!
మందునకైన బ్రాహ్మణుని పేదఱిక । మొందకుండఁగఁ జేయుదే దానకోటి?
దేవతలకుఁ బితృదేవతలకును । ధీవర నుతముగాఁ దృప్తియొనర్తె?
తల్లి దండ్రుల రీతి ధారుణీ ప్రజల । నెల్ల రక్షింతువే? యేపు దీపించి."
అనవుడు ధర్మజుఁ డాంబికేయునకు । వినయంబు తోడుత వినిపింపఁ దొడఁగె:
"వినవయ్య ధృతరాష్ట్ర, విజ్ఞానచతుర, । వినుతింపఁ దగు భవ ద్వినుతోపదేశ

మున భవ దుక్తముల్ పొందుగా నడచు. । అనఘాత్మ, మీయెడ లతితపోమహిమ
గైకొని యుండునే కడఁక దీపించి ? । చేకొని శుశ్రూష చేయునే కుంతి ?
తలకొని మా పెదతల్లి గాంధారి । నలినాప్త సమతేజ, నడపునే తపము ?
సూత తనూజుండు సురుచిరవ్రతము । చాతుర్యలీలల జరుపుచున్నాఁడె !
సరసుఁడు విదురుఁ డెచ్చటి కేఁగినాఁడొ ! । సొరిదిమై నాతనిఁ జూడంగవలయు."
నావుడు ధృతరాష్ట్ర నరపతియపుడు । భావించి యమతనూభవున కిట్లనియె :
"భూమీశ, యేఁ దపంబున కోర్తునెపుడు ; । శ్రీమించి శుశ్రూష చేయును గుంతి ;
యొనరంగ గాంధారియును దపం బర్థి । ననఘచరిత్రయై యాచరియించు ;
సంజయుఁడును దపస్సంపన్నుఁడగుచు । రంజిల్లి వర్తించు రాజావతంస !
ప్రాజ్ఞుండు ఘననీతిపరుఁడును మహిత । విజ్ఞానియును నైన విదురుఁ డెందైనఁ
జరియించు మునిజనాశ్చర్యంబుగాఁగ. । అరయంగ జలము లాహారంబుగాఁగ
హరి నాత్మనిలుపుచు నత్యంతమహిమఁ । బరమ భాగవతుఁడై భవ్యవిఖ్యాతి
వెలసి సంయములెల్ల వినుతింపుచుండ । నెలమి నొక్కొక వేళ నిచటికి వచ్చు."
ననునంతలోపల ననతిదూరమున । మనుజేశ, వనధూళిమలినాంగుఁ డగుచు
వెస దిగంబరుఁడైన విదురుని నర్థి । మసలక చూచి ధర్మతనూభవుండు
నిజభృత్య తతులను నిలునిలుఁడనుచు । విజయరూప వర్గుని వెనుక నొక్కరుఁడు
పోవుచు "విదుర, యోపుణ్యస్వరూప ! । వావిరి నినుఁ గాన వచ్చితి" ననుచుఁ

విదురుఁడు యోగమార్గంబున ధర్మజునందుఁ గలియుట

బలికిన నొక విటపంబునఁజేరి । నిలిచిన, యమసూతి నెఱిఁ జేరఁబోయి
యాయెడ నయనంబు లర్ధమీలితము । లై యున్నఁ గనుఁగొని యాశ్చర్యమంది
"(పనివడి వచ్చితే పాండవాగ్రజుఁడ ;) । కను విచ్చి చూడవే కరుణావిధేయ !
కనువిచ్చి చూడవే గాంభీర్యధుర్య !" । అనుడుఁ దప్పక చూచి యతి యోగబలము
గైకొని హరి నాత్మఁ గదలక నిలిపి । ప్రాకటవిస్ఫూర్తిఁ బ్రాణముల్ విడిచి
ధర్మస్వరూపమై దనరినయట్టి । ధర్మజు దేహమెంతయుఁ బ్రవేశించె.
అంతయుఁ గనుఁగొని యమతనూభవుఁడు । చింతించి యాశ్చర్యచిత్తుఁడై వగచి
యనల సంస్కారంబు నమ్మహాత్మునకు । ననయంబు చేసెదనని తలంచినను
ఆకాశవాణి యిట్లనియె "నోరాజ ! । చేకొని వినవయ్య సృష్టి యతిత్వ

గౌరవోజ్జ్వలుని యీకాయంబు వహ్ని । కారయనిచ్చుట యర్హంబుగాదు."
అనవుడు విడిచి యయ్యమతనూభవుఁడు । తన సహోదరులకుఁ దండ్రి కత్తెఱఁగు
వినిపించుటయుఁ, జాల విస్మయంబంది । గొనకొని యుండ నక్కురువృద్ధు సకల
సంయమీంద్రుల నంపి సరసరీతులను । అయ్యమనూతితో సర్థి నిట్లనియె:
"ఓ ధర్మనందన, యోపుణ్యనిలయ, । శ్రీధర, కరుణావిశేష, సర్వజ్ఞ,
అనఘాత్మ, విను మాకు నాహార మెద్ది । పనివడ నదియె యేర్పడ నాస్వాదింపు."
అనవుడు నట్లకాకని ధర్మసుతుఁడు । వనమూల ఫలములు వడి నాస్వాదించి
దర్భశయ్యలమీఁదఁ దప్పకారాత్రి । నిర్భర ప్రీతితో నిద్దుర పోయి
మఱునాఁడు సంధ్యాది మహిత కృత్యములఁ । దెఱఁగొప్ప నెంతయుఁ దీర్చి వేవేగ
ధారుణీనాథుండు తమ్ములుఁ దాను । వారక ధృతరాష్ట్ర వసుధీశుకడకుఁ
జనుదెంచి మఱి నమస్కార పూర్వముగ । వినుతిమై మది పల్లవింపఁగఁ జేసి
ధాత్రీశు ననుమతిఁ దనరినయట్టి । వేత్రాసనంబున విమలుఁడై యుండె.
అంతట శతయూపుఁ డాదిగామునులు । సంతోషచిత్తులై సరభసవృత్తి
నరుదెంచి దర్భాసనాసీనులైరి. । పరఁగంగ ద్రౌపదీప్రముఖ భామినులు
తిరిగిరాఁ గూర్చున్న, ధృతరాష్ట్రుఁడంతఁ । గరమొప్ప నుచిత వాక్యంబులఁ బ్రొద్దు
జరుపుచునుండి భాస్కరుఁడు మధ్యాహ్న । కరుఁడైన మునులను గ్రక్కున ననిపి
యఱలేని భక్తితో నాహ్నిక వృత్తి । మఱియు నిర్వర్తించె మగువతో" ననిన
జనమేజయుండును "సంయమినాథ! । వెనుకొని యప్పాండవేయు లీరీతి
నలువొప్ప నెన్నిదినంబు లచ్చోట । నిలిచి రత్తెఱఁగెల్ల నెఱిఁజెప్పు." మనిన
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపింపఁ దొడఁగె నావృత్తాంతమెల్ల :
"వినవయ్య భూపాల! వెనఁ బాండుసుతులు । ఘనపరాక్రములు సద్గాంభీర్యనిధులు
పడఁతులతోఁ గూడఁ బ్రజ్ఞ దీపించి । యడవికి నేఁగి యయ్యంబికాతనయుఁ
గాంచిన దినమునఁ గరము సంప్రీతి । సంచిత ఫలముల నాఁకలి దీర్చి
ధరణిపైఁ బవళించి తగ మరునాఁడు । అరుదుగా ధృతరాష్ట్రు ననుమతివడసి
యన్నపానాదులు నతిమృదు శయ్య । లెన్నఁగాఁ గైకొని యీరీతి నొక్క
మాసంబు వసియింప మఱియొక్కనాఁడు । భాసుర స్ఫూర్తి నప్పటియట్ల యుచిత
సల్లాపములఁ బ్రొద్దుజరుపుచు మిగుల । నుల్లంబు లలర వారున్న యవ్వేళ
సాత్యవతేయుండు చనుదేరఁ జూచి । యత్యంత భక్తితో నర్ఘ్యపాద్యాదు

యొనరింప నాతండు సుచితాననమున । ఘనముగాఁ గూర్చుండి కరుణించి పలికె:
"నడపెదవే నీవు నవ్రతవంబు ? । పుడమిఁ జచ్చినయట్టి పుత్రులఁ దలఁచి
శోకింపకుందుదే ! సురుచిరమైన । నీకుఁ బరిజ్ఞాన నిపుణత గలదె ?
చేకొని శుశ్రూష చేయునే కుంతి ? । ప్రాకటంబుగ." నని పలికి వెండియును
విదురుండు దేహంబు విడిచిన తెఱఁగు, । నదనుగా నెఱిఁగితె ? యనఘ, మాండవ్యుఁ
డిచ్చిన శాపంబు నెలమితో మోచి । యచ్చుగా శూద్రుఁడై యముఁడె యారీతి
జనియించి మాఱట శమనుఁడై మిగుల । ఘనుఁడైన ధర్మజు కాయంబు గలిసె.
అటువంటి దేవమయాత్మకుండగుచుఁ । బటు దివ్య దేహ సంపన్నుఁడైనట్టి
ధర్మతనూజుండు తద్దయుఁ గొలువ । నర్మిలి నుండుదే యవనీశచంద్ర ?"
అనినఁ బారాశర్యు కనియె నారాజు : । "వనవాసదుఃఖ మావంతయు లేదు.
ధరనాకు సుబలనందనకును మిగులఁ । బొరిఁ బుత్రశోకంబు పొందకుండంగఁ
దగు భక్తి సలుపు నీధర్మనందనుఁడు. । సుగుణాఢ్య, కుంతి శుశ్రూష యొనర్చు.
వరముని చంద్ర, భవత్ప్రసాదమునఁ । బరమ దివ్యజ్ఞాన భావన మిగుల."
నని పల్కుచుండు నయ్యవసరంబునను । బనివడి ద్రౌపది ప్రముఖులు వచ్చి
యతని పాదములకు నర్థితో మ్రొక్క । యతులితగతి నున్న నాశీర్వదించి
యంతట మఱియు నయ్యంబికాతనయు । నెంతయుఁ గనుఁగొని యిట్లని పలికె :
"చంద్రవంశాధీశ, శౌర్యప్రతాప, । సాంద్రకీర్తివిహార, సత్యవిస్తార,
తలకొని నీమనస్తాపంబు వాయ । వలెనని వచ్చినవాఁడ నిక్కముగ.
అనుమాన ముడిగి యెయ్యదియైన నడుగు । మొనయంగఁ దప్పక యిచ్చెద." ననిన
సంతోషచిత్తుఁడై సంయమిచంద్రు । నంతటఁ బలికె నయ్యాంబికేయుండు :
"మునినాథ, మిక్కిలి ముదము దీపించి । పనివడి నామీఁది పక్షంబు కతన
నరుగుదెంచితిరె ! నే నతికృతార్థుఁడను ; । పరికింప నా తపఃఫలమును నీవ.
ఇంతకంటెను కోర్కి యెయ్యది ధాత్రి । నెంతయు నాకు మునీశ్వరతిలక !
తల్లియుఁ దండ్రియు దైవంబు గురుఁడు । నెల్లబాంధవులును నిట నీవ నాకు
అడుగు మొక్కటియున్న నడుగకుండినను । అడరి ధర్మంబుగా దదిగాన మీకు
విడువక యొక్కటి విన్నవించెదను. । తొడరి శఠుండగు దుర్యోధనుండు
అవనిపైఁ బుణ్యాత్ములగు పాండుసుతుల । నవమాన మొనరించె; నఖిలభూపతుల
గురువుల మిత్రులఁ గూలంగఁ జేసి, । తరణిజ భీష్మాది ధన్వులఁ జంపె.

అతనికిఁ గాఁగ మహామహాబల్ సుతుల । సతులను విడిచి నిచ్చలు మృతులైరి.
ఈరీతిఁ దెగిన భూమీశు లెల్లరునో! । వారల చూడంగవలయు నా." కనిన
గాంధారి కుంతియుఁ గడఁకతో నితర । గంధేభయానలగ్గలమైన వగలఁ
బొగులుచునుండ నప్పుడు మునీశ్వరుఁడు । తగురీతి సుబలనందనమీఁదఁ జాలఁ
గరుణమై నున్న నాగాంధారి యనియె : । "పరమాత్మ, పుత్రులు భండనభూమి
నడఁగుట మొదలుగా నధికశోకంబు । కడుఁ బెద్దయై మదిఁ గలఁచుచున్నదియు.
సొలపుతోఁ దుత వారిఁ జూడకయుండి । వలనేది షోడశ వర్షంబులయ్యె.
నెలకొన్న పుత్రసాన్నిధ్య మీరాజు । కలవడ నొనరింపు మది నాకుఁ బ్రియము."
అనుటయుఁ గుంతి యిట్లనియె నంయమికి : । "అనఘాత్మ, నీరేరుహాప్తతనూజుఁ
జూడఁగోరెద నాకుఁ జూపంగవలయు. । వేడుకతోడ నో విజ్ఞానచతుర!
అరుదుగా నేఁ గన్యనై యుండుతఱిని । అరుదెంచె దుర్వాసుఁ డతనికి నేను
మేలిమిఁ గూర్తూర మెచ్చుగా వండి । రోలిమైఁ బెట్టుచు నొగి సేవసేయ
వలనొప్పఁ బ్రీతుఁడై 'వరమిత్తు నీకు । జలజాక్షి, యడుగుము శంకింపవలదు—'
అనవుడు నేఁ బుత్రునటఁ గోరుటయును । మనమున హర్షించి మానిశేఖరుఁడు
ఒక్క మంత్రము నాకు నుపదేశమిచ్చి । గ్రక్కునఁ జనియె, నాఘనమంత్రమేను
జపియింప నొకనాఁడు జలజబాంధవుఁడు । చపల మనస్కుఁడై చనుదెంచి సుతుని
దయచేసిపోయె; నాతనయుండులేమి । రయమేది యాత్మ నీరైపోయె నిపుడు.
అవనయింపుడుదాని ననఘ! యీకోర్కి । కృపనిచ్చుటయెనాకుఁ గృతకృత్య, ముదము."
అనిన సంతోషించి యాకుంతిఁ జూచి । మునినాథుఁ డనియె : "నీపుత్త్రునిఁ గర్ణుఁ
జూచెదు ; గాంధారి చూచు పుత్రులను. । ఈ చందమంతయు నెఱిఁగింతు వినుము.
దేవతల్ మనుజులై తెలఁగొప్పఁ బుట్టి । రే విను తెలియంగ నేర్పరించెదను.
అతుల విస్ఫూర్తి నీయంబికానూతి । వితతమై గంధర్వవిభుఁడు నిక్కముగ.
జానొప్ప నప్పాండుజననాథవరుఁడు । మానౌ మరుద్గణమయుజని సుమ్ము.
ధర్మువెతోడుగాఁ దనరినయట్టి । ధర్ముండనుమ్మో యీ ధర్మనందనుఁడు.
సకల జీవులకును జైతన్య మొసఁగు । సకలంకుఁడగు వాయువప్పవనజుఁడు.
ముద మొప్ప నరుఁడను మునిపుంగవుండు । విదిత శౌర్యుండైన విజయుండు నిజము.
వారక గోపికావల్లభుఁడైన । నారాయణుం డాదినారాయణుండు.
అశ్వినీదేవత లాకవలగుచు । శాశ్వత విస్ఫూర్తి జన్మించిరుర్వి.

కడఁగి ద్వాపరమె యాగాంధారరాజు; । తడయక కలి సుయోధనుఁ డుత్పలాక్షి!
ఆతని యనుజన్ములందఱు వినుము । దైతేయవరులు; రాధానందనుండు
సరసిజ మిత్రుండు; నరసిజారాతి । ధరణిలోపల సుభద్రాతనయుండు;
వసువులు భీష్ముండు; వాసవాచార్యుఁ । డనదృశ విస్ఫూర్తి నప్రగురుండు.
అగ్ని ధృష్టద్యుమ్నుఁ; డవని శిఖండి । యగ్నియె; రుద్రాంశ మాద్రౌణి నిజము"
అని యిట్లు పేర్వేరనందఱఁ జెప్పి । మునికులాధీశుఁ డిన్నుఁగలఁ గుంతిఁ జూచి
" ఇది విష్ణుసంకల్ప మిందీవరాక్షి! । అదిగాన నీకోరినట్ల సిద్ధించు."
అనిపల్కి యందఱ నట దోడుకొనుచుఁ । జనఁగ నచ్చటనున్న నంయుగు లెల్ల
నచ్చెరువందుచు నత్తెఱఁ గెల్ల । విచ్చలవిడితోడ వీక్షింపఁగోరి
కరమొప్ప నేతేర గంగకుఁ బోయి । యరుదుగాఁ దత్తీరమందు నిల్చుటయు
జలజాప్తుఁ డస్తాద్రిచాటున కేఁగె; । జలజముల్ ముకుళించె; జక్కవకవలు
విరహాగ్ని చేతను వేఁగుచునుండె; । విరివిగాఁ గుముదముల్ వికసింపఁ దొడఁగె;
గగనస్థలమున నక్షత్రముల్ పొడిచె; । మొగి నిశావిభుఁడు తూర్పున నుదయించె.
ఆరాత్రిగడపి పాయక మఱునాడు । వారిజాప్తుఁడు తూర్పువరశైలమందుఁ
గనుపట్టుటయు, వేగఁ గాలోచితంబు । లొనరించు వేడుక నుండునత్తఱిని

వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతులను రావించి చూపుట

మునిసార్వభౌముండు మునిచక్రవర్తి । మునిలోకపూజ్యుండు మునివతంసంబు
సాత్యవతేయుండు సరగునవచ్చి । యత్యంత మనురక్తి నాగంగలోన
నవగాహమొనరించి హర్షంబుతోడఁ । బ్రవిమలస్ఫూర్తిఁ గౌరవులఁ బిల్చుటయు
దుర్యోధనుండును దుశ్శాసనుండు । శౌర్యాఢ్యుఁడైన యా సవిత్రునందనుఁడు
దుష్కర్ణుండును దుర్ధర్షదీర్ఘ । దుర్ముఖ జలధర దుష్ప్రదర్శనులు
దృఢమహారథుఁడును దీర్ఘబాహుండు । దృఢహస్తుఁ డింద్రుఁ డాదిత్యకేతుండు
జలదుండు దుర్విలోచనుఁడు విందుండు । జలసంధ సమ సులోచనముఖ్యులైన
కురురాజతమ్ములు, గురుఁడు, భీష్ముండు । విరటుండు శకునియు వెససైంధవుండు
అభిమన్యుఁడును, త్రిగర్తాదు, లుత్తరుఁడు, । శుభమూర్తి పాంచాలనూనుండు, మఱియు
ద్రౌపదిపుత్రులుఁ, దక్కిన యట్టి । భూపాలవర్యు లద్భుతముగా నపుడు

చను దెంచుటయుఁ జూచి సకలసంయములు । సనఘులు నిది వింతయని పొగడంగ
నరయ నావిధమెల్ల నంబికానూతి । విరివిగా నెంతయు వినిసంతసమునఁ
దాపసారాధ్యు పాదంబుల కెఱఁగి । "యోపుణ్యనిజదేహ, యురుదయాధార,
మాపాలివేల్పవై మమ్మునంప్రీతిఁ । జేపట్టి యభిమత సిద్ధి యెంతయును
గృపచేసి తిలక సత్కీర్తి దీపింప । నిపుడొక్కటడిగెద నీయవె నాకు"
అనవుడు సంతోషమంది వ్యాసుండు । మనుజేశుఁ జూచి క్రమ్మఱనిట్టులనియె :
"సందేహమేటికి జననాథతిలక ! । పొందుగా నడుగు మిప్పుడ యిత్తు నీకు."
అనిన శీఘ్రమున నయ్యంధభూవిభుఁడు । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె :
"విను తాపసారాధ్య, వీరి నందఱను । గనుఁగొను వేడుక గదిరెను నాకు.
అదిగానఁ గనుఁగొను నట్లుగా నిపుడు । విదితంబుగా నీయవే ! దివ్యదృష్టి."
అనివల్కుటయు వ్యాసుఁ డట్లకాకనుచు । ఘన భూమిపతికిచ్చెఁ గన్నులదృష్టి.
ఇచ్చిన నందఱ నెలమిఁ జూడంగ । మచ్చికతోడ నమ్మగువ గాంధారి
కనుఁగవమీఁదఁ జక్కఁగఁగట్టినట్టి । కనకవట్టమువుచ్చి కనుఁ గొనె సుతుల ;
ద్రౌపదియును తన తనయులఁజూచి । ప్రావుగా సంతోషభరితాత్మయయ్యె ;
అభిమన్యుఁ గనుఁగొని యంత సుభద్ర । యభినవోత్సాహియై యుడిచె దుఃఖంబు ;
కుంతి మహాదేవి గూఢామునఁగర్ణు । నెంతయుఁ గడఁకతో నీక్షించుచుండె ;
మఱియును దక్కిన మానినీమణులు । తఱలక చూచిరి తమతమ పతుల.
సకల మునీంద్రులు సకల దేవతలు । సకలంకగతిఁ గొనియాడి రమ్మునిని.
అంత నేతెంచిన యఖిల కౌరవుల । సంతోషచిత్తులై సరవి నాఁడెల్లఁ
బరఁగంగ నన్యోన్య పరిభాషణముల । వరమతి తోడుతవర్తిల్లఁజేసె ;
ఏమనవచ్చు మునీశ్వరుమహిమ ! । ఓమనుజాధీశ, యుడురాజవంశ,
పరికింప నిట్లొక పగలును రేయి । గరిమతో నిలిపి తక్కక మునినాఁడు
వ్యాసమునీంద్రుండు వనితలనెల్ల । భాసురంబుగఁజూచి పలికె నిట్లనుచు :
"మానినీమణులార ! మమతదీపించి । పూనికతోడ మీపురుషులఁగూడి
పోవంగవలసినఁ బొండు వేవేగ । వావిరి నొల్లనివారు గల్గినను
భూమిపై నిలువుఁడు పొందుగా" ననిన । నామాటలకుఁ జాల హర్షంబునొంది
నరంగ ధృతరాష్ట్ర ధర్మనందనుల । యనుమతి వడసి యత్యంత శీఘ్రమునఁ

జని గంగలోఁ జొచ్చి చయ్యన మనుజ । తనువులుడిగి దివ్యతనువులు దాల్చి
దివ్య విమానముల్ తెఱఁగొప్ప నెక్కి । భవ్యాత్ములై సురభామలు గొలువ
దివ్యదుందుభులును దివ్యకాహళులు । దివ్యశంఖంబులు దివినిండ మ్రోయ
సురుచిరాలంకార శోభితులగుచుఁ । బురుషులఁ గలిసిరి భూలోకనాథ!
ఈ కథవిన్న నభీప్సితార్థములు । చేకూరు ; ధర్మంబు సిద్ధించు ; సకల
పాపక్షయంబు వైభవములుఁ గలుగు ; । శ్రీపతి కృపచేత జెన్నుమీఱుదురు."
అని చెప్పుటయుఁ గడునాశ్చర్యమంది । మునినాథునకుఁ గేలుమోడ్చి భూవిభుఁడు
"మునికులోత్తమ, వ్యాసముని సుమహాత్ముఁడు । వినుతింప మాటలవిష్ణు వేగాక
యితరుఁడే! తరువాత నేరీతి నడచె । ధృతరాష్ట్రుఁ డింకన త్తెరు వెఱిఁగింపు"
మనిన వైశంపాయనాఖ్యుఁడు ప్రీతి । జనమేజయునితోడఁ జతురుఁడై యనియె:
అనఘాత్మ యీరీతి నాంబికేయుండు । తనయుల బాంధవతతులను జూచి
ఘనతర సంతోషకలితాత్ముఁ డగుచు । వినయంగ వ్యాసమునీంద్రునకర్థిఁ
దలఁకొని సాష్టాంగ దండపాతమునఁ । గలవడి మ్రొక్కి వేడ్కలు తొంగలింప
"మునినాథ! నీకతంబున హతులైన । తనయుల బాంధవతతులనుజూచి
దొరకొని యధికసంతోషంబు గలిగె. । ధరణిలో నింక నేధన్యుండ నైతి."
అనియని కొనియాడి యాశ్రమంబునకుఁ । జనుదెంచి నిలిచిన, సంయమీంద్రుండు
నొనరంగ నాంబికేయునిఁజూచి యనియె: । "జననాథ, నీసుతుల్ సకల సౌఖ్యముల
దేవతావిభవ మందినవారు నిజము. । కావున వారికై గడఁగి పల్మాఱు
భావంబులోన విభ్రాంతి పొందకుము. । పావనాత్ముఁడైన పాండవాగ్రజుఁడు
నిలిచినవాఁడింక నెలనాళ్ళనుండి ; । పొలుపుగా నింతటఁ బొమ్మను పురికి."
అనిచెప్పి వ్యాసమహామునీంద్రుండు । చనినపిమ్మట సంత సమునందనునిఁ
బిలిచి భూవిభుఁడు సంప్రీతి నిట్లనియె: । "తలకొని ధర్మనందన, వినవయ్య
ఈరీతి నడవిలో నిట్లుండఁ దగదు. । ధారుణీభారమంతయును వహించి
తనరు వర్ణాశ్రమతతులు ధర్మంబు । నొనరంగఁ దప్పకయుండ వర్తింపు.
పొలుపొంద నీకతంబున శోకమెల్లఁ । దలఁగెఁ బుణ్యంబులు తగఁగంటి నేను"
అనవుడు ధర్మరాజాంబికేయునకు । ననఘ వాక్ప్రౌఢి నిట్లని విన్నవించె:

"ధారుణీతలనాథ, ధరణి రక్షింప । వారక భీముని వాసవిఁ గవలఁ
బనుపుము; నిను గొల్చి వరమవ్రతంబు । ఘనముగాఁ గైకొని కడఁగి వర్తింతు."
అన విని గాంధారి యాధర్మరాజుఁ । గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప:

ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు ధర్మములు బోధించి కరిపురి కంపుట

"ధర్మజ, వినవయ్య ధరణిలో నీవు । ధర్మాత్ముఁడవు పల్కఁదగునె యీరీతి?
కరమొప్ప నీవెఱుంగని ధర్మమెద్ది? । ధరణీశు కిది సమ్మతంబుగాదుసుగు.
రూఢిమైఁ దల్లిదండ్రులకుఁ బిండంబు । లోడక పెట్టంగ నొగిఁ గర్తవీవు.
మెఱసిన భక్తితో మీతండ్రియాజ్ఞ । యుఱలేక సేయుట యదియె ధర్మంబు.
అనవుడు పాండవేయాగ్రణి పలికె: । "నను నెంతతఱిమిన నాతల్లి, మిమ్ము
విపిన భూములలోన విడిచి పోఁజాల; । చపలత రాజ్యకాంక్షయు నాకు లేదు."
అనవుడు సహదేవుఁ డన్నతో ననియె: । "వినవయ్య ధర్మజ, వేడ్కతో నేను
భూతలనాథునిఁ బోలఁతి గాంధారి । నాతల్లిఁ గుంతి నెయ్యంబుతోఁ గొల్చి
విమల తపోనిష్ఠ వెలయుదు." ననినఁ । గ్రమమొప్ప మఱియు నగ్గాంధారి యనియె:
'వరపుణ్యులార, యీ వంత చాలించి । పురమున కేఁగుఁడు పొందుగా మీరు.
కమిడి యీమాట దాఁటితిరేని । పరఁగంగ భూవిభుపాదంబులాన."
అన విని మఱుమాటలాడంగ వెఱచి । మనుజేశునకు మ్రొక్కి మఱియుఁ దల్లులకు
సరి ప్రదక్షిణ నమస్కారముల్ చేసి । తరుణులుఁ బౌరులు ద్రౌపది ప్రముఖ
లరుదుగా నేతేర హస్తినాపురికి । నరుదెంచి భూప్రజలందఱుఁ బొగడ
ధర్మాగ్రజుండు సంభృత కీర్తిధనుఁడు । శ్రీమించి రాజ్యంబు సేయుచునుండె.
అన విని జనమేజయావనీవిభుఁడు । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె:
తాపసారాధ్య, యాధర్మనందనుఁడు । భూపాలనప్రౌఢి పొసఁగ వర్తింపఁ,
దపసియై యంబికాతనయుఁ డెన్నాళ్ళు । విపిన భూములయందు విహరించె నట్టి
తెఱఁగె? నేతత్కథాక్రమమెల్ల నాకు । వితతంబుగాఁ జెప్పవే! దయతోడ."
అన విని జనమేజయావనీంద్రునకు । మునివల్లభుండనె ముదము రెట్టింప.
వినవయ్య రాజేంద్ర, విభవదేవేంద్ర, । ఘనుఁ డాంబికేయుఁ డాక్రమమునఁ దపము

తిరముగా భాగీరథీతీరభూమి । వరుసతోఁ దుత మూఁడు వర్షముల్ చేసె.
అంతలో నొకనాఁడు హరిపరాయణుఁడు । శాంతచిత్తుఁడు మౌనిజనశేఖరుండు
తాపసారాధ్యుండు ధవళవిగ్రహుఁడు । భూపాల, నారదమునిపుంగవుండు
హస్తినాపురమున కరుదెంచుటయును । ప్రస్తావ మొప్ప ధర్మజుఁ డది యెఱిఁగి
యెదురుగాఁ జని ప్రీతి నిల జాఁగి మ్రొక్కి । పదపడి యర్ఘ్యంబుఁ బాద్యంబు నిచ్చి
తగిన యాసనమునఁ దప్పక యునిచి । యగణితస్ఫూర్తి నయ్యతికి నిట్లనియె:
"మునినాథ, యేదేశమునఁ జరియించి । యెనయంగ నిచ్చటి కేఁగుదెంచితిరి?
వలనుగా నేఁ జేయవలసిన దెద్ది? । తెలియంగ నాకానతీవె యతీంద్ర!
పరమ తపోధన, పనిలేక యుఱక । వరమతి వచ్చెడివాఁడవు గావు."
అనవుడు నారదుఁ డమ్మనుజేంద్రుఁ । గనుఁగొని వల్కె నుత్కంఠ దీపింప:

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణ మెఱిఁగించుట

"చంద్రవంశాధీశ, సత్కృపావేశ, । సాంద్రకీర్తి విహార, శత్రుసంహార!
వినవయ్య ధర్మజ, వివరంబుగాఁగ. । ఘనతీర్థయాత్రకై కదలి యేఁ బ్రీతి
సకల తీర్థంబుల స్నానముల్ చేసి । యకలంక వృత్తిమై నాగంగకరిగి
యవగాహ మొనరించి యరుగుదెంచితిని. । భువిలోన ధృతరాష్ట్రభూపతివార్త
వఱలు గంగాతీర వాసులచేత । నెఱిఁగితి; మీరలా నృపుఁ గొల్చియుండి
యరుదుగా నతనిచే ననుమతి వడసి । వరమతి నిచటికి వచ్చితి; రంత
కొన్నిదినంబులకును మహీవిభుఁడు । క్రన్నన నడవిలోఁ గడు ఘోరతపము
పరువడి నట వాయుభక్షణపూని । చరియించె; గాంధారి జలము వాటించె;
వరుసతో మాసోపవాస మాకుంతి । యిరవుగాఁ గైకొనె; నిట సంజయుండు
నేడుదినంబుల కొలమి భుజించు । జాడ గైకొనియె యాజకులెల్ల నగ్ని
నడపుచు నుండ నంతట నొక్కనాఁడు । పుడమీశ, ధృతరాష్ట్రభూవల్లభుండు
పరువడి గంగలోపలఁ దీర్థమాడి । ... ... ... ... ...
మునుకొని యాశ్రమంబున కరుగంగ । ... ... ... ... ...
నవని వాతోద్ధూతమై చెలరేఁగి । తివిరి వృక్షంబుల ధృతిఁ జుట్టుముట్టి

కడువడి విస్ఫులింగంబులు చెదర । నడరెడు పెనుమంట లాకసంబాట
సుడిగొని తరువులు సురసురఁ గాల । ... ... ... ... ...
నంతఁ దీవ్రంబుగా నతిఘోరవహ్ని । యంతకంతకుఁ గను నగ్గలంబగుచుఁ
దరికొని చనుదేరఁ దత్కీలములకు । నఱిముఱిఁ బక్షంబులన్నియుఁ గమరి
పెల్లు వాపోవుచుఁ బిల్లలుఁ దాము । మల్లడి గొని బెట్టు మడియు పక్షులును,
భూరితరార్చులఁ బొడవునఁ గాలి । ఘోరమై ఫెళఫెళ గూలు వృక్షములుఁ,
బటు భయంకర శిఖాపటలిచేఁ బొగిలి । పటపట మని బిట్టు పగులు వెదుళ్ళు,
సుడివడి యొఱలుచుఁ జొరఁజోటులేక । మిడియుడఁగఁగఁ జచ్చు మృగసమూహముఁ
నెగడి హేతుల నుడుకెక్కిన నదుల । నసువులఁ బాసి తేలాడు మత్స్యములుఁ
గలిగి కాలానల కల్పమై పేర్చి । వలయమై మండు నవ్వహ్ని నీక్షించి
యవిరళ స్ఫూర్తి నయ్యంధ భూవిభుఁడు । నువిదలుఁ దానును నుఱికి పోలేక
యువవాసముల స్రుక్కి యొక్కింత కదల । కపుడు సమర్థుఁడౌ నా సూతపుత్రుఁ
డైన సంజయుతోడ నడలు చిట్లనియె : । "జానొప్ప నీవు సంజయ, యెటకైన
నుఱికిపొమ్మిచ్చోట నుండంగఁ దగదు ! । అఱలేక." యనిన నయ్యవనీశుఁ జూచి
"భూనాథ, మిము డించిపో నెట్లు నేర్తు? । మానుగా నిందుకై మనసెట్లు పొసఁగు !
అనినఁ "బోవఁగఁ బాడి; యరుగుమునీవు; । జననుతంబుగఁ దామసము సేయువలదు
వేవేగఁ జను" మని విభుఁడు పల్కుటయు । నావేళ సంజయుఁ డతి శీఘ్రవృత్తి
నొక్క తెఱపిగాంచి యురు సత్వరమున । గ్రక్కునఁ జనియె; భూకాంతుండుఁ గుం
గాంధారియును నగ్నిఁ గాలి యాలోన । బంధురంబుగ దివ్యపదము గైకొనిరి."
అనుచు నారదమౌని యమతనూభవున । కనువొప్ప నెఱిఁగింప "హాతండ్రి యనుచ
దమ్ములుఁ దాను నంతట మూర్ఛ నొంది । క్రమ్మఱఁ దెలివొంది కన్నీరు నించి
"హా మదేభాయుతా యత సత్త్వ చతుర ! । హా మహనీయ విఖ్యాత ప్రభావ !
హా కమలారి వంశాంభోధి చంద్ర ! । హా కౌరవేశ్వర ! హా మేరుధీర !
అని యని పలుకుచు నంబికాసూతి । మనమునఁ దలఁచి క్రమ్మఱఁ గుంతిఁ దలఁచి
గాంధారిఁ దలఁచి శోకంబగ్గలముగ । బంధురంబుగ నేడ్వఁ బౌరులెఱింగి
భూరి వేగంబునఁ బొగులుచు వచ్చి । ధారుణిఁ బడి యేడ్వఁ దపసి నారదుఁడు
యమతనూజాతుని నప్పుడే తేర్చఁ । గ్రమమున మునికి భూకాంతుఁ డిట్లనియె:

“ నారద, మునినాథ, నలినజు తనయ, । కౌరవ వృద్ధుకా కష్టంపుఁ జావు. ”
వారక పాటిల్లె వలనింక నెద్ది ? । ఆరూఢి సమద నాగాయుత బలము
గలుగు మహారాజు కారుణ్య జలధి । యిలలోన నణఁగెనే! యేమిసేయుదును!
తడయక నూర్వురు తనయులు గలిగి । యడవిలోఁ జిచ్చున కాహుతియయ్యె.
వెలయు భామల తాలవృంతానిలములఁ । బొలుపొంద నిద్రించు పుణ్యవంతుండు
పాయక వాయస పక్షవిక్షేప । వాయువు లడరంగ వడిఁ బడెఁ గాదె!
సౌనర మాగధగానములఁ జాలమేలు । కనురాజు గృధ్రముల్ కాక ఘూకములు
నఱవంగఁ దెలియక యతిఘోరనిద్ర । నెఱి దిక్కుమాలి మ్రందిన వాఁడె యకట!
వల్లభుం డొక్క సద్వ్రతముఁ బూనినను । ఎల్లగా గాంధారి యేఁగిననేమి
పరికింప రాజ్యవైభవమెల్ల విడిచి । యరిగెఁ గుంతీదేవి; ‘హా విధి కడవ
రా.’ దని యేడ్చెధర్మజుఁడు; భీముఁడును । భూదేవిపైఁ బడి పొరలుచు నుండె;
నరుఁడును గవలు నున్నత దుఃఖమునను । ధరణిపైఁ బొరలి. రంతట యుధిష్ఠిరుఁడు
మునుకొని నారదమునిచంద్రుఁ జూచి । “ మునిరాజశేఖర, మున్ను ఫల్గునుఁడు
తనరంగ ఖాండవ దహనంబు నాఁడు । తనకు నెంతయుఁ బ్రమోదంబొనరించె.
అది యెల్లఁ దలఁపక యాతని తల్లిఁ । గదలక కాల్చె నక్కట! పావకుండు.
తనకుఁ గృతఘ్నత తగునె సేయంగ! । అనఘాత్మ, వినవయ్య యదియును గాక
మఱి యొక్క నెవ్వగ మననునఁ బుట్టె; । కఱకఱి నంధుఁడు కారాగ్ని నెరిసె.
దానికినెయ్యది తగు నానతిమ్ము । మౌనీంద్ర!” యనుడుఁ గ్రమ్మఱ నిట్టులనియె :
“ఎడపకా వృద్ధ మహీపతి యిష్టి । నడపి యగ్నులఁ దొలునాఁడు వీడ్కొనియె.
అప్పు డయ్యాజకు లయ్యగ్ని నడవిఁ । దప్ప కుద్వాసించి తగఁ జన్న పిదప
నది యవ్వనం బెల్ల నట్లాక్రమించె; । నదనుగా నృపతియు నయ్యగ్నిఁ గాలె.
కావ నెవ్వగఁ బొందఁగాఁ బనిలేదు । భూనాథ, వారి కిప్పుడు తిలోదకము
లీవలె.” ననవు డయ్యిందువంశజుఁడు । వావిరిఁ దమ్ములు వనితలుఁ దాను
జని గంగలోపల స్నానంబు చేసి । యొనరంగ నాంబికేయునకుఁ దల్లులకు
నెఱిఁ దిలోదకములు నిష్ఠమైఁ బోసి । తఱలక షోడశ దానముల్ చేసి
శ్రాద్ధార్హదినముల సకల దానములు । వృద్ధానుమతిఁ గురువృద్ధుకుఁ జేసి
తల్లుల కొనరించి తదనంతరమున । నెల్లగా సకల మునీంద్రుల నర్థిఁ

బరువడిఁ బూజించి భవ్యుఁడై నృపతి । కరిపురి కేతెంచెఁ గడఁక దీపించి.
పురమునఁ బదునేను, మూఁడు వర్షములు । కర మొప్ప వనమునఁ గాఁగ నీరీతి
వరుసఁ బదై్ధనిమిది వర్షముల్ సనఁగ । గురుమతి నీ తెఱఁగున ధర్మరాజు
ఘనతతో ధర్మమార్గము దప్పకుండఁ । బనివడి భూస్థలిఁ బాలింపుచుండె"
అని ముని జనమేజయక్షితిపతికిఁ । ...     ...     ...     ...     ...
చెప్పిన గతిఁ జెప్పఁ జెలఁగి యామీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు మనిన
వైకుంఠనాథ, గోవర్ధనోద్ధరణ, । లోకనాయక, పద్మలోచన, కృష్ణ,
మురదైత్య భంజన, పురహర వినుత, । కరి రాజ సంరక్ష, కౌస్తుభాభరణ!
ఘనమాని హృద్గేహ కలిత సందోహ । వినుతప్రకాశ, శ్రీ వేంకటాధీశ!
భక్త వత్సల, జగత్పావనమూర్తి, । ముక్తి ప్రదాయక, మ్రొక్కెద నీకు.
ఇది వేంకటాచలా ధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్య తనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్ర వర్య
రచిత మైనట్టి యాశ్రమ వాసమందు । నుచితమై యాశ్వాస మొప్పె రెండవది.

# మౌసలపర్వము



శ్రీమహిళానాథ, జిత దైత్యనాథ, । సోమ భాస్కర నేత్ర, శోభితగాత్ర,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
ఆరీతి ధర్మజుఁ డత్యంతమహిమ । వారక ధృతరాష్ట్ర వసుధీశ్వరునకుఁ
దల్లులకును దిలోదకములు పోసి । ఒల్లిదుఁడై మహీప్రజలఁ బాలింప
ననఘాత్మ, ముప్పదియైదు వర్షములు । చనియె; నామీఁది వత్సరమునఁ బ్రజకు

### ధర్మజు రాజ్యంబున నుత్పాతములు దోఁచుట

ఘనతరోత్పాతముల్ గానంగఁ బడియె. । ఇన మండల ద్యుతి యెల్లను మాసి
పరివేష మొదవెఁ; గబంధజారాతి । పరిపూర్ణకళలఁ జొప్పడక నీలంపుఁ
జాయమైఁ దోఁచెఁ; బ్రజలకు భయంబు । పాయక కలిగె; నభ్రంబులు లేక
పరికింప నిర్ఘాత పాతముల్ గలిగె; । సొరిది నుల్కలు నెల్లచోట్లను డుల్లె;
పెను మూఁడమంచు గప్పెను మహీస్థలిని; । ఘన ధూమకేతువు గానంగ వచ్చె.
అనఘాత్మ, యీరీతి ననుదివసంబుఁ । బొనర నుత్పాతముల్ పుట్టుచు నుండఁ
గర ముప్ప మఱి కొంత కాలంబునకును । దిరముగా ధర్మసూతికి వినంబడియె
'ధరణిలో యాదవుల్ దమలోనఁ దారు । గరిమతో నన్యోన్యకలహంబుఁ బూని
మునుకొని తుంగల మోదు లాడుచును । జనవేది యందఱు సమసిరి హరియు
బలభద్రుఁడును దక్కఁ బరువడి' ననుచు. । వెలయంగ విని కడు విస్మయంబంది
వాయుతనూజుని వాసవిఁ గవలఁ । బాయక రప్పించి పలికె ధర్మజుఁడు:
"ధర్మాత్ములగు సహోదరులార, మీకు । నర్మిలి నేవిన్నయంత చెప్పెదను.
యాదవుల్ తమలోన నన్యోన్య కలహ । మాదట నొనరించి యవనిపైఁ దెగిరి
హలధరుండును బంకజాక్షుండుఁ దక్క । నిలలోన మనలకు నిఁక నేటిబ్రతుకు!"
అని పల్కి తమ్ములు నటఁ దాను మిగుల । ఘన శోకమున నేడ్చెఁ గమలారివంశ!"
అన విని కడుఁ జాల నద్భుతంబంది । జనమేజయుండు వైశంపాయనాఖ్యుఁ
గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప: । "మునినాథ, యాదవుల్ పుడమిలోపలను

దలకొని తనులోనఁ దారె పోరాడ । నలవడఁ గలిగినయట్టి కారణము
వారివృత్తాంతంబు వలఁతు వినంగ । నారూఢిఁ జెప్పవే!" యనిన నిట్లనియె:
"మనుజేంద్ర, వినవయ్య మఱి తద్విధంబు, । వినిపింతు నీకును విశదంబుగాఁగ.
ద్వారకాపురికి నెంతయు నొక్కనాఁడు । నారదుండును గాధినందన కణ్వ
మైత్రేయ ముద్గల మాండవ్య శౌన । కాత్రి భరద్వాజులాదిగాఁ గలుగు
మునులు నాహరిఁ జూడ మోదంబుతోడఁ । జనుదెంచి పురవీథిఁ జనుసమయమున
మనమున వృష్ణికుమారు లుప్పొంగి । వెనుకొని యెంతయు విధివశంబునను
అవినీతి జనియించి యతికపటమునఁ । బ్రవిమల స్ఫూర్తి నప్పద్మాక్షు సుతుఁడు
సాంబున కంగనా సరసవేషంబు । వంబి కావించి తప్పక గొని తెచ్చి
మునుల పాదములకు మ్రొక్కించి యంత । మునుమిడి హస్తముల్ మొగిచి యెంతయుఁ
అవని మిథ్యా వినయంబులు చేసి । "భవదూరులార, యో భవ్యాత్ములార,
కారుణ్యమతులార, గంభీరులార, । సార తపఃప్రభా సంపన్నులార,
కరమొప్ప మీ రెఱుంగని దొకింతయును । ధరణిలోపల లేదు తత్త్వార్థ మింత.
అదిగాన నొక్కింత యడుగంగ వలసె. । విదితంబుగాఁగ నీవిమలేందువదన
పరికింప బభ్రుని భామ నిక్కముగ, । కరమొప్పఁ బుత్రులఁ గనునొ భూస్థలిని?"
అనినఁ దపోధను లయ్యాగడంబు । మనమున నగ్గిమై మండుచునుండ
నాఁదటఁ గోపించి యతిశీఘ్రవృత్తి । యాదవసూనుల కర్థి నిట్లనిరి:
"అంబుజనాభుని యాత్మసంభవుఁడు । సాంబుండు యాదవక్షయకారి యైన
ముసలముఁ గను నిజముగ నమ్ముఁడింక । నసదృశ విఖ్యాతి నాముసలమున
హలియును నీరేరుహాక్షుండుఁ దక్కఁ । జలమునఁ బోరాడి సకలయాదవులుఁ
జావంగఁ గలవారు సత్యమీమాట । నావిరి నమ్ముఁడు; వరున నంతటను
హవిపాణియును దేహ మర్థిమై విడిచి । జలధిఁ బ్రవేశించుఁ; జక్రహస్తుండు
పరఁగంగ భూశయ్యపైఁ బవ్వళింప । జరయను ఘాతుకి సరి నాక్రమించు
పొం"డని చెప్పి యమ్ముని కులోత్తములు । పుండరీకాక్షునిఁ బొడఁగను బుద్ధి
మెచ్చుగాదనుచు నర్మిలి నాశ్రమముల । కచ్చోట నిలువక యరిగి; రంతటను,
పద్మపత్రాక్షుండు పరమేశ్వరుండు । పద్మాలయా భర్త పాపభంజనుఁడు
కృష్ణుండు నరహరి కేశవుం డతుల । జిష్ణుమిత్రుండు రోచిష్ణుఁ డత్తెఱఁగు
విని యెంతయును గాలవేదిగావునను । దనచుట్ల నున్న బాంధవులను జూచి

సరవితో నిట్లను: "సర్వంబు ధాత్రు । కరణీయ; మిప్పుని కడఁక దీపింప
ఘనవాంఛ చేత నిమ్మహి మూఁడె ననుచు । మనికిత పడకుఁడి మహితాత్ములార!"
అని పల్కి యత్యంత రావానమునకుఁ । జనియె. నమ్మఱునాఁడు సాంబుండు గర్భ
మున జముదూతయుఁ బోలె నాశ్చర్య । మును భయంబును గల్గ ముసలంబుపుట్టె.
పుట్టిన భయమునుబొంది యాదవులు । గట్టిగా వసుదేవుకడకును బాఱి
"వసుదేవ, వినవయ్య వార్ధిగాంభీర్య! । అసమాన గుణధుర్య! హరిసమ శౌర్య!
మునుకొని సాంబుండు ముసలంబు నేఁడు । గనియె నిత్తెఱఁగెల్లఁ గడు నద్భుతంబు."
అని విన్నవించిన యాదవ భర్త । తనరంగ నాకకొంతతడవు చింతించి
యాశ్చర్యచిత్తుఁడై యుండంద నగచి । నిశ్చలబుద్ధితో నెమ్మి నిట్లనియె:
"కడు శీఘ్రవృత్తి రోఁకలి పొడిచేసి । జడనిధిలోపలఁ జల్లుఁడు పొండు.
చెలఁగి యాలస్యంబు చేయకుఁ." డనిన । వలనుగా వారలు వసుదేవు నాజ్ఞ
ముసలంబుఁ బొడిచేసి మొగి వార్ధిలోన । నసమునఁ జల్లిరి యవనీతలేశ!
మునుకొని యెంతయు మునిశాపశక్తి । మునుమిడి మానుషంబునఁ ద్రోవరామి
తలఁపక నిఖిలబాంధవులును దాను । వలనుగా నూఱడి వర్తించెనంత.

## ద్వారకాపురంబున నుత్పాతంబు లుప్పతిల్లుట

పదపడి ధృతరాష్ట్ర భామ గాంధారి । యదయయై వృష్ణిభోజాంధకాదులకు
వెస శాపమిచ్చుట విదితమయ్యెనను । విసువకజ్జనములు వెఱచుచు నుండఁ,
గాలంబు నగుటయు, ఘనతరోత్పాత । జాలము ల్మిగులఁ బ్రజాతంబులయ్యె.
అరుణ ఘూర్ణితములై యక్షులు మెఱయఁ । దరమిడి యతిఘోరదండంబు దాల్చి
కమనీయ నీల పింగళ దేహమమర । జముఁడు నొక్కొకవేళ సకలప్రజలకు
ఘనముగా నదె యిదె కానంగ వచ్చె । ననఁగ నదృశ్యుఁడై యట విహరించె.
పరికింప గూబలపగిదిఁ గీరములు । అరయ రాత్రులయందు నఱవంగఁ దొడఁగె.
నలి దివంబులయందు నక్కలయనెడు । కొలఁదిగా మేకలు కూయంగఁ దొడఁగె.
ఆవుల కడుపు లత్యద్భుతంబగుచు । భావింపఁగా గార్దభంబులఁ గనియె.
ముంగుల కుదయించె మూషికప్రతతి. । సంగతిఁ బిల్లుల సారమేయములు
గనియెఁ; బిచ్చుకలెల్లఁ గాకుల నీను. । పసివడి హరియును బలుఁడును దక్కఁ
దక్కిన యాదవతతి బ్రాహ్మణులను । దక్కక బాధించుఁ; దగలజ్జవిడుచు;

మఱి గురులకు నవమాన మొనర్చు; । అఱలేక పెద్దల నట భంగపెట్టు.
పాయక సతులెల్ల భర్తల వనుపు । సేయ కెంతేనియు స్వేచ్ఛావిహార
ములఁ దగులుచుఁ జిత్తముల కెట్లువచ్చు । వలనుగా నట్టుల వర్తించి రధిప !
ఒనరఁ గృశానుండు హోమకాలమున । ఘనత నానా భూతి కాంతులతోడఁ
దనరెడు నుగ్రగంధము రౌద్రమొసఁగ । ... ... ... ... ...
నవని వామావర్త నార్చుల తోడఁ । గవిసి ధూమంబు లగ్గలములై తోఁచు.
పరఁగఁ గూడ్గూరలు పాకంబు చేసి । తిరముగాఁ బొయివాపి దింపినయపుడు
కలయంగఁ బుర్వులగ్గలముగాఁ బుట్టి । మిల మిల మనుచును మెలఁగుచునుండు.
అనుదినంబును నందు నశుభముల్ చాల । ఘనముగాఁ దోఁపంగఁ గని సర్వవిదుఁడు
నరిమర్దనుం డంత నంతరంగమునఁ । బరికించి యంతఁ దప్పక తత్వమెఱిఁగి
"గాంధారి పుత్ర శోకంబునఁ జేసి । బంధురం బైన శాపంబిచ్చె 'వీరు
వరుస ముప్పదియాఱు వర్షంబులకును । ధరణి నన్యోన్య యుద్ధంబునఁ జత్తు'
రనుచుఁ, జర్చింపంగ నయ్యేడు వచ్చె. । పనివడి తప్పదు ఫలియించు నిజము.
ధీమతి నందుకుఁ దీర్థ సమీప । భూమి యయ్యెనఁ జాలఁ బుణ్యంబు గాదె !"
అని నిశ్చయము చేసి యంబుజోదరుఁడు । గొనకొని యటఁ బెన్కొలువులోపలను
జెలువొప్ప జాతర సేయఁ బోవలయు । జలనిధి కనుచు నిశ్చలభక్తితోడఁ
బెద్దలకెల్లను బెంపారఁ జెప్పి । తద్దయు వేగ నాదామోదరుండు
పురములో నావార్త పొందుగానొకని । సరసవిస్ఫూర్తిని జాటంగఁ బనిచి,
పెనుపొంద భక్తితోఁ బెద్దల ననిచి । చనియె నభ్యంతర సదనంబునకును.
కలయంగ నాధాత్రిఁగల యెల్లవారు । నలిఁ గోరదాడలు నల్లనిమేను
గలకాంత యొక్కతె గడుశీఘ్రవృత్తి । నిలుచొచ్చి భామల నీడుచుకొనుచుఁ
బోవంగ, శస్త్రముల్ భూషణంబులును । ఆవేళ రాక్షసుల్ హరియించుటయును
గని; రంతలోనఁ దక్కక మఱునాఁడు । ఎనయ వైశ్వానరుఁ డిచ్చిన యట్టి
ఘనసుదర్శనమును గరుడకేతనము । ననిచిన పాంచజన్యంబును మఱియు
నులలితంబై యున్న సుగ్రీవసైన్య । ములు వలాహకమును మొదలుగాఁ గలుగు
హయముల నొప్పైనయట్టి రథంబు, । రయమున విను నీఁగి రాజితధ్వజము
సకలజనంబులు సరవిఁజూడంగ । సకలంక విస్ఫూర్తి సడగె నద్దివికి.
"తెలివితోఁ గదలుఁడు తీర్థయాత్రకును । అలవడ నివ్వేళ నాలస్యమేల !"
యనుచు విస్ఫుటముగా నంబరస్థలిని । బనివడి దేవతల్ పలికి రంతటను.

## యాదవులు కృష్ణసహితులై సముద్రతీరమునకుఁ బోవుట

అవి గని వినియును యాదవోత్తములు । నవరణ లోప్పార సంభ్రమంబునను
దలఁకక యవిరళోత్సాహులై యపుడు । పొలుపొంద మధుమాంసములు కడుఁజాల
నమకట్టి మఱియుభోజ్యములు భక్ష్యములు । ప్రమాదాన్న పాన లేపములుఁబుష్పములు
నక్షతంబులును ధూపాదులు మఱియు । నక్షయంబుగఁ గొని యధికభారమునఁ
దలలఁ గావళ్ళను దనర మోపులను । వలనుగా ధరియించి వరుస నేతేర,
నవనిఁ గొందఱు బండ్ల నధికంబు గాఁగ । నవడిమైఁ బూరించి చనుదెంచుచుండ
గజములు గుఱ్ఱముల్ ఘన రథంబులును । విజయత్వమున నెక్కి వేడుకతోడ
నరస వాక్యంబుల సంగీతములను । బరిహాసముల భావభరితులై మిగిలి
మఱికొందఱరుదేర, మధుసూదనుండు । నఱిముఱి నెంతయు నరదంబు లేమి
నొండొక రథము సముద్ధతి దార । కుండు తెచ్చిన నెక్కి యొప్పుగాఁ గదలె.
తోడవులు వస్త్రముల్ తొంటిరీతులను । కడువేగ ధరియించి కడఁక దీపించి
పూని యుఱుంచుకమైన పొదుపైన వికృతి । లేని చిత్తంబు గల్గిన సీరపాణి
యేమి వాహనమును నెక్కక కీర్తి । ధాముఁడై మిత్రులుఁ దానును వెడలె.
ఆందోళికాది వాహనముల నెక్కి । యందంద చనుదెంచి రంగనామణులు.
ఈరీతి యాదవు లేపుదీపించి । ధీరులై వారిధి తీరంబునందు
నరిగి మున్నొనరించినట్టి చప్పరము । లరుదుగాఁ గైకొని యటఁ బ్రవేశించి
యుండునంతటిలోన నుద్ధవుండర్థి । దఁడిగా నొంటిమైఁ దపమొనరించు
వాఁడుగాఁ బలికిన, నరున నొక్కరుఁడు । పోఁడిగాఁ బలుక కప్పుడ యూరకున్న,
సర్వజ్ఞుఁడైనట్టి చక్రహస్తుండు । పర్వ యొండేయియుఁ బలుకక మ్రొక్కి
వీడుకొల్పుటయు నవ్వీముల పుణ్యుండు । నోడక చనుచుండ నొగి హాలధరుఁడు
పరువడి వినయంబు భక్తియు మెఱయ । సరుదుగా నాతని ననుపంగఁ బోయి
యాయుత్తముని(బుచ్చి యంత నొక్కరుఁడు । పాయక యొక విటపముక్రింద నిలిచి
యతుల నిరస్త మోహాంధత్వ మెనఁగ । మతి గిల్లి కూర్చుండె; మఱియు నచ్చటను
దగ విప్రభోజన తంత్రంబు దీర్ప । నగణితంబుగఁ దెచ్చినట్టి వస్తువులు
నతులెల్ల నాఁగఁగా సకల యాదవులు । మతి దప్పి పెట్టిరి మర్కటంబులకు.
పదపడి వాద్యముల్ బలునిడి మ్రోయ । నుదధి గంధాదుల నొనరఁ బూజించి

యలవడ హృద్య పదార్థంబు లెల్లఁ । జెలఁగి నైవేద్య మిచ్చిరి ప్రీతితోడ.
తదనంతరంబ యాదవు లానవంబు । కొదలేక కనకంపుఁ గోరలఁ బుచ్చి
హరిసన్నిధానంబునందుఁ గ్రోలుచును । సరవిమైఁ గృతవర్మ సాత్యకి గదుఁడు
చారుదేష్ణుండును సాంబుండు వృకుఁడు । మారుఁడు మొదలుగా మఱియును గలుగు
యాదవులెల్ల నత్యధికంబు గాఁగ । వేదితంబుగఁ బానవిధి యొనరించి
మదమగ్గలంబుగా మసలి పాఱుచును, । వదలక పాడుచు, వ్యక్తంబుగాని
పలుకులు పలుకుచుఁ బరఁగ నవ్వుచును । బలువుగా బడబడఁ బాఱుచు, మిగుల
నేత్రంబు లెఱ్ఱనై నిరతిఁ జొక్కుచును, । గాత్రంబు లెఱుఁగక కడఁగి వర్తింప,
నయ్యవసరమున నక్షులఁ గెంపు । చయ్యనఁ గాన్పింప సాత్యకి చెలఁగి
వరునతోఁ గృతవర్మ వదనంబు చూచి । పరికింప మద మెలర్పఁగఁ దనయొద్ద
నిలిచిన ప్రద్యుమ్ను నెమ్మి రమ్మనుచుఁ । జలమున నతని చే చఱచుచు మిగుల
నవమాన మేర్పడునట్టి రీతులను । దివిరి నవ్వుచు నంతఁ దెంపుమైఁ బలికె:

## సాత్యకి కృతవర్మల వాక్కలహము

"నిదురయుఁ జావును నెఱి నొక్కటరయ; । వదలక యట్లున్న వైరివర్గముల
బలిమి గల్గినయట్టి పాపాత్ముఁడైన । నెలమితోడుత వధియింపఁగఁ జొరఁడు.
యాదవ వంశంబునందు జన్మించి । యీదురాత్ముఁడు చంపె నిట ద్రౌణిఁగూడి.
ఏపుమైఁ దనమీఁద నెదురించెనేనిఁ । బ్రాపుగాఁ బొడుచుట బంటుతనంబు.
ఇది యెంత కార్యమే! యిస్సిరో!" యనిన । నదనుగాఁ బ్రద్యుమ్నుఁడనియె నాతనికి:
"వృష్ణివంశోత్తమ, విదిత ప్రతాప, । జిష్ణుసంకాశ, సుస్థిర భోగవిభవ,
వసుధలో నీకిది వాక్రువ్వనేల! । మసలక జనులెల్ల మఱి వీనిఁ బ్రువ్వఁ
దిట్టుట చాలదే? ధృతి నిట్టిమాట । నెట్టనంబుగ నేల నేఁ" డన్న. నవ్వుచు
కృతవర్మ సాత్యకిఁ గినుకతోఁ జూచి: । "క్షితిలోన నక్కటా! సిగ్గేమిలేక
యొరుల కయ్యము నిట నుగ్గడింపఁగఁ । బరఁగునే! నీవెట్టి బంటవు చెపుమ?
అమరేంద్రతనయుండు హస్తంబు నఱక । విమలతఁ బ్రాయోపవేశనవృత్తి
నైకొనియున్న యాఘను సోమదత్తి । వీఁకమైఁ దల ద్రుంచివేయవే యకట!
ఇది పోరుపాడియే! యిది బంటుతనమె? । వదలక" యనిన నవ్వాసుదేవుండు

కడు నెఱ్ఱనైన క్రీగంట భోజేంద్రుఁ । డడయక చూచె; నంతట సాత్యకియును
హరితోడఁ "గృతవర్మ ననుజుఁడై నట్టి । శతధన్వుఁ డుచితంపు సంగతి మాలి
సతత పుణ్యాత్ముని శతక్రతు విభవు । సరవి సత్రాజిత్తుఁ జంపఁడే మున్న !
మహిని శమంతక మాణిక్యమునకు । విహితంబుగా." నని వెసవారిదెసను
గీడు గాన్పింపఁ బల్కిన, సత్యభామ । పోఁడిగన్నుల నశ్రుపూరంబు గ్రమ్మ
హరియగ్రతలమున కరుగుదెంచుటయు । సరసిజాక్షునకు రోషము జనియించి
దానినీక్షింప, సాత్యకి కేశవునకు । మానుగా సత్యభామకుఁ బ్రియం బెసఁగ
డొనరింతు నేనని యుగ్రుఁడై యపుడు । కినుక రెట్టింపంగఁ గెంపారుచున్న
వదనంబుతోడుత వసుధ గంపింప । విదిత శౌర్యప్రభా విఖ్యాతి మెఱయఁ
గృతవర్మఁ జూచి మిక్కిలి రభసమున । "నతులితంబుగ నిత్తఁ డాచార్యసుతుఁడు
తోడుగా శ్వేతుఁ దత్సోదరప్రతతి । నోడక ద్రౌపదేయుల రాత్రి చంపి
నట్టి పాపాత్ముఁడీ యవనిలోపలను. । గట్టిగా వారలగతి వీనిఁ బట్టి

## మద్యపానమత్తుఁడైన సాత్యకి కృతవర్మ తల నఱకుట

చంపుదు నే." నని సంయమిప్రవరు । పెంపైన యాశాప భీకరశక్తి
కరము ప్రసిద్ధంబుగా నూనినట్టి । కరఖడ్గమున వాని ఖండించివైచె.
ఆరీతిఁ గృతవర్మ నవనిపైఁ గూల్చి । ధీరుఁడై నిజఖడ్గదీప్తులు మెఱయఁ
గవిసినఁ జూచి యాకంజనాభుండు । అవిరళగతి వాని నాఁగఁ బోవుటయు
నంతకు మున్న యత్యాహవోత్సాహ । మెంతయుఁ గనిపించి యేపు దీపించి
భోజు లంధకులును భువినొక్కటగుచుఁ । దేజంబుతో నార్చి తిరుగువాఱుటయు,
యాదవేంద్రుఁడు చాల నలుక వచ్చియును । వేదవేద్యుఁడు కాలవేదియుఁ గానఁ
దమ్మునిఁ గాచెడుతలఁ పొల్లఁడయ్యె. । సమ్మదంబున నంత శంబరారాతి
సాత్యకి మిక్కిలి సంతోష మంద । నత్యంత శౌర్యవిఖ్యాతుఁడై మెలఁగె.
ఆవేళ దేవత లంబరవీధి । వావిరి మూఁకలై వచ్చిచూడంగ
వృష్ణి భోజాంధక వీరు లీరీతిఁ । గృష్ణుఁ డీక్షింపంగఁ గినుక రెట్టించి
యార్పులు బొబ్బలు నడరు హుంకృతులు । దర్పిత సింహనాదంబులుఁ జెలఁగఁ
గయ్యంబు సేయంగఁ గాలు ద్రవ్వుచును । ముయ్యంచు తుంగయే మూలంబుగాఁగఁ

దలకొని పోరి రుదగ్ర శౌర్యమున । వెలయంగ భూనాథ, వినుము చెప్పెదను.
మునిశాప సంభవ ముసల మాశ్చర్య । మును నతి దారుణమ్ముగను నయి మిగుల
ఘనశక్తితోడఁ దుంగను బ్రవేశించి । తనవిస్ఫురత్కాంతి తగఁ గలిగించె.
పొడిగాఁగఁ జేసి యంబునిధి లోపలను । ననుకొని చల్లించినను జెడదయ్యె.
మౌనిశేఖరుల సామర్థ్యంబు కతన । మానితంబుగ విను మనుజాధినాథ !
మద్యపానోద్భూత మదము రెట్టింపఁ । బ్రద్యుమ్న సాత్యకి ప్రభృతులంధకులు
సాంబాది సూనులు సమరంబు చేసి । యంబుజలోచనుఁ డట చూచుచుండ
సమసిన మునివరు శాప ప్రభావ । మమరంగఁ దనచిత్తమందుఁ గోపాగ్ని
జనియింప దురములోఁ జావకయున్న । ఘన శౌర్యధుర్యులఁ గనలి వీక్షించి
తుంగలఁ గొనివ్రేసి దుర్దాంతమహిమఁ । ద్రుంగించె వారల దురములోపలను.
శ్రీకృష్ణుఁ డీరీతి శేషించి నట్టి । ప్రాకట శౌర్యులఁ బట్టిచెండాడి
చలమొప్ప గాంధారిశాపంబుఁ దలఁచి । నిలిచున్నఁ, గనుఁగొని నెఱి యుద్ధమందుఁ
బడని దారకుఁడును బభ్రుండుఁజేరి । కడఁకతోఁ బల్కిరి : "కంజదళాక్ష !
సకలజనంబులుఁ జచ్చి ; రిచ్చోట । నకలంకగతి నిల్వనగునె ! బలుండు
నెలకొని యెచ్చోట నిలిచినవాఁడొ ! । యిలఁ బరామరిసించి యెసఁగ నామీఁద
ననుగుణంబగు కార్య మాచరియింపు, । చను." మన్న నందుకు సమ్మతిపడుచు
వారలుఁ దానును వదలక యపుడు । సీరి పోయిన త్రోవ చేకొని పోయి
జననాథ, యొక మహీజము పొంతనున్న । ఘనుని హలాయుధుఁ గరమొప్పఁగాంచి
దారకుదెస చూచి దామోదరుండు । సీరాయుధుఁడు వినఁ దెలఁగి యిట్లనియె :

### అర్జునుఁ దోడ్తేరఁ గృష్ణుఁడు దారకునంపుట

వేగంబుగా నీవు వేదండపురికి । బాగొప్పఁ బోయి యప్పాండవేయులకు
యాదవక్షయమెల్ల ననువుగాఁ జెప్పి । సాదర మెసఁగ విజయుఁ దోడితెమ్ము."
అనవుడు దారకుఁ డంగీకరించి । తనరంగ వేగవంతములైనయట్టి
తురగ రత్నముల నుద్ధురముగాఁ బూన్చి । వరరత్నకాంతులు వసుధ నిండంగ
మించిన రథమెక్కి మేదినీనాథ, । యంచితగతి నేఁగె హస్తినాపురికి.
ఇట నంబుజోదరుం డిత్తెఱంగెల్లఁ । బటుతర బుద్ధిమైఁ బాటించి చూచి
యీకాంతలును మఱి యిఁకనేలయనుచుఁ । బ్రాకట విస్ఫూర్తి బభ్రుని బిలిచి

"కరితురగాదులఁ గామినీమణులఁ । బురి జేర్చి యరుదెమ్ము పో." మ్మని యనుప,
నా బభ్రుఁ డామాట లంగీకరించి । ప్రాబల్యముగ శౌరిభామల నెల్ల
కరులను ఘనతురంగములను గొనుచు । నరుగంగ నొకబోయ యత్యద్భుతముగ
నా తుంగ చేపట్టి హరి చూచుచుండ । నాతనిపై వ్రేయ నవనిపైఁ ద్రెళ్లె.
ఈరీతి బభ్రుఁడాయిలఁ గూలుటయును । నారాయణుండు శ్రీనాథుఁ డచ్యుతుఁడు
మునిశాపవృత్తాంతమున కరుదంది । ... ... ... ... ...
తమయన్నతోడుతఁ దప్పక పలికె : । "కమలదళాక్షుల ఘనఘోటకముల
నరదంబులను నిప్పు డతి శీఘ్రవృత్తిఁ । బురిఁ జేర్చి వచ్చెద ; భూజంబుకడనె
యనఘాత్మ, నే వచ్చునందాఁక నిలుము. । అని గజాదులఁ గొని యటఁబురి కేఁగి
వసుదేవుఁ గాంచి యవ్వసుమతీశునకు । మసలక మ్రొక్కి ప్రేమమున నిట్లనియె :
"కడఁకతో విను తొల్లి కౌరవక్షయము । పొడగంటి ; నిప్పుడు భూమిలోపలను
సకల యాదవులును జావఁ జూచితిని. । అకలంకమతి నిటు నఖిల బాంధవులు
హీనమయ్యెనవీట నేనిల్వఁజాల. । కానల కేఁగి సౌఖ్యంబు దీపింప
బలభద్రుతోఁ గూడ భవ్యతపంబు । నెలమితో నే నాచరించెద వినుఁడు.
చనవొప్ప మీరింక సర్వంబు నరసి । కొనుఁ డంతలోన ఫల్గునుఁ డేగుదెంచి
మీపంపు సేయు నర్మిలితోడ." ననుచు । నా పద్మనాభుఁ డొయ్యనజాఁగి మ్రొక్కి
ముకుళిత హస్తుఁడై ముందట నున్న । సకలంకమతి విభుండంతకుమున్న
యాదవుల్ దెగిన వృత్తాంత మంతయును । వేదనఁ బొందుచు విని కుంది యంతఁ
బలుజీవి పోయినపగిది మ్రాన్పాటు । కలయంగ వర్తింపఁ గన్నీరు నించి
శవముకై వడి నున్న సకలభామలును । వివిధరీతుల నేడ్వ, విశ్వంభరుండు
దయమీఱ వారలఁ దగ నాశ్వసించి । "రయమున సప్పాండురాజనందనుఁడు
వచ్చు నర్జునుఁడు మీవంతల నెల్ల । నచ్చుగాఁ దీర్చు నియ్యెడ శోక మేల!"
అనియని మధురవాక్యంబులఁ దేర్చి । జనకుని యెదుటను జక్కఁగూర్చుండి
యాతని పాదంబు లర్థి నొత్తుచును । భ్రాంతిగాఁ జిత్తవిభ్రమ మెల్ల మాన్చి
పరఁగ నర్జునురాక పల్మారు చెప్పి । యరయుఁడు కరితురగాదుల ననుచుఁ
దమతండ్రి వీడ్కొని దామోదరుండు । క్రమ మొప్ప బలుఁడున్నకడకు నేతెంచి,
వినతుఁడై జనకుని వృత్తాంతమెల్ల । ఘనముగా నెఱిఁగించెఁ గౌరవనాథ!

## బలరాముఁడు శరీరము విడిచి యనంతునియందుఁ గలియుట

తదనంతరంబ మాధవుఁ డచ్యుతుండు । వదలక బలభద్ర వదనపద్మమున
నరుదుగా వెడలంగ నప్పు డీక్షించె । నరుణకాంతులఁ జాల నందంబుగాఁగఁ
బొలుచు వక్త్రసహస్రమును దివ్యమైన । కలిత మాణిక్యముల్ గల ఫణంబులును
ప్రాలేయ భూధరాభంబైన మేను । నోలిమైఁ గలిగిన యొక భుజంగంబు
నీలాంబరుఁడు రౌహిణేయుఁడు బలుఁడు । తాలాంకుఁ డచలుఁ డుద్ధతి యోగబలము
ఘనత దీపింపంగఁ గాయంబు విడిచి । చనియె వియద్వీధి శంబర నిధికి.
అంతలో వరుణుండు నమ్మహాత్మునకు । నెంతయు భక్తితో నెదురుగా వచ్చె.
అహికులాధీశ్వరు లందఱుఁ గడలి । బహుతర సంతోష పారవశ్యమున
ఘనుఁడైన వాసుకి కర్కోటకుండు । గొనకొని తక్షక కుంజర కుముద
వారణ దుర్ముఖ వక్రదంతాఖ్య । భూరి పృథుశ్రవ పుండరీకులును
హ్రాదుండు శంఖుండు నజితుండు మిశ్రి । క్రోధుండు ధృతరాష్ట్రకుఁడు మొదల్ గాఁగ
నరుగుదెంచిరి ప్రీతి నహికులోత్తములు, । (పరమకౌతుకమున ఫణిరాజుఁ గొలువ)
గంగయు యమునయుఁ గావేరి పెన్న । తుంగభద్రయుఁ గృష్ణ తోయాత్మయగుచు
వలనైన యాసరస్వతియు గౌతమియుఁ । దలకొని శోణభద్రయు ఫల్గుణియును
మొదలుగాఁ గలిగిన పుణ్యవాహినులు । నదనుగా నేతెంచె నద్దేవుఁ గొలువ.
ధరణి నత్తఱిఁ గెల్లఁ దనదివ్యదృష్టి । హరి చూచుచుండంగ నమ్మహాత్ముండు
పొసఁగ ననంతునిమూర్తితోఁ గలిసె, । అసదృశంబుగ విను మవనీతలేశ !
అట్లగ్రజుఁడువోవ నచ్చోటు వాసి । నెట్టన నంత నా నీరజోదరుఁడు
మునుకొని భూలోకమునఁ గల్గునట్టి । పనులెల్లఁ దీఱుట పరికించి చూచి
తనువు ముక్తికి నిమిత్తంబును దలఁచి । ఘనులైన మునుల వాక్యంబు లూహించి
వలను మీఱంగ దుర్వాసుండు దొల్లి । కలితావయవములఁ గడఁగి పాయసము
పూయునాఁ డరకాలఁ బూయకయున్న । నాయెడ నవిలంఘ్యమై యపాయంబు
గలుగు నీకనిన వాక్యములు చర్చించి । జలనిధిలోపల శయనించునట్టి
ఘనుఁ డాదిదేవుండు కంజనాభుండు । మునుకొని భూస్థలంబునఁ బవ్వళించె.

## శ్రీకృష్ణుఁడు పరమపదము చేరుట

అంతలోపల జర యళుకుచు వచ్చి । యెంతయు నొకబోయ వీక్షించి యచటఁ
గమలనాభుని దివ్యకాయంబు చూచి । ప్రమదంబుతోడఁ దప్పక తెంకి నొక్క-

మృగ మేఁగు నట్లుగా మెల్లన మాయ । యగణితంబుగఁ జేసి యటనావహించె.
ధరణీశ, యాబోయ తగురభసమున । శరము చాపంబున సంధించి పొంచి
యొనయంగ దృఢముష్టి నేపుమైఁ దిగిచి । ఘనముగా నేసినఁ, గంజాక్షు పాద
తలము దూరఁగాని తచ్ఛరంబంత । వెలయంగ మీఁగాలు వెనువెచ్చిపోయె.
అంత శస్త్రంబున కతఁడేఁగుదెంచి । యొంతయుఁ దెలియంగ నీక్షించి పురుషుఁ
డగుట యెఱింగి యత్యంతశోకమున । వగచి దేహంబెల్ల వడవడ వడఁకఁ
బాదపద్మములపైఁ బడి యేడ్చుటయును । ఆదరంబెసఁగ నూరార్చి కృష్ణుండు,
రమణమై తన మనోరథ మిట్టిరీతిఁ । గ్రమమొప్ప నీడేరఁగా నంతలోన
మానుష దేహంబు మఱి విసర్జించి । పూనిక వైకుంఠపురమున కరిగి
పావనంబుగ నిజపదవి చేకొనిన, । దేవదేవుని సర్వదేవతామయుని
నక్షయు నక్షీణు నమలాత్ము నజరుఁ । బక్షివాహను నీశు భవరోగవైద్యు
మూఁడుమూర్తులు నేకమూర్తియై మిగులఁ । బోఁడిగా వెలసిన పుణ్యాత్ము నభవుఁ
గనుఁగొని సిద్ధులు గంధర్వవరులు । ననిమిషవర్యులు నాదిరుద్రులును
ద్వాదశాదిత్యులు వసువులు మునులు । నాదితేయాధీశుఁ డబ్జగర్భుండు
మొదలైన దేవతల్ మొగి నేఁగుదెంచి । పదపంకజములకు భక్తితో మ్రొక్కి
ముకుళిత హస్తులై " పురుషోత్తమాయ । ప్రకటిత దానవ ప్రధ్వంసకాయ
దేవాదిదేవాయ దివ్యరూపాయ । భావనాతీతాయ భవసంహరాయ
జలరుహబాంధవ శశిలోచనాయ । జలజనాభాయ కృష్ణాయ లోకైక
రక్షణ బుద్ధయే, ప్రథితాత్మకాయ, । అక్షయరూపాయ హరసన్నుతాయ,
గరుడధ్వజాయ భక్తశరణ్యకాయ, । పరమేశ్వరాయ తుభ్యంనమో." యనుచు
వినుతించి పూజించి వినయంబు మెఱసి । యొనరంగ సేవింపుచుండిరి ప్రీతి.
అవనీశ వినవయ్య యంత నిక్కడను । అవిరళగతి మీఱ నంత దారకుఁడు
కరిపురంబున కేఁగి ఘనులఁ బాండవుల । నరగునఁ బొడగని సంయమీశ్వరులు
యాదవకుల మెల్ల నణఁగంగఁ దొల్లి । సాదరంబెడలంగ శపియించుటయును,
జలధితీరమున నాసవపాయులగుచు । నలవడ వృష్ణిభోజాంధ కోత్తములు
మునివర నిర్దిష్ట ముసలాత్మకంబు । లనయంబునైన ముష్టులంచు తుంగలను
మోఁదులాడుటయును మునుమిడి సకల । యాదవోత్తములెల్ల నవనిఁ జచ్చుటయు,
నొగి రామకృష్ణుల యునికియుఁ, దన్ను । నగధరుండంపినయట్టి వర్తనము,

కరతలామలకంబుగాఁగ సర్వంబు । దిరముగాఁ జెప్పిన ధృతియెల్లఁదూలి
యతుల శోకాక్రాంతుఁడై యేడ్చుచుండ, । ధృతి చెడి యిట ద్రౌపదీప్రముఖాంగ
నలు పెద్దవాపోయిరంత దారకుఁడు । బలభేదినుతుతోడఁ బలికె నిట్లనుచు :
" నిను దోడితెమ్మని నీరజోదరుఁడు । పనివడి యంపినఁ బనివింటినేను.
తామసంబేటికి త్తఱి శీఘ్రవృత్తి । వేమఱు నే తెమ్ము విధువంశతిలక ! "
అనిన దారకుఁ జూచి యమరేంద్రసుతుఁడు । "ఘనుఁడ, యాదవకులక్షయమునాచెవుల
వినియుఁ గాల్పోఁదునే ! వేగంబె వత్తు. " । అని ధర్మపుత్రుని యనుమతి వడసి
యరదంబుపై నెక్కి యతిశీఘ్రవృత్తి । నరిగి ద్వారకచొచ్చునంతలోపలను
బురుషుండు చచ్చినపొలఁతియు, సోముఁ । డరుదుగాఁ గ్రుంకిన యట్టిరాత్రియును
బోలెఁ గృష్ణుఁడులేమిఁ బొలుపెల్లఁ దక్కి । చాలశూన్యంబైన, సంతోష మెడలి
యొనయంగ నేటికి నెదురీదు వగిదిఁ । జనుదెంచి పురజనుల్ సరవిమైఁ జూడ
నగరు చొచ్చుటయును నలినాక్షులెల్ల । మొగమున నశ్రువుల్ మునుమిడిఁగప్పఁ
గా శోకవార్ధిలో ఘనముగా మునిఁగి । లేశమైనను దెల్విలేక మూర్ఛిల్లి
యొకకొంత ప్రొద్దున కొయ్యన దెలిసి । ప్రకటించి వచ్చిరి పార్థుపాలికిని.
అంత వారలఁ గాంచి యమరేంద్రసుతుఁడు । సంతోష మెడలి యచ్చటఁ దేరుడిగ్గి
భూమిపైఁ బడి వడిఁ బొరలాడి యేడ్చె ; । నేమిచెప్పఁగవచ్చు నిందుకు లేశ !
పరిపంథులకునైనఁ బరఁగుడెందములు । కరమేది ద్రవ్యులు గా వగదాఁకు.
మఱి యంత సత్యభామయు రుక్మిణియును । అఱిముఱిఁ దక్కినయట్టి భామలును
మాకు దిక్కెవ్వరీమహిలోన ననుచుఁ । బ్రాకటగతి నేలఁబడి యేడ్చిరంత.
శ్వేతవాహనుఁడు చెచ్చెరఁ దనుదాన । బ్రాఁతిఁ దేర్చికొని సంభావ్యంబు గాఁగఁ
దరుణుల నూరార్చి తదనంతరంబ । పరిపరి విధములఁ బలవించి వగలఁ
బొగులుచు సెజ్జపైఁ బొరలెడు వాని । ... ... ... ... ...
యాదవోత్తములెల్ల నడఁగిన దిక్కు । ... ... ... ... ...
లేని దుఃఖమున విలీనత్వ మొనఁగ । ... ... ... ... ...
పలురోదనంబునఁ బ్రభ యెల్లఁ దక్కి । తలఁకి యొంతయును వేదనఁ బొందు వాని,
బలదేవ కేశవుల్ పట్టణంబునను । గలయంగ లేమికి గాత్రంబు వణఁకఁ
దన్ను దానెఱుఁగక తాపంబు చెంది । చెన్నుగా నెంతయుఁ జింతించు వాని

## అర్జునుఁడు స్వజనక్షయ దుఃఖితుఁడగు వసుదేవునిఁ గాంచుట

వసుదేవుఁ గనుఁగొని వసరుచునుండ । వసమున నాతఁడొయ్యన లేచి క్రీడిఁ
గౌఁగిటఁ జేర్చి గద్గదికంబు లడఁచి । "ఘనులైన బిడ్డల కారణదోష
మునఁ బరస్పర యుద్ధమును జేసి దెగిరి. । వినుము నీశిష్యులై వెలసినయట్టి
సాత్యకియును బంచశరుఁడును దొలుత । నత్యర్థముగఁ బోరి యడఁగిరి నిజము.
ఒనరంగ సాత్యకియును గృతవర్మ । యును రేఁచఁగాఁ బుట్టె నొగి సంగరంబు
రమణీయులైన వారల దూఱనేల ? । సమధికంబగు మునిశాప ముండఁగను.
ఇంతేసి వసులయ్యె నింద్రతనూజ ! । యెంతయు నింక నేనేమి నేయుదును !
తనయిచ్ఛ వచ్చిన దైత్యమర్దనుఁడు । ఘనముగా మూఁడులోకములు చచ్చినను
నెలకొని బ్రదికించు నిమిష మాత్రమున, । మెలవుతోడుత మున్ను మృతుఁ బరీక్షితుని
బ్రదికించెఁ గాదె ! నాభాగ్యమిట్లుండె. । ఇదె నేఁ డుపేక్షించె నేమనఁ గలదు."
అనునెడ ఫల్గునుండంతరంగమున । "ఘనమైన హరియుపేక్షయె చెప్పెనితఁడు ;
హరిఁ గూర్చి శోకింపఁ ; డదిగాన నిపుడు । సరసిజాక్షునకునై సందేహమేల ! "
యని మదిఁ జర్చించె ; నట వసుదేవుఁ । డనియె నర్జునుతోడ : " ననఘాత్మ, వినుము
సకల యాదవులును సంయమీశ్వరుల । ప్రకటశాపమున నుద్భవమైన యట్టి
ముసలంబు తుంగలై మొగి జనియింప । నసదృశ విస్ఫూర్తి నాతుంగలందు
నన్యోన్య నిహతులై యాదవులెల్ల । నన్యాయముగఁ జచ్చునంత నిక్కడకుఁ
గరులఁ దేరులఁ దురంగముల భామలను । అరుదుగాఁ గొనితెచ్చె నాకృష్ణుఁ "డనినఁ
దల్లడంబంది యంతట ధనంజయుఁడు । "ఎల్లగా శ్రీకృష్ణుఁ డెచ్చోటి కరిగె ? "
నని తన్ను నడిగిన నవ్వసుదేవుఁ । డెనసి కన్నీరొల్క నిట్లని పలికె :
"వినవయ్య ఫల్గున, విశదంబుగాఁగ । వనమాలి మాధుర్య వాక్యంబులందు
నన్ను నూరార్చి యెంతయును నాతోడఁ । గ్రన్నన నిట్లను ఘనులు యాదవులు
విధివశంబునఁ జేసి విను చలంబునను । అధికంబుగాఁ గూలి రవనీతలమున.
చెప్పిపుచ్చిన వాఁడ జిష్ణునకేను । అప్పుణ్యుఁ డిప్పుడ యరుదెంచు నిటకు.
నీయెడ భక్తుండు నిను గొల్చియుండు ; । ధీయుక్తుఁ డర్క సందీప్త తేజుండు ;
కార్యజ్ఞుఁ డత్యంతకారుణ్యమూర్తి ; । శౌర్య సమగ్రుండు సత్యసంధుండు.
నెలకొని యాతఁడు నేను నసంగ । సొలవక శేద మించుకయైన లేదు.

అదిగానఁ గరితురగాదుల నెల్ల । వదలక యాతని వశముగావించి
జననుతముగ బంధుజనములఁ గాచి । కొనుమ ; యీనగరంబుఁ గొన్ని దినముల
సర్వతోముఖనిధి సరిముంపఁ గలదు. । సర్వయాదవులును జావక మున్న
బలదేవుఁ డడవిఁ దవః ప్రౌఢి గలిగి । వెలసియున్నాఁ ; డింక వేయును నేల
సరవితో నొండు విచారంబు లుడిగి । చిరమతి ననుమతి సేయు మప్పనికి.
ఏను బోయెద నిదె ; యే తెంచుఁ గ్రీడి ; । మానవేశ్వర, యనుమానంబు దక్కి.
ఆతండు మృతులైన యాదవోత్తముల । కాతతగతిఁ జేయు నగ్ని కార్యములు.
ఘనముగా నాతఁడే కాలాంతరమునఁ । బనిఁబడి భవదీయ పరలోకవిధుల
నొనరించు.” నని నాకు నొడఁబడఁ జెప్పి । యనఘాత్ముఁడగు హరి యడవికిఁబోయె
ఆతఁడు సెప్పిన యట్టుల చేయు. । మీాతజె నొక్కటి యెఱిఁగింతు నీకు.
పెనుపొందఁ బీనుఁగు పెంటలై పడిన । తనయుల నెల్లను దలఁచి తలంచి
మదియెల్లఁ గలఁగంగ మఱి రుచియగునె । అదనుగా నెంతయు నన్నపానములు.
వనితలఁ బ్రజలను వారణంబులను । ఘనవస్తువులఁ దురగముల నీవరయు ;
పనివడి కృష్ణునిపలుకు చెల్లింపు.” । అన విని ఫల్గును డావాసుదేవు
హృదయమెఱింగి యెంతేనియు వగచి । పదపడి యిట్లని పలుకు : “భూనాథ !
వేదాంతవేద్యుండు వెన్నుండు లేని । యీ దేశమున వసియింపఁ జిత్తంబు
ధరణిలోఁ గొలుపునే ! ధర్మజభీము । లరయంగ మిక్కిలి యతివ పాంచాలి
యును నేకమనసున నొగి నిట్టి తెఱఁగు । వెనయంగ మును నిశ్చయించినవారు.
బాలుర భామలఁ బరఁగు ధనంబు । పోల నింద్రప్రస్థ పురవరంబునకు
నుతగతి నీవు మున్నుగఁ గొనిపొమ్ము. । తతభంగిఁ దప్పనే దైత్యారివలుకు !”
అనిపల్కి పౌరుల నపుడు రావించి । పనివడి వారితోఁ బలికె నర్జునుఁడు :
“కారుణ్యమతులార, కలితాత్ములార, । ద్వారకాపురి సముద్రము ముంచు నేఁటి
కేడుదినంబుల కేపుతో ననుచు । వాఁడిగా నాకాశవాణి భాషించె :
పొసఁగ నింద్రప్రస్థపురవరంబునకు । వసుధీశుఁ గాఁగ నీ వజ్రు నిల్పెదను.
అనుదినంబును మీార లతని రక్షింపుఁ ; । డనఘులై తొల్లిటి యట్ల మనుండు.
సకల ధనంబులు సకల ధాన్యములు । సకలపదార్థముల్ సరభస వృత్తి
వెడలింప వలె మీారు వేగంబె పోయి । పడఁతులతోఁ గూడఁ బయనంబు గండు;
భయపడకుఁడు ; తాల్మి పదిలంబు చేసి । జయము వొప్పఁ బొందు మీాసదనంబులకును.

గతములైనట్టి యీకార్యముల్ మగుడఁ । బ్రతినతోఁ గ్రమ్మరింపఁగరాదు గాన
మనకు ధర్మజుఁడుండ మహిమదీపించి । చెనసి వజ్రుని రాజుఁ జేయంగవలయు. ”
అని వారి నిండ్లకు నప్పుడే యనిపి । వనమాలి గృహమున వాసపియుండె.

## వసుదేవుఁడు పరమగతికిఁ బోవుట

అంతలో సూర్యుండు నస్తాద్రి కరిగె. । నెంతయు నారాత్రి యేపెల్లఁబొలిసి
సముచిత క్రియలెల్ల సలిపి, నిద్రించి, । ప్రమదంబుతోఁ బలుపల వేగునపుడు
ఆనక దుందుభి యతిఘోరనిష్ఠ । పూని దేహము డించి పుణ్యలోకమున
కరిగినఁ దత్పదనాంతరంబునను । దరమిడి రోదనధ్వనులు చెలంగె.
ఆసమయంబున నమరేంద్రసుతుఁడు । ఓసరింపక వచ్చి యున్నంతలోన
నెలమి దేవకియు రోహిణియు భద్రయును । జలజాక్షి మదిరయు సంతోష మెసఁగ
ననుమరణంబున కాక్షణంబునను । బనిపడి యాయత్త పడిరి శీఘ్రమున.
మానిత ప్రాలంబమాలికా పంక్తి । జానొప్పఁ గదళికా స్తంభముల్ హేమ
కలశ నిక్షిప్త శిఖరములుఁ గలిగి । విలసిల్లు యానంబు వేగఁ గల్పించి
నరవిభు శవము సుస్నాతం బొనర్చి । యరుదైన చందనంబలఁది వస్త్రములు
గట్టి భూషణములు ఘనముగాఁ దొడిగి । గట్టిగా మంత్రయుక్తముగ యాజకులు
సామంబు చదువంగ సతులు నల్వురును । గామించి యుచిత సంకలితయానముల
నెక్కి యేతేరంగ నిటఁ బౌరులెల్లఁ । దక్కక రోదనధ్వనులు చెలంగ
నారీతిఁ గొని చని యమ్మహీశ్వరుఁడు । వారక విహరించు వనములోపలను
చందనాగరు కాష్ఠచయములు పేర్చి । యందంద చితిమీఁద నవనీశుఁ బెట్టి
పితృమేధ మెల్ల సంప్రీతిఁ జేయించి । యతులితగతి నంత నగ్ని యిచ్చినను
దేవకి మొదలైన తెఱవలంతటను । భావించి నల్వురుఁ బడి రగ్నిలోన.
ఘృతములు చల్లంగఁ గృతమతి నగ్ని । యతులిత సప్తజిహ్వలఁ బ్రజ్వరిల్లె.
తదనంతరమున రోదనములు చెలఁగె । నదనుగా వజ్రుండు నంగనాజనము
నుదకప్రదానంబు లొగి నాచరించి । పదపడి చనుదేరఁ బట్టణంబునకు
సరవితో విజయుండు చని మఱునాఁడు । దురమునఁ జచ్చిన దుర్దాంత విక్ర
మాటోప ఘనులైన యాదవాదులకుఁ । బాటించి వారికిఁ బరలోకవిధులు
చేయించి శోకంబు చెందిన సతులఁ । బాయక యూరార్చి, పద్మాక్షుబలుని

కనుఁగొనఁ దలఁచి శీఘ్రంబుగా నాప్త । జనులు తోడుగ రాఁగఁ జనిచని యంత
దనమదిలోపలఁ దర్కించె నిట్లు: । "ననుఁ బిల్వఁబంచి జనకునకుఁ దోడు
గాఁగ నిల్పినవాఁడు గాన నెమ్మదిని । లోఁగక చనిన త్రిలోక వంద్యునకుఁ
జావుచెప్పఁగ నేఁడు చనియెద నకట! । ఈ వర్తమానంబు లేల పుట్టింప!
మురమర్దనుఁడు తపంబున నున్నవాఁడు; । ఎఱఁగంగ నతఁ డేమియని చెప్పు వట్లు
వనివడిఁ గావింతు భయభక్తి." ననుచు । ... ... ... ... ...
మఱియును జింతించి మగువ గాంధారి । యఱలేక యొక్కఁడు నవనిలోపలను
దిక్కువ్వారునులేక తెగఁగలఁడనియె. । చక్కఁగా నిప్పునఁ జెదలంటునొక్కొ! (?)
యని వితర్కింపుచు నటఁ బోయి పోయి । గొనకొని యడవిలోఁ గొన్ని దినములు
వేదన పొందుచు వెదకుచునుండ, । నాదట నొక బోయ యర్జునుఁ జూచి
'యిందెందుఁబోయెద వెఱఁగింపు!' మనినఁ । బొందుగా దివిజేంద్రపుత్రుఁ డిట్లనియె
"సరసిజనాభుఁ డెచ్చటఁ దపంబర్థిఁ । జరిపెడినో చూడఁ జనుచున్నవాఁడ."
ననిన నేనొక్కనాఁ డంబుజోదరునిఁ । గనుఁగొంటిఁ; జూపెదఁ గడఁగి; యచ్చోట
నుండునో పోవునో యొగి నది యెఱుఁగ. । దండిగా రండు మోదమున మీ." రనుచు

## అర్జునుఁడు రామకృష్ణుల కళేబరములఁజూచి విలపించుట

గొనిపోవఁ బోవ వైకుంఠు దేహంబు । తనరంగఁ బడియున్నఁ దప్పక చూచి
పురుహూత తనయుండు భూమిపైఁ ద్రాలి । తరమిడి యొక కొంతతడవుకుఁ దెలిసి
హరిమేను కౌఁగిట నందంద చేర్చి । పరి పరి విధములఁ బలవించునంత,
ననుచరులగు భూసురావలి దేర్చ । ననిమిషావలినూనుఁ డంకిలి దేఱి
మఱియును శోకాబ్ధి మగ్నుఁడై చాల । నెఱిచెడి కన్నులనీళ్లను గాఱ
'నేమిట నిట్లయ్యె నీమహాత్ముండు! । భూమిపై 'నని యంగములు పరికించి
కలయంగఁ బదపద్మ గతమైన యట్టి । కలిత విశేషంబుగనుఁగొని యపుడు
పలురోదనము సేయ బ్రాహ్మణోత్తములు । వలదని వారింప, వాసవాత్మజుఁడు
"పటుతరగతిఁ బోయి బాంధవతతిని । నిటకుఁ దెత్తమొ? కాక యీతని తనువు
గొనిపోదమో!" యనికూర్మిఁ జింతించి । యనుచర వరులతో నది యెఱిఁగించి,
నెఱి దైవగతి వారినిధియుఁ బట్టణము । కఱకఱి ముంపంగఁ గల దివసంబు
పాయక మదిలోన భావించి చూచి, । యీయెడ మఱునాఁడె యగుట యెఱింగి

"పొద్దు గ్రుంకఁగవచ్చెఁ బురము వారలను । దద్దయు నీరాత్రి తరలింప వలయు."
నని నిశ్చయముచేసి హరి శరీరంబు । ననలున కర్పించి, హలధరుఁ దలఁచి
కొనకొని మునుల పల్కులు దప్పవనుచు । ననయంబు వెదకి [1]యయ్యెడఁ గాంచియతని(?)
కాయంబు వహ్నికిఁ గడువేగ నిచ్చి । పాయక యనుచర ప్రభృతులతోడఁ
జెలరేఁగి యీరీతిఁ జేయక యున్నఁ । దలకొని రుక్మిణీ తతులను నిల్ప
మనలకు శక్యమే! మఱి హరిఁ గూడి । చనఁగఁ దామసమగు; జలధియు నంత
వచ్చుఁ; బుణ్యము సేయ వడిఁ దలఁచినను । గ్రచ్చుఱఁ గీడు తక్కక సంభవించు.
అన్ని తెఱంగులు నట మన సీను । కొన్నికతోఁ బోయి కొలమిఁ జెప్పెదము.
కాని యీవార్త యిక్కడఁ జెప్పవలదు, । జానొప్ప." నని వచ్చి సకలకార్యములు
నారాత్రి తీర్చి యయ్యంబుజాప్తుండు । భూరితరంబుగాఁ బొడమకమున్న
సకల జనంబుల సకలధాన్యముల । సకల ధనంబుల సకలధేనువుల
సకల గజంబుల సకలాశ్వములను । సకలభామలఁ గొని సంరంభమెసఁగ
ననిమిషేశ్వర పుత్రుఁ డతిశీఘ్రవృత్తిఁ । జనిన పిమ్మటను భాస్కరుఁడుదయించె.
అంతటఁ బురమెల్ల నంబుధి ముంచె । నెంతయుఁ గడుఁ జిత్ర మింకువంశేంద్ర!
అపుడు రెండవవార్ధియనఁగఁ బెంపారు । చపలాక్షులను సర్వజనముల నరుఁడు
వడిఁగొంచు నాపంచవటమున విడియ । నడురేయిఁ జోరు లున్నతమతిఁ గాంచి

## బోయ లర్జుననోర్చి యాదవాంగనల సొమ్ములపహరించుట

కవ్వడి యొక్కండు గంటిరే ధనము । నివ్వటిల్లెడు లోఁతు నెఱిఁగానవచ్చె.
బాలురు వృద్ధులుఁ బడఁతులుఁ జూడుఁ । డాలంబునకు నొక్కఁడైనను లేఁడు.
మునుకొని భామలఁ బొదువుద." మనుచు । ఘన విక్రమము మీఱఁగాఁ జెలరేఁగి
కవిసినఁ జూచి యాఖండలాత్మజుఁడు । సవడి "నోరోరి, యేసంరక్షకుండఁ;
దొలఁగిపొం డడియాసఁ దొద్దకుఁ జొచ్చి । తొలఁగకున్నను బట్టి త్రుంతు నందఱను."
అని యదల్చిన వార లఱవాయి గొనక । వనజాక్షులను దోఁప వడిఁ గోపగించి
గాండీవ మెక్కిడి ఘనబాణతతుల । మెండుగాఁ బరఁగింప, మ్లేచ్ఛులుప్పొంగి
యాతని మీఁదఁ దీవ్రాస్త్రంబులేయ, । నాతఱి నలిగి దివ్యాస్త్రజాలంబు
లేయంగఁ జూచిన నిట మంత్రివితతి । యీయెడఁ దోఁపమి కాశ్చర్యమంది,

1. కవి అకార మధ్యమని భ్రాంతిపడి 'అయ్యెడ' అని ప్రయోగించెను.

యిది దైవకృతమని యెంతయు వగచి । యదనేది తీవ్రబాణావళి నేసె.
ఏయంగ దొనలును నిట రిత్తమైన । సాయకాననముచే సరసీరుహాక్షు
మహిషుల నెనమండ్ర మఱియును జాల । సుహాసీయులగు నీరిమగువలం గాచె.
తక్కిన సతులను ధనములం గొనుచు । నక్కజంబైనట్టి హయములు గజము
లరదంబులును నొల్ల కచ్చోట విడిచి । యరిగిరి దస్యులో యవనీతలేశ!
ఆరీతిం బరివోయినట్టి మొత్తంబు । వారక గొనుచు నవ్యాసవాత్మజుండు
పోసంగం గురుక్షేత్రమునకును బోయి । యసమునం జతించి యంతరంగమున
సరవితోడను గను జనములతోడ । నిరవుగా నాతెఱంగెల్లం జెప్పచును
మున్ను గాంధారి యిమ్మల యాదవులకుం । బన్నుగా శాపమిచ్చిన ధర్మసుతుండు
తనుజూచి "యర్జున, తప్పదింతయును; । ఘనమైన యాదవక్షయము కాంగలదు
వినువక తద్బాల వృద్ధుల సతుల । వసుమతిలో నిల్పవలయు నెంతయును."
అని పల్కెం గావున నదికారణముగ । ఘనముగా నాతని కరుణపెంపునను
గృతవర్మ నందనుం గృపతోడం జూచి। "చతురాత్మ, నీవు నీ సకల బాంధవులు
వలనొప్ప మృత్తికావతి పురంబునను । నిలువుం డా దేశంబు నీక యిచ్చితిని."
అనిపల్కి మఱివాని నభిషిక్తుం జేసి । యనిపినం బోయె నెయ్యము సమకూడ.
పోసంగ సరస్వతి పుటభేదనంబు । నసదృశ స్ఫూర్తి సాత్యకి తనూజునకు
నిచ్చిన వాండును నేపుదీపించి । మచ్చికతోం బోయె మనుజాధినాథ!
తక్కటివారి నింద్రప్రస్థమునకు । గ్రక్కునం గొనిపోయి కడంక దీపించి
తొలంగక వజ్రనాథునిం గాంగ నందు । నిలిపి గజంబుల నిఖిలాశ్వములను
రథముల విభజించి రమణ మువ్వురకుం । బ్రథితంబుగా నిచ్చి బంధువర్గముల
నందుల నిందు నెయ్యము సమకూరం । బొందుగా నుండుం డిమ్మల ననిపలికి
యక్రూరు భార్యల నతని యాత్మజుల । నాశ్రమంబున వజ్ర కప్పగించినను
వారుండ నోపక వలసిన యెడకు । బోరనం బోయిరి భూలోకనాథ!
తదనంతరమున సుత్రామనందనుండు । వదలక కృష్ణుని వార్త భామలకుం
జెప్పంగం దలంచి చెచ్చెర శోక మొసంగం । దప్పక పెద్దలుం దాను వేవేగ
వారల కడ కేంగి, వనములోపలను । సీరినిం గృష్ణునిం జెలంగివర్దినము
లరయుటయును బోయులటం జెప్పుటయును । హరి బలదేవుల కగ్నిసద్విధులు
తిరముగాం జేసిన తెఱంగును జెప్పి, । పరంగంగం దలవాంచి పలుకకయున్నం,

బాలుపతి రుక్మిణిమొదలైన సతులు । కలఁగియు మఱి ధైర్యగరిమ వాటించి
“యర్జున, యింతేల యడలెద వీవు ? । కర్జమూహించినఁ గాలపర్యయము
వరమతి నుడుపంగ వశమె యెవ్వరికి ! । ఇరవుగా నీతెఱంగెఱిఁగింప కిట్టి
పని యేల చేసితి పార్థివ!” యనిన । నెనయఁ గన్నీరొల్క నిట్లని పలికె :
“ ఆరీతిఁ గృష్ణుని నడవిలోవలను । వారక వెదకుచు వదలక చూచి
యా రాత్రిపోయిన నమ్మఱునాఁడు । వారిధి పురమెల్ల వడి నాక్రమించు.
క్రన్ననఁ బురమువారల వెడలింప । కున్నఁ గాదనుచు నచ్యుతునకు వడిగ
నసల సంస్కారంబు లపుడు గావించి । పనుపొంద మీకుఁ జెప్పఁగ బ్రొద్దుపోవు
నంత వారిధి ముంచు నదిబుద్ధిగాదు । ఏంతయు ననిచూచి యిట్లు చేసితిని.
అటుగాన నాతప్పులన్నియుఁ గాచి । పటుగతి రక్షింపఁ బాడిమీకిపుడు.”
అని జాఁగి మ్రొక్కిన నాతనినెత్తి । ఘనముగా నూరార్చి కన్నీరు దుడిచి
... ... ... ... ... । ... ... ... ... ...
యందు భీష్మకుపుత్రియాజాంబవతియు । నందంద కోరిరి యనుమరణంబు.
మఱియంత సత్యభామయు మొదలైన । తెఱవలు తపము సుస్థితిఁ జేయువారు
గా మాటలాడినఁ గడఁగి యత్తెఱఁగు । భూమిపైఁ గావించి పురుహూతసుతుఁడు
అఖిల బాంధవుల నూరార్చి వజ్రునకు । నఖిల నీతులు చెప్పి యాశీర్వదించి

## అర్జునుఁడు వ్యాసునితో యాదవక్షయముఁ జెప్పుట

పోసఁగ గంగాతీరమున కర్థిఁ బోయి । యసదృశ భక్తి నావ్యాసుల కెఱఁగి
యతఁడు మన్నింపంగ నాసీనుఁడైనఁ । జతురు నర్జునుఁ జూచిసంయమిపలికె :
“ తెలివి లేశములేక ధీర, నీ ముఖము । తలకొని తేజంబు దక్కియున్నదియు.
చెలఁగి యోగ్యుల వధించితివో ? శాత్రవుల । కలఁపడ నోడితో ! యదియేమి చెపుమ.”
అనవుడు యాదవులవనిఁ గూలుటయు, । వనజాక్షుఁడును సీరి వసుధ లేమియును,
బురమువారలఁ గొని పోసఁగ నేఁగంగ । వరబుద్ధి బోయలు వచ్చి తాఁకుటయు,
శరము లేయుటయును నరవి మంత్రములు । వరుసఁ దోఁపమియును, వారిజముఖులఁ
గొందఱ వింటఁ జేకొని కాచుటయును, । బొందుగా నట వజ్రముఖ్య యాదవులఁ
దగిన పురంబులఁ దనర నిల్పుటయు, । నగణితంబుగఁ జెప్పి “ యనఘాత్మ, నీవు
చెప్పవే! నేనేమి సేయుదు నింకఁ, । దప్పక.” యనిన నత్తపసి యిట్లనియె :

"మునిశాపమున యదుపుంగవులట్టు । లనిచేసి చచ్చిరి యడలంగఁదగునె!
హరియు నిత్తెఱఁగు తానాత్మలో నెఱిఁగి । చిరమతి మనము వచ్చిన పనులయ్యె.
లాలిత ప్రాప్తకాలంబగు పనికి । నేల యడ్డ పడంగ నేనిపు డనుమఁ
దటుకున సంతియుఁ దనమదిఁ దలఁచి ।యటు నుపేక్షాపరుఁడై యుండెఁ గాక
వలసినఁ ద్రిజగంబువారలన్నైనఁ । జలమున రక్షింపఁ జాలెడువాఁడు.
జగతిఁ గణ్వాదుల శాపంబు నుడుపఁ । దగుశక్తిలేదె! యింతయునేల! యనుచు
నూరకయుండె; రణోర్వర నాఁడు । గారవంబున నిన్నుఁ గావఁడే శౌరి!
పరఁగ భూభారంబు పాపంగఁ బూని । ధర నవతారమై తగ సంహరించె;
ఇందుకు శోకింప నేటికి నీకు? । అందంద పనులైన నస్త్రముల్ తొలఁగె;
అదిగాన మీరింక నమరులు పొగడఁ । బదపడి యుత్తమపదవికిఁ జనుఁడు."
అనవుడు శోకమోహంబులు పాసి । మునిచంద్రునకు మ్రొక్కి ముదము సొంపెక్కి
యాతని వీడ్కొని యటఁ బురికరిగి । యాతతనూర్తిఁ దానన్నల కెఱిఁగి
తనపోయినట్టి వృత్తాంత మాతయును । బనివడి యెఱిఁగించె భక్తితో." ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నని చెప్ప వెండియు మునులు
అనఘాత్మ, తరువాత నైనవృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
ఆదినారాయణ! ఆద్యంతరహిత! । వేదగోచర! యీశ! విశ్వప్రకాశ!
అణురూప! ఘనరూప! హరి! పంకజాక్ష! । మణివక్ష! గోవింద! మధుదైత్యహరణ
ఘనమాని వ్యాఘ్రదేహ కలిత సందోహ । వినుతప్రకాశ! శ్రీ వేంకటాధీశ!
భక్తవత్సల! జగత్పావనమూర్తి! । ముక్తిప్రదాయక! మ్రొక్కెద నీకు
ఇది వేంకటాచలాధీశ్వర దివ్య । పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
విరచిత మాసల విమల పర్వమున । నరవిశో బుధులెల్ల నన్నుతింపంగ
నలలిత శృంగార శబ్దార్థతతుల । నలరి సర్వంబు నేకాశ్వాసమయ్యె.

# మహాప్రస్థానపర్వము



శ్రీసర్వభూధర శ్రేష్ఠివిహార, । వాసవార్చిత, కృత్తివాస సంస్తుత్య,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
పార్థివచంద్ర, యివ్విధిఁ గిరీటి । యర్థిమై రుక్మిణి యాదిగాఁ గలుగు
సతివల కప్పుడ యగ్ని కృత్యములు । చతురతఁ గావించి సంయమిచంద్రుఁ
డైన వ్యాసులవాక్య మంగీకరించి । పూనికఁ గరిపురంబునకు నేతెంచి
యమతనూజాతున కత్తెఱఁగెల్లఁ । గ్రమమున వినిపింపఁగా ధర్మసుతుఁడు

## పాండవులు మహాప్రస్థాన మొనర్చుట

“మొగి మహాప్రస్థానమునకుఁ జిత్తంబు । తగిలియున్నది నేఁడు తనమేన ననఘ!
పదిలమై యిదిమేలె పార్థ ?” నావుడును । అదనుగాఁ గ్రీడి యయ్యమసూతి కనియె:
“కాలమేమనవచ్చుఁ! గాలంబుఁ బోలుఁ । గాలంబె; యొంటికిఁ గలవాని యిట్టి
లీలలు! నామది లెస్స చూచితిని । బోలంగ నిదిమేలు భూనాథ,” యనుడు
నావల్కులకుఁ గడు నాత్మలో మెచ్చి । భూపాలకుండు భీమునిఁ బిలిపించి
[కవలను రప్పించి కడఁకతో నంతఁ] । దివిరి యత్తెఱఁగెల్లఁ దెలుపంగ, వారు
సమ్మతియీయ నా శమననందనుఁడు । నెమ్మి నత్తెఱఁగెల్ల నెఱి యుయుత్సునకుఁ
దెలిపి బుద్ధులు చెప్పి తేజంబుతోడ । నలలితంబుగ బుధుల్ సన్నుతిసేయఁ
బరఁగఁ బరీక్షిత్తుఁ బట్టంబు గట్టి । ధరణిఁ బాలించుచందములెల్లఁ దెలిపి
యాసుభద్రాదేవి నర్థిమైఁ బిలిచి । భాసుర కలిత వాక్ప్రౌఢి నిట్లనియె:
“భవదీయపౌత్రుఁ డుద్భట బలాధికుఁడు । అవని భూభార మెంతయును వహించె.
యాదవోత్తముఁడైనయట్టి వజ్రునకుఁ । బ్రోది నింద్రప్రస్థపుర మిచ్చినాఁడ.
ఎలమిదీపింపంగ నీయిండ్లు రెండు । కలిత విఖ్యాతిని గాచి రక్షింపు.”
అని తమవెంట నయ్యాతివ రాకుండఁ । బనివడ నియమించి, ప్రథనరంగమునఁ
జచ్చినవారికి సరి మాసలాజిఁ । జచ్చిన యాదవ సంఘంబులకును
బరలోక సౌఖ్య సంపద గల్గవలయు । సరసత ననిచేసె సకలదానములు.

ధౌమ్యాది భూసుర తతులకు ధనము । సౌమ్యవర్తన నిచ్చి చాల మన్నించి
కృపునకు ధనము మిక్కిలిగాఁగ నిచ్చి । కృపఁ జూడుమని పరీక్షితు నొప్పగించె.
ఈరీతి ధర్మజుఁ డేపుదీపించి । వారక దానముల్ వరుసతోఁ జేసి
ధరణిశేషించిన ధనరాసులెల్లఁ । దరమిడి యభిమన్యు తనయునకిచ్చి
కృపునకు శిష్యుఁగాఁ గృతమతితోడ । నపుడు పరీక్షితు నట నప్పగించి
పౌరుల రావించి పార్థుని పౌత్రు । నారూఢిఁ జూపి "యీయనఘుని మీరు
మహిని మా యేపురి మాఱుగాఁజూచి । సహజరీతులఁ గార్యజాతముల్ నల్పుఁ"
డని పల్కఁ గన్నుల నశ్రువులొలుక । "మనుజేశ, యీవేళ మము నుపేక్షించి
చనుట ధర్మమె! నీదు సచ్చరితములు । అనఘశీలములు కృపాలవాలములు.
ఆశ్రయించినవారి నట విసర్జించి । విశ్రామగతిఁ బోవ విధువంశ, తగునె!
అని జాగి మ్రొక్కిన యా పౌరవరుల । ననయంబు నూరార్చి నపుడంతలోన
భూరి నివేశనంబుల నొత్తిగొనుట । కారణంబుగఁజేసి కడఁక దీపింపఁ
బుడమి వివాదంబు పుట్టినమాత్రి । కడచూలి యిట్లనుఁ "గలియుగంబర్థిఁ
జెలఁగి యిప్పుడు ప్రవేశించుటఁ జేసి । యిలలోన నన్యాయ మిందఱుఁజూడ
(వాలాయముగఁబుట్టె ; వసుధ నశింపఁ) । గాలము వచ్చెను ఘనముగా." ననుచుఁ
(ప్రోదిగా నిదియెల్లఁ బూర్వజుతోడ) । నాదటఁ జెప్పిన, యమతనూభవుఁడు
యాలోన నవ్వి యీయడనిట్టి మనువు । చాలునంచును బల్కి సకలభూషణము
లొలిమై నంతయు నూడ్చి పో వైచి । శ్రీలీల వల్కలాజినములు పూనె.
తగువేడ్క నిట్టి విధానంబు చేసి । నగుమొగంబులతోడ నలిఁ గృశానులను
వెసఁ గంబుగతము గావించి భూవిభుఁడు । అసదృశ విస్ఫూర్తి ననుజులు సతియుఁ
దనవెంట రాఁగ మోదంబు రెట్టించి । మునుకొని వేదండపుర మర్థి వెడలె.
ఆనుభద్రయును నత్యంత దుఃఖమున । నా సార్వభౌముల నట వలగొనుచు
వానవికిని మ్రొక్కి వరుస ద్రౌపదికి । ధీసహమున్నతి మ్రొక్కి తిరిగె నంతటను.
ఆరీతిఁ బురివీడ నవనీశ, యొక్క । సారమేయము వెంటఁ జనియె నాలోన.
పౌరజనంబు లాబాలవృద్ధముగ । నారూఢిఁ జనుదెంచి గాసమయమున.
అవిరళ విస్ఫూర్తి నాయుయుత్సుండు । భవదీయ జనకుండుఁ బౌరులు వెంట
నరుదేర నవ్వారి నట నిల్పుఁ డనక । తగమిడి తలవాల్చి ధర్మజుఁ డరుగఁ
దనువులు దూలి యందఱుఁ బ్రదక్షిణము । లొనరించి చురలి; రా యుర్వీశుఁ డిట్లు

చనినఁ బరీక్షిత్తు సామజ పురికిఁ । జనియె; నులూచి రసాతలంబునకుఁ
బోయెఁ; జిత్రాంగద పుత్త్రుని కడకుఁ । బోయెఁ, దక్కినయట్టి పౌరులుఁ బ్రీతి
గరమొప్ప మీతండ్రికడ నిల్చి; రంత, । ధరణి యుయుత్సుండు ధౌమ్యుండు కృపుఁడు
నమరంగ మీతండ్రి నర్థవాక్యములఁ । బ్రముదితాత్మునిఁ జేసి పౌరులఁ దేర్చి
విలసిల్ల నంతట, వేదండపురము । వలను మీఱఁగఁ దొంటివలెనె వర్తించె.
అట ధర్మతనయుండు హర్షంబుతోడఁ । బటుగతిఁ జనఁగ నప్పవమానసుతుఁడు
పార్థుండుఁ గవలు నప్పడఁతి ద్రౌపదియు । నర్థిమై జనుచుండ నట వారి వెనుక
విడువక శునకంబు వెంట నేతేరఁ । గడఁకతోఁ జనిచని కారుణ్యనిధులు
తగ నుపవాసవ్రతంబు గైకొనుచుఁ । బాగడ గంగానది పొంతకుఁ బోయి
యంతనుండియుఁ దూర్పుకై నడచుచును । సంతోషచిత్తులై నరసరీతులను
లాలిత యోగ బలంబున నదులు । నోలిఁ బర్వతములు నుగ్రాటవులును
గడచి పూర్వాబ్ధికిఁ గ్రక్కునఁ బోవ । నడరంగఁ దేజోమయాత్మకుండైన
వైశ్వానరుఁడు వచ్చి వారి సన్నిధికి । శాశ్వతగతి నిల్చి జంభారితనయు
కరమున నున్నట్టి గాండీవధనువు । పరికించి యతనితోఁ బలికె నిట్లనుచు:

### అగ్నిదేవుఁ డర్జునుచేతి గాండీవము సముద్రమున వైపించుట

"హరిహయనందన, హరిసుదర్శనము । తిరముగా నెన్నఁడో దివమునకరిగె.
కడఁకతో నీవేల గాండీవ మర్థి । విడువవు? నుగలకై వేడ్కతో నేను
వరుణదేవునిచేత వడిఁ దెచ్చి నీకుఁ । గరమొప్ప నిచ్చితిఁ గాదె యీవిల్లు.
అతనికిఁ బ్రీతిమై నర్పింప వలదె! । చతురాత్మ!" యనుపుడు సవ్యసాచియును
అట్టె చేసెదనని యగ్రజానుజుల । కట్టితెఱంగు పాయక యెఱిఁగించి
యాదరం బెసఁగంగ నాతఁ డావిల్లు । మోదంబుతోడ నంబుధియందుఁ బెట్టెఁ
దదనంతరమున నంతర్ధాన లీల । నదనుగాఁ బోయె నయ్యగ్నిదేవుండు.
పదపడి నృపులు తప్పక దక్షిణాభి । ముఖులై చనిచని వార్ధితీరమున
మునుకొని పడమటి మొగముగా నడవ । మునుకొని ద్వారకాపురి నికటోర్విఁ
జనిచని ప్రాలేయశైలంబు దాఁటి । వనములు శైలముల్ పఱఁబ నద్రులును
బెక్కులు దాఁటి సంప్రీతి రెట్టింప । నక్కజంబుగఁ గాంచి రా కనకాద్రి.

ఆరీతిఁ గనుఁగొని యటఁ బోవఁబోవ । నారయ పాంచాలి యవనిపైఁ బడియె.
పడిన నంతట జగత్ప్రాణనందనుఁడు । తడయక ధర్మనందను మోముఁ జూచి,

## ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట

"యీనాతిదెస గాన మెన్నఁడు ధర్మ । హాని; యిట్లగుటకు నట కతమేమి!"
యని యడిగిన భీము నాధర్మరాజు । గనుఁగొని పలికె "నీ కాంత యర్జునుని
దెసఁ జాల పక్షపాతిని; దానఁజేసి । పసగల సుకృతంబు ఫలియింప కిట్టి
దురవస్థ పాటిల్లెఁ దోడ్తోడ." ననుచుఁ । దరుణిశోకము డించి ధరణీశుఁ డరిగె:
"భూవర, యిమ్మెయిఁ బోవఁబోవంగ । ధీవిశ్రుతుఁడు సహదేవుండు పడియె.
యమతనూజునిఁ జూచి యనిలనందనుఁడు । "క్రమమున నితఁ డహంకారవర్జితుఁడు;
మీకు శుశ్రూష యర్మిలి నాచరించు; । సాకల్యహృదయుండు సన్మార్గవర్తి.
యితనికి నేలొకో యీకీడు గలిగె! । చతురత నెఱిఁగింపు జననాథ." యనిన
సొలవక వీఁడు ప్రాజ్ఞుఁడు తనకంటె । నిలలోన లేఁడని యెప్పుడుఁ దలఁచు;
నదిగాన నిట్లయ్యె." నని పోవుచుండఁ । బడపడి నకులుండు పడియె భూస్థలిని.
పడినఁ గనుంగొని పార్థివుఁ జూచి । వడముడి యిట్లను: "వసుధీశ, వీఁడు
శౌర్యంబుగలవాఁడు చక్కనివాఁడు । ధైర్యగుణాఢ్యుండు తపన తేజుండు
ఇట్టి పుణ్యున కేల యీదెస వచ్చె? । నెట్టన నెఱిఁగింపు నిజముగా." ననుడు
పాండవేయాగ్రణి పవనజుఁ జూచి । "చండవిక్రమ, విను జగతిలో నితఁడు
తనపాటి విమల సౌందర్యవంతుండు । ఘనముగా మూఁడులోకములను లేఁడు
గొనకొని యనుచుఁ బల్కుచునుండుఁ గాన । నెనయంగ నీతని కీకీడు గలిగె."
అని వాని విడిచి యొయ్యనఁ బోవుచుండ । ననుజన్ములును నింతి యవనిపైఁ బడిన
నలమటఁ గుందుచు నాఫల్గునుండు । నిలమీఁదఁ బడిన నిట్లనియె భీముండు:
"ఈతనియెడ దోషమేమియు లేదు; । ఈతఁడు పుణ్యాత్ముఁ డీతని కతనఁ
గౌరవబలమెల్ల ఖండింపఁ బడియె. । ఆరూఢి దేవహితార్థమై పోయి
కాలకేయ నివాత కవచులఁ జంపె. । ఈలీలఁ బడుటకు నేమికారణము?"
నావుడు ధర్మనందనుఁ డిట్టులనియె: । "వావిరిఁ గౌరవ వర్గంబునెల్ల
నొకనాఁటఁ జంపెదనొగిఁ జూడుమనియె; । అకలంకవిస్ఫూర్తి నటు సేయఁడయ్యె;
పరఁగఁ జేత యొకండుఁ బలుకొక్కటయ్యె. । అరుదుగా వినవయ్య యదియునుగాక

గొనకొని ధరఁ గల్గు కోదండధరుల । జనిత మన్యుండునై చాల గర్వించు.
... ... ... ... ... । అది కారణముగ నుత్కట భుజశక్తిఁ
గడఁగి యెవ్వనినైనఁ గడనఁ బల్కుదువు । తడయక యదిగాన ధరఁ బడితీవు."
అనిపల్కి నిలువక యరుగుచు నుండ । వెనుక యాశునకంబు విడువకచనియె.

ఇంద్రుఁడు రథంబుఁగొని ధర్మజు నెదుర్కొనుట

అంత సహస్రాక్షుఁ డంగ సందీప్తి । సంతానములు దిశల్ నరి నాక్రమింప
రథనమాగమన సంరావంబు మేరు । ప్రథిత గహ్వరములఁ బ్రతిరవంబీన,
మునుకొని యచ్చటి మునిసిద్ధసాధ్య । జన నుస్తవంబులు సందడిసేయఁ,
గ్రమమున నచ్చటి కల్పవృక్షములు । రమణీయ పుష్పవర్షంబులు గురియ
నవనీతలేశుని యగ్రభాగమునఁ । బ్రవిమలగతి నిల్వ భక్తితో నతఁడు
ప్రణతుఁడై నిలిచినఁ బాకశాసనుఁడు । "మణిదివ్యకాంతిచే మహనీయమైన
యరదంబు నెక్కు నీ." వని పల్కుటయును, । తరమిడి శోక సంతప్తుఁడై నృపుఁడు
పాకశాసనుతోడ భక్తి నిట్లనియె: । "నాకుఁ దోడై వచ్చి నాతియుఁ దమ్ము
లిలమీఁదఁ బడిరి; వారెల్ల నావెంట । నలవడ నేతెంచునట్లుగా నీవె!"
అన విని ధర్మజు కయ్యింద్రుఁడనియె : । "మనుజేశ, దుఃఖంప మతి నీకుఁదగునె!
ద్రౌపదీసహితులై తమ్ములందఱును । ఓపిక దేహంబు లూడ్చిపోవైచి
యమరలోకంబున కరిగిన వారు. । అమరంగఁ గాంచెద వచ్చోట వారి.
కాయంబు విడువకే ఘనముగా నీవు । పాయక రమ్ము పుష్పక మెక్కి." యనుడు
ధర్మజుండిట్లను: "దైవతారాధ్య! । కూర్మితో భయభక్తి కొనలు సాఁగంగఁ
బురమేను వెడలునప్పుడు మొదల్ గాఁగ । సరసతఁ దోడనే చనుదెంచెఁ బుణ్య
కలిత మీశునకంబు కడఁగి నావెంట । నలవడ వచ్చెడునట్లు గావింపు."
అనవుడు దేవేంద్రుఁ డఱనవ్వునవ్వి । "పనివడ నిట్లాడఁ బాడియే! నీకు.
శునకంబు కేరీతి సురలోక మబ్బు? । వినుధర్మనందన, పెద్దత్రవ్వెదవు;
తామసంబేల రథ మెక్కు." మనిన । భూమీశుఁ డిట్లనుఁ బురుహూతుతోడ:
"అగణితంబుగ ననార్యమును దుష్కరము । నగుకార్యమేచియు నార్యుండు ప్రభువు
నైన సత్పురుషుండు నాశ్రితులకును । జానొప్ప ఎలవదే సంఘటింపంగ.
కృప మాలి భక్తపరిత్యాగ మొలమి । నిపుడొనరించి నాకేశ, రాఁ దగునె!

అనవుడు మఱియు నిట్లనియె నింద్రుండు : । "అనఘాత్మ, ధర్మజ, యలుగక వినుము ;
ఘన త్రివిష్టపము కుక్కలకెట్లు గలుగు ? । తనర నీవెఱుఁగని ధర్మంబు గలదె !
కడక నిష్ఠురత గల్గదు దీనినిపుడు । విడిచి రథంబెక్కు వేవేగ నీవు.
సౌఖ్యవర్తనలకు జగతిఁ దామసము । ముఖ్యమే !" యనిన నప్పాండవుఁ డనియె:
"అనిమిషేశ్వర, విను మతిభక్తియుక్తు । ఘనముగా విడిచిన కలుషాత్ములకును
అవనిలోపల బ్రహ్మహత్య వాటిల్లు । వివిధరీతుల నని వినఁబడు శ్రుతుల.
కలితాత్మ, దివ్యసౌఖ్యములకుఁ గాఁగఁ । గలుషజాలంబులు కట్టుకోఁ జాల."
అనిన "వ్రతస్థుఁడే యడనైనఁ గుక్క । మునుమిడి యంటినఁ బుణ్యంబు చెడును.
పరఁగ నీకిట్టి నిర్బంధ మేమిటికి ? । ధర దీని విడుచుట ధర్మమార్గంబు.
కలితపుణ్యంబు స్వర్గస్థభావంబు । తలనెఱుంగుదు వేల తామసించెదవు.
అనుజులు నింతి నీయడఁ బాయఁజాలి । యును దీని విడువవు యోగ్యమే యకట!"
అన విని వెండియు నాఖండలునకు । ననియె ధర్మతనూజుఁ: "డతుల పుణ్యాత్మ!
సకలలోకములకు స్వామివి మఱియుఁ । బ్రకట ధర్మములకుఁ బతివి నీకంటెఁ
దగ నెఱుంగుదునె సద్ధర్మ మార్గములు ! । అగపడి వినవయ్య యదియును గాక
యాదరంబెనఁగు మహాత్ములతోడ । వాదింపఁ దగునె పావనవృత్తి మిగుల !
విన్నవింపందగు విధమెల్లఁ దెలియ । విన్నవించిన దోషవృత్తి గాదంద్రు.
కావున మీకును గడఁగి విన్నపము । భావించి చేసెదఁ బాకారి, వినుము.
తమ్ములు నింతియు ధరణిపైఁ బడిన । నిమ్ముల విడువక యేడ్చుచు నున్న
వత్తురే ! నాతోడ ; వచ్చినకుక్క । నిత్తఱి విడుచుట యిది ధర్మమగునె !
చెలఁగి మిత్రునియెడఁ జేయు ద్రోహమును । నెలఁతఁ జంపుటయును, నెఱి విప్రధనము
గొనుటయు, శరణార్థిఁ గోరి కావమియు । ననఁ గల్గుపవి సమం బమరాధినాథ !
కావున నాకలోకంబేను నొల్ల; । దేవ, యీవేళ నాదెసఁ గృప గలిగి
పరువడి శునక సంభావన నేఁత । పరఁగ దోషంబుగాఁ బట్టమి నాకు
వరము; నీవిఁకఁబొమ్ము; వనభూమినుండి । తరమిడి నినుఁ గూర్చితపముచేసెదను."

ధర్ముఁడు శునకరూపంబు వీడి ధర్మజునకుఁ బ్రత్యక్షమగుట

అని పుయిలోడక యమతనూభవుఁడు । గొనకొని పలికినఁ గొడుకు నీక్షించి
ఘనతర సంతోష కలితాత్ముఁడగుచు । శునకరూపము వాసి సుమచిరమైన
నిజరూపు దాల్చి మన్నించి ధర్ముండు । భజనతో మ్రొక్కినఁ బట్టి లేనెత్తి

" వినవయ్య ధర్మజ, విపుల పుణ్యాత్మ! । ఘన దయా ప్రాభవ, గాంభీర్యధుర్య,
వసుధలో నీయట్టివారలు గలరె! । యనమునఁ దొల్లియు నరసినవాఁడ;
ద్వైత వనంబులోఁ దమ్ములు నీటి । కేతెంచి వడిన నే నేతెంచి యపుడు
ఎలమితో నొక్కని నిచ్చెద నడుగు । నెలకొని యనవుడు నీవు వాయుజుని
నరునిఁ దలంపక నకులు వేడితివి. । వరువడి మనసులోఁ బాయవెన్నఁడును.
శునకంబుఁ జేపట్టి సురరథంబెక్క । నని వల్కితివి నీకు నట సరిగలరె!
ఈరీతిఁ బెంపును నిట్టి సత్యంబు । నీరీతి ధర్మంబు నెందును గలదె! "
అనుచు సంతోషింప నఖిలదేవతలు । మునులు గంధర్వులు మోదంబుతోడ
నమ్మహాత్ముని నెత్తి యరదంబుమీఁద । సమ్మదంబున నిడి చతురులై యుభయ
పార్శ్వములఁ జేరి ప్రస్తుతింపుచును । ఆరూఢిఁ గొనిపోవ నంత నారదుఁడు
ఎల్లవారలు విన నిట్లని పలికె : । " బల్లిదుండవు మహీపాలాగ్రగణ్య!
దానంబులందును దపములయందు । మానుగాఁ బెక్కండ్రు మానవేశ్వరుల
వినమె! వారలకీర్తి వెలుఁగుట మాసె; । వనివడి నిండెను భవదీయకీర్తి.
మేనులతోడనె మెఱసి యేరైన । రానేర్చిరా యమరత్వ సిద్ధికిని? "
అనవుడు ధర్మజుం డర్థి నిట్లనియె : । " మునినాథ, వినుము తమ్ములఁ గనినంత
కును నిది సుఖముగాఁ గొన; నవశ్యంబు । చనియెద వార లెచ్చట నున్నవారొ.
అచట సుఖంబైన నసుఖంబెయైన । సుచరిత్ర, కానిమ్ము చూడంగ వలయు.
వారిని, మానవత్వవంతులై తెగిన । భూరమణులఁ జూడఁ బొందమ్యె మనసు."
అనవుడు దేవేంద్రుఁ డతని కిట్లనియె : । "తనువుపాయక సుకృతంబు పెంపునను
వచ్చితి విచటికి; వచ్చియు మనసు । అచ్చుగా వ్రాలెదు నా మర్త్యతకును.
మునులను దేవతాముఖ్యులఁ జూడు. । అనఘాత్మ, యొరులకు నందంగరాని
ఘనపుణ్యపదవి చక్కఁగఁ గల్గె నీకు. । అనుజుల కేరీతి యత్యంత పదవి
గలుగంగ వలెనన్నఁ గలుగునే చెపుమ! । వలదిట్టివిధ." మన్న వాసవు కనియె :
"మీరెంతచెప్పిన మెలఁతిఁదమ్ములను । గారవంబునఁ జూచికాని యే రాను.
వారలఁ జూచి యవశ్యంబు మగిడి । యారూఢి సౌఖ్యంబు లనుభవించెదను.
అదియె నామనసున కానందకరము, । అదనుగా." ననివల్కె నర్థితో ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపించె నని చెప్ప వెండియు మునులు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు.*

---

* ఆశ్వాసాంత ద్విపదలు లేవు.

# స్వర్గారోహణపర్వము



శ్రీరమణీ నాథ, జితదైత్యయూథ, । వారిధిశయన, శ్రీవత్సాంక, యీశ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె:
"ధర్మజుండారీతిఁ దమ్ములఁ గూడ । నగ్నిలోఁ గోరిన నాఖండలుండు
తగువాని రావించి ధర్మసూనునకు । మగువను దమ్ముల మఱియును గలుగు
బాంధవులను జూడ భావంబునందు । బంధురంబగు కోర్కి పట్టియున్నదియు.
ఇతనిఁ దోకొనిపోయి యెల్లబాంధవులఁ । జతురతఁ జూపుము చనుము శీఘ్రముగ."
అనవుడు వాఁడును నంగీకరించి । మనుజేశుఁ దోకొని మఱిపోవుచుండఁ
దోడన నారదాదులు కొందఱర్థి । వేడుకఁ బోవంగ విభుఁడు నక్లోఁగి
ముందటఁ గనుఁగొనె మోహనంబగుచు । బృందారకులు గొల్వఁ బెంపగ్గలించి
యున్నతాసనమున నొనరఁ గూర్చుండి । సన్నుల సురసతుల్ చామర లిడఁగఁ,
గరమొప్పు సూర్యసంకాశతేజమునఁ । బరఁగిన కురుమహీపతి సుయోధనుని.

ధర్మజుఁడు దుర్యోధనుఁజూచి యసూయపడుచుండ నారదుఁ డాతనిఁ దేర్చుట

ఆరీతిఁ జూచి సంయములతో ననియె: । "వారక యితఁడు పావన మతి గాఁడు;
అతిలోభి పాంచాలి నటు భంగపఱచె; । ఇతని కతంబున నెల్లభూవిభులు
చతురంగ బలముతో సమరోర్విలోన । హతులైరి యిట్టి దురాత్ములతోఁ గలిసి
వర్తింపనోప నోవరపుణ్యులార! । వార్తకెక్కిన ధైర్యవంతులు ఘనులు
వరుసతోడుత భీము వాసవుల్ కవలు । నరవి దీపింప నెచ్చట నున్నవారో!
కూరిమితోడుతఁ గొనిపోవరయ్య! । యాహూథ విస్ఫూర్తి." నని మరలినను
నారదుండప్పుడు నవ్వుచు నతని । గారవంబునఁ జూచి కరమర్థిఁ బలికె:
"ఓధర్మనందన, యుదురాజవంశ, । ఈధారుణీవిభుం డిద్ధతేజుండు,
ఆహవ సంపరిత్యక్త దేహుండు, । బాహుబలోన్నత ప్రాభవశాలి,
పుణ్యవంతుండని పొగడుచుందురు. । ... ... ... ... ...
మహనీయ దేవతా మాననీయుండు । సహజోత్తమక్షత్ర సాకల్యమైన

ధర్మమార్గంబున ధాత్రీశవరుల । నర్మిలిఁ జంపించె నఘమేలయగును!
ఎడపక పాంచాలి యీతనిచేతఁ । బడుటయు నగ్గుగా భావింపనేల?
పుణ్యలోకంబిది పొసఁగ రోషంబు । పుణ్యాత్మ, తగు నె! యిప్పుడు సర్వసమత
పరఁగ; జూదంబునఁ బ్రథనరంగమున । దొరఁకొని సేసిన దుఃఖంబులెల్ల
నాదరంబునఁ జేసి యన్నిటి మఱువు । మోదంబుతోడ నోభూపాల!" యనిన
నారదుఁ జూచి యన్నరనాథుఁడనియె: । "ధారుణి నితఁడు పాతకముల నెలవు;
ఉపకారములు చేసి యొప్పు సజ్జనుల । కపకారములు సేయునట్టి దుర్జనుఁడు;
కులనాశకుండు, సంక్షోభితలోష । కలితుండు శఠుఁడు దుష్కర్ముండు సురల
కెల్ల మాన్యుండునై యేపుదీపించె. । ఎల్లగా వినవయ్య యేమనఁ గలదు!
ఒనరంగ నతని నట్లుండఁగ నిమ్ము । తనయుల ననుజులఁ దరుణిఁ బాంచాలి
నరసి చూడఁగవలె; నదియునుగాక । దురమున మిగుల నుద్ధుర శౌర్యమహిమ
నెఱపి హతంబైన నిఖిలబంధులకు । నొఱపు మీఱంగఁ దిలోదక మేను
బోయుచున్నఁతలోఁ బొలుపరి కుంతి । పాయక నాతోడఁ బద్మాప్తసుతుఁడు
తనపుత్రుఁడనియె; నంతటినుండి వానిఁ । దనరంగ మనసునఁ దలఁచిన వేళ
శోక మగ్గలమగు; క్షోణి నద్దేవి । ప్రాకటంబగుచున్న పదములయట్ల
యతని పాదంబుల నర్చింప కునికి । కతి శోక మొందుదు, నతఁడును మేము
నేకమయ్యును సురాధీశ్వరుండైనఁ । జేకొని మాతోడఁ జెనకంగఁ గలఁడె!
అతని నెఱుంగక యర్జును వాని । మృతుఁ జేయుమంటి శమింప దాచిచ్చు.
చూడంగవలె నాకుఁ జూపవే కర్ణు; । నేడ నున్నాఁడొకో యినసందనుండు?
భీమార్జునయములఁ బ్రియుల బాంధవుల । భామ బాంచాలినిఁ బరికింపవలయు
పరవితో వారికి స్వర్గసౌఖ్యంబు । లరయఁగా లేకున్న నట్లను జన్మ
విరహిత స్వర్గంబు వేడుకగాదు; । వరమతి నిప్పుడు వారున్నచోటు
కరమొప్పఁ బుణ్యలోకంబని తలఁతు. । దుర దుర నచటికిఁ దోకొని పొండు."

## ధర్మజుఁడు స్వజనులఁ జూచుట

అనిన దేవమునీంద్రు "లట్టుల సేయు । మొనసిన కరుణతో, నిప్పుడు ప్రీతి
బొనయ నీమదిలోన నేమేమితోఁచె । మునికొని సేయుము మును వాని ననుచుఁ
గరలి యింద్రుఁడు నప్పగించినవాఁడు । తిరముగా" నని పల్కి దేవతాదూతఁ

గనుఁగొని మునులు "ఈ కలితాత్ముఁడును । అనువొంద భీమసేనాదులఁ జూపు,
పో." మ్మన వాఁడును ముందటఁ జనఁగ । నన్నను జేసుందు నట వానివెంట
ననయంబుఁ జనఁగఁ గేశాస్థిసాంద్రంబు, । తనరు దుర్గంధంబు, దంశక మశక
సాంద్రంబు, ఘనతమశ్ఛన్నంబు ధూమ । రుంద్రంబు క్రిమికీట రోమ మేదోస్థి
శవమాంస రక్తంబు, శాతచంచుయుత । వివిధ వాయసగృధ్ర విశ్రామభూమి,
తారఁగాఁగిన యట్టి తైలంబెపోలె । నారూఢిఁ దెరలినయట్టి యంబువులు,
ఆయస కంటకాత్యర్థ దుర్గమము, । పాయక సిశితాసిపత్రవనంబు,
వైతరణం బనఁబరఁగిన నదియు, । యాతన పాపాత్ములనుభవించుటయుఁ
గలిగిన మార్గంబు గానవచ్చినను । దొలఁగక యా దేవదూతితో నృపతి
"అనఘ, యిచ్చటు దేవతాధీనముగుము । గొనకొని యుందునే? కూర్మితో మనకు
వలనొప్పఁ బోవంగ వలసిన చోటు । ఎలమి నిచ్చోటికి నెంత దవ్వు?"
అని యడిగిన నతండతని కిట్లనియె: । "అనిమిషాధీనమై యలరు నిచ్చోటు:
మనకు రావలసిన మార్గంబు నిదియ." । అనిపల్క దుర్గంధ మధికమై యచటు
కలయఁ జిత్తముకు దుఃఖముచేయు నతఁడు । వలనొప్ప మరలిపోవఁగఁ జూచుటయును
వినఁబడె నతనికి: "వినులపుణ్యాత్మ! । ఘనమైన నీదివ్య గాత్రంపుసౌర
భముగల గాడ్పు మాపై వీచుటయును । అమితదుఃఖముఁ బాసి యలరుచున్నార
మింకఁ గొంతసేపైన నచ్చోట నిలిచి । ప్రకటితంబుగ మమ్ము బ్రదికించవయ్య"

తనవారు నరకమున నుండుట యెఱిఁగి ధర్మజుఁడు చింతించుట

అని దుఃఖభార మహాదైన్య వృత్తిఁ । బనివిన పలుకులు పరఁగ నాలించి
యెడప "కావహో! వీర లెట్టిబాధలను । బడియెదరో!" యని భావించి నిలిచి
యాలించినను దొంటియట్ల పల్కుటయు । వలనొప్ప మరలి పోవక చూచియుచట
చాలంగఁ గృపతోడ శమననందనుఁడు । ... ... ... ... ...
మీ రెవ్వరనుచు నర్మిలి నడుగుటయు । వారలు "కర్ణుండ, వాయునందనుఁడ,
విజయుండ, గవలము, వెలయు ద్రౌపదిని । నిజముగా శ్వేతుండ" నే ననుటయును
గడు దుఃఖమునఁ బొంది ఘనుఁడు ధర్మజుఁడు । "విదువక యెంతయు వీ రెట్టి కీడు
సేసిరో! నరకంబు చెందియున్నారు. । ఈసున నీచు లీ యింద్రాదిసురలు

సారిది విచారమించుకయును లేక । పెరిగి కష్టపుబాధ పెట్టుచున్నారు.
ధర్మమా, నీవును దయ విడిచితివె! । ధర్మస్వరూపులు దయగలవారు
సత్యసంధులు కీర్తి చాతుర్యఘనులు । నిత్యదానరతులు నిర్మలాత్మకులు
కట కట! మిక్కిలి కష్టపుఁబాటు । నిటు పడుచున్నవా; రేమియు మేలు
సేయని రారాజు చెందుచున్నాఁడు । ధీయుత కాముఁడై దివ్యసౌఖ్యముల.
లీలగాఁ బాపంబు లేశము లేని । యీ లలితాత్ముల కిట్టి కీడొదవె."
అని చాలఁ జింతించి యంతరంగమున । నెనయు వికార మిట్లెంతయుఁ దోఁప
"కతమేమియో! కలగనుటయొ! కాక । క్షితిలోని మాయయో! చిత్తవిభ్రాంతిఁ
జేసి వివేకింపఁ జెచ్చెర రాదు । ఈశయ్య" నని దివిజేంద్రుపైఁ జాల
నలుకపుట్టియు నప్పుడద్దూతఁ జూచి । "తొలఁగక యెవ్వరిదూతవో నీవు
వారివద్దకుఁ బొమ్ము వదలక యిపుడు. । శూరులైనట్టి నాసోదరుల్ దుఃఖ
మునఁ గుందుచున్నారు; మునుకొని యిచట । ఘనముగా నిలిచెదఁ గాన నీవరుగు."
మనుటయు దూత రయంబునఁ బోయి । యను వొంద ధర్మజుఁ డాడినమాట
యతని నిశ్చయము నయ్యమరేంద్రునకును । వితతంబుగా విన్నవించిన, నంత
నమరులు సిద్ధులు నఖిల సంయములుఁ । బ్రమదాత్ములైన దిక్పాలురుఁ గొలువ
నెలమితో దేవేంద్రుఁ డేఁగుదెంచుటయు । బలిమితో దుర్గతి బాధలు మ్రగ్గె;
మునుకొన్న దుర్గంధమును గంక గృధ్ర । ఘనపక్షి రవములు గానరావయ్యె.
కేశాస్థి శవ మాంస కీట కపాల । రాశియు రక్త ముగ్రపువైతరణియుఁ
గ్రూరాసి పత్రపు ఘోరాటవియును । గౌరవేశ్వర, యేమి గానరావయ్యె.
పరిపరి విధములఁ బరిమళమిళిత । పరిపక్వవాయువుల్ పరువడి వీచె.
ఆసమయంబున హర్షంబుతోడ । వాసవుండనియె భూవల్లభుఁ జూచి:

ఇంద్రుఁడు నరకముకడనున్న ధర్మజునొద్దకువచ్చి యతనిని సంభావించుట

"ఒనర నీవిచ్చోట నుండిన కతన । ననిమిషు లాత్మలో నందంద వగచి
దొరఁకొని ప్రీతితోఁ దోడ్కొని పోవ । నరుదెంచినారు నీయలుక చాలింపు.
చెలఁగి యవ్యయలోక సిద్ధియు సుఖము । గలిగె నీగుణముల కతన భూనాథ!
అరుదార ధరణీశుఁడైన వానికిని । గర మొప్ప నిరయంబు గనుఁగొన వలయు;
వేద వాక్యంబిది; విశ్వంబులోన । నాదుకై పుణ్యపాపంబులు రెండు

గనుపట్టుఁ; బుణ్యంబు కతన నెంతయును । ఘనతర స్వర్గ సౌఖ్యంబులు గలుగు.
పాపంబువలనఁ జొప్పడు నరకంబు । భూపాల, వినవయ్య పొందుగా మున్ను
నాక సౌఖ్యంబులు నలిఁ జెందినతఁడు । ప్రాకటగతిఁ బోవు బహుదుఃఖములకు.
మున్ను నారకదుఃఖమును బొందువాఁడు । క్రన్నన నాకసౌఖ్యంబులఁ బడయు.
పొలుపు మీఱఁగ నల్పపుణ్యుండు తొలుత । కలయంగ నాకసౌఖ్యములఁ బొందుచును
బిదప దుర్గతిఁ బొందుఁ బెంపెల్లఁ బొలిసి । యదనుగా నెంతయు నధికపుణ్యుండు
మును నిరయముఁ బొంది మునుమిడి వెనుక । ఘనతర స్వర్గసౌఖ్యములను వెలయు.
తెలియ నిన్నిటకుఁ బుత్తెంచుటయెల్ల । వెలయు నుత్తర దివ్య విభవంబు కొఱకు.
కర్ణుఁడుత్తమ సిద్ధి గాంచియున్నాఁడు । అర్ణవ గంభీర, యతనికిఁ గాఁగ
నెప్పుడుఁ జింతింతు వెలమితో నితఁడు । తప్పకెంతయు నిజస్థానంబు పొంది
యున్నాఁడతనిఁ జూచి యుత్సాహమొందు. । క్రన్నన భీముని గాండీవధరునిఁ
గవలను మిత్రవర్గమును ద్రౌపదిస । వివిధ రాజన్యుల వెసఁ దనూభవుల
నిజనిజధామ సందీప్తతేజులను । విజయుండవటుగాన వేడుకఁ జూచి
నిర్మలుండవు గమ్ము, నీవల్పదుఃఖ । మర్మిలి నీరీతి ననుభవించితివి.
బహుసౌఖ్యముల నింకఁ బరఁగి నాతోడ । విహరణం బొనరింపు విధువంశతిలక!
తిసరు వ్రతములకు దానగుణముల । కనుగుణంబగు శుభం బటు నేనొసర్ప
రమణతో హయమేధ రాజసూయాధ్వ । రముల సంచితములై రమ్యంబులైన
కలిత పుణ్యంబులఁ గైకొని తొల్లి । నల హరిశ్చంద్రాది నరనాథ వరులు
ఏరీతి సుఖముల హెచ్చియున్నార । లారీతి సుఖము నీవనుభవింపుచును
వర్తింపు.'' మనవుడు వైవస్వతుండు । మూర్తితో నారాజముఖ్యునకనియె:

## యముఁడు ధర్మజు నుచిత వచనముల గారవించుట

"నృపవర, వినవయ్య నిన్ను మున్మూఁడు । కృప పెంపుమీఱఁ బరీక్షింపఁ గంటి.
అది యెట్టులనిన ద్వైతారణ్యమందు, । వదలక శునకంబు వచ్చినయపుడు,
నిప్పుడుఁ జలన మొక్కించుక లేదు. । తప్పక నీసాటి ధరణిలోఁ గలరె!
నరక మవశ్యంబు నరవరేంద్రులకు । నరయఁ జూడఁగ నిల్లె; నందుకై యేను
గిటికొని నినుఁ గడుఁ గీడగు చోటి । కటు లేక పొనిపితి, మర్త్యతనూజ

... ... ... ... ... । ఘనవికారములు శోకములు నడంగుఁ ;
బరమ సౌఖ్యంబుల భవ్యులైనట్టి । తరణిజ భీమాది తతులఁ జూచెదవు."
అని చెప్పి తోడ్కొని యాగంగ కరిగి । ఘనతర స్నానంబు కడఁకఁ జేయింప
మానుషతనువు నమ్మాత్రన విడిచి । ధీనిధి, విను దివ్యదేహంబు దాల్చి
వైర మాత్సర్య సంవాదాభిమాన । దారుణ శోక హృద్గత వికారములు
పాసి నిర్ధూమపత్పావకు పగిది । రాశిగా వెలుఁగొందె రాజవర్యుండు.
ఆరీతి దివ్యుఁడై యత్యంత మహిమ । నారదాదులు నభినందింప సకల
సురలు తోడనెరాఁగ సొంపుతో నరిగి । వరమతి నొక్కెడ వరరత్నఖచిత
మహితాననంబున మహనీయ మహిమ । మిహిరకోటిప్రభ మించి యెంతయును
జక్ర గదాద్యస్త్ర సంహతి మెఱయ । విక్రమస్ఫూర్తులు విజయుండుఁ దాను
మున్ను జూచినయట్టి మూర్తి యొప్పార, । నున్న కృష్ణునిఁ గాంచి యుబ్బుతో మఱియుఁ
దత్సమీపంబునఁ దపన ప్రతాపుఁ । డుత్సాహమూర్తి దుర్యోధన ప్రియుఁడు
పరఁగఁ ద్రయోదశ భానుఁడో యనఁగఁ । బరఁగిన కర్ణుఁ దప్పగ నిరీక్షించి
నుతగతి వాయుతనూజునిఁ గవల । సతియైన పాంచాలిఁ జయ్యనఁజూచి
యరుదంది యింద్రుతో ననియె : "నిభామ । చిరమతి, యెవ్వరు చెప్పవే నాకు."
అనవు డింద్రుండను "ననఘ, యీయింతి । తనరు మహాలక్ష్మి, ద్రౌపది యనఁగ
ద్రుపదుని కూఁతురై రుద్రునియాజ్ఞఁ । బరఁగి త్వదీయవైభవము చెల్లించె "
అనిచెప్పి యల్ల రమ్యాకారులగుచు । ఘనులైన యేవురు గంధర్వవరులు
పాంచాలియందు నుద్భవమైనవారు । అంచితంబుగఁ జూడు మవనీతలేశ!
పరికింప గంధర్వపతి ధృతరాష్ట్రు । నరుదు గానీక్షింపు మబ్జారివంశ!
విను సిద్ధసాధ్య విశ్వేదేవ గణము । ననుసరింపుచును మహావైభవమున
నున్నవారలు కృష్ణునొగిఁగొల్చినట్టి । నున్నత కృతవర్మ సాత్యకి ముఖ్య
యాదవుల్ వారుగో" యనిచెప్పిమఱియు । మోదంబుతోడ నప్పురుహూతుఁడనియె:
"ఒనరఁ జంద్రునిభంగి నుజ్జ్వలకాంతిఁ । దనరెడు నభిమన్యుఁ దప్పకచూడు.
పాండుభూపాలుండు పడఁతులుఁదాను । జండతేజమునఁ బుష్పకమెక్కి వాఁడె
యరుదెంచుచున్నవాఁ డనఘ, కన్గొనుము. । కర మొప్ప వసువులకడ నున్నవాఁడు

వనటతోఁ జూడుము వాఁడె ద్రోణుఁడు. । (అనఘ, వారలె ద్రుపదాదులు వారి
యనుజులు తనజులు నట నున్నవారు. । కను మల్లవారె కేకయపాండ్య నృపతు)
లనుచుఁ బేర్వేర నయ్యఖిల బాంధవుల । మనుజేశునకుఁ జూపె మమతతో" ననిన
విని జనమేజయ విభుఁడు హర్షించి । మునినాథునకుఁ గేలు మొగిచి యిట్లనియె:
"అనఘాత్మ, వీరలయ్యమరలోకమున । ఘన సౌఖ్యములఁ బొంది క్రమ్మఱి మఱియు
నరవి మనుష్యాదిజన్మంబునకును । అరుగుదెంతురో లేదో యత్తెఱంగెల్ల
విన వేడ్కయయ్యెడు వినిపింపు." మనిన । మునినాథుఁ డనియె నప్పుడమీశ్వరునకు:
"కురువర, యిది దేవగుహ్య ముత్తమము; । అరయ వేదవ్యాసుఁ డత్యంతకరుణఁ
జెప్పినయది నీకుఁ జెప్పెద వినుము. । వప్పుగా (?) గురుకులాన్వయ నిజాంశములు.
దెఱవ గాంధారియు ధృతరాష్ట్రవిభుఁడుఁ । బరఁగఁ గుబేరునివద్ద వర్తించి;
రిద్దఱు భామలు నిటఁ బాండురాజుఁ । దద్ద నిలిచిరి సుత్రాముని నగర;
వసజారిఁ గూడె నా వాసవికొడుకు; । అనిమిషగురుఁ బొందె నస్త్రగురుండు;
ద్వాపరాత్మకుఁ డయ్యెఁ దనరుగాంధార । భూపతి; రారాజు మునుకొని నరక
దారుణబాధ లెంతయుఁ బొంది పొంది । చేరె నక్కలియందు; సృష్టిలో నతని
యనుజన్ము లారాజునట్టుల పోలె । ఘన నారకంపు దుఃఖంబును జెంది
యాతుధానావలి నందంద కలిసి. । రాతఱి నర్కజుఁ డర్కునిఁ గలిసె.
వసువుల సంతట నలనొప్ప భీష్ముఁ । డసదృశంబుగఁ జెందె నవనీతలేశ!
ద్రుపద విరాటులు ధృష్టకేతుండు । విపులతేజుఁడు మద్రవిభుఁ డుత్తరుండు
పౌనరంగ భూరిశ్రవుండు శంఖుండుఁ । దనరు విశ్వేదేవతలఁ జెంది రధిప!
అరయ ధృష్టద్యుమ్నుఁ డనలునిఁ గలిసె; । తరమిడి ధర్మజాతనువున మున్న
వెనఁ బ్రవేశించెను విదురుండు; నతఁడు । నసదృశంబుగఁ గూడె నంత ధర్మువును.
కమలగర్భుని నియోగంబునఁ జేసి । క్రమమొప్ప యోగంబు గైకొనిబలుఁడు
ఆయసంతుని దేహమందునఁ గలిసె. । బోయలచేత నొప్పుగఁ బట్టువడిన
వెలఁదులు పదియాఱు వేవురు వినుము । తలఁగి సరస్వతీ తటినీ జలముల
మునిఁగి దివ్యపదంబుఁ బొంది శ్రీకృష్ణు । నెనయంగ సేవించియుంపొంది రధిప!
అరయంగ వృష్ణి భోజాంధకు లెల్లఁ । గర మొప్ప గుహ్యక గణములఁ గలిసి;
రనుమరణంబున నతివరుక్మిణియు । ననువొంద లక్ష్మిదేహంబునఁ గలిసె.
వెలయఁ దక్కినయట్టి వెలఁదులేడ్వురును । అలవడ నప్పద్మయంశముల్ గాన

నారమఁ జెంది; రిట్లందఱు నేను । జేరి చెప్పినవారుఁ జెప్పనివారుఁ
గలిత నిజార్థ ప్రకారంబులందుఁ । గలుగు గుహ్యక యక్షగణముల నమర
వరులను జెందిరి వరుసతోడుతను. । ఇరవొప్పఁగా నిట్టి యితిహాసమేను
జెప్పితి ; నీవు సంస్కృత పుణ్యవిభవ । మొప్పార వింటివి యోగ్యుండవైతి.”
వనిన సజ్జనమేజయావనీ విభుఁడు । మునుకొని యస్తీక ముని మొదలైన
మునుల నందఱనంపి ముదము రెట్టింప । ననఘు వైశంపాయు నాఖ్యుని ననిపి
తనపట్టణము చొచ్చి ధరణియంతయును । ఘనముగాఁ బాలించెఁ గడఁకతోడుతను.
భారతకథ విను పంచమవేద । సారమై మిగుల నిశ్చలభాగ్యమొసఁగు.
ఇమ్మహాభారతం బేకాక్షరంబు । నెమ్మితో విన్నట్టి నిర్మలాత్ములకు
మునుకొని వ్రాసిన పుణ్యవంతులకు । ఘనముగాఁ జదివించు కలివిదూరులకు
భూదాన గోదాన భూరిదానములు। నాదరంబెసఁగఁ గన్యాదానములును
జేసిన పుణ్యంబు చేకూరు ననుచు । వాసిగా నా సూతవరుఁడైన కథకుఁ
డంచితంబుగ శౌనకాదులకెల్ల । *మించి చెప్పిన వారు మెచ్చి రా ఘనుని.

---

* ఆశ్వాసాంతము లేదు.

సరస్వతీ పవర్ ప్రెస్ : రాజమహేంద్రవరము 4976/1950.

## (B) HISTORY

No. 39. INDIAN POLITY A. D. 1600 TO 1948—by Atmakuri Govindacharyulu.
[3 Volumes—Rs. 35/-]
[Each Volume—Rs 15/-]

## (C) CRITICISM

No. 8. KAVITHWATHATHWAVICHARAMU — by Sir C. Ramalinga Reddy, M A. (Cantab). Hon. D. Litt. (Andhra), Ex-Vice-Chancellor Andhra University, Waltair. (Rs 3—0—0)

## (D) GRAMMAR

No. 15. VAIYAKARANA PARIJATAMU — by V. Ch Sitaramaswami Sastri, Pandit, University College of Arts (Rs 3—0—0)

## (E) LITERATURE

No 2. THE UNIVERSITY LECTURES ON VEMANA—by R Anantakrishna Sarma, Lecturer, Maharajah's College, Mysore (Rs. 1—8—0)

No 10. HISTORY OF SANSKRIT LITERATURE—PART I, VEDIC PERIOD (IN TELUGU) — by M Suryanarayana Sastri, formerly Pandit, University College of Arts (Rs 2—4—0)

No 12 HISTORY OF SANSKRIT LITERATURE—PART II, LAUKIC PERIOD (IN TELUGU)—by the same author (Rs. 2—4—0)

No 18 HISTORY OF TELUGU LANGUAGE—by Dr C Narayana Rao, M A, Ph D, L T, Retd Lecturer, C D College, Anantapur (in two volumes) Each volume. (Rs 6—0—0)

No 21 VYASAMANJARI OR COLLECTED ESSAYS (IN TELUGU-by Sir C R Reddy, M A (Cantab) Hon D Litt (Andhra), Ex-Vice-Chancellor, Andhra University, Waltair (Rs 2—8—0)

No 29. Gona Budhareddy's Ranganatharamayanam —Edited by Veturi Prabhakara Sastri. (Rs 7—8—0)

No. 30. DWIPADA BHARATAM—Vol. I—Edited by P Lakshmikantam, M A, (Rs. 10—0—0)

No 41 DWIPADA BHARATAM—Vol II Edited by P Lakshmikantam M. A (Rs. 12—0—0)

No. 42 DWIPADA BHARATAM—Vol III Edited by Vidwan G J Somayaji, M A, L T (Rs. 15—0—0)

No. 43 DWIPADA BHARATAM—Vol IV Edited by Vidwan G. J. Somayaji, M A, L T (Rs 12—0—0)

No's 30, 41, 42 & 43 Complete set of the four Volumes of DWIPADA BHARATAM Rs 40—0—0)

## (F) PHILOSOPHY

No 9 ANDHRA MIMAMSA NYAYA MUKTAVALI—(IN TELUGU)—A TREATISE ON PURVA MIMAMSA DARSANA-by K. Gopalakrishnamma, M A., L. T., formerly Lecturer in Oriental Languages, Government Arts College, Rajahmundry. (Rs 1—8—0)

## (G) SCIENCE

No 14 VISWARUPAM—(dealing with the Physical Universe) written in popular Telugu—by K Kondayya, M. Sc, Chemistry Department. Benares Hindu University, Benares. (Rs. 2/-)

No 20 TELUGU EQUIVALENTS OF TECHNICAL TERMS IN PHYSICS — by A Balankeswara Rao, B Sc (Hons), formerly Department of Physics, J V D College of Science and Technology (Re 0—12—0) (Inclusive of Postage)

No 33 A Text Book on Trignometry (in Telugu) by K. Rangachari, M A., B. L., M. R. College Vizianagaram (Rs. 4—0—0)

No 34 TEXT BOOK ON ZOOLOGY (in Telugu)—by R V. Seshaiya, M A, Annamalai University, Annamalainagar (Rs 5—8—0)

# III. SANSKRIT

## (A) VYAKARANA (Grammar)

No 6 CHITRAPRABHA — A COMMENTARY ON HARIDIKSHITA'S LAGHUSABDARATNA — by B Hari Sastri-Edited with notes by Mahamahopadhyaya Kalaprapurna Tata Subbaraya Sastri, Maharajah's Sanskrit College, Vizianagaram. (Rs 3—0—0)

No 26 Guruprasadam and Guruprasadasesham —Edited by Mahamahopadhyaya Kalaprapurna Tata Subbaraya Sastri and Peri Venkateswara Sastri—Part I (Rs. 7—8—0)
Do. do Part II (Rs 10—0—0)

## (B) NYAYA

No 7 SANGAMESWARAKRODUM—ON JAGADISA'S SIDDHANTALAKSHANAM—by G Sangameswara Sastri (Re 0—12—0)

## (C) VEDANTA

No 25 Vivaranaprameya Sangraha (Sanskrit Text) Edited by S S Suryanarayana Sastri, M.A B Sc, Bar-at-Law and Prof Saileswar Sen, M A D Litt, et., D Phil (Rs 7—8—0)

*Note—Copies of the above publications can be had from the Registrar, Andhra University, Waltair, on payment of the cost in advance. Book-sellers will be allowed a trade discount of 15% on the published price*

